# పత్రికా పదకోశం

ఇంగ్లీషు - తెలుగు


సంపాదకులు

**చేకూరి రామారావు**

సహాయకులు

**ఒరుగు భాస్కర్**

ద్వితీయ ముద్రణ పరిష్కర్త

**బూదరాజు రాధాకృష్ణ**





**ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ**

**5-9-166,** చాపెల్‌రోడ్, నాంపల్లి

హైదరాబాద్ - **500 001**

**2004**

**Patrika Padakosam**
English - Telugu

*Editor* : Chekuri Rama Rao
*Assistance* : Orugu Bhaskar
*Editorial Board* : K.Srinivasa Reddy, convenor
G.S.Varadachari
C.Raghavachari
I.Venkata Rao
R.V.Rama Rao



*First Publication* : February, 1998
*Revised edition* : November, 2004
*Revised by* : Budaraju Radha Krishna

*Cover Design* : Mohan

*Type Setting* : Nallomotu Raghu Ramaiah
(040-2416 0318)

*Printed at* : Akruthi Offset Printers
Chikkadpally, Hyderabad
(040-2766 4525)

*For Copies:*

- **Press Academy of Andhra Pradesh**
  5-9-166, Chapel Road, Nampally
  Hyderabad - 500 001
  ✆ 23298672; 23298673

- All leading Book Shops

Price: **Rs. 150**

# మలిమాట

తెలుగు దినపత్రికలలో పనిచేసే జర్నలిస్టులకు రోజువారీ పనిలో ఉపయోగపడే మంచి పదకోశం ఒకటి చేతికి అందుబాటులో ఉండాలన్నది పాత్రికేయులందరి చిరకాలవాంఛ. ఇలాంటి పదకోశాల కూర్పుకు వ్యక్తుల పరంగా, సంస్థల పరంగా అనేకమైన ప్రయత్నాలు జరిగాయి. ఇప్పటికే కొన్ని పదకోశాలు ప్రచురితమయ్యాయి కూడా.

అయితే సమగ్ర పదకోశం ఒక దానిని రూపొందించవలసిన ఆవశ్యకత ఉందని, కాలానుగుణమైన మార్పులకు అనుగుణంగా భాష, పత్రికా రచనలలో రావలసిన మార్పులను దృష్టిలో ఉంచుకుని ఎప్పటికప్పుడు పదకోశంలో మార్పు చేర్పులు జరగవలసి ఉందని ప్రముఖ పాత్రికేయులు పలువురు ఆకాంక్షించారు. ఆ ఆకాంక్షకు అనుగుణంగానే ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ తెలుగు పత్రికా పదకోశాన్ని రూపొందించే కృషిని చేపట్టడం.

ఎనిమిదేళ్ళ క్రితం అకాడమీ ఏర్పడిన తొలినాళ్ళలోనే, తొలి చైర్మన్ కె.శ్రీనివాస్ రెడ్డిగారి పూనిక మేరకు ప్రముఖ భాషా శాస్త్రజ్ఞులు చేకూరి రామారావు గారి సంపాదకత్వంలో పదకోశం రూపుదిద్దుకుంది. ఆయా తెలుగు దినపత్రికల సంపాదకులు, అనుభవజ్ఞులు, భాషజ్ఞులు అయిన కొందరు సీనియర్ జర్నలిస్టుల సహకారంతో 500 పేజీలకు పైబడిన బృహత్తర గ్రంథంగా ఈ పదకోశం వెలువడింది. ఈ కృషిని మొత్తంమీద పాత్రికేయులు, పండితులు అభినందించారు, ఆనందించారు. అనతికాలంలోనే మొదటి ప్రింట్ కాపీలు అయిపోయాయి. పదకోశం రీప్రింట్ అవసరాన్ని కొన్నాళ్ళుగా జర్నలిస్టులు అడపాదడపా అకాడమీ దృష్టికి తెస్తున్నారు. అకాడమీ కూడ, జర్నలిస్టుల వృత్తిపరమైన నైపుణ్యాన్ని పెంచడమే పరమావధిగా పెట్టుకున్నందున, పదకోశాన్ని రీప్రింట్ చేయడం తన ధర్మంగా భావించింది. రీప్రింట్ కృషికి సన్నాహంగా తెలుగు దినపత్రికల సంపాదకుల సమావేశం ఒక దానిని ఏర్పాటుచేసి వారి సలహా సహకారాలను కోరింది. అడిగినదే తడవుగా సంపాదకులు పదకోశం తొలిప్రతిని సమీక్షించి మరింత ఉపయోగకరంగా ఉండడానికి చేయవలసిన మార్పు చేర్పులను సూచించడం జరిగింది. విలువైన సమయాన్ని ఇందుకోసం వెచ్చించి, మలిప్రతి వెలువడడంలో తోడ్పడిన ప్రముఖ పత్రికా సంపాదకులందరికీ పేరు పేరునా అకాడమీ కృతజ్ఞతలు.

సంపాదకులు చేసిన సూచనలను దృష్టిలో పెట్టుకుని మలిప్రతిని సిద్ధంచేసే బాధ్యతను 'ఈనాడు' జర్నలిజం స్కూలు ప్రిన్సిపాల్‌గా పనిచేసి అనుభవం గడించిన ప్రముఖ భాషా శాస్త్రజ్ఞులు బూదరాజు రాధాకృష్ణ గారికి అప్పగించడం జరిగింది. ఆరోగ్యం అంతంతమాత్రమే అయినా, బూదరాజు గారు ఓపికగా, వేగంగా పదకోశం సంస్కరణ కార్యక్రమాన్ని పూర్తిచేశారు. ఈ కృషిలో ఆయనకు 'రచన జర్నలిజం కళాశాల' ప్రిన్సిపాల్ గోవిందరాజు చక్రధర్ సహాయ పడ్డారు. వారిరువురికీ అకాడమీ తరఫున హృదయపూర్వక ధన్యవాదాలు.

పదకోశాన్ని సంస్కరించి మలిప్రతిని సిద్ధం చేయడానికి ప్రధానంగా రెండు మూడు లక్ష్యాలను ఎంచుకోవడం జరిగింది. మొదటిది – జనరల్ డిక్షనరీకి భిన్నంగా ఒక ప్రత్యేక పత్రికా పదకోశంగా మలచడానికి ప్రయత్నించడం. అవసరంలేని పదాలు లేదా అతిసాధారణ

పదాలను వదిలివేయడం జరిగింది. అదే సమయంలో పదాలకు సుదీర్ఘమైన వివరణలు కూడా అవసరం లేదన్న సంపాదకుల అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకుని, అవసరం లేని చోట్ల అలాంటి వివరణలను కుదించడం జరిగింది. ఇక అత్యంత ప్రధానమైన కార్యక్రమం ఇంగ్లీషు మాటకు సమానమైన తెలుగు పదాన్ని ఇవ్వడం; సబ్ ఎడిటర్లు ఇంగ్లీషు కాపీని అనువదించే సమయంలో లేదా రిపోర్టర్లు ఇంగ్లీషు ఉపన్యాసాన్ని తెలుగులోకి తర్జుమా చేసుకుని వార్త వ్రాసే సమయంలో – అర్థ వివరణ కంటే ఆంగ్ల పదానికి సమానమైన తెలుగు పదంకోసం ఎక్కువగా వెతుక్కుంటారు. ఒక్కోసారి అర్థం తెలిసినా – సరైన పదం దొరకక కలం ఆగి పోతుంది. అలాంటి 'ఆపత్సమయాలలో' పదకోశం కరదీపికగా ఉండాలన్నది పత్రికా సంపాదకుల సూచన. ఈ సూచన చాలా ముఖ్యమైనది. అలా రూపొందినపుడే పదకోశానికి సార్థకత కూడా. ఈ అంశాన్ని ప్రత్యేకంగా బూదరాజు గారికి తెలియజేయడం, తదనుగుణంగా ఆయన సముచితరీతిలో సంస్కరణ పనిని చేపట్టడం జరిగింది.

మొత్తం ఈ కృషి కారణంగా పదకోశం పరిమాణం తగ్గింది. ఆ మేరకు ప్రమాణం, ప్రయోజనం పెరిగాయని, పాత్రికేయులు, భాషజ్ఞులు భావిస్తే, అకాడమీ సంకల్పం నెరవేరినట్టే! ఈసారి పదకోశంలో కొన్ని జనరల్ నాలెడ్జి అంశాలను కూడా జోడించడం ప్రత్యేకత. పాత్రికేయులకు అనుదినం అవసరమయ్యే మౌలిక సమాచారాన్ని ఈ పదకోశానికి అనుబంధంగా చేర్చడం జరిగింది. ఈ చేర్పులు పదకోశానికి మరింత ఉపయుక్తతను, సమగ్రతను తేగలవని ఆశ.

పదకోశాన్ని సంస్కరించడం, పునర్ముద్రించడం ఒకనాటితో ఆగిపోయే కార్యక్రమం కాదు. అవసరాన్ని బట్టి ఎప్పటికప్పుడు దీనిని పునర్ముద్రించవలసిన ఆవశ్యకత ఉండనే ఉంటుంది. అదీకాక, శాస్త్ర సాంకేతిక రంగాలలో, ఆలోచనలలో, నిత్యజీవితంలో వస్తున్న పెనుమార్పులకు అనుగుణంగా భాష సయితం వృద్ధి చెందుతూనే ఉంటుంది. ఈ మార్పులకు అనుగుణంగా పత్రికలూ మార్పులకు లోనవుతూ ఉంటాయి. వీటికి అనుగుణంగా జర్నలిస్టులు అప్‌డేట్ అవడం, వారికి చేదోడు వాదోడుగా అకాడమీ నిలబడవలసి రావడం అనివార్యమైన అవసరాలు. అందువల్ల నిరంతర కార్యక్రమంగా ఈ పదకోశం రూపకల్పన సాగవలసి ఉంది. రాబోయే రోజులలో పత్రికా పదకోశం మరింత సమగ్రతను, ఆధునికతను సంతరించుకుని పాత్రికేయులకు కరదీపికగా నిలువగలదని ఆశిస్తున్నాను.

పత్రికా పదకోశం తొలిప్రతినే కాదు, మలిప్రతిని ప్రచురించడంలో సయితం ప్రేరణగా నిలిచిన కె.శ్రీనివాస్ రెడ్డిగారికి, ప్రత్యేక శ్రద్ధ చూపిన ఎం.వి.ఆర్.శాస్త్రి, కె.రామచంద్రమూర్తి, టంకశాల అశోక్, ఈడ్పుగంటి నాగేశ్వరరావు, వి.శ్రీనివాసరావులకు ప్రత్యేక కృతజ్ఞతలు. ఎప్పటివలె అకాడమీ సిబ్బంది ఈ పుస్తక ప్రచురణలో కూడా శ్రమించారు. వారికి అభినందనలు.

**ఇనగంటి వెంకట్రావు**
**చైర్మన్**
**ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ**



# నా మాట

పత్రికా పదకోశాన్ని 'మలి ప్రచురణ'గా వెలువరించదలచిన సందర్భంలో 2004 సెప్టెంబరు 8వ తేదీన 'వీలయినంత త్వరగా' నన్ను 'సంస్కరణ కృషి' చేయమని కోరుతూ ప్రెస్ అకాడమీ చైర్మన్ శ్రీ ఇనగంటి వెంకట్రావు గారు ఆ గ్రంథం ప్రతులు నాలుగింటిని నాకు పంపారు. అవి ఆయా పత్రికల ఎడిటర్లు 'పరిశీలించిన' కాపీలు. వారి పరిశీలనలన్నింటినీ ఒకే ప్రతిలో గుర్తించిన తరవాత, ఈ కోశ నిర్మాణ, ప్రణాళికనూ స్వరూపాన్నీ అర్థం చేసుకోవాలని వారం రోజులు శ్రమించాను. 1990లో ఈనాడు వ్యవహారకోశాన్నీ, 2000లో ఆధునిక వ్యవహారకోశాన్నీ (పునర్ముద్రణ 2003) ప్రచురించిన, పత్రికాభాషతో రచనతో నాకున్న కొద్దిపాటి అనుభవాన్ని పురస్కరించుకొని 'సంస్కరణ' చేపట్టాను. ఈ కోశాన్ని 1998లో ప్రచురణకు సిద్ధం చేసిన వారిలో పూర్వం నాతో కలిసి పనిచేసిన శ్రీ ఆర్.వి.రామారావు గారూ ఉండడం సంతోషం కలిగించింది.

పరిశీలించగా కొన్ని ప్రధానారోపాలకు పంక్తులకొద్దీ వివరణలు, వ్యాఖ్యలు, చర్చలు, విమర్శలు, ఉదాహరణలు కనిపించాయి. కొన్ని సందర్భాల్లో శాస్త్ర పరిభాషకు మూలాలను కూడా చర్చించారు. నేటి పత్రికా రచనల్లో క్రీడలకు – ముఖ్యంగా క్రికెట్టుకు – సంబంధించిన పరిభాష మొత్తం మీద ఇంగ్లీషులోనే ఉండగా ఆ మాటలకు తెలుగు పర్యాయార్థకాలు లభించనందువల్ల భాష్యం చెప్పవలసి వచ్చింది! బీమా, స్టాక్ మార్కెట్ వ్యవహారాలకు విస్తృత వివరణలున్నాయి. ~ mancy అనే ప్రత్యయంతో సమాప్తమయ్యే మాటలు వందదాకా కనిపించాయి – అవన్నీ నానా దేశాల సంస్కృతుల్లో సోది/ జోస్యం చెప్పే విధానాలకు సంబంధించినవే. సాధారణ నిఘంటువులకు అందని మారుమూల పదాలూ అతి శృంగార ప్రసంగాలూ నేటి సాధారణ దినపత్రికల్లో ఎప్పుడూ వాడుకలోకి రానివి వున్నాయి. వీటికి తోడు అర్థాల, ఆరోపాల పునరుక్తి – కొన్నిసార్లు ఒకే పేజీలోనే – కనిపిస్తున్నది. వీటిని పరిహరించటం మంచిదనిపించింది.

ఇంతకన్నా ముఖ్యమైనవి – ప్రధానారోపాల వర్ణక్రమ దోషాలు; అందువల్ల కోశంలోని అకారాది క్రమం దెబ్బతిన్నది. ప్రధానారోపాల కింద ఇచ్చిన ఉపారోపాలకూ వ్యాపించిన ఈ దోషంవల్ల వర్ణక్రమానుగుణంగా వాటికి అటూ ఇటూ స్థానచలనం కల్పించవలసి వచ్చింది. విశేష్య విశేషణ భేదం గుర్తించని సందర్భాల కన్నా, క్రియాపదాలకు భావార్థకాలతో, భావ నామాలకు క్రియా రూపాలతో అర్థ వివరణ చేయటం ఎన్నోసార్లు సవరించవలసి వచ్చిన విశేషాలు. శక్తివంచన లేకుండా నాకున్న భాషాజ్ఞానానుభవాలను పురస్కరించుకొని చేతనైనంతగా సంస్కరణ చేయగలిగాను. పత్రికా సంపాదకుల సూచనలూ, సవరణలూ నా సంస్కరణ పద్ధతికి అనుగుణంగా లేని సందర్భాల్లో కూడా నేను ఎలాంటి మార్పులూ చేర్పులూ చేయలేదు. కేవలం రెండు నెలల్లో రోజుకు సగటున 8 పేజీలను సవరించవలసి రావటం నన్ను ఎక్కువ బాధించింది. అయినా నాకీ అవకాశం కల్పించిన ప్రెస్ అకాడమీ వారికి, చైర్మన్ శ్రీ వెంకట్రావు గారికీ కృతజ్ఞతలు చెప్పక తప్పదు. ఈ కార్యనిర్వహణలో నాకు సాయమందించటానికి ప్రెస్ అకాడమీ వారు సమకూర్చిన డాక్టర్ గోవిందరాజు చక్రధర్ గారికి నా కృతజ్ఞతలు.

అందుబాటులో ఉన్న సమయంలో ఇంతకన్నా సమర్థంగా సంస్కరించలేని నా అశక్తతను మన్నించగోర్తాను.

హైదరాబాద్
10-11-2004

**బూదరాజు రాధాకృష్ణ**

# ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ ప్రచురణలు

1. విలేకరి యోగ్యతలు - సత్యనిష్ఠ
2. విలేకరి - వ్యక్తిత్వవికాసం
3. గ్రామీణ విలేకరులు - వార్తావనరులు
4. విలేకరి - చట్టాలు
5. జర్నలిస్టుల నైతిక ప్రవర్తన - నియమావళి
6. ప్రభుత్వం - పత్రికలు
7. ఎలక్ట్రానిక్ మీడియా
8. పత్రికా భాష
9. తెలుగు పత్రికా భాష - సూచనలు
10. పత్రికా పదకోశం
11. ఏమంటున్నారు ఎడిటర్లు?
12. ఆంధ్రపత్రిక చరిత్ర
13. ఆంధ్రజాతి అక్షర సంపద- తెలుగు పత్రికలు
14. మీడియా డైరెక్టరీ



# లక్ష్యసాధన దిశలో

పత్రికా రచయితలకు నిరంతర వృత్తి నైపుణ్యం అవసరం. ఈ లక్ష్య సాధనకోసం ప్రెస్ అకాడమీ ఏర్పాటు అవసరమని ఆంధ్రప్రదేశ్ వర్కింగ్ జర్నలిస్టుల యూనియన్ అభిప్రాయ పడింది. కడచిన కొంత కాలంగా చేస్తున్న ఈ యోచన దాదాపు రెండు సంవత్సరాల క్రిందట ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ ఏర్పాటుకు దోహదపడింది.

ఈ రెండు సంవత్సరాల కాలంలో ప్రెస్ అకాడమీ పత్రికా రచయితలు ప్రధానంగా మన రాష్ట్రంలో అధిక సంఖ్యలో ఉన్న గ్రామీణ విలేకరుల వృత్తి నైపుణ్యాన్ని పెంచడానికి ఒక ఉద్యమస్ఫూర్తితో కృషి చేసింది. గ్రామీణ విలేకరులు పత్రికా ప్రపంచంలో కీలక పాత్రను నిర్వహిస్తున్నారని మనందరికీ తెలుసు. వారు తమ వృత్తి నైపుణ్యం పెంచుకోవలసిన అవసరం ఉంది. ఇందుకోసం ప్రెస్అకాడమీ ముందుగా మూడు కార్యక్రమాలను చేపట్టింది. మొదటిది శిక్షణ; రెండవది పుస్తక ప్రచురణ; మూడవది పత్రికా పదకోశ రూపకల్పన - ప్రచురణ.

శిక్షణ కార్యక్రమంలో రెండు వేలకు పైగా గ్రామీణ విలేకరులు పాల్గొన్నారు. రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లోను శిక్షణ తరగతులు జరిగాయి. ప్రసిద్ధ సంపాదకులు సీనియర్ పత్రికా రచయితలు వివిధ రంగాల్లో నిష్ణాతులైన నిపుణులు ఈ తరగతుల్లో బోధించి తమ అనుభవాన్ని అందించారు. బోధనతోపాటు జర్నలిజానికి సంబంధించి అవసరమైన బోధన సామగ్రి - అంటే, అచ్చుపాఠాలు - రూపొందించాలని అకాడమీ భావించింది. పత్రికా రచనకు సంబంధించిన వివిధ అంశాల మీద నిపుణులు వ్రాసిన పాఠాలను చిన్న పుస్తకాలుగా ప్రచురించింది.

తెలుగులో మంచి నిఘంటువులు లేని లోటు చాలా ఉంది. ఇది పండితులే అంగీకరించిన వాస్తవం. ఇంగ్లీషు తెలుగు నిఘంటువు కూడా సమగ్రమైంది ఏదీ లేదంటారు. ఒకటి రెండు పత్రికలు, పత్రికా రచయితలకు ఉపయుక్తమైన పదకోశాలను తయారు చేశాయి. అయితే శాస్త్ర సాంకేతిక అభివృద్ధి జాంబవంతుని అంగలతో అభివృద్ధి చెందుతున్న దశలో కొత్త సాంకేతిక పదజాలం వచ్చి పడుతోంది. ఈ పదజాలాన్ని తెలుగు పాఠకులకు అర్థమయ్యే రీతిలో ఉపయోగించడం కష్టసాధ్యమైన పని. సీనియర్ పత్రికా రచయితలు ఇలాంటి పదజాలాన్ని సృష్టించకపోలేదు. కాని ఆ పదజాలాన్ని ఒక్కచోట చేర్చి భావితరాల వారికి అందజేసే పనిమాత్రం జరగలేదు. ఈ లోటును కొంత వరకైనా పూడ్చడానికి ప్రెస్ అకాడమీ కోశనిర్మాణం అన్న బృహత్తర బాధ్యతను చేపట్టింది.

ఏ భాషలో అయినా అనునిత్యం ఎన్నెన్నో కొత్త పదాలు చేరుతూ ఉంటాయి. ఈ దృష్టితో చూసినప్పుడు ఏ నిఘంటువు అయినా సర్వసమగ్రంగా ఉండడానికి ఆస్కారం లేదు. అలాగని చేతులు ముడుచుకుని కూర్చోలేం. అందుకే పత్రికా రచయితలకు ఉపయోగపడే పదకోశాన్ని తయారు చేయడానికి సాహసించాం. ఇలాంటి పని చేపట్టినప్పుడు తగిన సమయం అవసరం అవుతుంది. కాని ఇది అనంతంగా కొనసాగడానికి వీల్లేదు.

అందువల్ల వీలైనంత తక్కువ సమయంలో, అంటే ఒక సంవత్సర కాలంలో ఈ పత్రికా పదకోశం వెలువరించాలని నిర్ణయించాం. కాలంతో పరుగెత్తితే తప్ప ఫలితం ఉండదన్న భావనతో అనుకున్న ప్రకారం కోశనిర్మాణం పూర్తిచేశాం. ఇందులో ఉండాల్సిన పదజాలం సమగ్రంగా ఉండకపోవచ్చు. కొన్ని లోపాలు కూడా ఉండవచ్చు. కాని ఆరం భించకుండడం కన్నా, చేతనైన ప్రయత్నం చేస్తే మంచిదన్న ఉద్దేశంతో అనుకున్న వ్యవధిలో ఈ పత్రికా పదకోశం రూపొందించాం.

ఈ పత్రికా పదకోశం నిర్మాణానికి సంపాదక బాధ్యతలు చేపట్టడానికి ప్రసిద్ధ భాషాశాస్త్రవేత్త, సాహితీవేత్త ఆచార్య చేకూరి రామారావు అంగీకరించడం సంతోషకరమైన విషయం. అతి తక్కువ సమయంలో పదకోశ నిర్మాణంలో ఉన్న పరిమితుల గురించి చే. రా. గారు గుర్తు చేస్తూనే ఉన్నారు. అయినా నిర్ణీతకాలంలో పత్రికాపదకోశం వెలువ రించాలన్న ఉద్దేశంతో వారిని తొందర పెట్టక తప్పలేదు. ఈ బృహత్తర కార్య క్రమాన్ని అనుకున్న సమయంలో పూర్తి చేయడానికి అంగీకరించి సహకరించినందుకు చేకూరి రామారావుకు కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాం.

సీనియర్ పాత్రికేయులు, విశాలాంధ్ర సంపాదకులు సి.రాఘవాచారి, తెలుగు విశ్వవిద్యాలయం జర్నలిజం విభాగం అధిపతి జి.యస్.వరదాచారి, ఆంధ్రజ్యోతి సంపాదకులు ఐ.వెంకట్రావు, ఆంధ్రభూమి రెసిడెంట్ ఎడిటర్ ఆర్.వి.రామారావు ఈ పదకోశం సంపాదక వర్గ సభ్యులుగా వ్యవహరించారు. తమ రోజువారీ వృత్తిలో తీరిక లేకుండా ఉంటూ కూడా, పత్రికా పదకోశం నిర్మాణానికి తగిన సలహాలు ఇచ్చారు.

ఈ పదకోశం నిర్మాణంలో పదసంగ్రహణలో పత్రికా రచయితలనే భాగస్వాము లను చేస్తే మరింత ప్రయోజనకరంగా ఉంటుందన్న ఆశతో అనుభవజ్ఞులైన పత్రికా రచయితల సహాయం అర్థించాం. కె.శ్రీనివాస్ (ఉదయం), బి.ఎస్.రామచంద్రరావు (ఆంధ్రభూమి), సి.హెచ్.వి.వి.సత్యనారాయణ (ఆంధ్రజ్యోతి), టి.శంకర నారాయణ (ఆంధ్రప్రభ). ఎన్.జ్యోత్స్నాదేవి (ఆకాశవాణి), ఎన్.బాబ్జీరాజు (ఆంధ్రప్రభ), టి.పి.విఠల్, (ఆంధ్రప్రభ మాజీ), యం.పి.సారధి (విశాలాంధ్ర). పి.ఎ.వి.వల్లభాచార్యులు (ఆంధ్రప్రభ వారపత్రిక) – పద సంగ్రహణలో సహకరించారు. వీరేకాక చివరి దశలో డి.నరసింగ రావు, కె.జ్యోతి, కె.సీతలు కూడా పదసంగ్రహణ చేశారు. పదసేకరణలోనూ వాటిని సరిచూడడంలోనూ బి.ఎస్.రామచంద్రరావు, టి.పి.విఠల్ చూపిన శ్రద్ధ, ఇచ్చిన తోడ్పాటును ప్రత్యేకంగా గుర్తు చేయడం మా విధి.

హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయ రీసెర్చి స్కాలర్ ఒరుగు భాస్కర్ అకడమిక్ అసిస్టెంట్‌గా పదకోశనిర్మాణం ఒక కొలిక్కి రావడానికి అహోరాత్రులు చేసిన కృషి అనన్య సామాన్యమైంది. ఆయనకు ప్రత్యేకంగా కృతజ్ఞతలు చెప్పుకుంటున్నాం.

ఈ నిఘంటు నిర్మాణానికి ప్రాజెక్టు నివేదికను తయారుచేయడం దగ్గరనుంచి పూర్తయ్యే వరకు అన్ని దశల్లోనూ సంపాదక వర్గ సభ్యులు ఆర్.వి.రామారావు కనబరిచిన



అమితమైన శ్రద్ధాసక్తులే కొరవడినట్లయితే ఈ సంకల్పం ఇంత త్వరగా నెరవేరేది కాదు. ఈనాడు వ్యవహారకోశం నిర్మాణంలో ఆయనకున్న అనుభవం కూడా ఇందుకు ఎంతో ఉపకరించింది. ఆయన తోడ్పాటుకు విశేష అభినందనలు తెలియజేయడం మా బాధ్య తగా భావిస్తున్నాం. పదకోశాన్ని సరిచూడడంలో అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం మాజీ ప్రొఫెసర్, ప్రసిద్ధ కథా రచయిత కేతు విశ్వనాథరెడ్డి తోడ్పాటును కృతజ్ఞతా పూర్వకంగా గుర్తు చేసుకుంటున్నాం.

నిఘంటు నిర్మాణంలో పైన తోడ్పడిన మిత్రులే కాకుండా మరెందరో జర్నలిస్టు మిత్రులు కూడా సహకరించారు. వారి సేవలను అకాడమీ ఎప్పటికీ మరిచిపోలేదు. నిఘంటు నిర్మాణం సాగిన ఈ ఏడాది కాలంలో ప్రెస్ అకాడమీ కార్యాలయ సిబ్బంది నిర్విరామ కృషి చేశారు. కార్యదర్శి ఎ.సత్యారావు, అకాడమీ ఇతర సిబ్బంది అభినంద నీయులు. పదజాలాన్ని కంప్యూటరీకరించడంలో యువమిత్రులు సి.హెచ్.రామారావు, జి.ప్రశాంత్ కుమార్ అలుపెరగకుండా పనిచేశారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ ఎన్.చంద్రబాబు నాయుడు ప్రెస్ అకాడమీ అవతరణకు కారకులు. ప్రప్రథమ అకాడమీ అధ్యక్షులుగా నన్ను నియమించారు. ఈ రెండేళ్ళలో ప్రెస్ అకాడమీ నిర్వహించిన, నిర్వహిస్తున్న వివిధ కార్యక్రమాలకు ఆయన వ్యక్తిగతంగా, ప్రభుత్వపరంగా ఇచ్చిన నైతిక, ఆర్థికసహకారం మరువలేనిది. ప్రెస్ అకాడమీ తన లక్ష్యాల సాఫల్యానికి చేస్తున్న కృషిని ఎప్పటికప్పుడు ఆయన ప్రోత్సహిస్తూనే ఉన్నారు. సంబంధిత ప్రభుత్వ అధికారులు కూడా అవసరమైన సహాయాన్ని మాకు అందించారు. వారందరికీ కృతజ్ఞతలు.

ప్రెస్ అకాడమీ స్థాపనకోసం ప్రభుత్వం ఏర్పాటుచేసిన ప్రత్యేక కమిటీలో సభ్యుడుగా ఉన్నప్పటి నుంచే పత్రికా రచయితలకోసం ఒక ప్రత్యేక నిఘంటువును రూపొందించాలనే ఉద్దేశం నాకు ఉండేది. అది ఇప్పటికి సాధ్యమైంది. అందుకు వ్యక్తిగతంగా నాకు చాలా సంతోషంగా ఉంది. వివిధ శాస్త్రాలకు సంబంధించిన సాంకేతిక పదజాలాన్ని చేర్చడానికి వివిధ పారిభాషిక పదకోశాలను ఆధారంగా తీసుకున్నాం. ఈ పదకోశంలో 25 వేల పైచిలుకు పదాలున్నాయి. ఇంకా చేర్చాల్సినవి అనేకం ఉండొచ్చు. దీని ప్రయోజనాన్ని నిర్ణయించవలసింది పత్రికా రచయితలే. ఈ పదకోశం నిర్మాణంలో ఉన్న పరిమితులను, వ్యవధిని సహృదయంతో అర్థం చేసుకుని తగిన సలహాలు ఇస్తే మలి ముద్రణలో దీన్ని మరింత నిర్దుష్టంగా, సమగ్రంగా రూపొందించడానికి వీలుంటుంది.

**అభివందనలతో**



**హైదరాబాదు**

**16, ఫిబ్రవరి 1998**

(కె.శ్రీనివాసరెడ్డి)

# సంపాదకీయం

**భా**షాభివృద్ధికి నిఘంటు నిర్మాణం ఒక సాధనం. తెలుగులో రకరకాల నిఘంటువులు రావలసిన అవసరం చాలా ఉంది. ఆ దిశగా ఒక చిన్న ప్రయత్నం ఈ పత్రికా పదకోశం. ఇది ఇంగ్లీషు తెలుగు ద్విభాషా నిఘంటువు. ఇంతకు ముందు ఇంగ్లీషు – తెలుగు నిఘంటువులు చాలా ఉన్నాయి. వాటిలో ఎక్కువభాగం గత శతాబ్దంలో తయారైనవి. ఈ శతాబ్దంలో వచ్చిన నిఘంటువులు ఎక్కువభాగం ఏవో నిఘంటువులకు అనువాదాలు మాత్రమే. మరికొన్ని నిఘంటువులు కొత్తగా తయారుచేసిన మాట నిజమేగాని వాటి పరిధి చాలా సంకుచితం.

తెలుగులో పత్రికారచన విస్తరించింది. రకరకాల దిన వార పక్ష మాసపత్రికలు ఇటీవలి రెండు దశాబ్దాల్లో ఎక్కువైనాయి. ఈ పత్రికలలో రకరకాల శీర్షికలు కూడా విస్తరించాయి. ఈ పత్రికల్లో కొత్తగా చేరి పనిచేసేవారు తమకు ఇంతకు ముందు తెలియని అనేక విషయాలను గురించి వార్తలు, వ్యాఖ్యలు, శీర్షికలు నిర్వహించాల్సి ఉంటుంది. ఇప్పుడు పత్రికా రచయితలకు ఉద్యోగ అవకాశాలు పెరగడంతో పాటు బాధ్యతలు కూడా పెరిగాయి. ఏ విద్యావంతుడికైనా ఈ కాలంలో ఏ ఒక్క శాస్త్రం లోనూ లోతైన ప్రవేశం సంపాయించటం కష్టం. కాని జర్నలిస్టులకు అన్ని శాస్త్రాలను గురించి అంతో ఇంతో తెలిసి ఉండాల్సిన అవసరాన్ని ఆధునిక విజ్ఞానం కల్పించింది. జర్నలిస్టులు తమ ఉద్యోగ ధర్మంగా అనేక వార్తాంశాలను, విజ్ఞాన విషయాలను పత్రికల్లో అనువాదం చేయాల్సిన అవసరం ఉంటుంది. ఈ అనువాదానికి లక్ష్య భాషలో తగిన పదాలు కావాలి. ఆ పదాలు వ్యక్తం చేసే భావనలూ అర్థం కావాలి. ఈ రెండు లక్ష్యాలను సాధించడానికి సమాన పద నిఘంటువు సరిపోదు. అతి వివరణాత్మక నిఘంటువులు అలవికాకుండా పోతాయి. అవి ఒక్కొక్క శాస్త్రానికి విడి విడిగా సాధ్యం అవుతాయి. ఒకే నిఘంటువులో ఇచ్చే వివరణలు విషయం స్థూలంగా తెలిసేంత సమగ్రంగానూ ఉండాలి, క్లుప్తంగాను ఉండాలి. ఈ రెండు లక్ష్యాలకోసం తెలుగు జర్నలిస్టులకు ముఖ్యంగా వృత్తిలో ప్రవేశించే కొత్త వారికి ఒక నిఘంటువు తయారు చేయడానికి ప్రెస్ అకాడమీ పూనుకున్నది. ఈ లక్ష్య సాధన అత్యంత క్లిష్టమైనది. దానికి విస్తృత ప్రాతిపదిక అవసరం. అనేక దేశాల్లో ప్రామాణిక నిఘంటువుల చరిత్రను పరిశీలిస్తే ఏ నిఘంటువూ ఒక దశాబ్దం లోపుగా బయటకు వచ్చిన దాఖలాలు లేవు. భాషాజ్ఞానం ఉన్న పండితులు అనేకులు ఒక చోట కూర్చుని తమ పూర్తికాలాన్ని వినియోగిస్తూ సుదీర్ఘకాలం వివిధ మూలాల నుంచి పదాలను, ప్రయోగాలను సంగ్రహించి వాటిని తైపారువేసి పునఃపునః పరిశీలించి నిగ్గుదేల్చి ప్రమాణీకరించవలసి ఉంటుంది.



ఉన్న వ్యవధిలో, అంటే ఒక్క ఏడాదిలోపునే, ఉన్న వనరులతో అనేకుల సహకారంతో జర్నలిస్టుల సౌకర్యం కోసం అవసరమైన ఈ నిఘంటువును రూపొందించగలిగాం. నిఘంటు ప్రమాణాల దృష్ట్యా చూస్తే చాలా లోపాలే కనిపిస్తాయి. నిఘంటు ప్రయోజనాల దృష్ట్యా చూస్తే ఇంతకు ముందు నిఘంటువులలో లేని అనేక సౌకర్యాలు ఈ కోశంలో కనిపిస్తాయి. ప్రామాణికతను సాధించలేని మా అశక్తతను మన్నించ గోరుతున్నాం. సాధించిన ప్రయోజకతను వినియోగించగోరుతున్నాం.

తాత్త్వికంగా అనిపించాలని కాదుకాని ప్రపంచంలో సమగ్రత అనేది పెట్టుకో దలచిన లక్ష్యమేగాని సాధించదగిన అంశం కాదని ప్రత్యేకంగా చెప్పక్కరలేదు. నిఘంటువుల విషయంలో ఇది పరమసత్యం. ఈ నిఘంటువు విషయంలో ఇది మరీ నిజం.

ఈ పదకోశంలో దినపత్రిక ప్రధాన వార్తల్లో కనిపించే సాధారణ పదాలు ఇంగ్లీషు దిన పత్రికల నుంచి విరివిగా సేకరించాం. ఆర్థిక రాజకీయాది సాంఘిక శాస్త్రాల పదజాలం, ఇతర భౌతిక జీవశాస్త్రాల పదజాలం, పత్రికలనుండి సేకరించి నవి కాక ఇతర ప్రత్యేక నిఘంటువుల నుండి కూడా గ్రహించాం. ఉన్న కొద్ది వ్యవధిలో ప్రత్యేక శాస్త్ర పదాలకోసం పత్రికల మీద మాత్రమే ఆధారపడితే ఎన్నో ముఖ్యమైన పదాలను వదిలివేసే ప్రమాదం ఉంది. ఇతర శాస్త్ర గ్రంథాల నుంచి గ్రహించిన పదాలు సాధారణ పత్రికా వ్యాసాల్లో రాదగిన వాటినే గ్రహించాం. ఈ మా నిర్ణయం అంత సరిగ్గా పాటించబడిందని చెప్పలేం. మా పద సంగ్రాహకులు అత్యుత్సాహంతో సేకరించిన గహనమైన శాస్త్ర పదాలను సాధ్యమైనంతవరకు తొలగించాం. ఇంకా మిగిలిపోయినవి ఉంటే ఉండవచ్చు.

ఒక ఇంగ్లీషు మాట బోధించే అర్థ సర్వస్వాన్ని చాలాచోట్ల ఒకే తెలుగుమాటతో చెప్పటం కష్టమయింది. స్వల్ప అర్థభేదాలతో ఉన్న అనేక సమానపదాలను తెలుగులో ఇచ్చిన సందర్భాలు చాలా ఉన్నాయి. ఇవి ఉద్దేశించిన మాటను పూర్తిగా అర్థం చేసుకోవడానికి మాత్రమే కాక అనువాద సందర్భానికి అనువైన మాటను ఎంచుకోవడానికి కూడా తోడ్పడతాయి. చాలాచోట్ల ముఖ్యమైన శాస్త్రపదాలకు క్లుప్తంగా వివరణలు ఇచ్చాం. ఈ వివరణలు చాలావరకు ఆ పదంగాని పదబంధం గాని ఉద్దేశించిన భావాన్ని స్థూలంగా అర్థం చేసుకోవడానికి పనికొస్తాయి. ఇంకా లోతుగా అర్థం చేసుకోవాలంటే ఆయా ప్రత్యేక శాస్త్రనిఘంటువులను సంప్రదించాల్సి వస్తుంది. కొన్ని పదాలు స్థూల దృష్టితో చూస్తే అర్థమైనట్టే కనిపిస్తాయి కాని ఆ మాటలకున్న పరిమితులు, వివరణలు చూడటం వల్ల మరింత విశదమవుతాయన్న ఉద్దేశంతో తెలిసినట్టే కనిపించిన మాటలకు కూడా అర్థనైశిత్యం కోసం వివరణలు చేర్చాం.

ఈ పదకోశంలో కనిపించే ఇంగ్లీషు మాటలన్నింటికీ తెలుగులో సమానార్థక శబ్దాలు తయారుకాలేదు. తయారయినవి దొరికితే ఇచ్చాం. పదసంగ్రాహకులు తయారుచేసినవి యోగ్యమనుకున్న వాటిని కోశంలో చేర్చాం. సందర్భాన్ని అనుస రించి సంపాదకులు, కొందరు సంపాదక మండలి సభ్యులు, అప్పుడప్పుడూ ఇతర పండితులూ సూచించినవి కూడా ఇందులో చేర్చాం. ఈ పదాలకు ప్రయోగ యోగ్యత ఉందో లేదోననే విషయం కాలమే నిర్ణయిస్తుంది. కొన్ని పదాలైనా నిలుస్తా యన్న ఆశ మాకుంది. కొత్తగా రాసేవారికి చేతికి అందుబాట్లో ఉంటాయనే ఆశతో ఈ పనిచేశాం. అయితే సాధ్యంకాని చోట్ల వివరణలు మాత్రమే ఇచ్చాం.

ఒకే ప్రపంచాన్ని భిన్న భాషలు రకరకాలుగా పరిశీలిస్తాయి. పదాల్లో వ్యక్త పరుస్తాయి. ఒక భాషలో నామం అయింది ఇంకో భాషలో క్రియగాను లేక క్రియ నామంగాను వ్యక్తం కావడం తరచుగా కనిపించే ఒక పద్ధతి. మూలభాషలో పదా లకు వాటి భాషాభాగాల్ని సర్వత్రా సూచించాలా లేదా అనే నిర్ణయం సకాలంలో తీసుకోలేకపోయాం. అందువల్ల ఈ భాషాభాగాన్ని సూచించే గుర్తులు అవసరమైన అన్ని చోట్లా కనిపించవు. నిఘంటు శాస్త్ర దృష్ట్యా చూస్తే ఇది నియమపాలనా లోపమే. అయితే ఈ కోశం ఇంగ్లీషులో రాసే వారికి కాక తెలుగు జర్నలిస్టులకు మాత్రమే ఉద్దేశించడం వల్ల, ఈ లోపం ఉద్దేశించిన ప్రయోజనానికి ఏమంత భంగకరం కాదని భావిస్తున్నాం.

ఈ పదకోశంలో సాధారణ నిఘంటువులో దొరికే మాటలన్నీ ఉండవు. అంతమాత్రం చేత సాధారణ నిఘంటువులో మాటలు ఇందులో తీసుకోకుండానూ ఉండలేం. కారణమేమంటే సాధారణ భాషాపదాలైనా పత్రికాభాషలో కొత్త సందర్భా లకు విస్తరించి కొత్త ఛాయలను కూర్చుకుని ఒక్కొక్కప్పుడు పూర్తిగా భిన్నార్థాలు కూడా చేర్చుకున్న దాఖలాలు కనిపిస్తాయి. ఈ రకం విస్తరణ ఆరోపాల్లో ఇచ్చిన ఇంగ్లీషు మాటలకన్నా అర్థాల్లో ఇచ్చిన తెలుగుమాటల్లో ఇంకా ఎక్కువ కనిపిస్తుంది. ఇట్లా ఇంగ్లీషు తెలుగు మాటల ప్రయోగ పరిధి ఇప్పుడు మనకు దొరుకుతున్న ఇంగ్లీషు తెలుగు నిఘంటువుల్లో అంతగా కనబడడం లేదు. ఈ పదకోశంలో వీటినన్నింటినీ సంపూర్ణంగా సాధించామని చెప్పలేంగాని ఆ మార్గంలో కొంత ప్రయత్నం చేశాం.

మాటలకున్న సర్వార్థచ్ఛాయలను ఇచ్చే ప్రయత్నం చేయలేదు. అన్ని విషయా ల్లోనూ, సర్వసమగ్ర నిఘంటువుగా తయారుచేసే ప్రయత్నం కన్నా పత్రికలలో తరచుగా కనిపించే మాటలను తరచుగా వాడే అర్థాలతో ఇయ్యటమే ఈ ప్రయత్నం లోని ప్రధానమైన లక్ష్యం.



కొన్ని మాటలు ప్రపంచంలో మూర్త పదార్థాలను సూచిస్తాయి. వీటిని గుర్తించడంలో ఏమంత చిక్కులుండవు. సాధారణ నిఘంటువులలో వీటిని బొమ్మల ద్వారా సూచిస్తారు. అమూర్త భావాల సంబంధాల్లోనూ, వ్యక్తీకరణలోనూ, భాషల మధ్య భేదాలు ఎక్కువగా ఉంటాయి. ఈ కోశంలో అమూర్తాంశాలకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చాం. ఉదా: awe అంటే భక్తి పూర్వక సంభ్రమం, భయం అనే అర్థాలతో పాటు నీటిచక్రం అనే అర్థం కూడా ఉంది. ఈ కోశంలో రెండో అర్థం లాంటివి కనిపించకపోవచ్చు.

మాటలకున్న అనేక అర్థాల్లో ఒక కాలంలో కొన్ని ప్రయోగ సందర్భాల్లో కొన్ని అర్థాలు ప్రధానంగాను, మరికొన్ని అర్థాలు అప్రధానంగాను కనిపిస్తాయి. చాలా చోట్ల ఇతరార్థాలను పరిగణనలోకి తీసుకున్నప్పటికీ కొన్ని చోట్ల పత్రికా భాషలో కనిపించే ప్రధాన అర్థాలను ఇచ్చి ఇతర అర్థాలను కొంత నిర్లక్ష్యం చేశాం. ఇందుకు కారణం నిర్లక్ష్యం చేయాలన్న సంకల్పం కాదు. ప్రధాన అర్థంతో త్వరగా సంతృప్తి పడి ఇతర అర్థాలకోసం అన్వేషించటంలో కొంత సాచేత జరిగింది. అయినా ఇచ్చిన అర్థాలను ఇతర సందర్భాలకు అన్వయించుకోవడంలో చిక్కులేమీ ఉండవు. ఉదా: irregularities, partisanship అనేమాటల అర్థాలు ఏ రంగంలో అయినా ప్రయోగ యోగ్యాలే. పత్రికలలో ప్రభుత్వ, ప్రజాపాలన కార్యక్రమాలకు సంబంధించి ఎక్కువగా కనబడతాయి. అర్థ వివరణలో పైరంగాలను పేర్కొన్నంత మాత్రాన ఇతర రంగాలకు అన్వయించదని మా ఉద్దేశం కాదు. పత్రికా భాషలో ప్రధానంగా ఈ అర్థంలో వస్తున్నదనే మా ఉద్దేశం. అయితే ఈ భాగాన్ని మాటను అర్థంచేసుకునే ప్రధాన ధోరణిని సూచించాలనే గాని అనువాదంలో ఇదంతా ఉపయోగించాలని కాదు.

ఇంగ్లీషు మాటలకు తెలుగు సమానార్థాలు ఇచ్చినంత మాత్రాన అన్ని చోట్లా ఆ మాటల ప్రయోగాలను గ్రహించటం సాధ్యంకాదు. అందువల్ల కొన్నిచోట్ల ఇంగ్లీషు మాటల సమానార్థకాలతోపాటు, తెలుగు వివరణలతో పాటు సంగ్రాహ కులు సరఫరా చేసిన సందర్భాల నుంచి ఇతరత్రా దొరికే సందర్భాలనుంచి కొన్ని పదబంధాలను ఉదాహరణలుగా ఇచ్చాం. ఉదా: Spiral అనే పదానికి పెరుగు అనే అర్థం వస్తే వయసు పెరగడమా వడ్డీ పెరగడమా అనే అనుమానం రావచ్చు. spiraling costs అనే ప్రయోగం కూడా ఇచ్చి అర్థం ఇస్తే ధరల పెరుగుదల అని అర్థమవుతుంది. ఒక మాటను ముందుగాని తర్వాతగాని విస్తరించి వాడిన రూపాలు పదబంధాలుగా ఉంటే వాటిని విస్తరణ రూపాలుగానే ఇచ్చాం. ఉదా: ఇటీవల Pollution అనే మాట బాగా ప్రచారంలోకి వచ్చింది. దానికి తెలుగులో కాలుష్యం అనే మాట వాడుతున్నాం. ఈ కాలుష్య సంబంధాన్ని విస్తరించిన అనేక

పదాలు వాడుకలో ఉన్నాయి. ఉదా: air pollution, water pollution, sound pollution etc.... ఇవి ప్రత్యేకమైన మాటలు కాకపోయినా, మాటల సంయోగాన్ని బట్టి అర్థం తెలుస్తున్నా అనువాదానికి అవసరం కాబట్టి విస్తరణ పదాలు చూపి తెలుగు పదాలు సూచించాం.

ఈ విస్తరణ విషయంలో కొన్ని చిక్కులున్నాయి. విస్తరణ పదబంధంగానే ఉందా? ఏకపద స్థాయికి చేరిందా? అనేది ఒక పట్టాన నిర్ణయించగలిగిన విషయం కాదు. ప్రామాణిక ఆంగ్ల నిఘంటువుల్లోనే ఈ విషయంలో ఏకత్వం ఉన్నట్టు కనిపించదు. అందువల్ల ఈ విషయంలో ఈ కోశంలో చేసిన నిర్ణయాలు అందరికీ అంగీకారం కాకపోవచ్చు.

కొన్ని మాటల అర్థాలను సంబంధితమైన ఇతర పదాలతో పోల్చిచూస్తే అర్థస్పష్టత ఏర్పడుతుంది. ఇట్లాంటి మాటలు నిఘంటువుల్లో దూరదూరంగా ఉంటాయి. ఈ కోశంలో అవసరమైన చోట్ల అట్లాంటి మాటల సూచికలను చేర్చాం. ఈ పద్ధతివల్ల ఒకే విషయానికి సంబంధించిన మరోమాట పరిచయం కావటం కూడా ఒక ప్రయోజనమే.

ఒక్కోసారి కొన్ని మాటలకు నిఘంటువులో ఇచ్చిన పదాలు ప్రయోగించిన అర్థానికి సరిపోవు. ముఖ్యంగా ఇతర భాషాపదాలు ఇంగ్లీషులో వాడినప్పుడు ఇటువంటివి ఎదురవుతాయి. 1997 ఆగస్టు 23 A.P.Times సంపాదకీయ పుటలో a birthday accolade to Andhra Kesari అనే వ్యాసంలో accolade అనే మాట అర్థనిర్ణయ విషయంలో కొంత చిక్కు ఏర్పడింది. ఈ మాటకు ఫ్రెంచి, ఇంగ్లీషు నిఘంటువులో hug, kiss అనే అర్థాలున్నాయి. American College Dictionaryలో పైపదానికి award, honor అనే మాటలు అర్థాలుగా ఇచ్చారు. ఇవేవీ ఈ వాడుకకు సూటిగా సరిపోవు. ఆ సందర్భాన్ననుసరించి దీనికి ప్రశంస అనే అర్థాన్ని కల్పించాం. ఇట్లాంటి అర్థకల్పనల్లో మేం కొంత సాహసం చేసిన మాట వాస్తవమే. ఇది దుస్సాహసం కాదని అనుకుంటున్నాం.

ఒక్కోసారి కొన్ని ఇంగ్లీషు మాటలు ఏకవచనంలో ఉన్నా తెలుగు అర్థాల్లో ఈ కోశంలో బహువచన ప్రయోగం కనిపించవచ్చు. అర్థవివరణ సౌకర్యం కోసం ఈ పద్ధతిని ఎన్నుకున్నాం. ఇంగ్లీషులో vector అనేమాట ఏకవచనమైనా తెలుగులో వ్యాధివాహకాలు, వ్యాధిప్రసారకాలు అనే అర్థాలనిచ్చాం. రకరకాల కీటకాలు వాహకాలుగా పనిచేస్తాయి గనుక బహువచనంలో అర్థగ్రహణం తేలికవుతుందని ఇలా చేశాం.

స్పెల్లింగుల విషయానికి వస్తే, తెలుగులో వర్ణక్రమవ్యవస్థ ఇంకా సరిగ్గా ఏర్పడలేదు. ఒకే మాట అనేక లేఖన పద్ధతుల్లో కనిపిస్తుంది. సంధికూడా ఒకసారి



చేస్తాం, ఒకసారి చేయం. ఈ కోశంలో కొంత నియతిని పాటించాం కాని, అన్ని వేళలా అ నియతికి కట్టుబడడం కుదరలేదు. ఇంగ్లీషు స్పెల్లింగులను సరి చూసేటప్పుడు ఉపయోగించిన నిఘంటు భేదాల వల్ల కొంత నియమ వైవిధ్యం కనిపిస్తుంది. అయితే మన దేశంలో ప్రస్తుతం బ్రిటిషు ఇంగ్లీషుతో పాటు అమెరికన్ ఇంగ్లీషు కూడా త్వరితగతిని వ్యాపిస్తుండటం వలన ఈ వైవిధ్యం ఇబ్బంది పెట్టదు.

ఇంకొక్కమాట: ఈ పదకోశంలో మేం చెయ్యాలనుకున్నవి చాలా చేయలేక పోయాం. పదాల భాషాభాగాల సూచన గురించి ఇంతకు ముందే ప్రస్తావించాం.

ప్రధానారోపం కింద ఇచ్చిన విస్తరణపదాల్లో వర్ణక్రమం పాటించడం ఒక పద్ధతి. ఈ నిర్ణయంలో జరిగిన జాప్యంవల్ల కొన్ని చోట్ల ఈ పద్ధతికి వ్యత్యయాలు కనిపించవచ్చు. అయితే ఈ అనుబంధ పదాల గుంపు పరిమితమైనదే గనుక వ్యత్యయాలు అంత ఇబ్బంది పెట్టకపోవచ్చు.

ఒక మాటకిచ్చిన సమానార్థక పదాలను వర్ణక్రమపద్ధతిలో ఇయ్యటం నిఘంటు నిర్మాణంలో పాటించే పద్ధతి. ఇక్కడ కూడా ఈ పద్ధతికి చాలాచోట్ల వ్యాఘాతం జరిగి ఉండవచ్చు. ఇది కూడా ఉద్దేశపూర్వకం కాదనీ, నిర్వహణలో జరిగిన స్ఖాలిత్యమనీ, కోశ వినియోగదారులు గ్రహించగలరని ఆశ.

ఒక మాటకు ఉన్న అర్థాలలో ప్రధానార్థం, గౌణార్థం వేర్వేరుగా సూచించాల్సిన బాధ్యత కోశకారులపై ఉంది. అంతేకాకుండా ఒక్కో మాటకు వివిధ శాస్త్రాలలో అర్థాలను ఆ శాస్త్రాన్ని సంకేతించి చెప్పవలసిన అవసరం కూడా ఉంది. ఈ బాధ్యతను నిర్వహించకపోవడానికి సమయాభావం ఒక ప్రధాన కారణం. ఇదికాక ఇంకో ముఖ్య కారణం కూడా ఉంది. ఇటీవల విస్తరించిన విజ్ఞానరంగాలు ఒక దానితో ఒకటి సంబంధాలు తెంచుకున్నవి కావు. ప్రతి శాస్త్రంలోను, ప్రతి విజ్ఞాన రంగంలోను మరో శాస్త్రప్రయోగం, మరో విజ్ఞాన విషయ సంబంధం అనివార్యంగా పెనవేసుకుని ఉన్నాయి. ఇటువంటి పరిస్థితులలో ఏ మాట ఏ శాస్త్రానికి పరిమిత మైనదో నిర్ణయించటం అంత సులభమైన పనేమీ కాదు. బహుశా కొన్ని మార్గాల ద్వారా ఆయా శాస్త్ర సంబంధాలను సూచించడం సాధ్యమయ్యేదేమో? ఈ కోశంలో ఆయా శాస్త్రాల ప్రమేయాన్ని సంకేత పదాల ద్వారా కాకుండా అర్థ వివరణలో సూచించాం.

ఇట్లా వివరించుకుంటూ పోతే మా లోపాలు మాకే కొట్టవచ్చినట్టు కనిపిస్తు న్నాయి. ఈ లోపాలేవీ ఈ కోశ ప్రయోజనాన్ని తగ్గించవని మేం దృఢంగా నమ్ము తున్నాం. వీటి ప్రస్తావన ఎందుకంటే ఈ లోపాలన్నింటినీ సవరిస్తూ అనతి కాలంలోనే ఇంతకన్నా మేలైన ప్రమాణాలతో ఈ కోశాన్ని పునఃపరిశీలించి పునరుద్ధ

రించవలసిన ఆవశ్యకతను మాకు మేం గుర్తు చేసుకోవటం కోసం. అట్లాంటి సంకల్పం మాకుందని మీకు తెలియజేయటం కోసం.

ఇట్లాంటి పదకోశ నిర్మాణానికి ఈ పరిమిత ప్రయత్నానికైనా ఎంతో మంది సహకారం లేకుండా ఈ ప్రయత్నం సాగదు. పేరుపేరున అనేకుల సహకారాన్ని ఇక్కడ చెప్పలేము కాని, కొన్ని ముఖ్యమైనవి చెప్పకపోతే అసంతృప్తి కలచివేస్తుంది. పదసంగ్రాహకులు అంతా కాకపోయినా, మా లక్ష్యాన్ని అర్థం చేసుకుని మాతో సహకరించిన వాళ్ళు కొద్దిమంది లేకపోలేదు. ఇదికాక సంపాదకమండలిలో ఆర్వీ రామారావుగారు ఈ కోశ నిర్మాణ ప్రయత్నంలో ప్రారంభం నుంచి ముగింపు వరకు వివిధ దశల్లో సహాయపడ్డారు. పద సంగ్రాహకుల్లో ఒకరైన బి.ఎస్.రామ చంద్రరావు పద సంగ్రహణకు మించి అర్థనిర్ణయంలో పాలుపంచుకున్నారు. చివరి దశలో ఆచార్యకేతు విశ్వనాథరెడ్డి పత్రికారంగంలోను, భాషారంగంలోను తనకున్న అనుభవాన్ని దాచుకోకుండా ఈ కోశానికి వెచ్చించడం ఈ కోశం అదృష్టం. మరీ ముఖ్యంగా ఆయన ఇచ్చిన ఆత్మవిశ్వాసం మాకు మరింత తోడ్పడింది. పద సంగ్రాహకులుగా పనిచేసిన టి.పి.విఠల్‌గారు తనకున్న విస్తృతమైన అనుభవాన్ని ఈ కోశం చివరి దశలో ఎడిటింగ్‌లో కూడా వినియోగించారు. చివరిదశలో కొన్ని పొరపాట్లను గుర్తుపట్టడంలో సి.సుజాత సాయపడ్డారు.

ఈ కోశ ప్రారంభం నుంచి చివరివరకు సంపూర్ణంగా నిమగ్నమైన సహాయకుడు, హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయ తెలుగుశాఖ పరిశోధక విద్యార్థి ఒరుగు భాస్కర్ తన ఆరోగ్యాన్ని కూడా లక్ష్యపెట్టకుండా సంపూర్ణ నిమగ్నతతో చేసిన కృషిని వర్ణించడానికి ఏ మాటలూ చాలవు.

ఆఖరుగా ఈ రకమైన ఆలోచన చేసిన ప్రెస్ అకాడమీ అధ్యక్షులు కె.శ్రీనివాస రెడ్డి గారు అభినందనీయులు. ఆమోదపూర్వకమైన ఆయన చిరునవ్వు, సంకోచం లేని ఆయన సహకారం ఈ కోశ నిర్వహణకు అవసరమైన ఆసరాను అందించాయి. కార్యదర్శి ఎ.సత్యారావు సమన్వయ కృషి ఇందుకు మరింత తోడ్పడింది.

నిఘంటు నిర్మాణానికి ప్రత్యక్షసంబంధం లేకపోయినా పరోక్షంగా అన్ని విధాలా సహకారాన్నందించిన ప్రెస్ అకాడమీ వివిధ స్థాయిల సిబ్బంది అందరికీ అభినందనలు, కృతజ్ఞతలు.

ఈ కోశాన్ని నిశితంగా పరిశీలించండి. మీ సూచనలు నిర్మొహమాటంగా ప్రెస్ అకాడమీకి పంపించండి. మలి ముద్రణలో దీని అభివృద్ధికి సహకరించండి.

**చేకూరి రామారావు**



# A a

**A1** ఉత్తమశ్రేణికి చెందిన, శ్రేష్ఠమైన, అత్యంత నాణ్యత కలిగిన

**aback** వెనకకు. *take* ~ ఆశ్చర్యపడిన, కలవరపడిన

**abaddon** నరకం; నరకాన్ని పాలించే దుష్ట దేవత

**abai** పైతృక, తండ్రినుంచి వచ్చిన

**abalienate** (హక్కు, ప్రయోజనం) పరాధీనం చేయు

**abalienation** హక్కును పరాధీనం చేయడం, అన్యాక్రాంతం చేయడం

**abandon** విశృంఖల స్వేచ్ఛ, ముందు వెనకలు చూడని స్వేచ్ఛ; వదిలివేయు, త్యజించు, దావా ఉపసంహరించుకొను; పరిత్యాగం చేయు: ఆశలు వదులుకొను

**abandoned** త్యక్తం, వదిలిపెట్టిన

**abandonment** వదులుకోవడం, జార విడవడం, విడిచిపెట్టడం, పరిత్యాగం ~ *clause* పరిత్యాగ నిబంధన

**ab ante** ముందుగానే

**abase** కించపరచు, అవమానించు, హీనపరచు

**abash** సిగ్గుపడేటట్లు, తలవంచుకునేట్లు చేయు

**abashed** సిగ్గుమాలిన

**abasia** నడవలేకపోవడం

**abask** వెచ్చని కాంతిలో ఉండు, ఎండ కాగు

**abate** తగ్గించు, దుర్బలపరచు, తగ్గుముఖం పట్టు, ఉపశమింపచేయు, రద్దు చేయు, తీసివేయు

**abatement** తగ్గుదల, ఆపుదల, ఉపశమనం, స్తంభన: దావా చర్యను ఆపివేయడం, దావా హక్కును కుదించడం. ~ *legacies* వీలునామా హక్కుల కుదింపు. ~ *of action* దావా ముగింపు. ~ *of appeals* అప్పీళ్ళు రద్దుకావడం. ~ *of judgement* అమలు చేయలేని తీర్పు రద్దు కావడం. *prorata* ~ దామాషా ప్రకారం చేసే తగ్గింపు.

**abattoir** కబేలా, వధ్యశాల

**abaxial** కేంద్రాపసార ఉపాక్ష

**abbacy** క్రైస్తవ మతాధికారి పదవి; అధికార పరిధి; పదవీ కాలం

**abbess** క్రైస్తవ సన్యాసినుల మఠానికి అధికారిణి

**abbot** క్రైస్తవ సన్యాసుల మతాధికారి

**abbrevature** నిక్షేపం, చిత్తురచన, సంక్షిప్త రచన

**abbreviate** సంక్షిప్తంచేయు, సంగ్రహపరచు

**abbreviation** క్లుప్తీకరణ, సంక్షిప్తీకరణ; ప్రత్యాహారం

**ABC** ఒక విషయానికి సంబంధించిన ప్రాథమిక విషయాలు

**abdicate** పదవిని వదులుకొను, పదవీ పరిత్యాగం చేయు, పరిత్యజించు

**abdication** పరిత్యాగం; పదవీ పరిత్యాగం

**abdomen** ఉదరం, కడుపు

**abdominal** ఉదర సంబంధమైన. ~ *approach* ఉదరమార్గం ద్వారా శస్త్రచికిత్స. ~ *reflex* ఉదరంలోని కండరాలు ముడుచుకు పోయేస్థితి

**abduce** అపహరణ

**abduct** అపహరించుకొనిపోవు, ఎత్తుకొని పోవు

**abduction** అపహరణ, బలవంతంగా ఎత్తుకొని పోవడం

**abductor** అపహరించే వ్యక్తి, అపహర్త; అభివర్తని కండరం
**abecedarian** ప్రాథమిక, నిర్దిష్ట రీతిలో అమర్చిన
**abed** మంచం మీద ఉండు, పక్క మీద
**abena** శ్వాసావరోధం
**aberrant** నైతిక ప్రమాణాల్ని అతిక్ర మించిన. ~ *behaviour* అసాధారణ ప్రవర్తన
**aberrate** దారితప్పు; వికృతి, వైపరీత్యం
**aberration** భ్రంశనం, దారితప్పడం; స్పష్టత లేకపోవడం, స్థానంలో మార్పు రావడం
**abet** పురికొలుపు, ఉసికొలుపు, ప్రేరే పించు; నేరాన్ని ప్రోత్సహించు
**abetment** ప్రోత్సాహం, నేరానికి ప్రేరేపణ, నేరం చెయ్యటంలో సహాయం, దుష్ప్రేరణ
**abetter** నేర ప్రేరకుడు, నేరం చెయ్య డానికి ప్రేరేపించిన వ్యక్తి
**abeyance** ఉపేక్షించడం, తాత్కాలికంగా పక్కనపెట్టడం, నిర్ణయం చెయ్యకుండా నిలిపి ఉంచడం
**abeyant** ఎటూ తేలని స్థితి, అనిర్ణాయక స్థితి
**abhor** అసహ్యించుకొను, ఏవగించుకొను, తిరస్కరించు, విద్వేషించు
**abhorrence** రోత, ఏవగింపు, ఛీదర, అసహ్యం
**abhorrent** తిరస్కృత, అసంగత
**abhorrer** అసహ్యించ దగిన వ్యక్తి, తిరస్క రించ దగిన వ్యక్తి
**abide** నిబద్ధమై ఉండు, శాశ్వతంగా కట్టు బడి ఉండు
**abiding** శాశ్వతమైన, స్థిరమైన. ~ *love* స్థిర ప్రేమ, శాశ్వతప్రేమ
**abience** తప్పించుకోదగినది
**abilitative** సామర్థ్యార్థకం
**ability** సామర్థ్యం, దక్షత, ప్రాగల్భ్యం. ~ *test* సామర్థ్య పరీక్ష
**ab initio** మొదటి నుంచి, ఆది నుంచి. ~ *mundi* మొట్టమొదటి నుంచి, సృష్ట్యాది నుంచి
**ab intestato** మరణశాసనం రాయని వ్యక్తి నుంచి
**ab invito** బదిలీ ఆస్తిని బలవంతంగా పుచ్చుకోవడం
**abiogenesis** అకస్మాజ్జీవ జననం:
**abiosis** జీవ రహిత స్థితి, అచేతన స్థితి
**abiotic** జీవం లేని; జీవించడానికి అను కూలం కాని
**abiotrophy** శరీరం శుష్కించిపోవడం, కణజాలాల అరుగుదల
**abject** దుర్భర, దుస్పృహ, దయనీయ, హీన, నికృష్ట, గర్హించదగిన
**abjection** న్యూనతాభావం
**ab judicatio** న్యాయస్థానం నుంచి తొల గించడం
**abjuration** ప్రమాణపూర్వకంగా నిరాక రించడం, త్యజించడం, వదిలివేయడం
**abjure** ప్రమాణ పూర్వకంగా నిరాకరించు, త్యజించు, వదులుకొను
**ablactation** బలహీనమైన
**ablation** ఉపరితలక్షయం, హిమానీ క్షరణం; హిమక్షయం
**ablative** పంచమీ విభక్తి
**ablator** ఉష్ణనిరోధక కవచం
**ablaut** అచ్చులలో అసమ పరిణామం
**ablaze** మండే, ఉద్రిక్తంగా, ప్రకాశ వంతంగా
**ablution** శుద్ధి స్నానం, శుద్ధీకరణం, శుచి స్నానం, తీర్థస్నానం
**ablutomania** నిరంతరం శరీరాన్ని శుభ్ర పరచుకోవాలనే కోరిక



**abnegate** కోరికను వదిలిపెట్టు, తోసి పుచ్చు, త్యజించు
**abnegation** త్యాగం, ఆత్మత్యాగం, స్వార్థ త్యాగం, ఆత్మతిరస్కారం, అయిష్టంగా వదిలిపెట్టడం
**abnormal** సాధారణస్థితికి భిన్నమైన, అసామాన్యమైన, అసహజ
**abnormality** వికృతస్థితి, అసహజత, క్రమవిరుద్ధత.
**abnormally** వికృతంగా, అసాధారణంగా
**abnormity** వైపరీత్యం, అసాధారణ
**aboard** (ప్రయాణ సాధనాలలో) ఎక్కి కూర్చొను
**abode** ఆవాసం, ఇల్లు, వసతి, తావు, నివాసం, నిలయం, నెలవు
**aboil** ఉడుకు మీద ఉండు, ఉడుకెత్తు
**abolish** రద్దుచేయు, నిర్మూలించు, తొల గించు, అంతంచేయు
**abolishionist** బానిసత్వం, మరణ శిక్ష వంటి వాటిని రద్దు చేయాలని కోరే వ్యక్తి
**abolishment** రద్దు
**abolition** రద్దు, తొలగింపు, నిర్మూలన
**abomasum** పశువుల్లో నాలుగో జీర్ణా శయం
**abominable** అసహ్యకరమైన, హేయ మైన, ద్వేషింపదగిన
**abominate** అసహ్యించుకొను, త్యజించు
**abomination** తీవ్ర అసహ్యం
**aborigin** ఆదివాసి, నగరేతర ప్రాంత నివాసి
**aboriginal** ఆదిమ, ఆదివాసి
**abort** గర్భస్రావం; మధ్యలో రద్దు చేయడం, నిలిపి వేయడం
**aborticide** గర్భస్రావ కారకం
**abortifacient** గర్భస్రావకం, గర్భ స్రావాన్ని కలిగించే
**abortion** గర్భస్రావం, గర్భవిచ్ఛిత్తి, కార్య భంగం, వైఫల్యం, భ్రూణహత్య. *spontaneous* ~ తక్షణ గర్భస్రావం. *threatened* ~ గర్భస్రావభయం
**abortionist** గర్భస్రావకుడు
**abortive** అకాల, మధ్యలోనే ఆగిపోయే నెల తక్కువ
**abortus** పడిపోయిన భ్రూణం
**aboulia** ఆత్మస్థైర్య రాహిత్యం
**abound** పర్యాప్తమైన, నిండిన, సమృద్ధ మైన, పుష్కలమైన
**about face** అభిప్రాయాన్ని మార్చుకొను
**about turn** వెనుదిరుగు
**above board** నిష్కల్మష, దాపరికంలేని, దోషరహిత, నిజాయితీ వ్యక్తమయేట్లు, అనుమానానికి తావులేని
**above law** చట్టానికి అతీతం, న్యాయా తీతం
**above par** మామూలు కంటె అధికం, ముఖవిలువకు మించిన ధర, అధి మూల్యం
**abrackish** తక్కువ ఉప్పుసాంద్రత కల నీరు
**abrade** అరిగిపోవు, తరుగు, అరగదీయు, తోము, చెక్కు
**abrancliate** మొప్పలులేని, జలశ్వాసా వయవాలు లేని
**abrasion** రాపిడి, ఒరిపిడి, ఒరుసుకు పోవడం, చర్మం గీసుకుని పోవడం
**abrasive** మొరటు, కరుకు, కఠిన, ఒరుసు కొని పుండగు, రాచుకొను
**abreaction** మానసికోద్రేకం, మనస్సు తేలిక పడేటట్లు చేయడం
**abreast** సరిసమంగా, సమ మట్టంగా; విషయం ఎప్పటికప్పుడు తెలుసుకోవడం, సమతల ప్రదేశంలో పక్క పక్కన ఉండటం

**abridge** క్లుప్తీకరించు, సంక్షిప్తీకరించు, సంగ్రహీకరించు/ తగ్గించు, కుదించు

**abridgement** కుదింపు, సంక్షిప్తీకరణ, క్లుప్తీకరణ

**abroad** దేశాంతరాల్లో, విదేశాల్లో; విస్తృత ప్రాంతంలో, ఆరుబయట

**abrogable** రద్దుకాదగిన శాసనం

**abrogate** (చట్టాన్ని) రద్దు చేయు, శాసనాన్ని ఉపసంహరించు

**abrogation** రద్దు, రద్దు చేయడం. ~ *of law* చట్టాన్ని రద్దుచేయడం

**abrosia** ఉపవాసస్థితి

**abrupt** హఠాత్తు, ఆకస్మికం, అనూహ్యం, అర్థాంతరం

**abruption** అవాంతరం

**abrus** గురివింద

**abscess** పుండు, కణితి, గాయం, వ్రణం

**abscissa** నిరూపకాక్షం, నిరూపకం

**abscission** కర్తనం, ఛేదించడం, తెగిపోవడం

**abscond** పరారు కావడం, ఆచూకీ లేకుండా పోవడం, పారిపోవడం, తప్పించుకొని పోవడం; గైరుహాజరు కావడం

**abscondence** పరారీ

**absconder** పరారైన వ్యక్తి

**absconding** పరారు, పరారీ

**absconsion** తప్పించుకు పోవడం, పరారీ, పారిపోవడం

**absence** స్పృహలేకపోవడం, మూర్ఛ రావడం

**absense** గైర్హాజరీ. *in the* ~ *of domestic laws* సొంతచట్టాలు లేనప్పుడు

**absentee** గైర్‌హాజరైన వ్యక్తి, హాజరు కాని, అనుపస్థితమైన. ~ *landlord* పరోక్ష భూస్వామి, ~ *voting* అనుపస్థితి ఓటింగ్

**absenteeism** గైర్‌హాజరీ, అనుపస్థితి, అలవాటుగా పని ఎగ్గొట్టడం. ~ *rate* నిర్ణీత కాలంలో పనిచేయని రోజుల శాతం

**absent minded** అన్యమనస్క, మతిమరుపుగల, పరాకు

**absent mindedly** పరాకుగా

**absent reo** ప్రతివాది హాజరు కాకపోవడం

**absolute** నిరవధిక, పూర్తిగా, సంపూర్ణమైన. ~ *freedom* అపరిమిత స్వేచ్ఛ, అవధులులేని స్వేచ్ఛ. ~ *idealism* కేవల భావవాదం, అధి భౌతికవాదం, వస్త్వాశ్రయ భావవాదం ~ *interest* ఆస్తిపై పూర్తి యాజమాన్యం ~ *knowledge* పరమజ్ఞానం. ~ *majority* పూర్తి మెజారిటీ, సంపూర్ణ ఆధిక్యం, నిరపేక్ష మెజారిటీ. ~ *monopoly* గుత్తాధిపత్యం, సంపూర్ణ ఏకస్వామ్యం, నిరపేక్ష ఏకస్వామ్యం, ~ *privilege* శాసనకర్తల ప్రత్యేక హక్కు ~ *temperature* పరమశూన్య ఉష్ణోగ్రత. ~ *theory of sovereignty* పరిపూర్ణ సార్వభౌమ సిద్ధాంతం. ~ *truth* పరమ సత్యం ~ *zero* పరమశూన్యం (–273 సెంటీగ్రేడుకు సమానం)

**absolutely** పూర్తిగా, సంపూర్ణంగా, కేవలం

**absolutism** శిక్షించకుండా వదిలివేయడం, విడుదలచేయు, పాప విముక్తం చేయు

**absolutism** నిరంకుశత్వం; పాప విముక్తి

**absolvant** విమోచకుడు, ముక్తి ప్రదాత

**absolve** నిర్దోషిగా నిర్ణయించండని, దోషరహితం చేయు, తప్పించు, విముక్తిచేయు

**absonant** అసంగతమైన, శ్రుతికలవని, కటువుగా



**absorb** పీల్చుకొను, గ్రహించు, శోషించు, చేర్చుకొను, కలిసిపోవు, అవచూషణ

**absorbant** ద్రవ గ్రాహకం, అవచూషకం

**absorber** శోషకం

**absorbing** ఆకట్టుకునే, ఆకర్షించే, విలీనం చేసుకునే

**absorption** శోషణం, గ్రహించడం, పీల్చుకోవడం, ద్రవ గ్రాహక పద్ధతి, ఎక్కువ శ్రద్ధచూపడం; (వి) లీనం. *active* ~ సక్రియాశోషణం. ~ *companies* కంపెనీల విలీనం. *light* ~ కాంతిశోషణం. ~ *of costing* అన్ని ఖర్చులను పరిగణనలోకి తీసుకుంటూ అమ్మకపువెల నిర్ణయించడం. *selective*~ వరణాత్మక శోషణం. ~ *spectrum* శోషణ వర్ణపటం.

**absquatulate** పరారీ అవు, బిచాణా ఎత్తివేయు

**abstain** మానుకొను, వైదొలగు, నిగ్రహించుకొను, దూరంగా ఉండు, ఓటు వేయకుండు, ఓటింగ్ సమయంలో సభకు గైర్‌హాజరవు

**abstainer** మత్తు పదార్థాలు మానేసిన వ్యక్తి

**abstemious** తక్కువ అలవాటు కల, మితాహారి అయిన,

**abstention** గైర్‌హాజరు, పాల్గొనకపోవడం; విముఖత

**abstinence** సంయమనం, ఉపవాసం, లంఖణం

**abstract** అమూర్తం, సారాంశం; అమూర్త, నైరూప్య; సంక్షిప్తరూపం, సంగ్రహం; సంగ్రహించు, సంక్షేపించు, పరిగ్రహించు. ~ *art* నైరూప్యకళ. ~ *knowledge* అమూర్త జ్ఞానం. ~ *of title* ఆస్తిపై యాజమాన్యపు హక్కును ధ్రువీకరించే పత్రం. ~ *painting* నైరూప్య చిత్రం. ~ *relation* అమూర్త సంబంధం

**abstraction** అక్రమంగా తీసుకోవడం; అమూర్తీకరణ, నైరూప్యత: భేదనం: కృత్రిమంగా నీటిని తోడివేయడం; విషయావగాహన; నమూనాను రూపొందించడం

**abstractionist** అమూర్త / అవాస్తవిక ధోరణులు గల వ్యక్తి

**abstrict** స్వేచ్ఛగా వదిలివేయడం; విడిచిపెట్టు, (విత్తనాలు) వెదజల్లు

**abstruse** అగమ్య, బోధపడని, సుబోధకం కాని, కఠిన, అర్థంకాని, క్లిష్టమైన, ప్రగాఢమైన

**absurd** విడ్డూరమైన, కారణరహిత, సందర్భరహిత; అసంబద్ధత; ~ *theatre* అసంబద్ధ నాటక రంగం

**absurdist** అసంబద్ధతా వాది

**absurdity** అసంబద్ధత, అసంగతం, అసమంజసం

**abulia** నిర్ణయరాహిత్యం

**abundance** సమృద్ధి, విరివి, మిక్కుటం

**abundant** అమితమైన, ధారాళంగా, అధికమైన, సంపూర్ణమైన, పుష్టియైన, సమృద్ధ

**abundantly** దండిగా

**abuse** n. దుర్భాష, నింద, తిట్టు, దూషణ, దురుపయోగం, దుర్వినియోగం. ~ *of law* చట్టాన్ని దుర్వినియోగం చెయ్యడం. ~ *of power* అధికార దుర్వినియోగం

**abuse** v. తిట్టు, దూషించు, నిందించు, దుర్వినియోగం చేయు

**abuser** దుర్వినియోగం చేసే వ్యక్తి

**abusion** దుర్వినియోగం, మోసం, తప్పు

**abusive** దుర్వినియోగంచేసే

**abut** ఆనుకొని ఉండు, పక్కనే ఉండు

**abutment** ఆసరా, అండ

**abuttals** భూమి / భవనాల సరిహద్దులు

**abuttor** సరిహద్దుదారు, పొరుగు భూమి యజమాని
**abuzz** వ్యాపించిన, అలుముకొన్న, ముసురుకొన్న
**abysmal** నాణ్యతలేని, అసమర్థమైన, చెడు, అగాథ, హీనమైన, నీచమైన
**abysmal sea** అగాధ సాగరం
**abyss** అగాధం, లోయ, పాతాళం, అథోలోకం, నరకం, సాగరగర్భం
**abyssal** అగాధం, సముద్రాంతర్భాగం
**acacia** తుమ్మ మొక్క/ పొద/ చెట్టు; ఒక విధమైన జిగురు
**academic** విద్యా విషయకమైన, పాండిత్య ప్రదర్శక, సంశయవాద సంబంధమైన. ~ *discussion* (విద్యా విషయక) చర్చ, గోష్ఠి, ~ *year* విద్యాసంవత్సరం
**academical** విద్యా విషయకమైన
**academician** విద్యావేత్త
**academist** విద్యావేత్త
**academy** అకాడమీ, విద్యాపరిషత్తు, విద్యా కేంద్రం; ప్రత్యేక శిక్షణా కేంద్రం
**acalculia** లెక్కలను పరిగణించ లేని మానసికస్థితి
**acanaceous** ముళ్ళుగల
**acantha** ముల్లు
**acapnia** రక్తంలో బొగ్గు పులుసు వాయువు
**acaricide** క్రిమి సంహారిణి
**acarpellous** తొనలు లేని
**acarpous** పండుపండని
**acarus** చెట్లకు పట్టే పేను బంక
**acathisia** కూర్చోవడానికి శక్తి చాలక పోవడం
**acaudal** తోకలేని
**acaulescent** పొట్టి కాండం గల
**accede** చేరు, చేరిపోవు, సమ్మతించు, విలీనమగు
**accelerate** తీవ్రపరచు, వేగంపెంచు, శీఘ్రంచేయు
**acceleration** త్వరణం, వేగవృద్ధి రేటు, వేగం పెంచే సాధనం / వ్యక్తి; పరిణామం: జీవి పెరుగుదల రేటు. ~ *due to gravity* గురుత్వ త్వరణం
**accelerator** వేగ వర్థక పరికరం/ వ్యక్తి/ పదార్థం
**accent** ప్రాంతీయోచ్చారణరీతి; విషయ ప్రాధాన్యం, గాఢత; తీవ్ర విలక్షణత; స్వరం
**accentuate** త్వరితంచేయు; పెంచు, తీవ్రంచేయు, నొక్కిచెప్పు, ప్రాముఖ్యం పెంచు
**accept** స్వీకరించు, అంగీకరించు, ఒప్పుకొను, సమ్మతించు, ఇవ్వచూపింది/ బాధ్యత తీసుకొను
**acceptability** అంగీకారయోగ్యత, ఆమోదదాయకం
**acceptable** స్వీకరించదగిన, ఆహ్లాదకర, ఆమోదించదగిన, గ్రాహ్య, అనుకూల, తగిన, అంగీకరించదగిన
**acceptance** అంగీకారం, ఒప్పందం, నమ్మిక, స్వీకరణ, అనుకూలత
**acceptant** స్వీకర్త
**accepted** స్వీకృత
**accepting** అంగీకరించిన. ~ *bank, house* చెల్లిస్తామని వాగ్దానం చేసిన సంస్థ, వాణిజ్య బ్యాంకు
**acceptor** చెల్లించేందుకు అంగీకరించి సంతకంచేసిన వ్యక్తి; గ్రాహి; మాలిన్యం.
**access** దారి, మార్గం, ప్రవేశం, ప్రవేశ సౌలభ్యం, అవకాశం, అందుబాటు; సమాచారాన్ని పొందడం / ఎక్కించడం
**accessibility** సుగమమైన, సులభమైన, ప్రవేశయోగ్యమైన, ప్రవేశ/ దర్శన సౌలభ్యం, అందుబాటు



**accessible** అందుబాటులో ఉండే, సుగమ, ప్రవేశయోగ్య
**accessio** ఆస్తిలో అనువృద్ధి
**accession** ప్రవేశం, విలీనం, చేరిపోవడం, ఆస్తిలో అనువృద్ధి; గద్దె ఎక్కడం, పదవీ స్వీకారం
**accessories** విడిభాగాలు, అనుబంధితాలు, సహాయకారులు, అనుబంధ సాధనాలు
**accessory** సహాయకుడు, తోడుదొంగ, సహాపరాధి; అప్రధాన, అనుబంధ, అదనపు. ~ *food* అనుబంధ ఆహారం. ~ *gland* ఉపగ్రంధి. ~ *industry* అనుబంధ పరిశ్రమ. ~ *right* అనుబంధ హక్కు. ~ *after the fact* నేరం జరిగిన తర్వాత నేరస్తునితో సహకరించిన వ్యక్తి. ~ *before the fact* నేరం జరగటానికి పూర్వం నేరస్తునితో సహకరించిన వ్యక్తి
**accident** హఠాత్సంఘటన, దుస్సంఘటన, ప్రమాదం, దుర్ఘటన. ~ *prone* ప్రమాదాలు ఎక్కువగా జరిగే అవకాశం ఉన్న
**accidental** ఆకస్మిక, యాదృచ్ఛిక, ప్రయత్నం లేకుండా
**accidentalism** యదృచ్ఛావాదం
**accidentally** అకస్మాత్తుగా, ప్రమాదవశాత్తు, యాదృచ్ఛికంగా
**accidie** n. బద్ధకం, సోమరితనం; నిరాశ
**accipitral** తీక్షణదృష్టి గల, డేగవంటి, క్రూర
**acclaim** అభినందన, చప్పట్ల ధ్వని
**acclamation** పొగడ్త, ప్రకటన, హర్షధ్వానం
**acclamitize** వాతావరణ పరిస్థితులకు అలవాటుపడు, సహించు
**acclimation** ప్రతిస్పందన
**acclimatization** అలవాటు పడడం అనుకూలనం
**acclivity** ఎగువభాగం, ఎగుడు ప్రదేశం
**accolade** ప్రశంస, మన్నన, అభినందన
**accommodate** స్థానం కల్పించు, (వ్యక్తిని) సంసిద్ధుణ్ణి చేయు, విభేదాన్ని తొలగించు, మైత్రి ఏర్పరుచు, వసతి కల్పించు
**accommodating** సహాయంచేసే, సులభంగా వంగే, అనుకూల; సరిపెట్టుకొను, సహాయం చేయడానికి సిద్ధంగా ఉండు.
**accommodation** సర్దుబాటు; స్వల్పకాలిక రుణం. ~ *address* ఉపయుక్త చిరునామా: ~ *of eye* దృష్టి సర్దుబాటు. ~ *ladder* నౌక దగ్గర ఉండే నిచ్చెన
**accommodatum** సరుకు బదులు ఇవ్వడం
**accomodative** సర్దుబాటుకు అనువైన, సర్దుకుపోయే
**accompaniment** తోడ్పాటు, సహకారం, వంతపాట
**accompany** అనుసరించు, సహకరించు, తోడ్పడు
**accomplice** తోడు దొంగ, సహాయకుడు, సహాపరాధి
**accomplish** పూర్తిచేయు, సాధించు, నెరవేర్చు, నిర్వర్తించు
**accomplished** నిష్ణాత, నేర్పుగల, నైపుణ్యంగల; పూర్తియైన, నెరవేరిన
**accomplishment** సిద్ధి, సాధించడం, పరిపూర్తి, సమాపనం
**accord** ఒప్పందం, ఒడంబడిక, అంగీకారం, సయోధ్య, అవగాహన; అంగీకరించు, ఒప్పుకొను, ఇచ్చు, అనుమతించు. *with one* ~ ఏకగ్రీవంగా, ఏకాభిప్రాయంతో
**accordance** సంబద్ధత, అనుకూలత, అనురూపత, ఏకీభావం, ఒప్పుదల. *in* ~ *with* ఆ విధంగా, అనుసరించి, ఆ ప్రకారంగా, తదనుగుణంగా

**accordant** అంగీకరించదగిన, అవసరం కోసం దగ్గరికి వచ్చు, ధైర్యంగా ఎదుర్కొను, లైంగిక వాంఛా సూచనలుచేయు. ~ *satisfaction* దండు కట్టి ఒప్పందం నుంచి వైదొలగడం

**accost** పలకరించు; అభివాదం, ప్రారంభపు పలుకు

**accouchement** ప్రసవం, కానుపు

**accoucheuse** మంత్రసాని

**account** వివరణ, వృత్తాంతం, సంగతి; రావలసిన/ చెల్లించవలసిన డబ్బు వివరాలు, లెక్క, పద్దు, డబ్బు లావాదేవీల వివరణ, ఖాతా. ~ *book* అకౌంట్ పుస్తకం. *bring to* ~ మందలించు. *by all* ~ అన్ని విధాలా. *capital* ~ మూలధనం ఖాతా *credit* ~ అరువు ఖాతా. *current* ~ కరెంట్ అకౌంట్, స్వల్పకాలిక ఖాతా, వడ్డీ చెల్లించని ఖాతా. *deficit* ~ లోటు ఖాతా, *drawing* ~ సొంత వాడకాల ఖాతా. *give a good* ~ *of* అద్భుతంగా చేయు, ప్రావీణ్యం చూపు, రాణించు. ~ *holder* ఖాతాదారు. *hold to* ~ బాధ్యుడ్ని చేయు. *on* ~ *off* దాని కారణంగా. *on no* ~ అకారణంగా, నిష్కారణంగా. *on ones own* ~ సొంత బాధ్యత మీద. ~ *payable* అందిన సరుకుకు చెల్లించాల్సిన మొత్తం, రుణపడి ఉన్న మొత్తం. ~ *payee* బ్యాంకు ఖాతాలో మాత్రమే జమ కావాలని చెక్కుపై రాసే నిర్దేశం. *purchases* ~ కొనుగోలు ఖాతా. ~ *receivable* ముట్టజెప్పిన సరుకుకు ప్రతిగా అందాల్సిన మొత్తం. *sales* ~ అమ్మకాల ఖాతా. *suspense* ~ అనామతు ఖాతా. *take into* ~ పరిగణించు. *take no* ~ *off* పరిగణించక పోవడం, నిర్లక్ష్యం చేయడం, బేఖాతరు చేయడం. *turn to good* ~ అనుకూలమగు, ప్రయోజనకరంగా పరిణమించు.

**account** లెక్కించు, పరిగణించు, వివరించు, కారణం చూపు, తలచు

**accountability** జవాబుదారీతనం, బాధ్యత

**accountable** వివరణ ఇవ్వాల్సిన, కారణం చూపాల్సిన, సంజాయిషీ చెప్పవలసి ఉన్న

**accountancy** గణకశాస్త్రం; ఖాతా లెక్కలు చూసేవృత్తి

**accountant** అకౌంటెంట్, గణకుడు. ~ *general* అకౌంటెంట్ జనరల్, ప్రధాన గణకుడు

**accounterments** సేవాసామగ్రి, హంగులు, అవసరమైన వస్తువులు

**accounting** లెక్కలుచూడడం, ఖాతాల తనిఖీ. ~ *period* గణనకాలం, నిర్ణీత కాల వ్యవధి. ~ *rate of return* వాణిజ్యం, వ్యాపారం; పథకం; అంచనా కట్టిన నికరలాభ శాతం. ~ *summary* ముగింపు ఖాతాల సంక్షిప్త రూపం, గణన కాలానంతర ద్రవ్య నివేదిక

**accountre** సైనికుడిలా దుస్తులు ధరించు, సైనిక పరికరాలు

**accredit** ఆధికారికంగా గుర్తించు/ నియమించు

**accreditation** ప్రాతినిధ్యం, ఆధికారికమైన గుర్తింపు

**accredited** నియమిత, నమోదుచేసిన, అధికృత ~ *journalist* గుర్తింపు పొందిన పత్రికా రచయిత/ జర్నలిస్టు

**accrescent** పెరిగే, నిరంతరాభివృద్ధి చెందే

**accrete** కలసి పెరగడం

**accretion** పెంపు, వృద్ధి; జమ; ~ *of land* భూవైశాల్యం పెరగడం



**accrimination** నేరారోపణ

**accroach** అధికారం దురుపయోగం

**accrual** పెరుగుదల, క్రమవృద్ధి, ప్రాప్తం. ~ *basis* పెరుగుదల ప్రాతిపదిక. ~ *bonus* ప్రాప్తించిన బోనసు. ~ *costs* ధరల పెరుగుదల. ~ *income* ప్రాప్తించిన వడ్డీ, ఆదాయం. ~ *interest* జత కలిసే వడ్డీ. వడ్డీ. ~ *rights* ప్రాప్తించిన హక్కులు

**accrue** వృద్ధి అవు, పెరుగు, ఇవ్వదగిన వడ్డీ ప్రాప్తించు, ఫలించు, జమ అవు, ఫలితం సిద్ధించు

**accrued benefits** లభించే ఉపకారాలు:

**accruing** ప్రాప్తించు, సంచితమగు. ~ *costs* ప్రాప్తించే ఖర్చులు. ~ *debts* ప్రాప్తించే రుణాలు. ~ *dividend* ప్రాప్తించే సంచిత లాభాలు. ~ *interest* సంచిత వడ్డీ

**accumulate** పెంపుచెందు, వృద్ధి అగు, పోగుచేయు, చేకూరు, కూడబెట్టు, కూడబెట్టి సంపాదించు, కూడగట్టుకొను, సంచయించు

**accumulated temperature** సంచిత ఉష్ణోగ్రత

**accumulation** పోగు, పెంపు, వృద్ధి, సంచయం. ~ *dividends* వాటాదారులకు చెల్లించాల్సి ఉన్న లాభాంశం. ~ *profit* లాభాంశం పంచి ఇవ్వగా మిగిలినది

**accumulative** వృద్ధి అయ్యే, పోగుపడి లభించే

**accumulator** కూడిన మొత్తం; కూడబెట్టే వ్యక్తి; ఇంధనాన్ని నిల్వచేసే పరికరం

**accuracy** యథార్థత, రుజువర్తన, నిర్దిష్ట, ఖచ్చిత. ~ *test* నిర్వహణ కాలాన్ని తెలుసుకొనే పరీక్ష

**accurate** ఖచ్చితమైన, సరి, సరియైన, యథార్థ, నిర్దిష్ట

**accured** పెరిగిన. ~ *charges* ఛార్జీల పెరుగుదల. ~ *expenses* ఖర్చుల పెరుగుదల

**accurse** శపించు, నాశనం చేయు

**accusation** ఆరోపణ, నింద, నిందారోపణ, నేరారోపణ

**accusative** నిందమోపే; ద్వితీయా విభక్తి వాక్యంలో కర్మ పదానికి చేర్చే ప్రత్యయం

**accusatory** నిందాపూరిత

**accuse** నిందించు, ఆరోపించు, నిందారోపణ చేయు, నేరంమోపు, తప్పు పట్టు

**accused** నేరారోపిత. ~ *person* ముద్దాయి, నిందితుడు, ప్రతివాది

**accuser** నిందమోపే వ్యక్తి, ఫిర్యాది

**accusing finger** వేలెత్తిచూపు

**accustom** అలవాటుపడు

**accustomed** అలవాటు పడిన

**ace** మేటి, సమర్థ; (పేక ముక్కల్లో) ఆసు

**acellular** కణరహిత

**acephalous** శీర్షరహిత; కేంద్రీకృత రాజ్యాధికారం లేని

**acerbic** తీవ్ర, కఠిన, కరుకు

**acerbity** కటు ప్రవర్తన/ స్వభావం, చేదు రుచి, తీవ్రత, కఠినత్వం

**acerous** కొమ్ములు లేని

**acervate** చిన్న చిన్న గుత్తులుగా పెరిగే

**acescent** పులిసే, పులుపెక్కిన

**ache** తీవ్రమైన నొప్పి

**acheiria** చేతులు లేకపోవడం

**achieve** సాధించు

**achievement** విజయం, జయం, కార్యసిద్ధి, నిర్వాకం

**achille's heel** బలహీనమైన విషయం, శరీరంలో దెబ్బకు సులభంగా గురి అయ్యే భాగం

**burrow pit** కొలిమి గొయ్యి, దాలి

**business** వృత్తి, వ్యాపారం, చర్చనీయాంశం. ~ *acumen* వ్యాపార కుశలత. *a head for* ~ వ్యాపారదృష్టి. ~ *depression* వ్యాపార మాంద్యం. ~ *enterprise* వ్యాపారసంస్థ. ~ *ethics* వ్యాపార నీతి. *in* ~ వ్యాపారంలో ఉన్న *get down to* ~ పని ప్రారంభించు. *go into* ~ వ్యాపారం/ పనిచేయడం ప్రారంభించడం. *go out of* ~ దివాళాతీయు, వ్యాపారం నిలిపివేయు. ~ *hours* వ్యాపార వేళలు, పని సమయం. ~ *houses* వ్యాపార సంస్థలు. ~ *lunch* మధ్యాహ్న భోజనంతో పాటు జరిగే చర్చా సమావేశం. *on* ~ పనిలో ఉండు. *open for* ~ వ్యాపార నిర్వహణకు సిద్ధంగా ఉన్న. *set up in* ~ కొత్త సంస్థను/ దుకాణాన్ని ప్రారంభించడం. ~ *man/ person* వ్యాపారస్థుడు. ~ *mathematics* వ్యాపారగణితం. ~ *sense* వ్యాపారావగాహన. ~ *woman* వ్యాపారవేత్త్రి. ~ *magnet* వ్యాపారవేత్త

**bustard** బట్టబాతు

**bustle** సందడి, హడావిడి; (ఇతరులను) తొందరపెట్టడం

**busy bee** నిరంతర శ్రామికుడు

**butcher** కసాయి

**butchery** వధ(శాల)

**butt** n. తుపాకి మడమ కొన; చెట్టు మొదలు; సారాపీపా; పరిహాస పాత్రం; ఢీకొట్టు, కుమ్ము

**butteress** n. ఆధారం, ఆశ్రయం

**butteress** v. ఆశ్రయం ఇచ్చు, సహాయపడు

**buttock** పిరుదు, పృష్ఠభాగం

**buy** కొను. ~ *and hold strategy* కొని దీర్ఘకాలం అమ్మకుండా అట్టిపెట్టుకునే వ్యూహం. ~ *back* తిరిగి కొనుగోలు చేయు. ~ *in* మొత్తంగా కొను. ~ *into* డబ్బు వెచ్చించి కొను. ~ *off* లంచమిచ్చి తప్పించుకొను, అనుకూలపరచుకొను. ~ *out* మొత్తం కొనేయడం. ~ *over* లంచమిచ్చు, కొనివేయు

**buyer** కొనుగోలుదారు

**buyers market** కొనుగోలుదారుల మార్కెట్టు

**buying support** కొనుగోళ్ళ మద్దతు

**buzz** ఝుంకారం; వదంతి; కోలాహలం; విసిగించు; (వదంతులు) పుట్టించు, గోల పెట్టు

**buzz word** మారుపేరు, ప్రత్యామ్నాయ పదం

**by** దగ్గర, గుండా, ద్వారా, అప్పుడు; వల్ల, చేత, ప్రకారం. ~ *all means* సర్వ విధాలా, ఏ విధంగానైనా. ~ *election* ఉపఎన్నిక. ~ *end* రహస్యోద్దేశం. ~ *gone* జరిగిపోయిన, పూర్వకాలపు, గత. ~ *law* ఉపనిబంధన. ~ *leaps and bounds* వెంటనే మారిపోవు. ~ *line* రచయితపేరు. ~ *name* మారుపేరు. ~ *pass* ఉపమార్గం, పక్కదారి. ~ *product* అనుబంధ ఉత్పాదన, ఉపోత్పాదితం. ~ *reference* నిర్దేశానుసారంగా. ~ *stander* దారినపోయే వ్యక్తి. ~ *word* సామెత

**by parol** నోటిమాటద్వారా

**bypass** ఉపమార్గం. ~ *surgery* ఉపమార్గ శస్త్ర చికిత్స

**by right** హక్కుగా

**by rotation** వంతులవారీ

**by trail** (న్యాయ) విచారణతో



# C c

**C G S system** సెంటీమీటర్ గ్రామ్ సెకండ్ పద్ధతి, పొడవు, ద్రవ్యరాశి, కాలం కొలతకు వాడే మౌలిక ప్రమాణాల పద్ధతి

**cab** బాడుగ, అద్దె బండి

**cabal** కుట్ర, కక్ష. ~ *group* కుట్రచేసే ముఠా

**cabbala** రహస్య విజ్ఞానం

**cabbalistic** రహస్యమైన, నిగూఢమైన

**cabinet** మంత్రిమండలి; అరలు గల పెట్టె, ఏకాంతాగారం. ~ *sub-committee* మంత్రివర్గ ఉపసంఘం

**cabotage** ఓడల కదలికలను, సరకు తరలింపును అనుమతించే చట్టాలు

**cackle** పొదిగేకోడి అరుపు, గొప్ప చెప్పుకొను

**cacogenics** చెడ్డ వారసత్వ ప్రభావాల అధ్యయనం

**cacography** తప్పుల తడిక రాత

**cacophony** అశ్రావ్యత

**cactus** బ్రహ్మజెముడు

**cadastrax** భూమిపై యజమాన్యం గల

**cadaver** మృతదేహం

**cadaverous** శవాకారమైన, పీనుగ వంటి

**cadaver transplantation** మరణించిన వ్యక్తి అవయవాలను వేరొకరికి అమర్చడం

**caddy** (గోల్ఫ్ ఆటలో) సహాయకుడు

**cadre** (ఉద్యోగ) శ్రేణి, స్థాయి

**cahoot** కుమ్మక్కు కావడం; కూటమి

**caird** దేశదిమ్మరి

**cajole** బుజ్జగించు, లాలించు

**cajolery** లాలన, బుజ్జగింత

**cakewalk** సులభసాధ్యం

**calamity** ఉపద్రవం, ప్రమాదం, ఆపద, విపత్తు. *natural* ~ సహజ ప్రమాదం

**calaorimeter** ఉష్ణమాపని

**calaorimetry** ఉష్ణమాపనం

**calcaneum** మడమ ఎముక

**calcareous** సున్నపు. ~ *rock* సున్నపు రాయి

**calcinate** స్వీకరించు; భస్మం

**calculate** లెక్కకట్టు/ పెట్టు, లెక్కించు, గణించు

**calculative** స్వలాభాపేక్షతో చూసే, లెక్క చూసుకునే

**calculus** కలనగణితం, రాయి

**calender year** పంచాంగ సంవత్సరం

**calf** కాలిపిక్క; దూడ

**calibrate** క్రమాంకనం చేయడం

**calibration** పరిమాణ నిర్ణయం/ మాపనం; శోధన, క్రమాంకనం. ~ *factor* క్రమాంకన గుణకం

**caliology** కులాయ శాస్త్రం

**call** పిలుపు; పిలుచు. ~ *attention motion* సావధాన తీర్మానం. ~ *it a day* ముగించు. ~ *money* అడిగిన వెంటనే ఇచ్చే రుణం. ~ *option* కోరిన రోజున కోరినంత కొనే సదుపాయం. ~ *up on* పిలుపునిచ్చు. ~*bond* వసూలు వాయిదా నిర్ణయించే పత్రం. ~ *attention notice* దృష్టికి తెచ్చే హెచ్చరిక

**calligraphy** అందమైన దస్తూరి

**callipers** కృత్రిమ పాదం, పెట్టుడు కాలు, ఊతకర్ర

**callosity** కాయ, కిణం

**callotrophis** జిల్లేడు

**callous** గట్టిపడిన, భావంలేని, స్పందనలేని

**callousness** కాఠిన్యం, నిర్దయత్వం

**callow** అనుభవంలేని

**callus** శాఖీయ కాండం, కాయగాచిన

**calmness** నీరవం, ప్రశాంతం

**calomel** రసభస్మం

**calorie** ఉష్ణోగ్రత పరిమాణాన్ని చెప్పే ప్రమాణం, ఆహారం ఉత్పత్తి చేసే శక్తిని కొలిచే ప్రమాణం

**calorific food** అధిక శక్తినిచ్చే ఆహారం

**calumniation** అపనింద

**calumniate** దూషించు, అపవాదు పాలు చేయు, అపనిందవేయు

**calumniator** దూషించే వ్యక్తి, అపవాదు వేసే వ్యక్తి

**calumnious** దూషించే, అపవాదు కలిగించే

**calumny** అపవాదు, అపప్రథ

**calyx** (పువ్వులో) రక్షక పత్రావళి

**camaraderie** సన్నిహిత స్నేహమైన, ఒకే వర్గానికి చెందిన వారమన్న భావం

**camber** ఉబుకు

**cambrian** కేంబ్రియన్ కాలం

**camelopard** జిరాఫీ

**camion** లారీ; భారీ రవాణా శకటం

**cammy** జిగురుగా, అతుక్కొనేట్లుగా

**camouflage** మభ్యపెట్టు, కప్పిపుచ్చు

**campaign** ఉద్యమం, ప్రచార (యుద్ధ)ం/ కార్యకలాపాలు

**campaigner** ప్రచారకుడు

**campanology** ఘంటాశాస్త్రం

**campanulate** ఘంటాకార

**camphor** హారతి కర్పూరం

**canaille** అల్లరిమూక

**canal** కాలువ, మార్గం. *cervical* ~ గర్భాశయమార్గం. *vaginal* ~ యోని మార్గం. *alimentary* ~ జీర్ణనాళం. *anal* ~ గుదనాళం. *auditory* ~ శ్రవణనాళం. *birth* ~ జనన మార్గం

**canaliculus** సూక్ష్మనాళిక

**canalisation** నాళికా కరణం; నిర్ణీత మార్గం/ విధానం

**canard** అబద్ధపు రాత, అభాండం

**cancel** ఆపు, నిలిపివేయు, రద్దుచేయు, చెల్లుబాటు కాకుండా చేయు

**cancellation** రద్దుచేయడం, నిలిపి వేయడం

**cancer** పుట్టకురుపు, రాచపుండు, కాన్సర్ అనే వ్యాధి; కర్కాటకరాశి. *tropic of* ~ కర్కాటక రేఖ

**canda balsam** జిగురు

**candescent** జ్వలించే

**candex** మాను

**candid** నిక్కచ్చి, నిష్పాక, యథార్థం, ఆలోచనలు దాచుకోని

**candour** నిష్కపటత్వం, సరళత, నిష్పక్షపాతం

**candy** కలకండ, పటికబెల్లం

**canine** కుక్కలకు సంబంధించిన. ~ *tooth* కోరపళ్ళు

**canker** నోటి పుండు, చెట్లతెగులు, వ్రణం, కణితి, వ్యాకుల; రోగగ్రస్త

**canline** కాండ సంబంధమైన

**cannabis** గంజాయి

**cannibal** నరమాంస భక్షకుడు

**cannibalism** నరమాంస భక్షణ

**canning** డబ్బాల్లో (ఆహారాన్ని) నిల్వ చేయడం

**cannishness** తెగల తత్వం

**cannon** ఫిరంగి. ~ *bone* నాళాస్థులు. ~ *fire* ఫిరంగి గుళ్ళవర్షం. ~ *fodder* బలిపశువు

**cannonical text** మతగ్రంథం

**canoe** దోనె పడవ; పడవ నడుపు

**canon** విధి, చట్టం; సాధికారిక సాహిత్యం/ రచనాధోరణి



**canonical** పండిత సమ్మతి పొందిన. ~ *text* మతగ్రంథం

**canonicity** పండిత సమ్మతి

**canonisation** మత గురువుల జాబితాలో చేర్చు

**canopy** పందిరి, మండపం

**cantankerous** మితిమీరిన కోపంగల, కలహప్రియ, దుష్టభావం గల

**canthoplasty** నేత్రకణ సంధానం

**canthotamy** నేత్రకణచ్ఛేదన

**canto** ఆశ్వాసం, ఖండం, పర్వం, మహాకావ్య భాగం

**canvasser** ప్రచారకుడు

**canyon** లోతైన లోయ

**caodaism** n. బౌద్ధమతం, తావోయిజమ్, కన్‌ఫ్యూషియనిజమ్

**capability** సమర్థత, స్తోమత

**capable** శక్తి సామర్థ్యాలు గల

**capacious** విశాలమైన

**capacitor** సంఘనకం

**capacity** దిట్టతనం, సామర్థ్యం, ఘన పరిమాణం, గ్రహణశక్తి. *vital* ~ జీవక్షమత. ~ *utilization* సామర్థ్య వినియోగం

**cap a pic** తల నుండి పాదాల వరకు, ఆపాద మస్తకం

**capillar** కేశనాళికాస్పందనం

**capillarity** కేశనాళికా చర్య

**capillary** కేశనాళిక. ~ *action* కేశనాళికాచర్య. ~ *movement* కేశనాళికత. ~ *permeability* కేశనాళికా పారగమ్యత

**capital** మరణ దండార్హమైన, ప్రమాదకరమైన, ప్రశస్తమైన, ముఖ్యమైన; రాజధాని, తలకు సంబంధించిన; ఆస్తుల మొత్తం, సంపద, మూలధనం. ~ *account* మూలధనం ఖాతా. ~ *accumulation* మూలధన సంచయనం. ~ *adequacy ratio* కనీస పెట్టుబడి నిష్పత్తి. ~ *allowance* మూలధనం బత్తెం. ~ *acquisition* మూలధన సేకరణ. ~ *asset* పెట్టుబడి, మూలధన ఆస్తి. ~ *base* పెట్టుబడి పునాది. ~ *charges* వ్యాపార మూలధన నిర్వహణ వ్యయం. ~ *consumption* మూలధన వినియోగం. ~ *crime* శిరశ్ఛేదార్హాపరాధం. ~ *deficiency* మూలధనం లోటు. ~ *expenditure* మూలధన/ పెట్టుబడి వ్యయం. ~ *formation* మూలధన కల్పన. ~ *gains tax* మూలధన లాభాలపై పన్ను. ~ *goods* ఉత్పాదక వస్తువులు, పెట్టుబడి సాధన సామగ్రి. ~ *growth* మూలధన వృద్ధి. ~ *investment* మూలధన పెట్టుబడి. ~ *market* పెట్టుబడుల మార్కెట్, మూలధన విపణి. ~ *offence* మరణశిక్ష విధించదగిన నేరం. ~ *punishment* ఉరిశిక్ష, మరణ శిక్ష. ~ *receipts* మూలధన రాబడి. ~ *sum* బీమా కంపెనీ చెల్లించే డబ్బు

**capitalism** పెట్టుబడిదారీ విధానం

**capitalist** పెట్టుబడిదారు, పెట్టుబడిదారీ వర్గం. ~ *encirclement* పెట్టుబడిదారీ రాజ్యాలు చుట్టుముట్టడం

**capitalization issue** పాత వాటాదారులకు జారీచేసే ఉచిత వాటా

**capitate** శీర్షాకారం గల

**capitulate** లొంగు, లోబడు, లొంగిపోవటం

**capping** అధికభారం

**caprice** చిత్తచాంచల్యం, చపలత

**capricious** మతిస్థిమితంలేని, చంచలమైన

**capricorn** మకరరాశి. *tropic of* ~ మకర రేఖ

**capsicum** బుట్ట/ సీమ మిరపకాయ

**capsid** వైరసుల బాహ్యకవచం
**capsize** బోల్తాపడు
**capsule** నాళిక, గొట్టం మందు
**caption** (వార్తా) శీర్షిక
**captivate** మోహింపచేయు, వశం చేసు కొను, వలపించు, రంజింపచేయు, ముగ్ధంచేయు
**captivated** ఆకర్షిత, మంత్రరుద్ధమైన
**captive** బందీ, ఖైదు. ~ *market* నిర్బంధ మార్కెట్. ~ *power plant* సొంత విద్యుత్ కేంద్రం
**captive breeding** నిర్బంధంలో ప్రజ ననం
**captivity** నిర్బంధం, ఖైదు, దాస్యం
**captor** ఖైదీని పట్టుకొన్న వ్యక్తి; విజేత
**capture** బంధించు, పట్టుకొను, జయించు, వశపరచుకొను, స్వాధీనం చేసుకొను
**caravan** బిడారు
**carbohydrate** పిండిపదార్థం
**carbon** కర్బనం. *activated* ~ ఉత్తేజిత కర్బనం. ~ *fixation cycle* కర్బన నియంత్రక చక్రం
**carbon dating** రేడియో కార్బన్ సహా యంతో వయోనిర్ధారణ
**carbuncle** రాచకురుపు, సూర్యకాంతమణి
**carcass** మృతదేహం, కళేబరం, మాంసం ముద్ద
**carcinogen** కాన్సర్ కలుగజేసే
**carcinogenic** కాన్సర్ ప్రేరక
**carcinoma** కాన్సర్, ప్రాణాంతక వ్రణం
**cardamom** ఏలకులు
**cardia** జీర్ణాశయ ప్రవేశద్వారం
**cardiac** హృదయ కోశ సంబంధమైన. ~ *arrest* గుండె ఆగిపోవడం. ~ *beat* గుండె కొట్టుకోవడం. ~ *ganglion* హృదయనాడీ సంధి. ~ *innervation* హృదయనాడీ సంధానం. ~ *mach* పూర్వజీర్ణాశయం. ~ *muscle* హార్దిక కండరం. ~ *stimulant* హృదయో త్తేజకం
**cardinal** మౌలిక, ఆధారభూత, ప్రాథమిక; రోమన్ కాథలిక్ మతాధికారి. ~ *points* ప్రధానాంశాలు
**carding** పత్తిని పింజలుగా చేయడం
**cardio** హృదయకోశ సంబంధి. ~ *gram* హృదయ రేఖాపటం. ~ *myopathy* హృద్రోగం. ~ *phonogram* హృదయ శబ్దలేఖ
**cardiogenic** హృదయజనితమైన
**cardiology** హృదయకోశాధ్యయన శాస్త్రం
**cardiophobia** గుండె సమస్యలంటే భయం
**cardio-vascular** గుండె రక్తనాళాలకు సంబంధించిన
**care** జాగ్రత్త. *antenatal* ~ప్రసవపూర్వక సంరక్షణ. *intranatal* ~ ప్రసవకాల సంరక్షణ. *postnatal* ~ ప్రసవానంతర సంరక్షణ
**careerism** పదవీకాంక్ష, పదవీ కాంక్ష పరుడు
**careerist** పదవికోసం, పెత్తనం కోసం విలువలు, ఆదర్శాలు వదిలిన వ్యక్తి
**caressing** దువ్వటం, లాలించడం
**caretaker** సంరక్షకుడు. ~ *government* ఆపద్ధర్మ ప్రభుత్వం
**cargo** రవాణా సరుకు
**caricature** వికృత/వ్యంగ్య చిత్రం
**caries** క్షయం, పుప్పి. *bone* ~ అస్థి క్షయం. *dental* ~ దంతక్షయం, దంతాలు పుచ్చిపోవడం
**cariou** నాశమగు
**carnage** మారణహోమం, దమనకాండ



**carnality** విషయ లౌల్యం
**carnivorous** మాంసాహారి
**carol** ఆనందగీతం
**carona** సూర్యవాతావరణం
**caronsal** జల్సా, తాగుడుతో కూడిన విందు
**carotin** వర్ణద్రవ్యం
**carousel** రంగులరాట్నం
**carpel** ఫలదళం
**carpet** తివాచీ, జంపకానా
**carping** దురాక్షేపం
**carriage** శకటం; రవాణా (వ్యయం/ ఖర్చు)
**carrier** రవాణా వ్యాపారం/ శకటం/ వ్యక్తి. ~ *system* వాహక వ్యవస్థ
**carrion** చెత్త, కుళ్ళిన పదార్థం
**carry** తీసుకొనిపోవు, చేర్చు, సాధించు, కొనసాగించు, భారం వహించు, ఆమో దింపచేయు, గెలుచు. ~ *away* తీసు కొనిపోవు, కొట్టుకొనిపోవు. ~ *forward* ముందుకు తీసుకొనిపోవు. ~ *into effect* పూర్తిచేయు, అమలు చేయు. ~ *off* తీసుకొని ఎత్తుకొని పోవు; గెలుచు, చంపి వేయు. ~ *on* కొనసాగించు. ~ *one's point* మాట నెగ్గించుకొను. ~ *over* దాటు, దాటించు. ~ *the day* సఫల మగు, గెలుపొందు. ~ *through* పూర్తి చేయు, నెరవేర్చు. ~ *weight* విలువ కలిగి ఉండు
**cartage** బండి బాడుగ
**carte blanche** పూర్తి అధికారం
**cartel** యుద్ధఖైదీల మార్పిడి ఒప్పందం; సంస్థల కూటమి, ఉత్పత్తిదారుల సంఘం
**cartilage** మృదులాస్థి
**cartography** మానచిత్ర రచనాశాస్త్రం
**carve** చెక్కు, మలుచు, చిత్రించు
**casanova** శృంగార పురుషుడు
**cascade** జలపాతం, అధికాంశం, కుమ్మ రించు. ~ *method* సోపాన క్రమపద్ధతి
**cascading effect** పర్యవసాన ప్రభావం
**case** పెట్టె, డబ్బా, ఒర; నిజస్థితి, నిద ర్శనం; అభియోగం, వ్యాజ్యం; (వ్యాకర ణంలో) విభక్తి; రోగి. ~ *history* వ్యక్తి (రోగ) చరిత్ర. ~ *law* నిదర్శన న్యాయం. ~ *study* సమాచారాధ్యయనం
**cash** నగదు, రొక్కం. ~ *account* నగదు ఖాతా. ~ *balance* నగదు నిల్వ. ~ *crop* వాణిజ్య పంట. ~ *crunch* నగదు కొరత. ~ *deal* నగదు వ్యవహారం. ~ *discount* తగ్గింపు ధర, ముదరా. ~ *deposit ratio* నగదు నిల్వల పెట్టు బడుల నిష్పత్తి. ~ *flow* ద్రవ్యసరఫరా. ~ *incentive* నగదు ప్రోత్సాహకాలు. ~ *in on* లబ్ధిపొందు, ప్రయోజనం పొందు. ~ *market* నగదు విపణి. ~ *memo* నగదు చీటీ. ~ *on delivery* సరుకు అందగానే డబ్బు చెల్లించే విధానం. ~ *price* నగదు ధర. ~ *sale* నగదు అమ్మకం. ~ *settlement* నగదు పరి ష్కారం. ~ *voucher* ధర తగ్గింపును ఇచ్చే కూపను
**cashew nut** ముంతమామిడి, జీడిపప్పు
**casino** నర్తనశాల, జూదశాల
**casket** పెట్టె
**cassandra** నిరాశావాది
**cassia** తంగేడు, కసిందచెట్టు
**cast** (పార) వేయు, వదిలివేయు, వ్యాజ్యంలో ఓడించు; కరిగించి పోత పోయు
**castaway** వెలిపెట్టు, వేరుపరచు
**caste** కులం
**casteism** కులతత్త్వం

**casteist** కులతత్త్వవాది. ~ *forces* కుల తత్త్వ శక్తులు. ~ *politics* కుల రాజకీయాలు

**castigate** శిక్షించు, దండించు

**casting vote** నిర్ణయాత్మక ఓటు

**castor** ఆముదాలు

**castration** విత్తుకొట్టడం, పొగరు తగ్గించడం

**casual** ఒక పద్ధతిలో లేని, క్రమబద్ధం కాని. ~ *employment* తాత్కాలిక ఉద్యోగిత. ~ *labour* దినకూలీ, తాత్కాలిక కార్మికులు

**casuality** ప్రమాదం, దుస్సంఘటన, దుర్ఘటన. ~ *insurance* అపఘాత బీమా. ~ *ward* అత్యవసర చికిత్సా స్థలం

**casuarina** సరుగుడు, సర్వి

**cataclysm** విప్లవం, జలప్రళయం

**catalog(ue)** జాబితా, పట్టిక

**catalyse** ఉత్ప్రేరణ చేయడం

**catalysis** ఉత్ప్రేరణం

**catalyst** ఉత్ప్రేరకం

**catalystic converter** ఉత్ప్రేరక పరివర్తకం

**catalytic** ఉత్ప్రేరక

**catameran** చిన్నపడవ

**catamountain** చిరుతపులి; కజ్జాకోరు

**catanation** పరస్పరాన్వయం

**catapult** విసరికొట్టు, లాగికొట్టు; వడిసెల, ఉండేలు

**cataract** కంటిశుక్లం, పొర. ~ *immature* అపక్వశుక్లం. ~ *mature* పక్వ శుక్లం. ~ *senile* వృద్ధాప్యంలో ఏర్పడ్డ శుక్లం

**catarrh** n. జలుబు, పడిశం

**catastrophe** విపత్తు, దుర్గతి, ఉపద్రవం, సర్వనాశం

**catch** పట్టుకొను, యుక్తితోకూడిన ప్రశ్న, ఆశ్చర్యం, మోసం. ~ *a cold* వ్యాపారంలో నష్టంవాటిల్లు. ~ *at* లాగుకొను. ~ *fire* అంటుకొను, వ్యాపించు. ~ *on* వ్యాపించు, విస్తరించు. ~ *the eye* కంటపడు. ~ *up* పట్టుకొను, సమానమగు; నష్టాన్ని, లోపాన్ని పూరించుకొను. ~ *word* ఊతపదం

**catch feeder** నీటి పారుదలకు తవ్విన గొయ్యి

**catching bargain** అనుచిత బేరం

**catchment** అరగాణి, నీరు నింపే వనరు. ~ *area* అరగాణి హరివాణం, నదీ పరివాహక ప్రాంతం

**catechism** (మతంలో) ప్రశ్నోత్తర గ్రంథం; (రాజకీయాల్లో) ప్రశ్నోత్తరాలు

**categorically** స్పష్టంగా, తేటతెల్లంగా

**categorical proposition** నిరుపాధిక ప్రతిజ్ఞావాక్యాలు

**categorisation** వర్గీకరణ

**categorize** వర్గీకరించు

**category** వర్గం, విభాగం

**cateran** పశువుల దొంగ; కొల్లగొట్టే వ్యక్తి

**caterer** ఆహార పదార్థాలను, సరఫరా చేసే వ్యక్తి/ వ్యాపార సంస్థ

**catering** భోజనసౌకర్యం కల్పించే వ్యాపారం. ~ *services* భోజన సదుపాయాలు

**caterpiller** గొంగళి పురుగు

**caterwaul** పిల్లికూత

**catharsis** క్షాళనప్రక్రియ, దేహశుద్ధి

**cather** సూక్ష్మకేశనాళిక

**cathertic** విరేచనకారి, భేదిమందు

**catheterisation** సూక్ష్మకేశనాళికా ప్రవేశనం

**cation** కాటయాన్, రుణాత్మక అయాన్



**catkin** మృదుపుష్పవిన్యాసం

**catridge** తృణావస్థి

**cattle** పశుగణం

**cattle rearing** పశుపాలనం/ పోషణ

**cat walk** సౌందర్య ప్రదర్శన

**caucus** ముఠా

**caudal** పుచ్ఛ. ~ *fin* పుచ్ఛవాజం. ~ *region* తోకభాగం. ~ *vertebra* పుచ్ఛకశేరుకం

**caudate** సపుచ్ఛ

**causality** కారణవాదం, హేత్వర్థవాదం

**causative** ప్రేరణార్థక(ం)

**causeway** సేతువు, కాలిబాట

**caustic** దాహక, కాల్చే. ~ *soda* దాహక సోడా

**cauterization** దహనీకరణం, మండించడం

**caution** హెచ్చరిక, ముందు జాగ్రత్త

**cautioner** హామీదారు, పూచీదారు

**cautiously** మెళకువగా, జాగ్రత్తగా

**cavalcade** అశ్వికబృందం

**cavalier** అశ్వికుడు, రౌతు, విలాస పురుషుడు, వీరపురుషుడు

**cavalry** అశ్వికదళం, గుర్రాలదండు

**caveat** ఆటంకం, షరతు, హెచ్చరిక (పత్రం); వారించు; చర్యల విరమణకు నోటీసు. ~ *emptor* కొనేవారికి హెచ్చరిక. ~ *venditor* అమ్మేవారికి హెచ్చరిక

**cavern** బిలం, గుహ

**cavernicolous** గుహాజీవనం

**cavil** దురాక్షేపణ, రంధ్రాన్వేషణ

**cavity** కోశం, కుహరం; శూన్యప్రదేశం. *abdominal* ~ ఉదరకుహరం. *amniotic* ~ పిండకోశం. *cranial* ~ కపాల కుహరం. *nasal* ~ నాసికాకుహరం. *pelvic* ~ కటీకుహరం. *tympanic* ~ కర్ణభేరీ కుహరం

**caw** కాకికూత

**cease fire** కాల్పుల విరమణ, తాత్కాలికంగా యుద్ధవిరమణ

**cede** ఇచ్చివేయు, అప్పగించు; ఓడిపోవు, దత్తంచేయు, వదులుకొను

**ceiling** గరిష్ఠపరిమితి, శిఖరం, కప్పు. ~ *price* గరిష్ఠమూల్యం

**celebrate** ఉత్సవంచేయు, నెరవేర్చు

**celebrity** ప్రాముఖ్యం, ప్రసిద్ధి, కీర్తి, ఖ్యాతి; ప్రసిద్ధవ్యక్తి

**celerity** త్వరితత్వం

**celestial** ఖగోళ, దివ్యమైన, అతిలోక, శ్రేష్ఠమైన. ~ *bodies* ఖగోళవస్తువులు

**celibacy** బ్రహ్మచర్యం

**cell** జైలుగది; విద్యుద్ఘటం, జీవకణం. ~ *culture* కణసంవర్ధనం. ~ *free* కణరహిత. ~ *theory* కణసిద్ధాంతం. ~ *wall* కణకవచం

**cellar** నేలమాళిగ, పాతర, నేలకొట్టు

**cellular** కణసంబంధమైన

**celluloid** చలనచిత్ర సంబంధమైన. ~ *divinity* చలనచిత్ర నటులకు గల ప్రత్యేక గౌరవం, ఆదరణ

**cament** n. అతికేపదార్థం; *dental* ~ పంటి సందులను నింపే పదార్థం

**cement** v. అతికించడం, అతుక్కోవడం. ~ *setting* సిమెంట్ గట్టిపడడం

**cementation** అతకడం, లోహమిశ్రమం పూయడం

**cenozoic era** ఆధునిక, జీవమహాయుగం

**censor** నిషేధించు. ~ *motion* అభిశంసన తీర్మానం ~ *ship* కత్తిరింపు విధానం/ ఆంక్ష

**censure** మందలింపు, నింద, అభిశంసన, ఖండన; నిందించు, మందలించు, అభిశంసించు

**census** జనాభాలెక్కలు
**cent** నూరోవంతు, డాలర్‌లో నూరోవంతు
**centenarian** శతాయుష్మంతుడు
**centenary** శతవార్షికం, శతవార్షికోత్సవం
**centennial** శతవార్షికోత్సవం
**center** కేంద్రం, ప్రధానస్థలం
**centigrade** సెంటీగ్రేడ్, ఉష్ణోగ్రతా ప్రమాణం
**centimeter** మీటర్‌లో వందోవంతు
**centipede** జెర్రి
**centisimal measure** శతాంశమానం
**central** కేంద్రీయ. ~ *air conditioning* కేంద్రీకృతవాతానుకూలనం. ~ *government* కేంద్రప్రభుత్వం. ~ *undertaking or undertakings of* ~ *government* కేంద్రప్రభుత్వ యాజమాన్యంలోని సంస్థ. ~ *issue price* కేంద్ర జారీ ధర. ~ *pool* కేంద్ర ధాన్యం నిల్వలు. ~ *processing unit* కేంద్రీయ నియంత్రణ భాగం
**centraliser** కేంద్రకం
**centralization** కేంద్రీకరణ
**centralize** కేంద్రీకరించు, కేంద్రీకరింప జేయు
**centralized states** కేంద్రీకృత రాజ్యాలు
**centre** n. కేంద్ర (ప్రభుత్వం), మధ్యభాగం
**centre** v. మధ్యనుంచు, మధ్యనిలుపు, కేంద్రీకరించు. ~ *of gravity* గరిమ నాభి, గురుత్వకేంద్రం. ~ *of a plane* సమతల గురుత్వకేంద్రం. ~ *of an are* వక్రఖండ గురుత్వకేంద్రం. ~ *of inertia* జడత్వ కేంద్రం. ~ *of mass* ద్రవ్యకేంద్రం
**centrifugal** అప కేంద్ర, కేంద్ర పరాఙ్ముఖ. ~ *force* అపకేంద్ర బలం
**centrifugation** అపకేంద్రీకరణం
**centrifuge** అపకేంద్రయంత్రం
**centripetal** అభికేంద్ర, కేంద్రోన్ముఖ. ~ *force* అభికేంద్రబలం
**centrism** మధ్యేవాదం
**centrists** మధ్యేవాదులు
**centrosphere** భూకేంద్రావరణం
**centuple** నూరింతలు (చేయు)
**cephalalgia** తలనొప్పి
**cephalic** శీర్ష సంబంధమైన
**cephalin** మెదడులోని కొవ్వు
**cephalon** తల
**cephalothorax** శిరోపక్షం. ~ *metry* తలకొలత
**cephalotriosy** కపాల విచ్ఛిన్నప్రక్రియ
**ceramic** పింగాణీ
**ceramics** మృత్పరికర విజ్ఞానం
**cereals** తృణధాన్యాలు
**cerebellum** చిన్నమెదడు, అనుమస్తిష్కం
**cerebral cortex** మస్తిష్క వల్కలం.
**cerebral palsy** శిశు పక్షవాతం
**cerebrum** పెద్దమెదడు
**ceremonious** ఆడంబరపూర్వక, ఆచార బద్ధ
**ceremony** వేడుక, ఉత్సవం, తంతు
**cerography** మైనంతో చిత్రీకరణ
**certain** నిజమైన, నిర్ణీతమైన, నమ్మకంగల, ఒకానొక, నిశ్చిత, రూఢిఅయిన. ~ *knowledge* నిశ్చయజ్ఞానం
**certainly** ముమ్మాటికి, తప్పనిసరిగా
**certainty** నిజం, నిశ్చయం
**certificate** యోగ్యతాపత్రం. *authorisation* ~ అధికార ధ్రువీకరణ పత్రం. ~ *of deposit* జమ ధ్రువీకరణ పత్రం. ~ *of incorporation* ప్రమాణ పత్రం; నమోదుపత్రం. ~ *of merit* సనదు, యోగ్యతాపత్రం, ప్రశంసాపత్రం. ~ *of origin* ఉత్పత్తి స్థానధ్రువపత్రం



**certification** ధ్రువీకరణ
**certified** ధ్రువీకృత. ~ *cheque* ధ్రువీకరించిన చెక్కు. ~ *copy* అధికార ధ్రువీకృత ప్రతి
**certify** ధ్రువీకరించు
**certiorari writ** దావాల రికార్డులను పంపమని పెద్ద కోర్టు జారీచేసే ఉత్తరువు
**cerumen** చెవిలోని గుబిలి
**cervex** గర్భాశయ (ద్వార)o
**cervical** గర్భాశయ సంబంధమైన, మెడకు చెందిన. ~ *canal* గర్భాశయ ద్వారం.
**cesarean** సిజేరియన్, పొట్టకోసి బిడ్డను తీయడం
**cess** పన్ను, సుంకం
**cessation** విరామం, ఆపు, విరమణ, నిలుపుదల
**cession** అప్పగింత, సమర్పణ, పరిత్యాగం
**cesspit** పేడగుంట
**cesspool** మురికిగుంట
**cetus** తిమింగిలం
**chaff** ఊక, తవుడు, పొల్లు, పొట్టు, చెత్త, పశుగ్రాసం
**chaffer** బేరం, బేరమాడడం
**chafing dish** నిప్పుల కుంపటి
**chagrin** విసుగు, నిరుత్సాహం, ఆశా భంగం, నిరాశ, మనోవ్యథ, అవమానం
**chain** గొలుసు, కంఠహారం; సంకెల; నిర్బంధం, శృంఖలం, జతకూర్చు. ~ *reaction* శృంఖలా ప్రతిచర్య
**chair** కుర్చీస్థానం, అధిష్ఠ స్థానం, సభాపతి, అధ్యక్షుడు, ఆచార్యపదవి, అధ్యక్షత వహించు, పీఠం. ~ *man* అధ్యక్షుడు. ~ *person* అధ్యక్షుడు/ అధ్యక్షురాలు
**chalaza** కలాజా, శ్వేతక రజ్జువు
**challenge** సవాలు, ప్రతిఘటన, ఎదు ర్కోవడం
**chamber** గది. *anterior* ~ ముందుగది, పూర్వకక్ష. ~ *of commerce* వ్యాపార వేత్తల సంఘం
**chamberlain** రాజగృహనిర్వాహకుడు
**chameleon** ఊసరవెల్లి
**champion** విజేత, అగ్రస్థానం పొందిన వ్యక్తి, అసహాయశూరుడు
**chance** n. అదృష్టం, ఘటన, ఆకస్మిక సంఘటన; సమయం, యాదృచ్ఛిక, అవ కాశం; సాధ్యం, సంభవం. *take a* ~ ప్రయత్నించు, అవకాశం తీసుకొను. ~ *upon* అకస్మాత్తుగా పొందు
**chance** v. సంభవించు, తటస్థించు
**chancellor** కులపతి, అధ్యక్షుడు
**chancery** విదేశీ రాయబార కార్యాలయం
**chancre** సవాయిపొక్కు
**chancy** నిశ్చయం కాని, ప్రమాదకరమైన
**change** పరివర్తన, మార్పు; చిల్లర
**changeability** అస్థిరత్వం, మారే స్వభావం
**changeable** అస్థిర, పరివర్తనశీల
**changeful** అస్థిర, పరివర్తనశీల
**changeful** అస్థిర, చపలమైన
**changeling** దొంగసొమ్ము
**channel** కాలువ, వాహకం, జలసంధి
**chant** జపించు; పాడు
**chaos** అస్తవ్యస్తత, గందరగోళం
**chaotic** గందరగోళమైన, అస్తవ్యస్తమైన
**chap** చర్మం పగులు; పురుషుడు, బాలుడు
**chaperon** సహాయక వ్యక్తి
**character** శీలం, పాత్ర, లక్షణం. *aquired* ~ ఆర్జిత లక్షణం
**characteristic** ప్రత్యేకలక్షణం
**characterization** పాత్ర చిత్రీకరణ
**characterize** వర్ణించు, చిత్రించు
**charade** సమస్య, ప్రశ్న

**charcoal** కర్ర బొగ్గు. ~ *test* బొగ్గు పరీక్ష

**charge** n. భారం, బరువు, చట్టబద్ధంగా పొందేహక్కు, రుసుము, వస్తుసేవలకు కోరే వెల; బాధ్యత, ఆరోపణ, నిందారోపణం; మందుగుండు, ఫిర్యాదు, ధర. ~ *account* జమపద్దు, అరువు ఖాతా. ~ *sheet* అభియోగ/ దోషారోపణ పత్రం

**charge** v. ఆవిష్టంచేయు, కొట్టు, దాడిచేయు, ఆరోపించు. *electric* ~ విద్యుదావేశం

**charged** ఆవిష్ట *electrically* ~ విద్యుదావిష్ట

**charge d' affairs** తాత్కాలిక దౌత్యరాయబారి/ అధికారి

**chariot** రథం

**charioteer** రథసారథి

**charisma** జనాకర్షణ, సమ్మోహనశక్తి

**charismatic** ప్రజాకర్షణ కలిగిన

**charitable trust** ధర్మసంస్థ

**charity** దయాధర్మభిక్షం

**charlatan** డాంబికుడు, కువైద్యుడు

**charm** ఆకర్షణ, ప్రకాశం, మంత్రం, తావీదు, రక్ష

**charmer** మంత్రగాడు

**charring** మాడిపోవు

**chart** పటం. ~ *of temperature* జ్వరపటం

**charter** ఆజ్ఞాపత్రం, హక్కు, అధికారం. ~ *of the company* కంపెనీ నియమావళి

**chartered accountant** అధికృత గణకుడు

**chary** జాగ్రతగల, పిసినారి

**chase** వేటభూమి; వెంటబడు, వెన్నాడు, వేటాడు, వెళ్ళగొట్టు, తరుము

**chasing** లోహంపై చెక్కడం

**chasm** అగాధం, లోతైన కనుమ

**chassis** చట్రం

**chaste** పరిశుద్ధ, పవిత్ర, నిష్కళంక, స్వచ్ఛమైన

**chasten** ఆపు; నిర్బంధంలోఉంచు, శిక్షించు

**chastise** శిక్షించు

**chastisement** శిక్ష

**chastity** పవిత్రత, సచ్ఛీలత

**chat** మాట్లాడు, కబుర్లు చెప్పు

**chateau** కోట

**chatted** సామాను, చరాస్థి

**chatter** వాగుడు, వదరు, పక్షుల కిలకిలారావం

**chauffeur** డ్రైవర్, షోఫర్, చోదకుడు

**chauvinism** దురహంకారం, దురభిమానం

**cheap** చవక, నాణ్యతలేని. ~ *money* తక్కువ వడ్డీకి లభించే డబ్బు

**cheat** మోసం, దగా, వంచన; మోసగాడు; మోసగించు, దగాచేయు, వంచించు

**check** అడ్డగించు, వేగం తగ్గించు, పరీక్ష, పరిశీలన, తనిఖీ. *keep in* ~ అదుపులో ఉంచు. ~ *list* పరిశీలిత పట్టిక. ~ *mate* ఆటకట్టు. ~ *point* తనిఖీస్థలం

**checks and balances** నిరోధ సమతౌల్యాలు

**cheer** ప్రోత్సహించు, సంతోషపెట్టు, చప్పట్లుకొట్టు, అభినందించు, హర్షధ్వానం, చప్పట్లు, ఉత్సాహం

**cheerful** సంతోషంగా, ఆనందంగా

**cheerfully** ప్రసన్నంగా, సంతోషంగా

**cheilitis** నోటిపూత

**chemical** రసాయనం, రసాయనిక. ~ *bond* రసాయనబంధం. ~ *decomposition* రసాయన శైథిల్యం. ~ *dis-*



*placement* రసాయన స్థానభ్రంశం. ~ *energy* రసాయన శక్తి. ~ *equation* రసాయన సమీకరణం. ~*equillibrium* రసాయన సమతాస్థితి. ~ *name* రసాయన సంకేతం/ నామం. ~ *preservative* రసాయన సంరక్షకం ~ *potential* రసాయన శక్మం. ~ *reaction* రసాయనిక చర్య. ~ *reactivity* రసాయన క్రియాశీలత. ~ *warfare* రసాయన ఆయుధాలతో యుద్ధం. ~ *weapons* రసాయనాయుధాలు.

**chemist** రసాయన శాస్త్రవేత్త, ఔషధ విక్రేత

**chemistry** రసాయనశాస్త్రం. *blood* ~ రక్త రసాయన శాస్త్రం

**chemo** రసాయన. ~ *autotrophic* రసాయన స్వయంపోషిత. ~ *receptor* రసాయనగ్రాహి. ~ *synthesis* రసాయన సంశ్లేషణ. ~ *therapy* రసాయనిక చికిత్స

**cheque** చెక్కు. *crossed* ~ క్రాస్ చేసిన చెక్కు. *open* ~ క్రాస్ చేయని చెక్కు. *post dated* ~ తర్వాత తేదీ వేసిన చెక్కు. *stale* ~ పాతచెక్కు

**cherish** భావించు, మనసులో ఉంచుకొను, స్మృతిగా నిక్షిప్తంచేయు

**cherophobia** హాస్యభీతి

**chess** చదరంగం. ~ *board* చదరంగం బల్ల. ~ *men* పావులు

**chest** ఛాతి, గుండె; పెట్టె, భోషాణం

**chewing** నమలడం, చర్వణం

**chicanery** వంచన, కుయుక్తి, తంత్రం, రెండు వైపుల నుంచి వ్యవహారం నడుపు

**chick** కోడిపిల్ల

**chicken** కోడి, బలహీన మనస్కుడు

**chicken pox** ఆటలమ్మ, చిన్నమ్మవారు

**chick pea** సెనగలు, కొమ్ము సెనగ

**chide** మందలించు, గద్దించు

**chief** ముఖ్య, ప్రధాన, పెద్ద, విశేష

**chief** ప్రధానాధికారి, నాయకుడు, ప్రముఖుడు. ~ *justice* ప్రధాన న్యాయమూర్తి. ~ *patron* ప్రధాన పోషకుడు. ~ *whip* ప్రధాన విప్

**chiefly** ప్రధానంగా, విశేషంగా

**chiffonade** తరిగిన తాజా కూరగాయలు

**chilblains** చలికురుపులు

**child** శిశువు. ~ *care* శిశుసంరక్షణ

**chill** చల్లని, ఉదాసీనత, ఉత్సాహరాహిత్యం

**chimaera** అభూతకల్పన

**chime** గంట, గంటకొట్టు, అంగీకారం కుదురు

**chimney** పొగగొట్టం

**china rose** మందార

**chine** వెన్నెముక; వెన్నుబద్ద

**chink** పగులు, విభేదం; సందు; నాణాలు ఖంగుమనే ధ్వని

**chip** పేడు, బద్ద; కుస్తీలో ఒకపట్టు, వాటా, ముక్క, చెక్కు, కోయు

**chirogriomy** సాముద్రికం

**chirp, chirrup** చిన్న పక్షుల కిచకిచలు; కిచకిచలాడు, సంతోషంతో మాట్లాడు

**chisell** ఉలి, చెక్కు, నగిషీ చేయు

**chit chat** లోకాభిరామాయణం, పిచ్చాపాటీ

**chiton** సన్నటి వస్త్రం

**chivalry** రక్షకత్వం, శూరత్వం, పరాక్రమం

**chlorenchyma** హరిత కణజాలం

**chlorination** హరినీ కరణం

**chloroform** మత్తుకలిగించే పదార్థం

**chlorophyll** పత్రహరితం

**chloroplast** హరిత రేణువు

**chloroquine** మలేరియా నివారిణి

**chlorosis** నిర్హరితత్వం

**choice** ఇష్టమైన, శ్రేష్ఠమైన, ఉత్తమ, నచ్చిన; నిర్ణయం, ఎన్నిక, ఇష్టం, కోరిక
**choir** గాయకబృందం, భజనమండలి
**choke** నులిమివేయు, విఘాతం కలిగించు; ఉక్కిరిబిక్కిరి చేయు, ఆవేశంవల్ల మాట్లాడలేకపోవు
**choked voice** గద్గదస్వరం, డగ్గుత్తిక
**choking** పొరబారటం
**chondrometer** విశిష్ట భారమాపకం
**choose** ఎన్నుకొను, నిర్ణయించు, ఇష్టపడు
**chop** తెగనరుకు, ముక్కలుచేయు, దారి చేసుకుంటూ పోవు, మాంసపుముక్క
**chopping block** వధ్యశిల
**choral** బృందగాన సంబంధి
**chord** వాద్యసాధనాల తీగె, చాపకర్ణం, దారం
**chordata** వృష్ఠ దండం
**choreographer** నృత్యదర్శకుడు
**choreography** నృత్యసంయోజనం, నాట్యకళ, నాట్యపద్ధతి సూచన
**chorography** భౌగోళిక ప్రాంతధ్యయనం
**chorus** బృందగానం, ధ్రువాగానం
**christen** నామకరణంచేయు, పేరుపెట్టు, జ్ఞానస్నానంతో క్రైస్తవునిగా చేయు
**christendom** క్రైస్తవప్రపంచం
**christian** క్రైస్తవుడు; క్రైస్తవ
**christianise** క్రైస్తవమతంలో చేర్చు
**christianism** క్రైస్తవమతవాదం
**christianity** క్రైస్తవమతం
**chroma** వర్ణపరిశుద్ధత
**chromatic** వర్ణసంబంధమైన
**chromatics** వర్ణాధ్యయన(శాస్త్ర)ం
**chromatography** వర్ణరేఖన శాస్త్రం
**chromotropic** వర్ణాకర్షక
**chromosome** క్రోమోజోము
**chromosphere** సూర్యవాతావరణం

**chronic** ఎడతెగని, మళ్ళీమళ్ళీ సంభవించే. ~ *disease* దీర్ఘవ్యాధి. ~ *hunger* తగ్గని ఆకలి
**chronicle** కైఫీయత్, కథనం, చారిత్రక పత్రం/ గ్రంథం, (కాలక్రమంలో) నమోదు చేయు
**chronobiology** ఆయఃప్రమాణ నిర్ణాయక శాస్త్రం
**chronological** కాలక్రమానుసారం. *in order* కాలక్రమానుసారంగా
**chronologist** కాలక్రమ నిర్ణయ నిపుణుడు
**chronology** కాలక్రమం
**chrysanthemum** చేమంతి
**chrysolite** చంద్రకాంతమణి, లేతగుడ్లరాయి
**chuff** మొరటు, పిసినారి
**chummy** సన్నిహిత, స్నేహపూర్వక, ఆత్మీయ
**chunk** భాగం
**churlish** మర్యాదలేని, మొరటైన, స్నేహశీలి కానట్టి
**churn** చిలుకు, మథించు
**churning** చిలకటం, మథనం
**cicatrix** గాయపు మచ్చ
**cilia** సూక్ష్మకేశాలు, రోమకాలు, శైలికలు
**ciliary** సూక్ష్మకేశసంబంధ
**cinchona** సింకోనాచెట్టు
**cinema** చలనచిత్రం
**cinemascope** సినిమాస్కోప్, భారీ తెరమీద సినిమా ప్రదర్శించే ఆధునిక పద్ధతి
**cinerary** బూడిదకి సంబంధించిన. ~ *urn* చితాభస్మపాత్ర
**cinnamon** దాల్చినచెక్క
**cipher** సాంకేతికలిపి, శూన్యం, సున్న. ~ *code* లిపిసంకేతం
**circle** చుట్టూతిరుగు, గిరగిర తిరుగు; వృత్తం, వలయం, మండలం; సమూహం



**circuit** (విద్యుత్) వలయం, చక్రం, సంచారం
**circulant** వలయకారి
**circular** వర్తుల; ప్రకటనపత్రిక, సర్క్యులర్. ~ *orbit* వృత్తాకార కక్ష్య. ~ *muscle* వర్తుల కండరం
**circulating asset** నిత్య వాడకపు ఆస్తి
**circulating capital** సర్క్యులేటింగ్ మూలధనం, ప్రవాహ, చక్రీయ మూలధనం: వ్యాపారాన్ని నడిపించేందుకు, వృద్ధిచేసేందుకు ఉపయుక్తమయ్యే ధనం, నిలువసరుకు
**circulation** ప్రసరణ, చెలామణి, వ్యాప్తి, అమ్ముడుపోయే కాపీలసంఖ్య, రక్త ప్రసరణ
**circulative** సంచారక
**circulatory system** (రక్త) ప్రసరణ వ్యవస్థ
**circumambulation** ప్రదక్షిణ
**circum centre** పరికేంద్రం, పరివృత్త కేంద్రం
**circumcission** సునతి
**circumference** పరిధి, చుట్టుకొలత
**circumlocution** శాఖాచంక్రమణం, డొంకతిరుగుడుగా చెప్పడం, (వాక్య) విస్తరణ
**circumnavigate** (నౌక) చుట్టూతిరగడం
**circumnuclear** పరికేంద్రక
**circumorbital** పరికక్షీయ
**circumration** వంచన, మోసం
**circumscribe** చుట్టూ గీతగీయు, హద్దు ఏర్పరచు
**circumsolar** సూర్యునిచుట్టూ తిరిగే
**circumspect** జాగ్రత్తగల, తూచి మాట్లాడే
**circumspection** జాగ్రత్త, ఆలోచనాత్మకత
**circumstantial evidence** ప్రాసంగిక సాక్ష్యం

**circumstellar matter** నక్షత్రం చుట్టూ గల ద్రవ్యం
**circumvent** తప్పించుకోవడం; మోసపుచ్చడం; దాటవేయడం
**circumvention** మోసం
**circuitous litigation** డొంకతిరుగుడు, వ్యాజ్యం/ వ్యవహారం,
**cirrhosis** ప్రాణాంతక కాలేయ వ్యాధి
**cirrus** ఉపాంగం
**cissun** నల్లేరు
**cistern** ఉపరి జలాశయం
**citadel** దుర్గం
**citation** అనుఖనం. ~ *form* అనులిఖిత రూపం
**cite** పేర్కొను, ఇచ్చు, ఉదాహరించు
**citizen** పౌరుడు. ~ *front* పౌరసమితి
**citizenship** పౌరసత్వం
**citric acid** నిమ్మఉప్పు
**citronella** నిమ్మగడ్డి
**citrus** నిమ్మజాతి మొక్క
**city hall** నగర పాలక సంస్థ కార్యాలయం
**city state** నగర రాజ్యం
**civic critic** సాంఘిక విమర్శకుడు
**civic poetry** సామాజిక కవిత
**civic reception** పౌరసన్మానం
**civil** సాంఘిక, పౌర (సంబంధ), మర్యాదగల. ~ *administration* పౌర పరిపాలన. ~ *aviation* పౌర విమానయానం. ~ *code* పౌరస్మృతి. *common* ~*code* ఉమ్మడి పౌరస్మృతి. ~ *death* వ్యావహారిక మరణం. సివిలు హక్కులు పోగొట్టుకోవడం. ~ *defence* పౌర రక్షణ. ~ *disobedience* శాసనోల్లంఘన. ~ *law* పౌరన్యాయం. ~ *liberty* పౌరస్వేచ్ఛ. ~ *list* ప్రభుత్వోన్నతాధికారుల జాబితా. ~ *mar-*

*riage* మత నియమాలకు భిన్నంగా జరిపే పెళ్ళి. ~ *society* ప్రజాజీవన వ్యవస్థ. ~ *religion* సామాజిక మతం. ~ *rights* పౌరహక్కులు. ~ *suit* సివిల్ వ్యాజ్యం. ~ *servant* ప్రభుత్వోద్యోగి. ~ *service* ప్రభుత్వసేవ. ~ *supplies* పౌరసరపరా. *uniform* ~ *code* ఉమ్మడి పౌరస్మృతి, పౌరసరఫరాలు. ~ *war* అంతర్యుద్ధం

**civilian** పౌర(సంబంధి), ప్రభుత్వాధికారి, సాధారణ పౌరుడు. ~ *area* పౌర నివాస ప్రాంతం. ~ *dress* పౌరదుస్తులు

**civility** సభ్యత, మర్యాద

**civilization** నాగరకత, సభ్యత, మర్యాద

**civilize** నాగరకత నేర్పు, సభ్యత అలవాటు చేయు, మర్యాదచెప్పు

**civilized** నాగరక, సభ్యతగల. ~ *society* సభ్యసమాజం

**cladode** పత్రాభకాండం

**claim** హక్కు, వాదం

**claimant** హక్కుదారు

**clairvoyance** దివ్యదృష్టి, దూరదృష్టి

**clam** ఆల్చిప్ప

**clamorously** ఘొల్లుమని

**clamour** n. గోల, గగ్గోలు, నినాదాలు, అరుపు, గడబిడ, కోలాహలం, గందర గోళం చేయు, నినాదాలు చేయు, కేకలు పెట్టు

**clamp** n. కొక్కెం, గొళ్లెం, ఇటుకల కుప్ప, బిగించి ఉంచు, విధించు, అధికారాన్ని ఉపయోగించు. ~ *connection* తంతు బంధనం

**clan** గోత్రం: కుటుంబవర్గం

**clandestine** దొంగచాటు, ప్రచ్ఛన్న, గుప్త. ~ *sale* దొంగతనంగా అమ్మడం

**clank** గలగల ధ్వని

**clap** చప్పట్లు కొట్టు, తట్టు

**clarification** స్పష్టీకరణ, వివరణ

**clarify** స్పష్టం చేయు

**clarinet** సన్నాయి

**clarion** బాకా, బూర. ~ *call* పిలుపు, ఆహ్వానం

**clarity** స్పష్టత

**clash** విరోధం, సంఘర్షణ, ఎదుర్కొను, దాడిచేయు, విభేదించు

**clasp** అంటుకొను, అంటి ఉండు. ~ *ing root* అంటువేరు

**clasper** సంపర్క కంటకం

**class** శ్రేణి, తరగతి, వర్గం. ~ *awareness* వర్గస్పృహ. ~ *bias* వర్గ పక్ష పాతం. ~ *Conflict* వర్గ సంఘర్షణ. ~ *consciousness* వర్గచైతన్యం. ~ *dialect* వర్గమాండలికం. ~ *exploitation* వర్గదోపిడి. ~ *frequencies* వర్గ పౌనః పున్యాలు. ~ *less society* వర్గరహిత సమాజం. *middle* ~ మధ్యతరగతి. ~ *oppression* వర్గపీడన. *proletariat* ~ శ్రామికవర్గం. ~ *society* వర్గవిభక్త సమాజం

**classcism** సంప్రదాయవాదం

**classic** ప్రామాణికగ్రంథం, ప్రాచీన మహా కావ్యం

**classical** ప్రామాణిక. ~ *abstraction* ప్రామాణిక వివక్తత. ~ *period* ప్రామా ణిక యుగం

**classical** ప్రాచీన, సాంప్రదాయిక, ఉదాత్త మైన. ~ *dance* సంప్రదాయ నృత్యం. ~ *literature* ప్రాచీన సాహిత్యం. ~ *music* శాస్త్రీయ సంగీతం

**classification** వర్గీకరణం. ~ *of assets* ఆస్తులవర్గీకరణ

**classified** వర్గీకృత



**calssifieds** వర్గీకృత ప్రకటనలు

**classifier** వర్గీకారకం

**clause** నిబంధన, ఉపవాక్యం, వాక్యాంగం

**clavate** ఒక చివర భాగాన దళసరిగా గల

**clavicle** కంటి ఎముక, బోర ఎముక, జత్రుక

**claw** గోరు, నఖం. ~ *foot* పంజా వంటి పాదం. ~ *hammer* మేకులు తీసే సుత్తి

**clawed** గోళ్ళుగల, నఖారిత

**clay** బంకమన్ను; పార్థివశరీరం

**clay court** మట్టికోర్టు

**clean** శుభ్రమైన, దిద్దుబాట్లు లేని తుది ప్రతి. ~ *chit* మచ్చలేదనే కితాబు. ~ *credit* సంపూర్ణపరపతి. ~ *days* పూర్తి దినాలు. ~ *hands* నిష్కళంక హస్తాలు. ~ *receipt* నిర్దుష్ట రసీదు. ~ *sweep* అఖండవిజయం

**cleaning** క్షాళనం, శుభ్రపరచడం. ~ *mixture* క్షాళనమిశ్రమం. ~ *solution* క్షాళనద్రావణం. ~ *nuts* చిల్లగింజలు

**cleanse** ప్రక్షాళించు

**clear** పరిశుద్ధ, కల్తీలేని, స్వచ్ఛమైన, నిర్మల మైన, తగువులేని, స్పష్టమైన, మిగిలిన మొత్తం, విక్రయించు, హస్తగతంచేయు, చెల్లించు, తొలగించు. ~ *profits* నికర లాభం

**clearance** తీర్పివేత, తొలగింపు. ~ *certificate* విడుదలరసీదు

**cleavable** పగులగొట్టగలిగిన, చీల్చగల

**cleavage** చీల్చు, నరుకు, విడివడు; చీలిక, విదళనం

**cleave** పగులు, చీలు, పగులగొట్టు, చీల్చు

**cleaver** కసాయికత్తి, గండ్రగొడ్డలి

**cleft** చీలిక, పగులు. ~ *palate* మొర్రి

**clemancy** క్షమాభిక్ష

**clement** దయగల

**clergy** క్రైస్తవ మతాధికారి/ పురోహిత వర్గం

**clerical error** రాతపొరపాటు, రాత తప్పు, గుమస్తా పొరపాటు

**clericalism** మతాధికారుల జోక్యం

**clerk** గుమాస్తా

**clever** తెలివైన, కుశల, సూక్ష్మబుద్ధిగల

**cleverly** తెలివిగా, నేర్పుగా

**cleverness** చతురత

**cliche** పడికట్టుపదం, నలిగిన సామెత, గతానుగతిక వాక్యం, పునరుక్తి

**client** కక్షిదారు, ఉపయోక్త

**clientele** ఉపయోక్తలు, వినియోగదారుల బృందం

**cliff** చరియ, కొండకొమ్ము, శిఖరం

**climate** శీతోష్ణస్థితి, వాతావరణం

**climatic** వాతావరణ/ శీతోష్ణసంబంధి. ~ *regions* శీతోష్ణప్రాంతాలు

**climatologist** వాతావరణశాస్త్రజ్ఞుడు

**climatology** శీతోష్ణస్థితి/ వాతావరణ శాస్త్రం

**climax** పతాకసన్నివేశం, పరాకాష్ఠ, క్రమో న్నతి, పరాకాష్ఠకుచేరు

**climb down** దిగివచ్చు

**climber** ఎగబాకే మొక్క

**clinch** తుదినిర్ణయం చేయు, పూర్తిచేయు

**clinching** విస్పష్ట. ~ *evidence* విస్పష్ట సాక్ష్యం

**clincher** తెగదెంచే వ్యక్తి; తుదినిర్ణయ ప్రకటన

**cling** వేలాడు

**clinical** వైద్యచికిత్స/ పరిశీలన/ పరీక్షకు సంబంధించిన. ~ *death* మస్తిష్క మృతి. ~ *medicine* చికిత్సా వైద్యం. ~ *thermometer* జ్వరమాపకం

**clinical psychology** మానసిక చికిత్సా ధ్యయన (శాస్త్ర)ం

**clinker** కాలిన ఇటుక, చిట్టెం; తుప్పు
**clinometer** కోణమాపకం
**clip** n. కత్తిరింపు, పట్టకారు, కత్తిరించు, గట్టిగా పట్టుకొను
**clipping** కత్తిరింపు, కత్తిరించిన వ్యాసం/ ప్రకటన
**clique** ముఠా, గుంపు
**clitic** ఆశ్రయి
**clitoris** భగాంకురం
**cloak** పైగుడ్డ, వేషం, సాకు, మిష, పరదా; ధరించు, కప్పు, మరుగుపడు, మారువేషంవేయు
**cloak room** సామానుగది
**clock off** పనిముగింపు సమయాన్ని నమోదుచేయు
**clock on** పనిప్రారంభ సమయాన్ని నమోదుచేయు
**clockwise** సవ్య. ~ *direction* సవ్యదిశ, ప్రదక్షిణదిశ
**clod** మంటిగడ్డ; తెలివితక్కువ మనిషి
**clog** ఆటంకం, గుదికొయ్య, పావుకోళ్ళు; జోళ్ళు; అదుపులోపెట్టు, అడ్డుపెట్టు
**cloister** (క్రైస్తవ సన్యాసినుల) మఠం; మఠ జీవితం
**cloistress** సన్యాసిని
**clone** సమరూపజీవిని సృష్టించిన
**cloning** సమరూప జీవుని సృష్టి
**clop** n. డెక్కల చప్పుడు లాంటి ధ్వని; అలా ధ్వనించు
**close** సంవృత; సన్నిహిత, ఇరుకైన, బిగువైన, మూసిన, రహస్యమైన, ఏకాంతమైన, పిసినారి, సమాప్తి, పరిధి, మూయు, దగ్గరచేర్చు, ముగించు, మూసుకొను, ముగియు. ~ *by* దగ్గరగా. ~ *call* ప్రమాదం నుంచి వెంట్రుకవాసిలో తప్పించుకొను. ~ *down* మూసివేయు. ~ *fisted* పిసినారి. ~ *in* చుట్టుముట్టు. ~ *knit* సువ్యవస్థీకృత, దృఢమైన. ~ *quarters* సన్నిహిత స్థలాలు. ~ *ranks* విభేదాలు విస్మరించు. ~ *up* మూసివేయు, ఐక్యమగు. ~ *vowel* సంవృతాచ్చు.
**closet** ఏకాంతగృహం, సామాను గది ఏకాంత వాసంలో ఉంచు. ~ *drama* చదవడానికి అనుకూలమైన నాటకం
**close up** సన్నిహితమైన. ~ *shot* అతి దగ్గరి నుంచి తీసిన చిత్రం
**closing date** ముగింపు తేదీ
**closure** ముగింపు, చిట్టచివరి భాగం, భరతవాక్యం
**clot** (రక్తం) గడ్డకట్టు; కదుము, ముద్ద, బృందం
**cloud** మబ్బు, మేఘం, దట్టమైన పొగ. ~ *seeding* కృత్రిమవర్షం కురిపించడం
**clout** గుడ్డపీలిక; అధికారం, పలుకుబడి, అంగబలం, ఒత్తిడి, దెబ్బకొట్టేశక్తి, ప్రభావం, ప్రభావితం చేయు
**clouted** అతుకులు వేసిన
**clove** లవంగం (మొక్క)
**clown** హాస్యగాడు, విదూషకుడు, పల్లెటూరివాడు; బైతు
**club** గద, లాఠీ, దుడ్డుకర్ర; క్లబ్బు, సంఘం (పేకలో) కళావరుముక్క; సంఘంగా ఏర్పడు. ~ *law* కఠిన శాసనం
**cluck** కోడిపిల్లలను పిలవడానికి అరిచే అరుపు; మూర్ఖుడు
**clue** జాడ, ఆచూకీ; నూలుండ, కండె
**clump** చెట్ల/ పొదలసమూహం; తోపు
**clumsy** వికృత, మోటయిన, అసహ్యకర, అడ్డదిడ్డమైన, అస్తవ్యస్తమైన
**clustard bean** గోరుచిక్కుడు
**cluster** గుంపు, గుత్తి, గెల, సమూహం, మూక, సంయుక్తవర్ణం. ~ *bomb* విస్తృత ప్రదేశంలో పేలే బాంబు



**clutch** గట్టిపట్టు, కబంధ హస్తం; దడాలున పట్టుకొను; గట్టిగాపట్టుకొను
**clutter** రొద చేయు, అల్లరిచేయు; అవసరం లేని సామాను పోగుచేయడం
**co-accused** సహనిందితుడు
**coach** శకటం, బండి; శిక్షకుడు; ఉపాధ్యాయుడు; శిక్షణనిచ్చు, నేర్పించు, తర్ఫీదు చేయు
**co-action** సంయుక్త ఆచరణ
**coagulant** కరుడు, స్కందనం; గడ్డకట్టిన
**coagulate** పేరుకొను, గడ్డకట్టు
**coagulation** ఘనీభవనం, గడ్డకట్టుకోవడం, పేరుకోవడం
**coal** బొగ్గు. ~ *field* బొగ్గు నిక్షేపాలున్న ప్రాంతం. ~ *tar* తారు. ~ *mine* బొగ్గు గని. ~ *pit* బొగ్గు తవ్విన గొయ్యి
**coalition** (రాజకీయ పక్షాల) మిశ్రమం, సంకీర్ణం; తాత్కాలిక ఒప్పందం/ కూటమి; ఏకీభవించడం; కలిసిపోవడం. ~ *government* సంకీర్ణ ప్రభుత్వం, మిశ్రమ ప్రభుత్వం. ~ *partners* సంకీర్ణ (భాగస్వామ్య) పక్షాలు. ~ *politics* సంకీర్ణ రాజకీయాలు
**coarse** ముతక, అనాగరక, జడ్డి. ~ *grain* ముతకధాన్యం
**coarseness** మోటుతనం
**coast** కోస్తా, సముద్రతీరం; దేశ సరిహద్దు. ~ *guard* తీర రక్షకదళం. ~ *line* తీరం
**coastal** తీరసంబంధ. ~ *dwellers* తీర ప్రాంతవాసులు. ~ *habitat* తీర ప్రాంతావాసం. ~ *line* తీరరేఖ, తీర ప్రాంతం. ~ *zone* తీరప్రదేశం
**coat** పూత; పొర/ చర్మం; కోటు; పూయు
**coating** విలేపనం, పూత; కోట్లు కుట్టడానికి ఉపయోగించే గుడ్డ
**co-author** సహరచయిత
**coax** ఇచ్చకాలాడి వంచించు, పొగిడి సమ్మతింపచేయు; లాలించు
**coaxing** మురిపెం
**coaxingly** లాలనగా
**cob** మగహంస; బలిష్ఠమైన గుర్రపు తట్టు
**cobalt** మణిశిల
**cobble** కలియడం, కూర్చు; బాగుచేయు
**cobbler** చర్మకారుడు; మద్యం, పళ్ళు కలిపిన చల్లనిపానీయం
**cobbles** నేలమీద పరిచే గుండ్రని రాళ్ళు
**cobra** త్రాచుపాము, విషసత్యం. ~ *posture* భుజంగాసనం
**cobweb** సాలెగూడు; చిక్కుముడి
**cocaine** కొకెయిన్, మత్తుమందు
**coccus** గోళాకార బాక్టీరియం
**coccygeal** అనుత్రికానికి సంబంధించిన
**coccygeo** అనుత్రికపు
**coccyx** అనుత్రికం, వెన్నుపూసలు కలిసి ఏర్పడే త్రికోణాకారపు చిన్న ఎముక
**cock** కోడిపుంజు, మగపిట్ట; నీటిగొట్టపు తొండం; పురుషాంగం; తుపాకి మీట, ముఖ్యుడు, నాయకుడు
**cockade** తురాయి
**cockboat** దొన్నె
**cockhafer** చిమ్మట, ఈలపురుగు
**cockcrow** కోడికూతవేళ, తెల్లవారువేళ
**cock-eyed** మెల్లకన్ను గల; వంకర బుద్ధి గల; పనికిరాని
**cockney** గారాబంవల్ల చెడిపోయిన పిల్లవాడు
**cockpit** విమానంలో పైలట్‌కు, సిబ్బందికి కేటాయించే అర
**cockscomb** కోడిజుట్టు; నీటుకాడు
**cockswain** తండేలు, పడవవారి నాయకుడు
**cocktail** మద్యమిశ్రమం

**coconut fibre** కొబ్బరిపీచు
**cocoon** పట్టుగూడు, పసినికాయ
**cocoonery** పట్టుపురుగులను పెంచే గూడు
**cocooning** ఉబుసుపోకకు టీ.వీ. చూడడం
**cocurricular** అనుబంధ పాఠం
**cod** పెద్ద సముద్రపుచేప; సంచి, తలగడ
**coddle** ఉపచరించు; ముద్దులాడు, నెమ్మదిగా ఆహారం వండడం
**code** సంకేతం, నియమనిబంధనల జాబితా; స్మృతి. ~ *of conduct* ప్రవర్తన నియమావళి
**code mixture** భాషామిశ్రమం
**code noise** సంకేతావరోధం
**code of laws** న్యాయ సూత్రావళి
**code switching** భాషమార్పు
**codex** రాతప్రతి
**codger** ఛాందసుడు, మోటుమనిషి
**codicil** వీలునామాలో మార్పు, అనుబంధ వీలునామా
**codification** క్రోడీకరణం
**codify** సంకేతించు, క్రోడీకరించు, స్పష్టంగా పేర్కొను
**coding** గుర్తుల మార్పు
**co-edition** సహప్రచురణ
**co-editor** సహసంపాదకుడు
**co-education** సహవిద్య
**coefficient** గుణకం
**coeliac** ఉదరకుహర సంబంధమైన
**coencyte** అఖండ జీవకణకోశం
**coerce** బలవంతపెట్టు
**coercion** బలాత్కారం
**coercive** బలవంతం చేసే
**co-eval** సమకాలీనమైన, సమకాలీనుడు
**co-exist** సహజీవనం చేయు, కలిసి ఉండు
**co-existance** సహజీవనం. *peaceful* ~ శాంతియుత సహజీవనం

**coffer** ఖజానా
**cofferdam** తాత్కాలిక ఆనకట్ట
**coffin** శవపేటిక
**cog** పళ్ళచక్రం పళ్ళు; ఒక పెద్ద సంస్థలో చిన్న పనిచేసే వ్యక్తి; మోసగించు
**cogency** శక్తి, సామర్థ్యం, బలం
**cogent** బలమైన, నిర్ణాయకమైన, సముచితమైన; విశ్వసనీయమైన
**cogitate** దీర్ఘంగా ఆలోచించు
**cognac** ద్రాక్షసారాయి
**cognate** సహజాతం
**cognate language** సోదరభాష
**cognate word** స్వజాతిపదం
**cognisable offence** కేసుపెట్టదగిన నేరం
**cognitive consistency** అభిజ్ఞాసంతులనం
**cognitive development** అభిజ్ఞావికాసం, మేధావికాసం
**cognitive dissonance** అభిజ్ఞా వైరుధ్యం
**cognitive sociology** అభిజ్ఞాత్మక సామాజికశాస్త్రం
**cognitive theory** అభిజ్ఞాసిద్ధాంతం
**cognizance** (నేరం) గుర్తింపు; పరిశీలన పరిధి, న్యాయరీత్యావిచారణ చేసే హక్కు, తెలిసి ఉండడం; ప్రత్యేకమైన గుర్తు
**cohabitation** సంకీర్ణం, మిశ్రమం, కలయిక, సహనివాసం
**co-heir** సహవారసుడు
**cohere** అంటుకొను, పొందికగా ఉండు
**coherence** సందర్భశుద్ధి; పొందిక
**coherence theory** పొందిక సిద్ధాంతం
**cohesion** బంధం, సంబంధం, సంయోగం, ఐకమత్యం, అతికి ఉండడం/ అంటిపెట్టుకొని ఉండడం
**cohesive force** బంధనశక్తి, కలిపి ఉంచే శక్తి, సంసంజనబలం



**cohort** బృందం; సహచరుడు; (నేరంలో) మద్దతుదారు
**coil** (తీగ) చుట్ట
**coinage** పదసృష్టి, పదసృజన
**coincide** సరిపడు, ఏకీభవించు; సమాన స్థలాన్ని ఆక్రమించు; ఒకే సమయంలో తటస్థించు
**coincidence** కాకతాళీయం, యాదృచ్ఛికం; ఏకీభావం
**coitus** మైథునం, సంభోగం. ~ *interruptus* స్ఖలనరహిత మైథునం
**coke** n. ఒకరకమైన బొగ్గు; కొకెయిన్ మాదకద్రవ్యం
**coke** v. మాదక ద్రవ్యానికి అలవాటుపడు
**cokehead** మత్తుపదార్థాలకు అలవాటుపడే వ్యక్తి
**cold** శీతల, చల్లని. ~ *storage* శీతల గిడ్డంగి. ~ *war* ప్రచ్ఛన్నయుద్ధం. ~ *wave* శీతలతరంగం
**cold glacier** శీతల హిమానీనదం
**colic** శూలనొప్పి. *biliary* ~ పిత్తాశయ శూల. *gastric* ~ జఠరశూల. *intestinal* ~ ఆంత్రశూల
**colitis** పెద్దపేగు నొప్పి
**collaborate** కలిసి పనిచేయు, సహకరించు, భాగస్వామి అగు
**collaboration** సహభాగిత, సహకారం, తోడ్పాటు, భాగస్వామ్యం
**collaborator** సహకారి, భాగస్వామి, సహవ్యాపారి, సహకృషికుడు
**collage** దృశ్య రూపకల్పన
**collapse** కూలిపోవడం, పడిపోవు
**collate** పోగుచేయు
**collateral** జాతి సంబంధం గల, తత్సంబంధమైన, పరస్పర సంబంధ మున్న, జ్ఞాతి. ~ *agreement* అనుషంగిక ఒప్పందం. ~ *damage* యాదృచ్ఛిక నష్టం. ~ *proceedings* అనుషంగిక వ్యవహారాలు. ~ *evidence* ప్రధాన సాక్ష్యాన్ని బలపరిచే సాక్ష్యం. ~ *guarantee* సహాయక హామీ. ~ *loan* అనుషంగిక రుణం. ~ *obligation* అనుషంగిక బాధ్యత. ~ *security* అదనపు హామీ/ భద్రత. ~ *weed* పంటలో పెరిగే కలుపు
**collation** సమాకలనం; క్రమంలో కూర్చడం, సరిచూడడం, సంకలనం, బహుమానం, అల్పాహారం
**colleague** సహోద్యోగి, తోటిఉద్యోగి
**collection** వసూలు, సేకరణ. ~ *of data* సమాచార సేకరణ
**collective** ఉమ్మడి, సామూహిక, సాముదాయిక. ~ *agreement* ఉమ్మడి ఒప్పందం. ~ *bargaining* గుంపులో బేరం. ~ *behaviour* సామూహిక ప్రవర్తన. ~ *conscience* సామూహిక చేతన. ~ *farm* ఉమ్మడి చేను
**collectivism** సాముదాయికత
**collectivization** సమష్టీకరణ
**collectomy** పేగులో భాగం తొలగింపు
**collector** జిల్లాధికారి, కలెక్టర్
**collide** ఢీకొను, సంఘర్షించు
**collier** బొగ్గుగని కార్మికుడు, బొగ్గుల వ్యాపారి
**colliery** బొగ్గుగని
**collinear** సహరేఖీయ
**collision** ఢీకొనడం
**collocate** ఒకచోట పెట్టడం/ అమర్చడం
**collocation** సహసంబంధం; సంయోజన
**collop** మాంసపుకండ
**colloquialism** భాషావాదం
**colloquial** వ్యావహారిక, వాడుకలో ఉన్న, వాడుకభాష, వ్యావహారిక భాష

**colloquium** నిపుణుల/ పండితుల చర్చా గోష్ఠి
**colloquy** సంభాషణ
**collude** కుమ్మక్కగు, చేతులుకలుపు, లాలూచీపడు
**collusion** కుట్ర, కుమ్మక్కు; రహస్య ఒప్పందం
**colocasia** చామగడ్డ
**colon** (పెద్ద) పేగు, ఎల్‌సాల్వడార్ దేశపు కరెన్సీనోటు
**colonel** సేనా విభాగాధిపతి, కల్నల్
**colonial** వలసదేశాలకు సంబంధించిన. ~ *office* వలసదేశాల కార్యాలయం. ~ *power* వలసరాజ్యం. ~ *rule* వలస పాలన. ~ *war* వలసయుద్ధం
**colonialism** వలసపాలన విధానం; వలస వాదం
**colonisation** వలసరాజ్య స్థాపన
**colony** కాలనీ, పేట, గృహసముదాయం; (వలస) రాజ్యం, ఏకరూపక ఏకజాతి జీవుల సమూహం
**colophon** ముద్ర, చివరిమాట
**colorral** బృహదాకార (శిల్పం)
**colotomy** పెద్దపేగుకు కన్నం పెట్టడం
**colossal** చాలా పెద్దదయిన, బ్రహ్మాండమైన
**colossus** మహామూర్తి, మనుష్య ప్రమాణాన్ని మించిన విగ్రహం
**colostrum** ప్రథమస్తన్యం, (జంతువుల్లో) ముర్రు/ జున్నుపాలు
**colour** రంగు, వన్నె, వర్ణం. ~ *blindness* వర్ణాంధత్వం. ~ *characteristic* వర్ణవిలక్షణత. ~ *doppler* రక్తప్రసార పరీక్షయంత్రం. ~ *print* రంగు అద్దకం. ~ *property* వర్ణధర్మం. ~ *relationship* బంధుత్వం, సంబంధం, వర్ణసమన్వయం. ~ *sculpture* వర్ణ శిల్పం. ~ *theory* వర్ణసిద్ధాంతం
**colourist** వర్ణవేత్త
**columbarium** భూతల శ్మశానగృహం
**column** స్తంభం; సైనికులబారు, వరస; ప్రత్యేక రచన. ~ *spinal* వెన్నుపాము. ~ *vertebral* వెన్నెముక
**columnist** ప్రత్యేక శీర్షికా రచయిత
**coma** అపస్మారకం. ~ *tose* అపస్మార స్థితిలోనున్న
**comb** దువ్వెన, తేనెపట్టు; దువ్వు, చిక్కు దీయు, వెతుకు
**combatant** యోధుడు, పోరాడేదేశం
**combat** పోరాటం, పోరు; ద్వంద్వ యుద్ధం; ఎదుర్కొను, ప్రతిఘటించు
**combination** కలయిక; ఏకీభావం, కట్టుబాటు; మేళనం
**combine** కలుపు, చేర్చు; కలుసుకొను, చేరు
**combined** మిళిత
**combing** (జుట్టు) దువ్వడం, చిక్కు తీయడం
**combuster** దాహకం
**combustibility** దాహ్యత, జ్వలన సామర్థ్యం; దహనశీలత
**combustible** దహనశీల, మండే, కాలే. ~ *nature* ఉద్రేకానికి లోనయ్యే స్వభావం
**combustion** దహనం, దహనచర్య, కాల్చడం. ~ *boat* దహనపాత్ర/ నౌక. ~ *bomb* దహనబాంబు. ~ *chamber* దహనపేటిక. ~ *engine* దహనశీల యంత్రం. ~ *furnace* ఆవం, కొలిమి. ~ *space* దహనప్రదేశం. ~ *tube* దహననాళిక
**comedian** విదూషకుడు; సుఖాంత నాటక రచయిత; హాస్యనటుడు
**comedy** హాస్యరచన; సుఖాంతనాటకం
**comeliness** చక్కదనం, సౌందర్యం



**comely** చక్కని, సుందరమైన
**comer** వచ్చిన/ ఎదుగుతున్న వ్యక్తి
**comestible** తినదగినవస్తువు
**comet** తోకచుక్క
**comfort** ఓదార్చు, ఊరడించు; సౌకర్యం, సదుపాయం, సౌఖ్యం, బొంత
**comic** నవ్వుపుట్టించే, హాస్యపోషక. ~ *relief* హాస్యోపశాంతి
**comintern** అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థ
**comity** సౌహార్దం
**command** ఆజ్ఞ, ఆధిపత్యం, స్వాధీనత, ఆజ్ఞాపించు, స్వాధీనంలో ఉంచు
**commandant** సేనాధిపతి
**command area** ఆయకట్టు
**commandeer** లాగుకొను, జప్తుచేయు
**commander-in-chief** సర్వసేనాని
**commanding officer** దళవాయి, సేనాని
**commandment** ఆజ్ఞ, ఈశ్వరాజ్ఞ, శాసనం, విధి
**commando** కమెండో, భద్రతాదళ సైనికుడు
**commemorate** స్మారకార్థం/ జ్ఞాపకార్థం నిర్వహించు
**commemoration** సంస్మరణ, స్మారకోత్సవం, స్మారకచిహ్నం
**commemorative** గుర్తుకు తెచ్చే, కొనియాడే
**commence** మొదలుపెట్టు, ప్రారంభించు
**commencement** మొదలు, ప్రారంభం
**commend** మెచ్చుకొను, పొగడు, ప్రస్తావించు, పేర్కొను, అప్పగించు
**commendable** కొనియాడదగిన, శ్లాఘనీయ, సిఫారసు చేయదగిన
**commendation** సిఫారసు, మెచ్చుకోలు, మెప్పు, పొగడ్త
**commensurate** సమానమైన, తగిన
**comment** వ్యాఖ్య; విమర్శ, చర్చ; వ్యాఖ్యానించు, విమర్శించు, ఆక్షేపించు
**commentary** వ్యాఖ్యానం, భాష్యం, టిప్పణి
**commentator** వ్యాఖ్యాత
**commerce** వాణిజ్య (శాస్త్ర)ం
**commercial** వాణిజ్య, వాణిజ్య సంబంధమైన; లాభాపేక్షతో కూడిన. ~ *affairs* వాణిజ్య వ్యవహారాలు. ~ *agency* వాణిజ్య సంస్థ. ~ *art* వ్యాపార కళ. ~ *artist* వాణిజ్య కళాకారుడు. ~ *bank* వాణిజ్య బ్యాంకు. ~ *break* వాణిజ్య ప్రకటనలకు కేటాయించే సమయం. ~ *code* వాణిజ్య సంకేతం. ~ *court* వాణిజ్య న్యాయస్థానం. ~ *crisis* వాణిజ్య సంక్షోభం. ~ *enterprise* వాణిజ్య సంస్థ. ~ *law* వాణిజ్య న్యాయశాస్త్రం. ~ *pilot* ప్రయాణికుల విమానాల్ని నడిపే పైలెట్. ~ *production* వాణిజ్య స్థాయి ఉత్పత్తి. ~ *traveller* వర్తకుడు, సంచారి
**commercialisation** వ్యాపారీకరణ
**commercialise** వ్యాపారీకరించు
**commie** (నిందార్థంలో) కమ్యూనిస్టు
**comminate** శపించు, బెదిరించు
**commiserate** జాలిచెందు
**commissar** శాఖాధిపతి, (కమ్యూనిస్టు ప్రభుత్వంలో) మంత్రి, ఉద్యోగి
**commissariat** సైన్యానికి ఆహార పదార్థాలు సమకూర్చే విభాగం
**commissary** సైనికోద్యోగులకు, గని కార్మికులకు ఆహార పదార్థాలు అందజేసే విభాగం
**commisseration** జాలి, కనికరం
**commission** ఆజ్ఞ, అప్పగించిన పని, ఆజ్ఞాపత్రం, సంఘం, మండలి; ప్రారంభించు; నియోగించు, అధికారమిచ్చు. ~ *agent* మధ్యదళారి

**commissioner** ఉన్నతాధికారి
**commissioning** ప్రారంభించడం
**commit** వాగ్దానం చేయు, అప్పగించు. ~ *to custody* నిర్బంధంలో ఉంచు. ~ *to sessions* సెషన్స్ కోర్టుకు నివేదించు. ~ *to writing* రాతపూర్వకంగా ఒప్పుకొను
**committal proceedings** (క్రిమినల్ కేసులో) ప్రాథమిక విచారణ
**committed** నిబద్ధ. ~ *bureacracy* నిబద్ధాధికారి బృందం, నిబద్ధ పాలనా యంత్రాంగం. ~ *judiciary* నిబద్ధ న్యాయ వ్యవస్థ. ~ *press* నిబద్ధ పత్రికా రంగం
**committee** సంఘం, సమితి. ~ *on welfare of backward classes* వెనుకబడిన తరగతుల సంక్షేమ కమిటీ. ~ *on general purpose* సాధారణ ప్రయోజనాల కమిటీ. ~ *on government assurances* ప్రభుత్వ హామీల కమిటీ. ~ *on library* గ్రంథాలయ కమిటీ. ~ *on public-undertakings* ప్రభుత్వ సంస్థల కమిటీ. ~ *on welfare of scheduled castes* షెడ్యూలు వర్గాల సంక్షేమ కమిటీ. ~ *on welfare of scheduled tribes* షెడ్యూలు జాతుల సంక్షేమ కమిటీ
**commode** దొడ్డి తొట్టి, బయలు తొట్టి
**commodities** ఉత్పత్తులు
**commodity** వస్తువు, సరుకు, దినుసు; ఉపయోగానికి/ అమ్మకానికి సిద్ధంగా ఉన్న ముడిసరుకు/ తయారైనవస్తువు. ~ *market* సరుకుల విపణి
**common** సాధారణ, సామాన్య, ఉమ్మడి. ~ *civil code* ఉమ్మడి పౌరస్మృతి. ~ *core vocabulary* సమాన ప్రాథమిక పదజాలం. ~ *front* ఐక్యవేదిక. ~ *law* సాధారణన్యాయం. ~ *market* అంతర్జాతీయవాణిజ్యం. ~ *millet* పరిగలు. ~ *stock* సాధారణ వాటా. ~ *usage* లోక వ్యవహారం
**commonality** సామ్యం, ఏకత్వం
**commons** సామాన్యజనం, బ్రిటీష్ పార్లమెంట్‌లో సాధారణ సభ
**commonsense** లోకజ్ఞానం, వ్యవహార జ్ఞానం, ప్రపంచజ్ఞానం. ~ *knowledge* ఇంగితజ్ఞానం
**commonwealth** కామన్వెల్త్ దేశాలు
**commotion** గొడవ, అలజడి, గడబిడ
**communal** వర్గ/ కుల/ మతతత్వం గల. ~ *forces* మతవాద శక్తులు. ~ *harmony* మతసామరస్యం. ~ *marriage* సామూహికవివాహాలు. ~ *politics* కుల/ మతతత్త్వ రాజకీయాలు. ~ *riots* మత కల్లోలాలు. ~ *tensions* మతోద్రేకాలు
**communalise** కుల/ మతతత్త్వాన్ని రెచ్చగొట్టు
**communalism** కుల/ మతతత్త్వం
**commune** సహజీవనవ్యవస్థ
**communicable** సోకే, అంటుకునే. ~ *disease* అంటువ్యాధి
**communicate** తెలియజెప్పు; ప్రసరించు; అంటించు; సందేశం పంపు, కబురు పెట్టు, వర్తమానం పంపు
**communication** సమాచార ప్రసారం, వార్త, సూచన, సందేశం. ~ *channel* వార్తపథం. ~ *facilities* వార్తా సౌకర్యాలు. ~ *gap* అవగాహన లోపం. ~ *theory* భావ ప్రసార సిద్ధాంతం
**communication** వార్తాసౌకర్యాలు, రవాణాసదుపాయాలు. ~ *satellite* సమాచారఉపగ్రహం. ~ *theory* సమాచార సిద్ధాంతం
**communicative** మాటకారి; తెలియచెప్పే. ~ *competence* భాషాప్రయోగ దక్షత



**communion** సమ్మేళనం; భావ వినిమయం
**communique** అధికార ప్రకటన, విజ్ఞప్తి
**communism** కమ్యూనిజం, సమసమాజ సిద్ధాంతం
**community** సమాజం, సంఘం; వర్గం, కులం, మతం. ~ *care* సామాజిక రక్షణ. ~ *charge* ప్రజలు చెల్లించే పన్ను. ~ *development* సమాజాభివృద్ధి. ~ *investment* సమాజహిత కార్యక్రమాలలో పెట్టే పెట్టుబడులు. ~ *service* సంఘసేవ. ~ *study* వర్గాధ్యయనం
**commutable** మార్పిడికి వీలైన
**commutate** దిక్పరివర్తన చేయు
**commutation** పరివర్తనం, మార్పిడి, తగ్గింపు, మదింపు
**commutator** దిక్పరివర్తకం
**commute** మార్పు, మార్పిడి, బదలాయింపు
**commute** v. తరచుగా ప్రయాణం చేయు; శిక్షతగ్గించు, ఏక మొత్తంగా చెల్లించు.
**commuter** నిత్యప్రయాణికుడు
**commotion** గగ్గోలు, దుమారం
**companion** సహచరుడు, తోటివాడు
**company** సాహచర్యం, వ్యాపారసంస్థ. ~ *law* కంపెనీ న్యాయశాస్త్రం
**comparable** పోల్చదగిన
**comparative** తులనాత్మక. ~ *grammar* తులనాత్మక వ్యాకరణం. ~ *law* తులనాత్మక న్యాయ పద్ధతి. ~ *linguistics* తులనాత్మక భాషాశాస్త్రం. ~ *literature* తులనాత్మక సాహిత్యం. ~ *method* తులనాత్మక పద్ధతి. ~ *philosophy* తులనాత్మక తత్త్వ శాస్త్రం. ~ *philology* తులనాత్మక ప్రాచీన భాషా శాస్త్రం
**compare** పోల్చు, తైపారువేయు, సామ్యభేదాలను నిరూపించు
**comparing** పోల్చడం
**comparsion** పోలిక, ఉపమానం; సాదృశ్యం
**compass** n. దిక్సూచి; పరిధి, విస్తృతి, చుట్టుముట్టు
**compassion** దయ, జాలి, ప్రేమ, కరుణ, సంవేదన
**compassionate** కరుణామయ, దయాళు
**compatibility** అనుకూల్యం, అనుకూలత, పొందిక, అనుగుణ్యత
**compatible** అనుకూల, యోగ్య, అనుగుణ
**compatriot** తోటి పౌరుడు, స్వదేశీయుడు
**compel** బలవంతంచేయు, నిర్బంధించు
**compendium** సారాంశం, సంక్షిప్తరూపం
**compensate** పరిహారం చెల్లించు; పూరించు
**compensation** పరిహారం, నష్టపరిహారం, ప్రతికరణం. ~ *insurance* నష్టపరిహారక బీమా. ~ *scheme* నష్టపరిహారక పథకం
**compensatory lengthing** లోపదీర్ఘత
**compare** సమానస్థాయిగల వ్యక్తి; సహచరుడు
**competence** సమర్థత, ప్రావీణ్యం, ప్రతిభ, యోగ్యత; అధికారం; దక్షత
**competent** సమర్థ, యోగ్య, సాధికారిక. ~ *authority* సమర్థాధికారి/ సమర్థాధికారం
**competently** సమర్థంగా
**competetor** పోటీదారు
**competition** పోటీ. *cut throat* ~ తీవ్రమైన పోటీ. *destructive* ~ విధ్వంసక పోటీ. *imperfect* ~ అసంపూర్ణ పోటీ. *monopolistic* ~ గుత్తాధిపత్యపు పోటీ. *perfect* ~ సంపూర్ణ పోటీ

**competitive** పోటీపడగల. ~ *advantage* స్పర్ధాసౌకర్యం, పోటీ సౌకర్యం. ~ *examination* పోటీపరీక్ష. ~ *price* పోటీధర
**compilation** కూర్పు, సంకలనం ~ *of data* దత్తాంశ సంకలనం
**compile** సంకలనం చేయు; సంగ్రహించు, కూర్చు
**compiler** కూర్పరి, సంగ్రాహకుడు
**complacency** నిర్లక్ష్యం, అలసత్వం, అల్ప సంతోషం; నిశ్చలత
**complacent** నిశ్చింతగా ఉన్న, సంతోషంగా ఉన్న
**complain** ఫిర్యాదుచేయు, అసంతృప్తి వ్యక్తంచేయు; సణుగు
**complainant** ఫిర్యాది, వాది
**complaint** ఫిర్యాదు, ఆవేదన; రోగం
**complaisant** మర్యాదగల, దాక్షిణ్యంగల, ఆదరణగల
**complement** సంపూరక; చాటూక్తి
**complementary** పరిపూరకమైన, బహుమానపూర్వక. ~ *food* పుష్టికర అల్పాహారం. ~ *hypothesis* పరస్పర పూరక వాదం
**complete** ముగించు, పూర్తిచేయు; సాంగోపాంగ, సమగ్ర, ముగిసిన, నెరవేరిన
**completely** నిండుగా, పూర్తిగా
**completion** సమాప్తి, ముగింపు, సంపూర్తి
**completness** పరిపూర్తి
**complex** క్లిష్ట, జటిల, సంకీర్ణ, స్థూల, చిక్కనయిన, (భవన) సముదాయం, మనోవికారం. ~ *fertilizers* మిశ్రమ ఎరువులు. *inferiority* ~ ఆత్మన్యూనతా భావం. *primary* ~ ప్రాథమిక రోగ సంచయం. *superiority* ~ ఆధిక్య భావన
**complexion** ఛాయ, వర్ణం, రంగు, రూపం
**complexity** సంక్లిష్టత
**compliance** అనువర్తనం, అంగీకారం; అమలుచేయడం; చెప్పినట్లు చేయడం, నిబద్ధత
**compliant** అంగీకరించే
**complicacy** క్లిష్టస్థితి
**complicate** జటిల, సంక్లిష్ట; జటిలం చేయు, క్లిష్టపరుచు
**complication** జటిలత, చిక్కు, సంక్లిష్టత; క్లేశం
**complicity** భాగస్వామ్యం
**compliment** n. అభినందన; ప్రియోక్తి
**compliment** v. అభినందించు, మెచ్చుకొను
**complimentary** అభినందనపూర్వక, మెప్పును తెలియజేయునట్టి. ~ *copy* బహూకృత ప్రతి/ ఉచితప్రతి. ~ *distribution* పరిపూరక వ్యాప్తి
**comply** అమలుజరపడం, కట్టుబడడం, అనుగుణంగా వ్యవహరించడం; అంగీకరించు
**complying** పాటించే, నిర్వర్తించే
**component** అంగం, అంశం, భాగం, అనుఘటకం, సంఘటనాంశం; భాగస్వామ్యపక్షం
**comport** వర్తించు; సరిపడు
**comportment** నడత
**compose** కూర్చు, అక్షరాలను పేర్చు, రచించు, పరిష్కరించు, శాంతపరచు, స్వరబద్ధం చేయు
**composed** శాంతించిన, నెమ్మదిపడిన; రచిత
**composer** స్వరకర్త, రచయిత, కూర్పరి
**composing** రచన, కూర్పు



**composite** అవిభక్త, మిశ్రమ, ఉమ్మడి. ~ *numbers* సంయుక్తసంఖ్యలు
**composition** సంరచన, సంవిధానం
**compost** పచ్చిఎరువు
**composure** నెమ్మది, చిత్తశాంతి, స్థిమితత్వం
**compound** మిశ్రమం చేయు; కూర్చు; రాజీ చేయు; రాజీపడు; సమాసం, పదాల కలయిక, సమ్మేళనం, సంయోగ పదార్థం, గృహావరణం. *chemical* ~ రసాయన సమ్మేళనం. ~ *eyes* సంయుక్త నేత్రాలు. ~ *interest* చక్రవడ్డీ. ~ *microscope* సంయుక్త సూక్ష్మదర్శిని. ~ *pendulum* గురులోలకం. ~ *sentence* మహా వాక్యం. ~ *structure* సంయుక్త నిర్మాణం. ~ *verb* సంయుక్తక్రియ
**compoundable offence** రాజీకి వీలున్న నేరం
**compounding fees** అపరాధ రుసుము, జరిమానా
**compradore** దళారీ; విదేశీ వ్యాపార సంస్థ ప్రతినిధి
**comprehend** గ్రహించు, ఇముడ్చుకొను
**comprehensible** గ్రాహ్యమైన
**comprehension** గ్రహణశక్తి; ఇముడ్చుకొనే శక్తి; గ్రహించడం; గ్రహింపు
**comprehensive** సమగ్ర, సంపూర్ణ, విపుల, విస్తృత
**comprehensively** సాకల్యంగా, సమగ్రంగా
**compress** కుంచించు, సంగ్రహించు, అణచు, సంక్షిప్తీకరించు. ~ *cold* శైత్యోపచారం. ~ *hot* ఉష్ణోపచారం
**compression** సంపీడనం
**compressor** సంపీడకం
**comprise** ఇముడ్చుకొను; చేర్చుకొను
**comprising** కలిగిఉన్న
**compromise** రాజీచేయు, ఒప్పందం/ సంధి కుదుర్చు; రాజీ, ఒప్పందం, సంధి
**compulsion** నిర్బంధం, అనివార్యం, తప్పని; నిశ్చయం, ఒత్తిడి, బలాత్కారం
**compulsory** తప్పనిసరిగా, అనివార్యంగా, ఆవశ్యకంగా, నిర్బంధంగా, తప్పకుండా. ~ *acquisition* నిర్బంధ సేకరణ. ~ *amalgamation* నిర్బంధ సమ్మేళనం. ~ *loan* నిర్బంధ రుణం. ~ *services* నిర్బంధ సేవలు. ~ *retirement* నిర్బంధ పదవీ విరమణ
**compunction** పరితాపం, పశ్చాత్తాపం; పరితపించు, పశ్చాత్తాపపడు
**compurgation** నిర్దోషిగా నిర్ణయించడం
**compurgator** నిర్దోషిత్వ ధ్రువీకర్త
**computation** లెక్కించడం, గణన; పరికలనం
**computer** కంప్యూటర్. ~ *graphics* కంప్యూటర్ నిర్మించే ఊహాచిత్రాలు. ~ *literacy* కంప్యూటర్ పరిజ్ఞానం
**computerization** కంప్యూటరీకరణ
**computerize** కంప్యూటరీకరించు
**comrade** సహచరుడు, స్నేహితుడు, కమ్యూనిస్టు (పార్టీ సభ్యుడు)
**con** వాదన, వైఖరి, వాది, వల్లించు; కంఠస్థంచేయు
**conartist** అబద్ధాల కోరు, నమ్మకద్రోహి
**conation** సంకల్పశక్తి
**concatenate** లంకె, కలుపు/ వేయు
**concave** పుటాకార. ~ *lens* పుటాకార కటకం. ~ *mirror* పుటాకార దర్పణం
**concavity** పుటాకార ప్రదేశం
**conceal** దాగు, దాచు, రహస్యంగా ఉంచు
**concealed** గుప్త
**concealment** మాటు, గోపనం, దాపరికం; రహస్య ప్రదేశం, దాచిపెట్టడం

**concede** ఒప్పుకోవడం, సమ్మతించడం, అంగీకరించడం
**conceit** స్వాతిశయం, అహంభావం; ఊహ; గర్వం, తలంపు
**conceited** గర్వంకల
**conceivable** గర్వించదగిన, ఊహించదగిన, సంభవనీయ
**conceive** భావించు, అనుకొను; గర్భం ధరించు
**conceiving** గర్భంతో ఉండడం
**concentrate** కేంద్రీకరించు, ఒకచోటికి చేర్చు, సాంద్రీకరించు
**concentration** కేంద్రీకరణం, ఏకాగ్రత, సాంద్రీకరణం, గాఢత. ~ *camps* నిర్బంధ శిబిరాలు
**concentrative** కేంద్రీకరింపచేసే, సారం తీసే
**concentric** ఏక కేంద్రక. ~ *circle* ఏక కేంద్రకవృత్తం. ~*ring* ఏకకేంద్ర వలయం
**conception** గర్భధారణ; ఊహ, భావం
**conceptual colour** సంభావిత వర్ణం
**conceptualisation** భావగ్రహణం
**conceptualism** సంకేతవాదం
**concern** n. సంబంధం, ఆందోళన
**concern** v. ప్రభావితం చేయు, పట్టించుకొను
**concerning** సంబంధించిన, నిమిత్తమైన
**concert** సంగీత కచేరీ, ఏకీభావం, యుక్తి పన్ను, కూడి ఆలోచించు
**concession** రాయితీ, ముదరా, తగ్గింపు, ప్రత్యేక సదుపాయం; హక్కులు ఇవ్వడం
**conch** శంఖం
**conchoidal** శంఖాకార
**conchology** శంఖాధ్యయన(శాస్త్రం)
**conciliate** సమాధానపరచు, రాజీచేయు, పొందికచేయు
**conciliation** రాజీ, ఒప్పందం
**conciliator** మధ్యవర్తి, రాజీకుదిర్చే వ్యక్తి
**conciliatory** రాజీధోరణి గల; స్నేహపూర్వక
**concise** టూకీ, సంక్షిప్త, సంగ్రహ
**concision** సంక్షిప్తత, దృఢత్వం
**conclave** రహస్యసభ/ సమావేశం/ సమాలోచన
**conclude** ముగించు, ముగియు; నిశ్చయించుకొను; ఏర్పరచు
**concluding** కడపటి, సమాపక. ~ *remarks* ముగింపు, తుదిపలుకులు
**conclusion** ముగింపు, పర్యవసానం; నిర్ధారణ
**conclusive** నిశ్చయాత్మక
**concoct** కల్పించు, కట్టుకథలు చెప్పు
**concoction** కల్పన; కుట్ర
**concomitant** సహగామి, ఏకకాలిక
**concord** అన్వయం, అనుస్వరత
**concordance** సామరస్యం; పదప్రయోగ పట్టిక/ కోశం
**concordant** అనుసరించి ఉండే, సుసంగత
**concourse** సమూహం, గుంపు, కలయిక, గుమికూడడం
**concrete** వాస్తవిక, నిర్దిష్ట, యథార్థ
**concretion** ఘనీభవనం, సంగ్రథనం, కలయిక
**concretise** గట్టిపరచు, బలపరచు
**concubine** ఉంపుడుగత్తె
**concupiscence** మోహం, ఉద్రిక్తత
**concur** ఏకీభవించు
**concurrence** ఏకీభావం
**concurrent** సమకాలీన, ఏకకాలిక. ~ *list* రాజ్యాంగంలో ఉమ్మడిజాబితా
**concussion** తీవ్రస్పందన, దిగులు, ఘాతపరిమాణం, మెదడు అదరడం



**condemn** ఖండించు, తోసిపుచ్చు, శిక్ష విధించు, దండించు
**condemnation** నిరసన, దూషణ; శిక్ష విధించడం
**condensation** కుదించడం, సంక్షేపణం, సాంద్రీకరణం
**condense** కుదించు, గట్టిపరచు, కేంద్రీకరింపచేయు
**condensed milk** డబ్బాపాలు, సాంద్రీకృత క్షీరం
**condenser** కండెన్సర్, ద్రవీకరణకారి
**condescended** దిగజారు, దిగివచ్చు; నమ్రతచూపు
**condescending** నమ్రతగల, అనుగ్రహించే, ఆదరించే
**condign** చాలిన, సముచిత, తగిన
**condiment** మసాలా
**condition** (పరి) స్థితి, దశ, అవస్థ, షరతు
**conditional** నియత, నియమబద్ధ, షరతులతో కూడిన. ~ *bail* షరతులతో కూడిన జామీను. ~ *contract* షరతులతో కూడిన కాంట్రాక్టు. ~ *support* షరతులతో కూడిన మద్దతు
**conditioning** ఆశ్రయణం, స్థితివ్యాజం
**condole** పరామర్శించడం, ఓదార్చు
**condolence** పరామర్శ, సానుభూతి, సంతాపం. ~ *resolution* సంతాప తీర్మానం
**condom** గర్భనిరోధక సాధనం, రబ్బరు తొడుగు
**condominium** ఉమ్మడిరాజ్యం, ఉమ్మడి పరిపాలన
**condonation** క్షమాభిక్ష, మాఫీ
**condone** మాఫీచేయు, మన్నించు, వదిలిపెట్టు, క్షమించు
**condor** సాళువ డేగ
**conduce** కారణమగు, సాధనమగు
**conducive** సహాయకారి, కారణమైన, సాధనమైన
**conduct** n. ప్రవర్తన, నిర్వహణ, దారి చూపడం, మార్గదర్శనం, నడిపించు, నిర్వహించు, వర్తించు
**conductance** వాహకత
**conduction** ప్రసరణ
**conductivity** వాహకత, చలనం
**conductometer** వాహక మాపకం
**conductor** నిర్వాహకుడు; కండక్టర్; వాహకం. ~ *current* విద్యుద్వాహనం. ~ *of electricity* విద్యుద్వాహకత్వం. ~ *of heat* ఉష్ణవాహకత్వం
**conduit** పై తొడుగు, కాలువ, మార్గం; (రాజకీయాల్లో) మధ్యవర్తి; చిన్న సొరంగం, గొట్టం, కాలువ, మార్గం
**cone** కూచి, కోణం, శంకువు
**confabulate** మాట్లాడుకోవడం
**confabulation** చర్చ
**confection** మిఠాయి, తినుబండారం
**confectioner** మిఠాయిలు/ తినుబండారాలు అమ్మే వ్యక్తి
**confectionery** మిఠాయి (దుకాణం)
**confederate** సహాయకుడు, కూటమిలో చేరినవారు; కూటమిగా చేర్చు
**confederacy** (రాజ్యాల) కూటమి, సమితి, సదస్సు, సమ్మేళనం
**confederation** (రాజ్యాల) కూటమి/ సమాఖ్య
**confer** చర్చించు; అభిప్రాయాలు కలబోసుకొను, సంభాషించు, ఇచ్చు
**conferee** స్వీకర్త, గ్రహీత
**conference** సదస్సు, సమాలోచన, గోష్ఠి, సభ (వార్షిక) సమావేశం
**confession** నేరాన్ని అంగీకరించడం

**confessional poetry** పశ్చాత్తాప కవిత్వం
**confidant** ఆంతరంగికుడు
**confidante** ఆంతరంగికురాలు
**confide** నమ్మకం ఉంచు (రహస్యం) చెప్పు
**confidence** నమ్మకం, విశ్వాసం, నిబ్బరం; నమ్మకం; ధైర్యం. ~ *motion* విశ్వాస తీర్మానం
**confidential** ఆంతరంగిక, గోప్య, రహస్య, మరొకరికి తెలియగూడని, నమ్మదగిన. ~ *communication* రహస్య వర్తమానం. ~ *report* రహస్య నివేదిక
**confidently** నిబ్బరంగా, నమ్మకంగా, ఆత్మవిశ్వాసంతో
**configuration** విన్యాసం, సంస్థితి, ఆకృతి
**confine** కట్టుబడిఉండు, ప్రసవించు, నిరోధించు, పరిమితమవు
**confinement** ప్రసవం; నిర్బంధం, నిర్బంధంలో ఉంచడం, శిక్ష. *solitary* ~ ఏకాంతవాస శిక్ష
**confirm** స్థిరపరచు, రూఢిపరచు, ధ్రువీకరించు
**confirmation** నిర్ధారణ, ధ్రువీకరణ
**confirmed** ఖాయం/ రూఢి అయిన, ధ్రువపడిన/ పరిచిన
**confiscable** జప్తు చేయదగిన, వశపరచుకోదగిన
**confiscate** జప్తు చేయదగిన, వశపరచుకోదగిన
**confiscate** జప్తుచేయు, లాగుకొను, స్వాధీనం చేసుకొను, కబ్జా చేయు
**confiscation** జప్తు, స్వాధీనత
**conflagration** దహనకాండ, పరశురామ ప్రీతి
**conflict** సంఘర్షణ, వివాదం. ~ *theory* సామాజిక వైరుధ్య సిద్ధాంతం
**confluence** సంగమం, కూడలి, సమూహం
**confluent** కలిసే; ఉపనది
**conform** పోలునట్లు చేయడం, అనుసరింపచేయు, అనుగుణంగా వర్తించు, అనుసరించు
**conformable** పోలిన, అనుసరించి ఉన్న, ఒప్పిన, పొందికగా ఉన్న
**conformist** యథాతథవాది
**conformity** ఒదుగుదల, అనుసరణ
**confound** ఆందోళన కలిగించు, కలతపెట్టు, కలవరపెట్టు, విచ్ఛిన్నం చేయు
**confront** ఎదుర్కొను, ప్రతిఘటించు
**confrontation** ముఖాముఖి నిందారోపణ; ప్రతిఘటన, ఘర్షణ
**confrontationist** ఘర్షణవాద, ప్రతిఘటించే వ్యక్తి
**confuse** కంగారుపెట్టు, చెల్లాచెదరు చేయు
**confusion** గందరగోళం, కలవరపాటు, కంగారు, అస్పష్టత
**confutation** ఖండన, అపరాధ నిరూపణ
**confute** ఖండించు, ఆక్షేపించు, అపరాధం, నిరూపించు, తప్పని నిరూపించు
**congeal** పేరుకొను, పేరబెట్టు, ఘనీభవించు
**congealment** ఘనీభవనం, పేరుకోవడం
**congenial** అనుకూల, తగిన, ఒకే స్వభావం గల, సజాత, సహజ
**congenital** జన్మతః, పుట్టుకతో వచ్చిన, సహజమైన. ~ *abnormality* జన్మసిద్ధ మనోవైకల్యం. ~ *diseases* పుట్టుకతో సంక్రమించే వ్యాధులు
**congest** నిండు, ఒకేచోట కూడుకొను
**congestion** తొడతొక్కిడి, రక్తాధిక్యత; జన సమ్మర్దం, రద్దీ
**congestive heart failure** రక్త ప్రసారం స్తంభించి గుండె ఆగిపోవడం
**congestus** పోగయిన



**conglomerate** సమ్మేళనం, పోలిన
**conglomeration** సమ్మేళనం, ఏకరాశి
**conglutinate** సంయోజనం, అతికింపు
**congrats** అభినందనలు
**congratulate** అభినందించు
**congratulation** అభినందన
**congregant** సమూహంలోని వ్యక్తి
**congregate** గుంపుకట్టు, గుమికూడు, సమావేశమగు; సమూహం
**congress** కాంగ్రెస్‌పార్టీ, మహాసభ, (అమెరికా) శాసనసభ
**congruenc** అమరిక, ఒప్పుదల, పొందిక, అనుగుణత్వం
**congruous** అనుగుణమైన; సంబద్ధ, పొందికైన, అమరిన
**conical** శృంగాకార, శంక్వాకార
**conidium** సూక్ష్మసిద్ధ బీజాశయం
**conifer** శృంగాకార వృక్షం
**coniferous** శృంగార వృక్షాలున్న
**conium** విషం, విషపు మొక్క
**conjecture** n. ఊహ, అభిప్రాయం, భావన, ఉజ్జాయింపు; ఊహించు, అనుకొను
**conjoined** సంయోజిత
**conjoint** అంటుకొన్న, కలిసి ఉన్న
**conjugal** దాంపత్యానికి సంబంధించిన, సాంసారిక. ~ *bliss* వైవాహికానందం. ~ *rights* వైవాహిక హక్కులు, దాంపత్య హక్కులు
**conjugally** సంసారరీతిగా
**conjugate** సంయోజకం, వినిమయం; బంధించిన, కలిపిన; క్రియారూపాలు చెప్పు; జంటకూర్చు
**conjugation** సంయుగ్మం, సంయోజన క్రియ
**conjunction** సముచ్చయం, కలయిక, సంయోగం, ఉమ్మడి
**conjunctiva** కనురెప్ప, కనుగుడ్లను కలిపే పొర
**conjunctive** కలిపే, సంశ్లిష్ట
**conjuncture** కలయిక, కూడిక; సందిగ్ధ సమయం
**conjuration** మనఃపూర్వక ప్రార్థన; అభిమంత్రణం
**conjure** గారడీచేయు, ఆనపెట్టి పిలుచు, ప్రార్థించు
**conjurer** మంత్రగాడు, గారడీవాడు
**conman** ఆస్తిని/ డబ్బును కాజేసే వ్యక్తి, మోస గాడు
**connate** ఏకకాలంలో పుట్టిన, జన్మతో వచ్చిన
**connatural** నైసర్గికమైన, ప్రకృతి సంబంధమైన
**connection** లంకె, చేరిక, కలయిక, సంబంధం; బాంధవ్యం, బంధువు, సందర్భం
**conniption** మూర్ఛ, అపస్మారం
**connivance** సమ్మతి, ఉపేక్ష, అర్ధాంగీకారం
**connive** తప్పుడుపని ప్రోత్సహించు, కుట్ర చేయు, చూసీచూడనట్లుండు
**connoisseur** పారీణుడు, సహృదయుడు, రసికుడు. ~ *ship* సహృదయత, రసికత
**connotation** సహజార్థం, గుణనిర్దేశం
**conquer** సాధించు, ఆక్రమించు, జయించు, గెలుచు
**conqueror** విజేత, జయించినవాడు
**conquest** విజయం
**consanguinary** సగోత్ర
**consanguineous** రక్తసంబంధం గల; సగోత్ర

**consanguinity** రక్తసంబంధం, వావి; సగోత్రత
**conscience** అంతరాత్మ, మనస్సాక్షి, ఆత్మ ప్రబోధం. ~ *money* ఎగ్గొట్టిన పన్ను/ డబ్బు పాపభీతితో చెల్లించడం. ~ *morality* చేతనాత్మకనీతి. ~ *state* మానసిక స్థితి
**conscientious** న్యాయబుద్ధిగల, పాపభీతి గల, మనస్సాక్షికి లోబడిన
**conscious** స్పృహలోఉన్న, జాగ్రత్తగా ఉన్న, చేతన
**consciousness** స్పృహ, చైతన్యం
**conscribe** నిర్బంధంగా సైన్యంలో చేర్చు
**conscript(ee)** నిర్బంధ సైనికుడు; నిర్బంధంగా సైన్యంలో చేర్చుకోవడం
**conscription** నిర్బంధ సైనిక శిక్షణ
**consecrate** పవిత్రం చేయు, సమర్పించు, నివేదించు, శుద్ధిచేయు
**consecration** పవిత్రం చేయడం, ముడుపు కట్టడం, శుద్ధి
**consecution** హేతుపరంపర
**consensus** అంగీకారం, ఏకాభిప్రాయం
**consent** సమ్మతించు, అంగీకరించు
**consentaneours** తగిన, ఏకోన్ముఖమైన
**consentience** ఒప్పందం, ఏకాభిప్రాయం
**consent** సమ్మతి, అంగీకారం
**consequence** ఫలితం, ఫలం, పర్యవసానం, పరిణామం, పెద్దరికం, గౌరవం
**consequential** పర్యవసానంగా ఏర్పడిన, పరిణామాల ఫలితంగా తలెత్తిన. ~ *damages* అనుషంగిక నష్టపరిహారం
**consequently** పర్యవసానంగా
**conservation** సంరక్షణ, అక్షయత, నిలవచేయు, దాచిపెట్టు, అంతరించకుండా రక్షించు, వృథా పోకుండా చూడు, నష్టం జరగకుండా చూడు. ~ *of forest* అటవీరక్షణ. ~ *of water* నీరు నిల్వ చేయటం
**conservatism** సంరక్షకవాదం, సంప్రదాయ (పరిరక్షణ) వాదం
**conservatist** పర్యావరణ సంరక్షకుడు/ పరిరక్షణ వాది
**conservative** సంప్రదాయవాది, యథాతథవాది
**conservator** పరిరక్షకుడు
**consider** పరిశీలించు, ఆలోచించు
**consideration** పరిగణన, పరిశీలన, పరిహారం; బహుమతి, ప్రతిఫలం
**consign** పంపు, రవాణాచేయు, స్వాధీనపరచు
**consignee** వస్తుగ్రహీత
**consignment** ఒప్పగింత, (రవాణా) ఒప్పందం, పంపించే వస్తువులు/ సామగ్రి. ~ *note* పంపించే వస్తువుల జాబితా/ వివరాలు. ~ *tax* సరుకు రవాణా పన్ను.
**consignor** సరుకు పంపిన వ్యక్తి
**consist** కలిగి/ కూడిఉండు, తగి ఉండు
**consistency** సంగతత్వం, క్రమబద్ధత, చిక్కదనం, అనుగుణత, నిలకడ
**consistent with** నియమానుసారం, తగినట్టు
**consistent** అనుగుణమైన, అవిరుద్ధమైన
**consistometer** గాఢతామాపకం
**consolation** ఊరడింపు, ఓదార్పు
**console** ఓదార్చు, ఊరడించు, ఏకీకృత రుణపత్రాలు
**consolidate** బలపరచుకొను, గట్టిపరుచుకొను, పట్టుసాధించు, పదిలపరచుకొను, పటిష్ఠంచేసుకొను, ఏకమగు
**consolidated fund** సంచితనిధి; ఏకీకృత నిధి. ~ *annual accounts* ఏకీకృత వార్షిక ఖాతాలు



**consolidation** ఏకంచేయడం. ~ *of holdings* భూ కమతాలను సంఘటిత పరచడం
**consols** ప్రభుత్వ రుణపత్రాలు
**consonance** రెండు స్వరాల మేళనం, హలనుప్రాస, అనుకూల్యం, అనురూపత
**consonant** హల్లు, వ్యంజనం
**consort** భార్య, భర్త; సహవాసం చేయు, సహచరించు
**consortium** సహవ్యవస్థ, ద్రవ్య, వాణిజ్య సంస్థల కలయిక; సహాయతా సంఘం
**conspectus** స్థూలాభిప్రాయం, సారాంశం
**conspicuous** స్పష్టమయిన, కనబడే, గణించదగిన, గుర్తించదగిన, బహిరంగమైన, ప్రస్ఫుట
**conspicuousness** సుస్పష్టత
**conspiracy** కుట్ర, గూడుపుఠాణీ
**conspirator** కుట్రదారు
**conspire** కుట్రచేయు
**constabulary** రక్షకభటవర్గం
**constancy** స్థిర, నిశ్చలత, సహిష్ణుత
**constant** స్థిరాంకం, స్థిరరాశి, నిరంతర, అవిచ్ఛిన్న, మారని. ~ *of integration* సమాకలన స్థిరాంకం. ~ *of proportion* స్థిరానుపాతం. *universal* ~ సార్వత్రిక స్థిరాంకం
**constellate** గుంపుగా చేర్చు
**constellation** నక్షత్రరాశి; నక్షత్రమండలం
**constellations** నక్షత్రరాసులు
**consternation** దిగ్భ్రమ, దిగ్భ్రాంతి, స్తంభన, ప్రాణభీతి
**constipation** మలబద్ధకం
**constituency** నియోజకవర్గం
**constituent** అవయవం, ఓటరు, నియోజకుడు; భాగం. ~ *assembly* రాజ్యాంగ సభ/ పరిషత్తు
**constitute** ఏర్పాటుచేయు; నియోగించు, స్థాపించు
**constitution** రాజ్యాంగం; నియామకం; శారీరక/ మానసిక ప్రకృతి
**constitutional** రాజ్యాంగ బద్ధమైన/ పరమైన. ~ *head* రాజ్యాంగాధినేత. ~ *impasse* రాజ్యాంగప్రతిష్టంభన. ~ *government* రాజ్యాంగ బద్ధ ప్రభుత్వం. ~ *law* రాజ్యాంగ న్యాయశాస్త్రం. ~ *remedy* రాజ్యాంగ పరిహారం. ~ *validity* రాజ్యాంగబద్ధత, రాజ్యాంగపరమైన చెల్లుబాటు
**constitutionalism** రాజ్యాంగ బద్ధత, రాజ్యాంగబద్ధతా వాదం
**constitutionalist** రాజ్యాంగ నిపుణుడు/ వాది
**constitutionality** రాజ్యాంగబద్ధత
**constrain** నిరోధించు, లొంగదీయు, చెరబెట్టు
**constraint** సమస్య; పరిమితి, నిరోధం, నిర్బంధం, సంయమనం
**constrict** అణగ్గొట్టు, నొక్కు
**constrictor** కొండచిలువ
**constringe** నొక్కు, అదుము
**construct** నిర్మించు, కట్టు, కూర్చు; చిత్రించు
**construction way** తాత్కాలిక మార్గం
**construction** రచన, నిర్మాణం, కట్టడం. ~ *industry* నిర్మాణపరిశ్రమ
**constructive** క్రియాత్మక, నిర్మాణాత్మక
**constructivism** నిర్మాణ కళావాదం
**constructor** నిర్మాత
**construe** అన్వయించు, భాష్యంచెప్పు, వ్యాఖ్యానించు, విశ్లేషించు
**consubstantiate** ఐక్యంచేయు, ఐక్యమగు
**consul** రాజదూత, దౌత్యప్రతినిధి

**consulate** కాన్సులేట్, దౌత్యకార్యాలయం
**consultancy** సలహాసంస్థ, సంప్రదింపు సంస్థ
**consultant** సలహాదారు, సలహా ఇచ్చే నిపుణుడు
**consultation** సంప్రదింపు, సమాలోచన
**consume** అనుభవించు, వినియోగించు, వ్యయంచేయు
**consumer** వినియోగదారు. ~ *credit* వినియోగదారుల రుణాలు. ~ *disposables* ఎక్కువకాలం ఉపయోగించలేని వస్తువులు (ఆహార పదార్థాలు, పానీయాలు, దినపత్రికల వంటివి). ~ *durables* దీర్ఘ కాలం మన్నే వినియోగ వస్తువులు (ఫ్రిజ్, టీవీ వంటివి). ~ *forum* వినియోగదారుల ఫోరం/ న్యాయసభ. ~ *goods* వినియోగ వస్తువులు. ~ *price index* వినియోగ వస్తువు ధరల సూచి
**consumerism** వినిమయతత్త్వం
**consumerist** వినియోగదారుల హక్కుల పరిరక్షకుడు
**consummate** పూర్తిచేయు, నిర్వహించు, సంపూర్ణం గావించు, అత్యంత నైపుణ్యం/ నిపుణుడు, దాంపత్యసిద్ధి, తుది, చరమ, సంపూర్ణ
**consummation** శోభనం, పరిపూర్ణత, లక్ష్యప్రాప్తి
**consumption** క్షయ; వినియోగం, వాడకం. ~ *goods* వినియోగ వస్తువులు. ~ *loan* నిత్యావసరాలకు ఆర్థిక సహాయం. ~ *sectors* వినియోక్తల వర్గాలు
**consumptive** క్షయరోగంతో బాధపడే; హరించే
**contact** స్పర్శ, సంబంధం, సాన్నిహిత్యం. ~ *agent* స్పర్శకారకం. ~ *angle* స్పర్శకోణం
**contact** v. కలుసుకొను, సంప్రదించు
**contagion** అంటు, సంక్రమణ
**contagious** సాంసర్గిక, సాంక్రామిక, సోకే
**contain** అదుపులో ఉంచు, నిలవరించు
**container** డబ్బా, పెట్టె; భారీ వాహనం
**containment** నిలుపుదల, నిలవరించడం, అదుపుచేసే చర్య/ పథకం. ~ *policy* అణచివేత విధానం
**contaminant** మాలిన్యం కలగజేసే, మలినకారక
**contaminate** మలినపరచు, కలుషితం చేయు
**contaminated** కలుషిత, విషపూరితమైన. ~ *food* కలుషితాహారం
**contamination** అశుచి, అపవిత్రత, కాలుష్యం
**contemn** చులకనచేయు, నీచంగా చూచు
**contemnor** చులకనచేసే వ్యక్తి, తృణీకర్త
**contemplate** ధ్యానించు, చింతించు, తలచు, యోచించు, ఆలోచించు, తలపెట్టు, ఉద్దేశించు
**contemplation** ఆలోచన, ధ్యానం, యోచన, తలంపు
**contemplative** ఆలోచనాత్మక
**contemporary** సమకాలీన, సమకాలిక, వర్తమాన; సమకాలికుడు, సమ వయస్కుడు; సమకాలీన పత్రిక
**contempt** ధిక్కారం, తిరస్కారం, అవమానం; చులకన. ~ *of court* కోర్టు ధిక్కార (నేరం). ~ *of legislature* శాసనసభాధిక్కారం, సభా హక్కుల ఉల్లంఘన నేరం
**contemptible** నీచమైన, చులకన చేయదగిన
**contemptuous** తృణీకరించే, చులకన చేసే, తిరస్కరించే



**contemptuously** చులకనభావంతో
**contend** నొక్కిచెప్పు, స్పష్టంచేయు, దృఢంగాచెప్పు, నొక్కి వక్కాణించు, వాదించు, పోరాడు
**contender** పోటీదారు
**content** తృప్తి, తుష్టి, వస్తువు, సారం: తృప్తి చెందిన; సంతోషపెట్టు. ~ *analysis* వస్తువిశ్లేషణ
**contentedness** తృప్తి
**contention** ప్రతిస్పర్ధ, వాదన, జగడం, వివాదం, వ్యాజ్యం, పోటీ
**contentious** వివాదాస్పద, కలహకార
**contentment** సంతుష్ట, సంతోషం
**contenture** నేత, అల్లిక; కట్టడం
**contest** n. పోటీ, వాదన, వివాదం
**contest** v. పోటీచేయు, వివాదం లేవనెత్తు
**contestable** సవాలుచేయదగిన, వాదింపదగిన
**context** సందర్భం. ~ *of situation* ప్రయోగసందర్భం
**contiguity** అంటి ఉండడం, అవ్యవహితత్వం
**contiguous** ఆనుకొని ఉన్న, సన్నిహిత, పొరుగున ఉన్న
**continent** ఖండం; ఇంద్రియ నిగ్రహం గల, మితమైన
**continental** భూఖండ సంబంధమైన. ~ *crust* ఖండభూపటలం. ~ *drift* ఖండ చలనం. ~ *shelf* తర్భాగం. ~ *slope* తీరపువాలు
**contingency** అనిశ్చితమైన, యాదృచ్ఛికమైన, ఊహించని, ఊహించకుండా జరిగే, తక్షణ. ~ *fund* ఆగంతుక నిధి, అత్యవసర నిధి
**contingent debt** ఆగంతుక రుణం
**contingent plan** ఆగంతుక పథకం. ~ *event* యాదృచ్ఛిక సంఘటన
**continuosly** ఎడతెగకుండా
**continual** తెంపులేని, సంతత
**continually** ఎడతెగకుండా
**continuance** అవిచ్ఛిన్నత
**continuation** నిరంతరత
**continuous** సంతత, నిరంతర, తెంపులేని, ఎడతెగని
**continuum** అవిచ్ఛిన్నత, అఖండ ద్రవ్యం, అవిభక్తత
**contort** వంకర తిరుగు, కొంకరపోవు
**contortion** వక్రత, వంకర
**contortionist** వ్యాయామశీలి, వంకర్లు తిరిగే వ్యక్తి
**contour** మానసికానుభూతి హద్దు, సమోన్నత రేఖ
**contour** నిమ్నోన్నత రేఖ, ఆకృతి
**contra** ప్రతికూలమైన
**contra adjustment accounts** సర్దుబాటు ఎదురు ఖాతాలు
**contraband** నిషిద్ధ, అక్రమ, దొంగతనంగా దిగుమతి చేసిన. ~ *goods* నిషిద్ధమైన సరుకులు
**contracept** గర్భాన్ని నిరోధించు
**contraceptive** సంతాన/ గర్భనిరోధక(ం)
**contract** ఒడంబడిక, ఒప్పందం; గుత్త. ~ *labour* గుత్త కార్మికులు; ప్రత్యేకమైన పనికి, నియత కాలానికి నియమితులైన కార్మికులు. ~ *of employment* ఉద్యోగ ఒప్పందం
**contractor** కాంట్రాక్టర్, గుత్తేదారు
**contraction** ముడుచుకోవడం, సంకోచం
**contractual liability** ఒప్పందం ప్రకారం నిర్వహించవలసిన బాధ్యత
**contradict** ఖండించు, నిరాకరించు, వ్యతిరేకించు

**contradiction** ఖండన, విరుద్ధ వాదన, నిరాకరణ, వైరుధ్యం
**contradiction** వైరుధ్యం
**contradistintion** వైపరీత్యం, విపర్యాసం
**contrary** విరుద్ధ, ప్రతికూల, వ్యతిరేకి. ~ *to law* శాసన విరుద్ధమైన
**contrast** n. భేదం, తేడా, వ్యత్యాసం
**contrast** v. పోల్చిచూచు, తారతమ్యాన్ని విచారించు, అతిక్రమించు, వ్యత్యాసం చూపు
**contravariant** ప్రతిచరరాశి
**contravene** ఉల్లంఘించు, ఎదిరించు, అతిక్రమించు, వ్యతిరేకించు
**contravention** వ్యతిరేకం, నిరోధం, ఉల్లంఘన, అతిక్రమణ
**contraversial** వివాదాస్పద
**contravert** విరుద్ధవాదనచేయు, నిరాక రించు
**contribute** విరాళమిచ్చు, చందా ఇచ్చు, సహాయంచేయు, పాల్గొను, తోడ్పడు, రచించు
**contribution** విరాళం, సహాయం, తోడ్పాటు, రచన, సేవ
**contributor** సహాయకారి
**contributory** సహాయక
**contrition** పశ్చాత్తాపం
**contrivance** సాధనం, యుక్తి, తంత్రం; కల్పన, ఉపాయం, వల
**contrive** యుక్తి పన్ను, కొత్తగా కల్పించు, వలపన్ను
**contriver** ఉపాయశాలి
**contriving** పరికల్పన
**control** n. అధికారం, అదుపు, నియం త్రణ. ~ *accounts* కంట్రోలు ఖాతాలు
**control** v. నియంత్రించు, అణచు, నిర్వ హించు, నిర్దేశించు
**controller** నియంత, అధికారి
**controlling interest** నియంత్రణాసక్తి
**controversialist** వైతండికుడు
**controversy** వివాదం
**controvertible** సవాలు చేయదగిన, వివా దాస్పదమైనది
**contuse** నలగగొట్టు, కమిలిపోయేటట్లు కొట్టు
**contusion** బొప్పి, కముకు దెబ్బ
**conundrum** క్లిష్ట సమస్య, శ్లేష ప్రశ్న
**convalescence** కోలుకోవడం, క్రమస్వస్థత
**convalescent** స్వస్థత చెందుతున్న
**convection** సంవహనం: ఉష్ణప్రసరణ
**convene** సమావేశపరచు, హాజరుపరచు, ఏర్పాటుచేయు
**convener** సమావేశకర్త, సంయోజకుడు
**convenience** వెసులుబాటు, అనుకూలత, లాభం, అవకాశం, వసతి, సదుపాయం
**convenient** అనుకూల, సులభ
**conveniently** అనుకూలంగా, వీలుగా
**convention** మర్యాద, పద్ధతి, సంప్ర దాయం, ఆచారం, అలవాటు, అంతర్జా తీయ ఒప్పందం, లోక మర్యాద, సదస్సు, సభ, సమావేశం
**conventional** ప్రాచీన, సాంప్రదాయిక. ~ *education* సంప్రదాయవిద్య
**converge** గుమికూడు
**convergence** కలయిక, అభిసరణ
**convergent** అభిసారి. ~ *beam* అభిసారి కిరణపుంజం. ~ *lens* అభిసారికటకం. ~ *system* అభిసారి వ్యవస్థ
**conversable** సరస సంభాషణ చేయగల, కలుపుగోలుతనం గల
**conversance** చనువు, పరిచయం
**conversant** పరిచయం గల, తెలిసిన, అభిజ్ఞ



**conversation** సంభాషణ
**converse** n. సంభాషణ; తలకిందులయిన
**converse** v. సంభాషించు, ముచ్చట్లాడు
**conversion** మార్పు, కొత్త సిద్ధాంతాన్ని అవలంబించడం (మత) మార్పిడి
**convert** (మతం) మారిన వ్యక్తి, (మతం) మార్చు
**convertibility** పరివర్తనీయత
**convertible** మార్చదగిన, పరివర్తనీయ. ~ *currency* మారకం చేయగల కరెన్సీ. ~ *debentures* వాటాలుగా మార్చదగిన రుణపత్రాలు. ~ *securities* మార్చదగిన సెక్యూరిటీ పత్రాలు
**convex** కుంభాకార, ఉబికిన, ఉబ్బెత్తుగా ఉన్న. ~ *lens* కుంభాకార కటకం. ~ *mirror* కుంభాకార దర్పణం
**convey** పంపించు, తెలియజేయు, ప్రస రింపజేయు
**conveyance** ఆస్తిమార్పు, అన్యాక్రాంత పత్రం, దస్తావేజు, వాహనం, సవారీ
**conveyancer** దస్తావేజులు రాసే వ్యక్తి
**conveyancing** హక్కుల బదలాయింపు
**convict** అపరాధి, దోషి: ఖైదీ, శిక్షితుడు, నేరం నిర్ధరించు, నేరగాడని తీర్పు చెప్పు
**conviction** దోష నిర్ధారణ, దృఢ విశ్వాసం, శిక్ష, నమ్మకం
**convince** నమ్మించు, ఒప్పించు, నచ్చజెప్పు
**convivial** ఉల్లాసంగల, సరదాగల
**convocation** స్నాతకోత్సవం. ~ *adress* స్నాతకోపన్యాసం
**convoke** సమావేశపరచు
**convolution** మడత, చుట్టుకోవడం, మెలి (తిరగడం)
**convoy** రక్షక పరివారం, సహప్రయాణం చేస్తున్న వాహనాలు; వాహనశ్రేణి; పంపించు, తీసుకొనిపోవు
**convulsion** కంపం; విరగబడి నవ్వడం; మూర్ఛరోగం; శరీరంలో వణుకు, విక్షోభం
**convulsively** గిజగిజలాడుతూ
**co-occur** ఏకకాలంలో సంభవించే
**cook** వంట మనిషి; వంట చేయు
**cookery** వంట, పాక(విధానం)
**cool** చల్లని, నెమ్మదైన; చల్లార్చు, శాంతింప జేయు; చల్లారు. ~ *breeze* చల్లతెమ్మెర. ~ *headed* ప్రశాంతమైన
**coolant** శీతలకారి
**cooling** శీతలీకరణ. ~ *agent* శీతలీకరణ కారకం
**coon** కపటి
**coop** చెరపట్టు, నిర్బంధించు, కోళ్ళగూడు
**cooperation** సహకారం, మద్దతు, తోడ్పాటు
**cooperative** సహకార. ~ *agricultural lands* సహకార వ్యవసాయ క్షేత్రాలు. ~ *credit society* సహకార పరపతి సంఘం. ~ *dairy farm* సహకార పాడి పరిశ్రమ కేంద్రం. ~ *economy* సహ కార ఆర్థిక విధానం. ~ *farming* సహ కార సేద్యం. ~ *societies* సహకార సంఘాలు
**coopt** చేర్చుకోవడం, సహనియామకం
**cooption** కలుపుకొను, ఆమోదిత స్వీక రణం
**coordinate** సమానమైన, తుల్య, సమన్వ యించు, సహకరించు; నిరూపకం, నిర్దేశాంకం
**coordination** సమన్వయం, సహకారం
**coordinator** సమన్వయకర్త
**coowner** భాగస్వామి, సమష్టి యజమాను లలో ఒకరు. ~ *ship* సమష్టి యాజ మాన్యం
**cop** రక్షక భటుడు; పట్టుకొను

**coparcenary** సమానభాగస్వామ్యం
**coparcener** దాయాది, భాగస్వామి
**copartner** సహభాగస్వామి
**cope** మదురు, పోటీచేయు, ఈదగు, మదురుపెట్టు
**copious** విస్తృత, విశాల
**copper** రాగి, తామ్రం
**coprophagy** వ్యర్థ పదార్థ జీవి
**copse** చిన్న క్రముక్క
**copulation** మైథునం
**copy** n. అనుకరించు, నకలు రాయు, నకలు, అనుకరణ, ప్రతి; సారూప్యత. ~ *book* ఒరవడి పుస్తకం. ~ *right act* రచనాస్వామ్య చట్టం. ~ *right* గ్రంథ స్వామ్యం
**coquet** వగలుపోవు
**coquette** చిన్నెలాడి, వన్నెలాడి
**coral** పగడం, ప్రవాళం. ~ *reef* పగడాల దిబ్బ, ప్రవాళ భిత్తిక
**corbonation** కర్బనీకరణం
**cord** తాడు. *spinal* ~ వెన్నుపాము. *umbilical* ~ బొడ్డుతాడు. *vocal* ~ నాదతంత్రి
**cordage** ఓడ తాళ్ళు
**cordial** సుహృద్భావ/ స్నేహపూర్వకమైన, మంచి, హృదయ పూర్వక, సాదర, హార్దిక
**cordiality** హార్దత, హృదయ పూర్వకత, సాదరత
**cordially** సాదరంగా, హృదయ/ స్నేహ/ పూర్వకంగా
**cordinal points** నాలుగు దిక్కులు
**cordite** పొగరాకుండా పేలే వస్తువు
**cordon** భద్రతా వలయం, రేఖ, పహరా; చుట్టుముట్టు
**core** చేవ, అంతర్భాగం, హృదయం. *business* ~ ప్రధాన వ్యాపారం. ~ *committee* చాలా ముఖ్యమైన కమిటీ/ సభ/ సంఘం/ సమితి. ~ *group meeting* ప్రముఖ వ్యక్తుల సమావేశం. ~ *issue* చాలా ముఖ్యమైన విషయం. ~ *principle* ప్రధానాశయం. ~ *sector* కీలక రంగం
**coriander** కొత్తిమిర. ~ *seeds* ధనియాలు
**cork** బిరడా, బెండు, బిరడావేయు
**corkage** బయటినుంచి తెచ్చుకున్న మద్యంపై వసూలుచేసే రుసుం
**corm** కందం
**cornea** ఊరబెట్టడం, ఆనెకాయ, మొక్కజొన్న. *sweet* ~ మొక్కజొన్న
**corn** శుక్లపటలం
**cornice** చూరు
**corollary** పరిణామం, తీర్మానం, ఉపసిద్ధాంతం, ఫలితం; పర్యవసానం, అవ్యవధానంగా తేల్చే భావం, పరివేషం. ~ *radiata* వికిరణ మండలం
**coronal** మస్తక సంబంధి, కిరీటం, మాల, హారం
**coronary** పరిహృదయ, హృదయానికి సంబంధించి. ~ *artery* ధమని
**coronation** పట్టాభిషేకం
**coroner** దుర్మరణ విచారణాధికారి
**coronet** ముకుటం, కిరీటం, మాల
**coronoid** వంకరైన
**corporal** చిన్న సైనికోద్యోగి; శరీర సంబంధి; పవిత్ర వస్తువుల్ని ఉంచే వస్త్రం
**corporality** సశరీరత
**corporate** సంఘంగా చేరిన, సంస్థగా ఏర్పడిన. ~ *governance* వ్యాపార సంస్థా నిర్వహణం. ~ *morality* వ్యాపార సంస్థాగత నీతి. ~ *sector* కార్పొరేట్ రంగం. ~ *society* వణిక్ సమాజం. ~ *tax* వ్యాపార సంస్థలపై విధించే పన్ను



**corporation** (పురపాలక) సంస్థ, సంఘం, చట్టబద్ధ సంస్థ
**corporeal** శారీరక, సాకారమైన, దైహిక, మూర్త, ప్రస్ఫుట, భౌతిక. ~ *property* భౌతిక సంపద
**corps** పటాలం, సైనికదళం
**corpse** మృతదేహం
**corpulence** బలుపు
**corpulent** స్థూల, బలిసిన
**corpus** రచనా సామగ్రి. ~ *fund* మూల నిధి
**corpuscle** కణం
**corpuscular** కణసంబంధి. ~ *theory* కణసిద్ధాంతం
**corral** పశువుల దొడ్డి
**correct** సరియైన, తప్పులులేని, సవరించు, దిద్దు, బుద్ధిచెప్పు
**correction** దిద్దుబాటు, సవరణ, విశోధనం
**corrective** సంస్కరించే, బాగుపరిచే. ~ *measures* సరిదిద్దే చర్యలు. ~ *punishment* సంస్కరించే శిక్ష
**correctness** తప్పులులేని, సరయిన
**correlate** సహ సంబంధం, అన్యోన్య సంబంధం గల వస్తువుల్లో ఒకటి; పరస్పర సంబంధం కలిగించు
**correlation** సహసంబంధం
**correlative** పరస్పర సంబంధం గల, పరస్పరాశ్రితమైన
**correspondence** ఉత్తర ప్రత్యుత్తరాలు, అనురూప్యం. ~ *course* దూరవిద్య
**correspondence theory** అనుగుణ్య సిద్ధాంతం
**correspond** సంప్రదించు, ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపు; సమంగా ఉన్న, అనుగుణంగా ఉన్న
**correspondent** విలేఖరి/ ప్రతినిధి
**corresponding** అనురూప, అనుగుణ, తగిన, సదృశ, సమాన, ఈడైన
**corridor** వరండా, వసారా, పంచ
**corrigendum** తప్పొప్పుల పట్టిక
**corroborate** బలపరచు, రూఢిపరచు
**corroboration** బలపరచడం, రూఢిపరచడం
**corrobortant** బలవర్ధకం, బలపరిచే విషయం
**corrode** కోతపెట్టు, కాలక్రమేణా నశించు, తుప్పుపట్టు, కాలక్రమేణా బలహీనమగు, చెడిపోవు
**corrosion** కోత, హరింపు, తినివేయడం, తుప్పుపట్టడం, క్షయం
**corrosive** హరింప జేసే
**corrugator** కనుబొమల్ని ముడిచే కండరం
**corrupt** లంచగొండి, అవినీతికర, కుళ్ళిన, భ్రష్టుపట్టిన, లంచమిచ్చు, కల్తీచేయు, కుళ్ళిపోవు, చెడిపోవు, చెడగొట్టు, భ్రష్టమగు
**corruption** అవినీతి, లంచగొండితనం
**corruptionist** అవినీతిపరుడు
**corruptive** పాడుచేసే, చెడగొట్టే
**corset** రవికె, కంచుకం; బాడీ
**corslet** ఉరస్త్రాణం, బిగువుటంగీ
**cortege** అంత్యక్రియల ఊరేగింపు
**cortex** చెట్టు పట్ట, నారపట్ట, వల్కలం
**corundum** ఎర్రని కెంపు, కురువిందం
**coruscate** మెరయు, ప్రకాశించు
**coruscation** మెరపు
**corvee** వెట్టి
**corvette** చిన్న యుద్ధనౌక
**coryza** పడిశం

**cosmetic** సౌందర్య సాధక(ం). ~ *measures* పైపై చర్యలు. ~ *nature* పైపై మెరుగులు

**cosmetics** సౌందర్య సాధనాలు, సౌందర్య సామగ్రి

**cosmetic surgery** సౌందర్య సాధక శస్త్ర చికిత్స

**cosmic** విశ్వసంబంధి, జగత్ సంబంధి. ~ *dust* అంతరిక్ష ధూళి. ~ *evolution* విశ్వపరిణామం. ~ *noise* విశ్వతరంగ శబ్దం. ~ *rays* విశ్వ కిరణాలు; కాస్మిక్ కిరణాలు

**cosmism** విశ్వపరిణామ దర్శనం

**cosmodrome** ఉపగ్రహ ప్రయోగ కేంద్రం

**cosmogony** జగదుత్పత్తి (వాదం)

**cosmography** సృష్టి వర్ణన

**cosmology** విశ్వోద్భవ శాస్త్రం

**cosmonaut** వ్యోమగామి, రోదసీ యాత్రికుడు, అంతరిక్ష యాత్రికుడు

**cosmopolis** అనేక జాతులు ఉండే నగరం

**cosmopolitan** విశాలదృష్టి గల, సర్వ సమభావం గల, విశ్వజనీన, విశ్వవ్యాప్త

**cosmopolitanisation** విశ్వజనీనీకరణ

**cosmopolitanise** విశ్వజనీన భావం కలిగించు

**cosmopolite** ప్రపంచ పౌరుడు; ప్రపంచ వ్యాప్తమైన జంతువు/ మొక్క

**cosmos** విశ్వం, జగత్తు

**cosmosony** సౌర వ్యవస్థాధ్యయనం

**cosset** బుజ్జగించు, గారాబం చేయు

**cost** n. వెల, మూల్యం, ధర; ఖర్చు, నష్టం. ~ *cut* ఖర్చు తగ్గింపు. ~ *of living* జీవన వ్యయం. ~ *of production* ఉత్పాదన వ్యయం. ~ *price* కొనుగోలు ధర; ఖరీదు, విలువ కట్టు

**costing** వస్తూత్పాదన వ్యయాన్ని అంచనా వేయడం; అమ్మకం ధరను నిర్ణయించడం

**costive** మలబద్ధంగా ఉన్న

**costiveness** మలబద్ధకం

**costly** ఖరీదైన, ప్రియమైన

**costume** ఆహార్యం, దుస్తులు, వేషం

**cosy** సుఖమైన, హాయిఅయిన

**coterie** ముఠా, గుంపు, బృందం

**cottage** గుడిసె, కుటీరం

**cottage industry** కుటీర పరిశ్రమ

**cottager** గుడిసె/ కుటీర వాసి

**couch** n. మంచం; పరుపు, శయ్య, సోఫా

**couch** v. నక్కు, దాగుకొను, పొంచి ఉండు, మాటువేయు

**cough** దగ్గు. *productive* ~ కఫంతో కూడిన దగ్గు. ~ *up* సమకూర్చు. *whooping* ~ కోరింత దగ్గు

**council** మండలి, పరిషత్తు, సమితి. *ligislative* ~ శాసన మండలి. ~ *of advisers* సలహా మండలి. ~ *of ministers* మంత్రివర్గం. ~ *of states* రాజ్యసభ. ~ *of war* యుద్ధ పరిషత్తు

**counsel** n. సలహా, న్యాయవాది, న్యాయ సలహాదారు, వకీలు

**counsel** v. సలహా చెప్పు, హితబోధచేయు

**counsellor** వకీలు, సలహాదారు, హితబోధకుడు

**count** n. గణన, లెక్క, సంఖ్య, నేతనాణ్యత, ఒక బిరుదు

**count** v. లెక్కించు, జమవేసుకొను, గొప్పగా ఎంచు, విశ్వసించు, దృఢంగా ఆశించు

**count down** తుది సన్నాహాలు, ఏర్పాటు

**countenance** n. సహనం, నిశ్చలత్వం, స్థైర్యం, ముఖవైఖరి, అనుగ్రహం, మెప్పు, సమ్మతి, ఆమోదం

**countenance** v. అభిమానించు, ఆమోదించు, ప్రోత్సహించు, ఓర్చుకొను



**counter** విరుద్ధ, ప్రతికూల, వ్యతిరేక, ప్రతివాదన, ఉపసంస్కృతి. ~ *act* పరిహరించు, నిష్ఫలం చేయు. ~ *action* విఘాతం, పరిహారం, ప్రతిచర్య, ప్రతికూల క్రియ. ~ *argument* ప్రతివాదన. ~ *attack* ఎదురుదాడి. ~ *attraction* ప్రత్యాకర్షణ. ~ *blast* తీవ్ర ఖండనం. ~ *balance* సరితూకం. ~ *change* అడ్డగింపు. ~ *charge* ప్రత్యారోపణ. ~ *claim* ఎదురుదావా. ~ *check* నిరోధం. ~ *clock wise* అపసవ్యం. ~ *culture* ప్రతి సంస్కృతి. ~ *espionage* ప్రతి గూఢచర్యం. ~ *guarantee* కౌంటర్ గ్యారంటీ, కనీస లాభాల హామీ. ~ *foil* మారుప్రతి. ~ *insurgency* ప్రతి విద్రోహం. ~ *irritant* ప్రతిక్షోభకం. ~ *mand* వ్యతిరేకాదేశాలు జారీచేయు. ~ *movement* వ్యతిరేక ఉద్యమం. ~ *revolution* ప్రతివిప్లవం. ~ *vailing credit* సమానీకరణ పరపతి. ~ *vailing duty* సమానీకరణ సుంకం. ~ *weapon* ప్రత్యస్త్రం, ప్రత్యాయుధం. ~ *weight* ప్రతిభారం

**counterfeit** చట్ట విరుద్ధమైన, దొంగ, నకిలీ

**countermarch** వెనుదిరగడం

**counterpart** సమస్థాయి వ్యక్తి, ప్రతిరూపం

**counterpoise** సరితూకం; సరితూగ చేయు, సమస్థితిలోకి తెచ్చు

**countersign** మారు సంతకం, అంగీకరించి సమర్థించు

**countervail** సరితూగు; సమఉజ్జీ

**countless** లెక్కలేని, అసంఖ్యాక

**countryard** ఆవరణ/ ప్రాంగణం

**county** జిల్లా, మండలం

**coup** కుట్ర, తిరుగుబాటు

**coup de grace** చావుదెబ్బ

**coupd' etat** తిరుగుబాటు జరిపి ప్రభుత్వాన్ని కూలదోయడం

**coup de main** ఆకస్మిక దాడి

**coup de maitre** అదిరే దెబ్బ

**coup dessi** తొలి ప్రయత్నం, తొలిదెబ్బ

**coup de theatre** (నాటకంలో) అనూహ్యమైన మలుపు

**coupe** బండి తోలే వ్యక్తి, గూడు బండి, రైలులో ఇద్దరు మాత్రమే ప్రయాణించ వీలుండే గది

**couplet** ద్విపది, పద్య పాదాల జంట

**coupling** సంధానం

**courage** గుండెధైర్యం, సాహసం, తెగింపు

**courageous** ధైర్యంగల, నిర్భయ

**courier** కొరియర్: సమాచార వాహకుడు

**course** గమనం, దిశ, నడత, క్రమం, మార్గం, పరుగుపందెం, పందెంలో పరిగెత్తే ప్రదేశం, రుతుస్రావం, ఆదరువు, పాఠ్యాంశం. ~ *pattern* పాఠ్య క్రమం

**courser** పందెపు గుర్రం

**coursing** వేట

**court** రాజాస్థానం, న్యాయస్థానం, క్రీడాస్థలం, ప్రేమను అర్థించు. ~ *directive* కోర్టు ఆదేశం. ~ *of law* న్యాయస్థానం. ~ *martial* సైనిక న్యాయస్థానం. ~ *of appealate jurisdiction* పునర్విచారణాధికారం గల కోర్టు. ~ *of appeal* పునర్విచారణ న్యాయస్థానం. ~ *of competent jurisdiction* తగిన అధికార పరిధి గల కోర్టు. ~ *of wards* సంరక్షితుల న్యాయస్థానం

**courtesan** పడుపుకత్తె, వేశ్య

**courtesy** మర్యాద, దయ, సరసత. ~ *call* మర్యాద పూర్వకంగా కలవడం, మర్యాదకు చూసిరావడం

**courtier** రాజభృత్యుడు
**courtship** అనురంజనం, ప్రేమాభ్యర్థన
**covalance** సమయోజనీయత
**covalent** సమయోజనీయ. ~ *bond* సమయోజనీయ బంధం
**covariant** సహచర రాశి
**covenant** ఒప్పందం, ఒడంబడిక (పత్రం)
**covenantee** ఒడంబడికకు బద్ధుడు
**covenenter** ఒప్పందం చేసుకున్న వ్యక్తి
**coventur** ఉమ్మడి వ్యాపారం
**cover** మూత, కప్పు, ముసుగు, పుస్తకం అట్ట, ఒర, క్రికెట్‌లో బాట్స్‌మెన్‌కు కుడి చేతి వైపు (ఎడమ చేతివాటం ఆటగాడికి ఎడమ వైపు). ~ *story* వివరణాత్మక కథనం
**coverage** వార్తాసేకరణ, భద్రతా నిధి, ప్రమాద పరిమితి
**covert** ప్రచ్ఛన్న, రహస్య, గుప్త. ~ *observation* ప్రచ్ఛన్న పరిశీలన
**covert operation** విద్రోహచర్య, రహస్య కార్యకలాపం
**coverture** ఆశ్రయం
**cover up** కప్పిపుచ్చడం
**covet** (తనది కాని దాన్ని) అపేక్షించు
**covetous** దురాశగల, పేరాసగల, లుబ్ధ
**covetousness** అత్యాశ, పేరాస, దురాశ, ప్రలోభం
**covin** కుట్ర, ఒడంబడిక, గూడుపుఠాణి
**cow** n. ఆవు, అందవికారమైన, చూడలేని, తగని, శుభ్రతలేని, తలమాసిన వ్యక్తి, గర్హణీయుడు, శాఖ, చీపురుకట్ట. ~ *pea* అలచందలు, బొబ్బర్లు
**cow** v. లొంగదీసుకొను, దారికి తెచ్చుకొను, అణచు. ~ *down* అణచివేయు, అణగద్రొక్కు, ఓడగొట్టు, జయించు, అతిక్రమించు, తగ్గించు, మచ్చికపర్చు
**coward** భయస్థుడు, పిరికివాడు, భీరువు
**cowardice** పిరికితనం
**cower** భయంతో కుంగు/ నక్కు
**cowherd** పశువుల కాపరి
**cowl** ముసుగు
**cowrie** గవ్వ
**coxcomb** బడాయికోరు, సొగసుకాడు
**coxcombry** డాబుసరి/ ప్రవర్తన
**coy** బిడియపడే, సిగ్గుగల, ఏకాంతంలో ఉన్న
**coyness** బిడియం, సిగ్గు
**coze** సంభాషణ, ముచ్చట; సంభాషించు, ముచ్చటించు
**cozen** మోసగించు
**crab** పీత, ఎండ్రకాయ; కర్కాటకరాశి; పెద్ద బరువును ఎత్తే యంత్రం; కోపిష్టి; గీకు, పోరాడు
**crack** చలోక్తి విసురు, పగులకొట్టు, బీటలు పడు. ~ *down* విరుచుకుపడు
**cracker** టపాకాయ, టపాసు; అడకత్తెర
**cracking** తైల భంజనం
**crackle** చిటపట ధ్వని
**crack** బీటలు, పగులు, నెరియ; బడాయి; డంబం; పెటేలుమనే ధ్వని; వెర్రివాడు, మంచి ఆటగాడు, పందెపు గుర్రం, కన్నం దొంగ, ఇంటి దోపిడి; ఛలోక్తి
**cradle** డోలిక, ఊయల, పుట్టిన చోటు. ~ *song* జోలపాట
**crafish** గాజురొయ్య
**craft** కళ, కౌశలం, నైపుణ్యం; కపటం; వృత్తివిద్య, వ్యాపారం, చిన్న ఓడ
**craftiness** జిత్తులమారితనం, నేర్పరితనం
**craftsman** నిపుణుడైన పనివాడు, కళాకారుడు
**craftsmanship** పనితనం, వృత్తి నిపుణత
**craftswoman** కళాకారిణి



**crag** ఎగుడు దిగుడుగా ఉన్న గుట్ట
**cram** కుక్కు, కూరు; ఎక్కువ తిను; బట్టీ పెట్టు
**cramp** తిమ్మిరి, ఆటంకం
**crampon** లోహపు కొక్కెం
**crane** కొంగ; బరువుల నెత్తే యంత్రం, నీళ్ళు పీల్చే గొట్టం
**craniometry** కపాలమితి
**craniotomy** కపాలచ్ఛేదన
**cranium** కపాలం
**crank** ఊగిసలాడే, కదలాడే, మునిగిపోయే; వంపుగల ఇరుసు, వక్రోక్తి, విపరీత వ్యక్తి
**crankle** మెలి, వంపు; వంపు తిరుగు, మెలితిరుగు
**cranky** రోగిష్టి, చంచల, మెలితిరిగిన
**cranny** బీట, పగులు, రంధ్రం
**crash** వినాశం, పెళపెళమనే శబ్దం; విరిగిపడు, కూలిపోవు
**crashlanding** బలవంతంగా దిగటం/ దించటం
**crash programme** అత్యవసర కార్యక్రమం
**crater** అగ్నిపర్వత బిలం
**crave** (బలమైన) కోరిక, అర్థించు, యాచించు, ఆశించు
**craving** తృష్ణ, మనఃపూర్వక వాంఛ
**craw** పక్షుల ఆహారకోశం
**crawl** పాకడం, నెమ్మదిగా నడవడం
**crayon** రంగుబలపం
**craze** మోజు, పిచ్చికోరిక, వెర్రి, వెర్రెత్తించు
**craziness** వెర్రితనం, మనోదౌర్బల్యం, యావ
**crazy** పిచ్చి, వెర్రి (వ్యామోహం)
**cream** మీగడ, సారాంశం
**creamy layer** ఉన్నత వర్గం, సంపన్న వర్గం
**crease** మడత (గుర్తు) (క్రికెట్‌లో) బంతిని విసిరే వ్యక్తి, బ్యాట్స్‌మెన్ దాటి రాకూడని గీత, మడతలు పడు
**create** సృష్టించు, కల్పించు, ఉత్పత్తిచేయు
**creation** సృజన, సృష్టి, కల్పన, నిర్మాణం
**creative** సృజనాత్మక. ~ *evolution* సృజనాత్మక పరిణామవాదం. ~ *power* సృజనాత్మక శక్తి
**creativity** సృజనాత్మకత
**creator** సృష్టికర్త, పరమాత్మ
**creature** ప్రాణి, జీవి, మానవుడు, జంతువు, నియామకపత్రం
**creaturely** ప్రాణిసంబంధమైన
**creche** శిశుసంరక్షక కేంద్రం
**credelous** సులభంగా నమ్మదగిన, బోళా
**credence** విశ్వాసం, నమ్మకం
**credential** యోగ్యతా పత్రం, అధికార పత్రం, ప్రమాణ పత్రం
**credentials** పరిచయ పత్రాలు; అధికార పత్రాలు
**credibility** నమ్మిక, విశ్వసనీయత, ప్రతిష్ఠ
**credible** నమ్మదగిన, విశ్వసనీయ
**credit** పరపతి, జమ. ~ *account* జమ పద్దు, అరువుఖాతా. ~ *exchange* రుణ మారకం. ~ *policy* రుణవిధానం. ~ *rating* పరపతి ప్రమాణం
**creditable** కీర్తిదాయకమైన, యోగ్యమైన
**creditor** అప్పిచ్చినవాడు, రుణదాత
**credit squeeze** అప్పులు నిలిపివెయ్యడం
**credulity** బోళాతనం
**creed** సంప్రదాయం, మతవిశ్వాసం, అభిప్రాయాల మొత్తం
**creek** సముద్రపు పాయ, మడుగు, ఇరుకైన లోయ, చిన్న ఓడరేవు
**creel** పెద్దచేపలబుట్ట
**creep** భీతి, పాకడం, పాకు, దొంగచాటుగా పోవు

**creeper** తీగ, పాదు, గాలం; అల్లుకుపోయే మనస్తత్వం గల
**creepy** పాకే, గగుర్పాటు కలిగించే
**cremate** అంత్యక్రియలు చేయు
**cremation** అంత్యక్రియలు, దహన సంస్కారం, శవదహనం. ~ *ground* రుద్రభూమి, శ్మశానం
**crematorium** శవ దహన శాల
**creme de la creme** అత్యుత్తమమైన, ప్రతిభా పాటవాలు గల
**cremery** పాల అంగడి
**cremona** ఫిడేలు
**crenate** రంపం వంటి అంచుగల
**creole** సరళీకృత భాష, నిర్వాసిత భాష
**creolization** కేవలం వ్యాపార భాషగా మిగిలిపోవడం
**crepe** నొక్కుల జుట్టు, ఉంగరాల జుట్టు
**crepitate** చిటపట ధ్వనిచేయు, కర్ణ కఠోర ధ్వని చేయు; ఘాటువాసన గల ద్రవాన్ని చిమ్ము
**crepuscular** సాయంకాలపు సంజ వెలుగులో తిరిగే, మసక చీకటిగా ఉన్న
**crescendo** పతాక స్థాయి, క్రమాభివృద్ధి
**crescent** చంద్రవంక, అర్ధచంద్రాకార; వర్ధమాన
**crest** జూలు, పింఛం, తురాయి, జుట్టు, శిఖ, చిహ్నం. ~ *fallen* కుంగిన, అపజయం పొందిన, వెలవెలపోయిన
**cretaceous** సున్నపు
**cretinism** వామనత్వం
**cretonne** ముతక నూలు గుడ్డ, కలంకారీ ముతక
**crevasse** (హిమఖండం) బీట
**crevice** సందు, బీట
**crew** సిబ్బంది, నావికగణం, బృందం, గుంపు; పొట్టిగా కత్తిరించిన జుట్టు

**crewel** అల్లిక, ఒకరకం సన్న దారం
**crib** పశువులకు గడ్డివేసే తొట్టి; ఉయ్యాల తొట్టి, గనులలోకి దిగడానికి ఉపయోగించే చట్రం; చిన్న గుడిసె; గ్రంథచౌర్యం
**cribbage** ఒక రకమైన పేకాట
**crick** మెడనరం పట్టుకోవడం, బెణుకు
**cricket** క్రికెట్ ఆట; కీచురాయి, చిమ్మట, ఇలకోడి
**cridecoeur** హృదయ వేదన, ఆవేశపూరిత విజ్ఞప్తి, మొర; అసమ్మతి
**crier** వేలంపాడే/ అరిచే/ చాటించే వ్యక్తి
**crikey** ఆశ్చర్యార్థకం
**crime** అపరాధం, దుష్కృత్యం, నేరం
**criminal** నేర సంబంధమైన, అనుచిత; దోషి, నేరగాడు, అపరాధి. ~ *advocacy* క్రిమినల్ కేసులో వాదనలు. ~ *breach of trust* విశ్వాస ఘాతుకం, నమ్మక ద్రోహం. ~ *conspiracy* నేరం చెయ్యడానికి కుట్ర. ~ *law* నేరాలకు సంబంధించిన న్యాయశాసన. ~ *procedure code* శిక్షాస్మృతి, శిక్షాసంహిత. ~ *propensity* అపరాధ ప్రవృత్తి. ~ *psychology* నేరస్థుల మనస్తత్వాధ్యయనం
**criminalisation of politics** రాజకీయాలను నేరమయం చేయడం
**criminalise** నేరమయంచేయు
**criminate** ఆక్షేపించు, నేరంమోపు, ఆరోపించు; దోషి అని రుజువు చేయు
**criminology** నేరవిచారణ శాస్త్రం
**criminous** నేరం చేసిన. ~ *clerk* క్రైస్తవ మత ఉద్యోగి
**crimp** n. దళారి; మోసం చేసి పటాలంలో చేర్చే వ్యక్తి
**crimp** v. పడవేయు, ముడతలు పడేట్లు చేయు; మోసగించు



**crimson** ముదురు ఎరుపు, సింధూరం, కెంపువన్నె
**cringe** అతివినయం, నక్కవినయం
**crinite** నూగు గల, బొచ్చుగల
**crinkle** మెలితిప్పు/ తిరుగు, ముడతలు పడు
**crinkum crankum** అష్టావక్రమైన, వంకర్లు తిరిగిన, గజిబిజియైన
**crinoid** తామరపూవు ఆకారమున్న
**crinoline** యుద్ధ నౌకల చుట్టూ బిగించిన వల; కంబళి
**cripple** కుంటివాడు, అశక్తుడు, బలహీనమైన, చేతకాని, నిర్వీర్యంచేయు
**crisis** సంక్షోభం, సంకటం
**crisp** పెళుసు, కరకరలాడే, బిగువైన, స్ఫుటమైన, చురుకైన; సంక్షిప్తం
**crispate** పెళుసైన, కరకరలాడే, అలల వంటి అంచుగల
**crispation** ఉంగరాలు చుట్టుకోవడం; సంకోచం
**crispy** పెళుసైన, ఉంగరాలు చుట్టుకొన్న, చురుకైన
**criss cross** గజిబిజి, అల్లుకున్న, చిరాకు. ~ *pattern* నిలువు అడ్డుగీతలతో కూడిన
**cristate** కిరీటం/ శిఖరం గల
**criterion** ఆధారం, ప్రమాణం, లక్షణం
**critic** విమర్శకుడు, తప్పులెన్నే వ్యక్తి
**critical** క్లిష్టపరిస్థితి, సంక్షోభం. ~ *angle* సందిగ్ధ కోణం. ~ *method* విమర్శనాత్మక పద్ధతి; అనుభవ హేతువు. ~ *point* (రసాయనశాస్త్రంలో) సందిగ్ధ బిందువు. ~ *temperature* సందిగ్ధ ఉష్ణోగ్రత
**critically** సవిమర్శకంగా. ~ *endangered status* త్వరగా అంతరించిపోయే ప్రమాద స్థితి

**criticise** విమర్శించు, తప్పొప్పులు బేరీజు వేయు
**criticism** విమర్శ, అనుశీలన, పరిశీలన, హేతుబద్ధమైన చర్చ, ఆక్షేపణ
**critique** సవిమర్శక పరిశీలన
**croak** కాకి అరుపు, కప్ప బెకబెక, నిరాశగా మాట్లాడు, అశుభాన్ని సూచించు; చనిపోవు
**croaker** శకునపక్షి
**croceate** కుంకుమ రంగుగల
**crock** n. కూజా, మట్టికుండ, లోహపాత్ర; చిల్లపెంకు; అసమర్థుడు, ముసలి, గుర్రం/ గొర్రె
**crock** v. పనికి మాలేటట్లు చేయు, అసమర్థం చేయు. ~ *up* డీలాపడు, కుప్పకూలు
**crockery** పింగాణీ పాత్రలు, వంట/వడ్డన పాత్రలు
**crocodile** మొసలి. ~ *tears* మొసలి కన్నీరు, కపట దుఃఖం, దొంగ ఏడుపు
**crocus** కుంకుమపువ్వు
**croft** పెరడు, కొద్దిపాటి సాగుభూమి
**crofter** కొద్ది భూమిని సాగుచేసే రైతు
**cromlech** రాక్షస గుళ్ళు (చరిత్ర పూర్వయుగ సమాధులు)
**crone** ముదివగ్గు; ముసలి(గొర్రె)
**crony** సన్నిహిత సహచరుడు
**crooked** కుంచిత. ~ *ness* వంకర, కౌటిల్యం
**croon** కూనిరాగం, గొణుగుడు, కూనిరాగం తీయు, గొణుగు
**crooner** n. లలితగాయకుడు
**crop** పంట, సస్యం. ~ *management* పంటల యాజమాన్యం
**crop switching** పంట మార్పిడి
**crore** కోటి: వంద లక్షలు

**cross** సిలువ, క్రైస్తవుల నమస్కార పద్ధతి. ~ *bench* పక్షపాత రహితమైన. *at ~ swords* కత్తులు దూయు. ~ *cheque* ఖాతాదారు మాత్రమే మార్చడానికి వీలయ్యే చెక్కు. ~ *one's mind* మనస్సులో స్ఫురించు. ~ *out/off* కొట్టివేయు, రద్దుచేయు. ~ *patch* దుర్మార్గుడు. ~ *reference* పరస్పర నిర్దేశం. ~ *the path of* చెరుచు; ఎదుర్కొను; అంటుకట్టు, సంకరజాతిని ఉత్పత్తి చేయు. ~ *voting* స్వంత పార్టీకి వ్యతిరేకంగా ఓటు చేయడం

**cross-belt** నడుముకి ధరించే తుపాకీ గుళ్ళ బెల్టు

**cross-bow** తుపాకీకి అమర్చిన విల్లు

**cross-breed** మిశ్రజాతి

**cross-buttok** (మల్లయుద్ధంలో) తుంటి మీదుగా కింద పడవేయడం

**cross-counter** (బాక్సింగ్‌లో) ఎదుటి వ్యక్తి తలపై కొట్టేదెబ్బ

**cross-cultural** వివిధ సంస్కృతులకు సంబంధించిన

**cross-cut** అడ్డదారి

**cross-examination** అడ్డ సవాలు, విచారణ, వాదోపవాదాలు

**cross-fire** ఎదురు కాల్పులు

**cross-furrows** అడ్డ చాళ్ళు

**cross-grained** పెడసరపు, తలతిక్క

**crossing** కూడలి. ~ *the floor* పార్టీ ఫిరాయింపు

**cross-legged** కాలు మీద కాలు వేసుకుని కూర్చున్న

**cross-multiplication** అడ్డగుణకారం

**cross purposes** విరుద్ధ ప్రయోజనాలు. *be at ~* భిన్న మార్గాలు అవలంబించు, వ్యతిరేక ధోరణి ప్రదర్శించు, ఎదురు సవాలు

**cross road** చౌరస్తా, కూడలి. *at the ~s* కీలక సమయం, కీలక మలుపు

**cross-section** అడ్డుకోత

**cross section** ప్రతినిధి వర్గాలు

**cross-stitch** అడ్డకుట్టు

**crossword** గళ్ళనుడికట్టు

**crostat** హిమాంక ఉష్ణస్థాపకం

**crotch** పంగ

**crouch** నక్కు, వంగు, అణగి ఉండు

**croup** పిల్లికూతల జబ్బు, పొల ఉబ్బసం

**croupier** జూదం ఆడేచోట వసూళ్ళు/చెల్లింపులు చేసే వ్యక్తి

**crow** n. కోడికూత, శిశువు కేరింత; కాకి; కేరింత కొట్టు, హర్షధ్వానం చేయు. *as the ~ flies* స్పష్టంగా, నేరుగా, సూటిగా. *~ bar* గడ్డపార. *carrion ~* మాలకాకి. *eat ~* అవమానం దిగమింగు. *~ over* జయించు. *~ quill* రాయడానికి ఉపయోగించే ఈక. *white ~* తెల్లకాకి.

**crowd** మూక, జనబాహుళ్యం

**crown** కిరీటం

**crowner** శవ పంచనామా చేసే అధికారి

**crown prince** యువరాజు, రాజుకి వారసుడు

**crucial** కీలకమైన, ముఖ్యమైన

**cruciate** స్వస్తికాకారంగల

**crucible** మూస, కుప్పె

**crucifix** శిలువ వేసిన క్రీస్తు ప్రతిమ

**crucifixion** శిలువ వేయడం, చిత్రవధ

**cruciform** శిలువ ఆకారపు

**crude** ముతక, మొరటు, వండని, పచ్చి, అరగని, పక్వంకాని

**crude oil** ముడి చమురు

**cruel** క్రూరమైన, కఠినమైన, బాధాకరమైన

**cruiser** అధికవేగం గల యుద్ధనౌక

**crumb** n. రొట్టెముక్క; సుఖలేశం, రొట్టె లోపలి మెత్తటి భాగం



**crumb** v. రొట్టెను చిన్న ముక్కలుగా చేయు, వాటిని చేర్చి పలుచని పదార్థాన్ని చిక్కపరచు, బలంగా కొట్టు

**crumble** ముక్కలు చెక్కలగు, బద్దలు కొట్టు, భాగాలగు, ఆశలు వమ్ము అగు, సంబంధం చెడు, ప్రతిఘటించడం మానుకొను, పోరాడలేకపోవు, ప్రయత్నం విరమించు, తుక్కుతుక్కగు, పొడి అగు

**crumbling** పొడిఅయి రాలిపోవు

**crumbly** చిన్నభిన్నం కాదగిన

**crumpling** నలగ గొట్టడం

**crunch** కొరత

**crusade** మతయుద్ధం, మహోద్యమం

**crusader** ధర్మ యుద్ధానికి నడుము బిగించే వ్యక్తి

**crush** చితక కొట్టడం, అణగదొక్కడం, కిక్కిరిసిన సమావేశం; అదుము; అణుచు. *as a ~ defeat* దారుణమైన ఓటమి, వినాశకరమైన ఓటమి. *as a ~ reply* నోరెత్తనీయని సమాధానం. *~ ing out* నాశంచేయు, నిర్మూలించు. *~ room* నాటకశాలలోని విశ్రాంతి గది

**crust** భూమ్యుపరితలం, బయటి పొర

**crusted** పొక్కు కట్టిన; పురాతనమైన; మానవీయమైన

**crusty** పెంకువంటి, గట్టి; సంక్షిప్తమైన, సంగ్రహమైన

**crutch** చంక కర్ర, ఊత కర్ర, ఊతం, ఆధారం; ఇంకొకరి సహాయంతో పైకి పోయే వ్యక్తి

**crux** మర్మం, కీలకాంశం

**cry** కేక, అరుపు, కూత, ఏడుపు; పుకారు; ప్రజావాణి; పరిభాష. *a far ~* సదూరం; శోకాలు పెట్టు, బిగ్గరగా ఏడ్చు. *~ out* కేకవేయు. *battle ~* యుద్ధ నినాదం. *~ down* దూషించు. *~ for the moon* అందని పండ్లకు అర్రులు సాచు. *~ off* బేరం చాలించు. *~ over spilt milk* జరిగిపోయిన దానికి విచారించు. *~ up* పొగడు. *within ~* కూతవేటు దూరంలో

**crying** వెంటనే గమనించవలసిన, లోకమంతా కోడైకూస్తున్న

**cryochemistry** హిమ రసాయన శాస్త్రం

**cryocopy** హిమాంక మాపనం

**cryogen** గడ్డకట్టించే మిశ్రమం

**cryogenics** అత్యల్ప ఉష్ణోగ్రతలను గురించిన అధ్యయనం

**cryonics** మానవ కళేబరాలను భద్రపరిచే ప్రక్రియ

**cryophilic** తక్కువ ఉష్ణోగ్రతలో పెరిగే జీవులకు సంబంధించిన

**cryotherapy** అతిశీతల వైద్య విధానం

**cryptaesthesia** అతీంద్రియ జ్ఞానం

**cryptic** గోపక, రహస్యమైన, నిగూఢ, అర్థంకాని, అంతుపట్టని

**cryptogam** పుష్పించని మొక్క, విత్తనాలు లేని మొక్క

**cryptogram** రహస్య లిపి, గూఢ లిపి

**crystal** స్ఫటికం; స్పష్టమైన, స్వచ్ఛమైన. *compound ~* సంయుక్త స్ఫటికం. *~ lattice* స్ఫటికజాలకం. *~ line* స్ఫటిక సంబంధి. *minoclinic ~* ఏకనత స్ఫటికం. *~ orientation* స్ఫటిక విన్యాసం, స్ఫటిక దిగ్విన్యాసం. *rhombic ~* విసమాక్ష స్ఫటికం. *rhombohedral ~* త్రికోణ స్ఫటికం. *tetragonal ~* చతుష్కోణ స్ఫటికం. *triclinic ~* త్రినతస్ఫటికం. *trigonal ~* త్రికోణ స్ఫటికం

**crystallanity** స్ఫాటికత

**crystalline** స్ఫటికం వంటి, స్ఫటికాకార

**crystallisable** స్ఫటికీకరణీయ

**crystallisation** స్ఫటికీకరణం
**crystallize** స్ఫటికీకరించు, స్పష్టమగు
**crystallogram** స్ఫటిక చిత్రం
**crystallograph** స్ఫటిక విజ్ఞానం
**crystallograph** స్ఫటిక లేఖిని
**crystallographer** స్ఫటికశాస్త్రవేత్త
**crystallography** స్ఫటికాకృతి శాస్త్రం
**crystalloid** స్ఫటికం వంటి, స్ఫటికాత
**cub** పులిపిల్ల, నక్కపిల్ల వగైరా; అనామక యువకుడు. ~ *reporter* యువ పాత్రికేయుడు, ఈను, పిల్లలను పెట్టు
**cubage** ఘనపరిమాణం
**cube** n. ఘనం, ఘనాకారం, ఘనాకారపు దిమ్మ
**cube** v. ఘన పరిమాణాన్ని కనుక్కోను; ఘనాకారపు రాళ్ళు పరుచు
**cubeb** చలవ/ తోక మిరియాలు
**cubic** ఘనరూపమైన. ~ *content* ఘన పరిమాణం. ~ *equation* త్రిఘాత సమీకరణం. ~ *foot* ఘనపుటడుగు
**cubicle** ప్రత్యేకమైన (చిన్న) గది, గదిలోని ప్రత్యేక భాగం
**cubiform** పొడవు, వెడల్పు, మందం సమానంగా గల ఘనాకారం
**cubism** రేఖాగణిత చిత్రకళాశైలి
**cubit** మూర
**cubital** ముంజేతి సంబంధమైన
**cubitus** మోచేయి
**cuboid** ఘనాకార. ~ *bone* దీర్ఘఘన చతురస్రం, సమాంతర్భుజ ఘనం
**cuckold** వేశ్యాభర్త, వ్యభిచరించి భర్తను నవ్వులపాలు చేయు
**cuckoo** కోకిల, వెర్రి, చపల చిత్తం, అమాయకుడు
**cucullate** పడగగల
**cucumber** దోసకాయ
**cucurbit** సొరకాయ, దోసకాయ
**cud** నెమరు. *chew the* ~ మననం చేయు
**cudbear** ఊదారంగు చూర్ణం
**cuddle** ఆలింగనం చేసుకొను, కౌగిలించుకొను
**cuddley** హత్తుకొనే, హత్తుకోవాలనిపించే
**cuddle** ఆలింగనం, కౌగిలింత
**cuddy** నౌకలోని క్యాబిన్; పెద్ద ఓడలో విశాలమైన హాలు; చిన్న గది, అరల బీరువా; అవివేకి; గాడిద; ఒక రకపు చేపపిల్ల
**cudgel** దృఢమైన చిన్న కర్ర
**cue** స్ఫూర్తి, సంకేతం, ప్రేరకం
**cuff** చొక్కా ముంజేతి పట్టీ, నడుముకు కట్టుకునే గుడ్డ పట్టీ; గుద్దు, చరుచు
**cuirass** రొమ్ము, వీపు రక్షణ కవచం, స్త్రీల బిగువు రవిక
**cuisine** వంట పద్ధతి, వంటింటి ఏర్పాట్లు
**culinarry** పాక సంబంధమైన. ~ *banana* కూర అరటి
**cull** ఎంపిక చేయు
**cullet** గాజు పెంకు, పగిలిన గాజు
**culm** రాతి బొగ్గుపొడి; చొప్పదంటు
**culminant** శిఖరాయమానమైన, ఆకాశ మధ్యానికి వచ్చిన (గ్రహం)
**culminate** శిఖరం చేరు, ఆకాశం మధ్యకు వచ్చు
**culmination** ఉన్నతస్థితిని చేరడం
**culpable** నేరంగల, దోషపూరిత, తప్పు చేసే, అపరాధి; నేరగాడు, తప్పుచేసిన వాడు, శిక్షార్హుడు, శిక్షార్హమైన నేరం
**culprit** అపరాధి, నేరగాడు, తప్పుచేసిన వ్యక్తి
**cult** మతపరమైన కార్యకర్తల బృందం, సమూహం, ఆరాధన విధానం, పూజ, ప్రార్థనా విధానం, భక్తి భావం, శ్రద్ధ



**cultivable** సేద్యయోగ్యమైన
**cultivate** పండించు, అలవరచుకొను
**cultivation** సేద్యం, వ్యవసాయం
**cultivator** వ్యవసాయదారు, కృషీవలుడు
**cultural affairs** సాంస్కృతిక వ్యవహారాలు
**cultural determinism** సంస్కృతీ నిర్ణాయక వాదం
**cultural fabric** సాంస్కృతిక నిర్మాణం
**cultural imperialism** సాంస్కృతిక సామ్రాజ్యవాదం
**cultural lag** సంస్కృతీ వైరుధ్యం
**cultural relativism** సాంస్కృతిక సాపేక్ష వాదం
**cultural revolution** సాంస్కృతిక విప్లవం
**culture** సంస్కృతి
**cultured** సభ్య
**cultured pearls** కృత్రిమ ముత్యాలు
**culture shock** సాంస్కృతిక ఆఘాతం
**culturology** సంస్కృతి శస్త్రం
**culver** బెల్లగువ్వ, అడవి పావురం
**culvert** తూము; చిన్న కాలువపై వంతెన
**cumber** ఆటంకం, నిరోధం; అడ్డగించు, ఆటంకపర్చు, కష్టపెట్టు
**cumbersome** గజిబిజి, చిక్కువడిన
**cumin seeds** జీలకర్ర
**cumshaw** ఇనాం, బక్షీసు
**cumulate** పోగుచేసిన, సంకలించిన, పోగుచేయు, సంచయించు
**cumulation** సంచితం
**cumulative** సంచిత. ~ *development* సంచితాభివృద్ధి
**cumulus** దట్టమైన మేఘం
**cuneform** కీలాకారపు, కీలలిపి
**cunning** టక్కరియైన, కాపట్యం, జిత్తుల మారితనం, నేర్పరితనం
**cupid** మన్మథుడు
**cupola** గుమ్మటం
**cupulate** గుమ్మటంలాంటి
**cur** తక్కువ జాతికుక్క; దుష్టుడు, పిరికి పంద
**curative** స్వస్థత కలగజేసే మందు
**curator** సంరక్షకాధికారి, పర్యవేక్షకుడు
**curb** కళ్ళెంవేయు, ప్రతిబంధించు, ఆటంక పరుచు, నిరోధించు, నివారించు
**cure** స్వస్థత, మాన్పు, నెమ్మదించు, పదును చేయు, నివారించు
**curette** తురిమే సాధనం
**curiosity** ఉత్కంఠ, జిజ్ఞాస, ఆసక్తి, కుతూహలం, ఆత్రుత
**curious** ఆసక్తికరమైన, ఉత్సాహ పూరితమైన
**curl** ఉంగరాలజుట్టు, మెలితిప్పు, చుట్టుకొను, ముడుచుకొను
**curly** మెలితిరిగిన
**currency** కరెన్సీ, ద్రవ్యం
**current** విద్యుత్, ప్రవాహం, సరళి, గతి; ప్రస్తుత. ~ *assets* చరాస్తి. ~ *capital* ప్రవాహ/ చక్రీయ మూలధనం. ~ *liability* ప్రస్తుత బాధ్యత/ నష్టం. ~ *ratio* ప్రస్తుత నిష్పత్తి
**current account** కరెంటు ఖాతా, వర్తమాన ఖాతా
**curriculum** బోధన ప్రణాళిక
**curry** కూర, కూరగాయల వంటకం. ~ *favour* ప్రాపకం కోసం ప్రయత్నించు, ఎదుటి వారికి అనుగుణంగా వ్యవహరించు. ~ *leaf* కరివేపాకు
**curse** శాపం, తిట్టు, శపించు, తిట్టు
**cursive** గొలుసుకట్టు
**curt** పెడసరపు, మోటు
**curtail** తగ్గించు, అదుపుచేయు, కోతపెట్టు

**curtain** తెర, పరదా, యవనిక. ~ *raiser* పూర్వరంగం
**curvature** వక్రత, వంపు
**curve** వంపు
**curvilinear** వక్రరేఖలుగల
**cusec** క్యూసెక్: సెకనుకు ఒక ఘనపు అడుగు నీటి ప్రవాహ వేగం
**cushion** మెత్త, దిండు; కుదుపులను తట్టుకునే శక్తి, ఒడిదుడుకులను నిభాయించే
**cusp** చిగురు, శిఖరం, అంచు, దళం, దంతాగ్రం
**cuspidate** మొనవాడి
**custard apple** సీతాఫలం
**custodian** సంరక్షకుడు
**custody** నిర్బంధం, అదుపు, వశం
**customer** ఖాతాదారు, వస్తుసేవలను కొనుగోలు చేసే వ్యక్తి
**customize** కొనేవారి అభిరుచులకు, అవసరాలకు అనుగుణంగా మార్పులు చేయు
**customs** ఆచారాలు; సుంకాలు విధించే ప్రభుత్వ విభాగం. ~ *duty* కస్టమ్స్ సుంకం
**cut motion** కోత తీర్మానం
**cutaneous** చర్మ సంబంధమైన
**cute** చురుకైన, ఆకర్షణీయమైన
**cuticle** చర్మం పైపొర, అవభాసిని
**cutis** చర్మం
**cutler** కత్తులు చేసే/ అమ్మే వ్యక్తి
**cutlery** కత్తులూ, కటారులూ
**cutter** కోసే వ్యక్తి/ పరికరం; యుద్ధ నౌకకు చెందిన చిన్న పడవ
**cutthroat** తీవ్ర, భయంకర. ~ *competition* చచ్చేంతపోటీ
**cyan** ముదురు నీలం
**cyanosis** నీల/ శ్యామల వర్ణం
**cybernetics** సమాచార నియంత్రణ యంత్రాధ్యయనం
**cyberphobia** కంప్యూటర్లంటే భయం
**cycle** వర్తులం, చక్రం: భావపునరావృత్తి
**cycle of deprivation** తరాల తరబడి వచ్చే సామాజిక దారిద్ర్యం
**cyclic** చక్రీయ, చక్రక్రమ, వర్తులక్రమ. ~ *compound* చక్రీయ సమ్మేళనం. ~ *disorder* తరచూ సంభవించే మానసిక లోపం. ~*rules* వర్తుల క్రమ సూత్రాలు. ~ *structure* చక్రీయ నిర్మాణం
**cyclical** చక్రీయ
**cyclone** తుఫాను, గాలివాన
**cyclonic separator** పరిశ్రమలలో వ్యర్థ పదార్థాలను వేరుపరచే పరికరం
**cyclonic storm** అతి తీవ్రమైన తుఫాను
**cylinder** స్థూపం, స్తంభాకారం గల కడ్డీ/ గొట్టం
**cylindrical** స్థూపాకార
**cyme** పుష్పమంజరి
**cymotrichous** ఉంగరాల జుట్టుగల
**cyncope** మూర్ఛ
**cynic** విరాగి, విరసుడు, తప్పులెన్నే వ్యక్తి, సుఖద్వేషి, రంధ్రాన్వేషకుడు, నిరాశావాది
**cynicism** నిస్పృహతత్త్వం
**cynophobia** కుక్కలంటే భయం
**cypher** గూఢలిపి; సున్న
**cypher telegram** గూఢలిపి తంతి
**cypres law** యథాసమీప న్యాయం
**cypridophobia** సుఖవ్యాధులు అంటే భయం
**cyptonym** రహస్యనామం
**cyst** ద్రవకోశం, తిత్తి
**cystectomy** ద్రవకోశచ్ఛేదనం
**cystic** ద్రవకోశ సంబంధమైన
**cystitis** మూత్రాశయంలో నొప్పి
**cystochemistry** జీవకణ రసాయన శాస్త్రం



**cystography** మూత్రాశయ చిత్రణం
**cystoscope** మూత్రాశయ దర్శిని
**cystotomy** మూత్రాశయ విచ్ఛిత్తి, మూత్రాశయ ఛిద్రీకరణ
**cytogenesis** కణోత్పాదన
**cytogenetics** జీవకణ వంశానుగత తత్త్వ శాస్త్రం
**cytology** జీవకణశాస్త్రం
**cytopenia** కణాల తగ్గుదల
**cytoplasm** కణద్రవ్యం, కణ పదార్థం

# D d

**dab** రంగు పూత, తట్టడం, అదమడం; ఒక రకం పలచని చేప; నెమ్మదిగా తట్టు, అదుము, ఒత్తు
**dabble** చల్లు, పూయు; ఆగి ఆగి తడుపు, కొద్దిగా దుమ్ము అంటుకొను
**dabbler** చేతకానిదానిని చేయబూనే వ్యక్తి
**dabchick** నీటికోడి
**dacoit** బందిపోటు దొంగ
**dacoity** బందిపోటు దొంగతనం
**dactylitis** అంగుళి వాపు
**dactylogram** వేలిముద్ర
**dactylography** మూగసైగల అధ్యయనం
**dactylomegaly** అసాధారణంగా పొడవైన వేళ్ళు కలిగి ఉండడం
**dadaism** డాడావాదం, అరాజక సాహిత్య పద్ధతి
**daddle** మసలు, జాగుచేయు, కాలం వృథా చేయు
**dado** గోడను కొంత ఎత్తు వరకు రంగుతో, పెంకులతో, కలపతో అలంకరించడం
**daft** వివేకహీనమైన; జాగ్రతలేని
**dagger** బాకు, ఛురిక, కటారి
**daily** ప్రతిరోజూ. ~ *allowance* రోజూవారీ బత్తెం, రోజుకూలీ, దినబత్తెం. ~ *fine* రోజువారీ జరిమానా. ~ *mazdoor* దినసరి కూలీ. ~ *necessaries* రోజువారీ అవసరాలు. ~ *period* దినదిన గండం. ~ *routine* నిత్య పరిపాటి, రోజువారీ మామూలు. ~ *wages* రోజువారీ కూలి
**daintiness** స్వారస్యం, సౌకుమార్యం, నాజూకుదనం
**dairy** పాల (ఉత్పత్తి) కేంద్రం. ~ *development officer* పాడి అభివృద్ధి అధికారి. ~ *farm* పాల ఉత్పత్తి క్షేత్రం. ~ *industry* పాడిపరిశ్రమ. ~ *man* పాడి పారిశ్రామికుడు. ~ *officer* పాడి పరిశ్రమాధికారి. ~ *products* పాడి ఉత్పత్తులు
**dairying** పాడిపని చేయడం
**dais** వేదిక
**dale** కనుమ, (కొండ) లోయ
**dalliance** వ్యర్థంగా కాలం వెళ్ళబుచ్చటం
**dally** సరసమాడు, మేలమాడు; వినోదించు, పరిహాసమాడు, ముద్దులాడు, ఆలస్యంచేయు, జాగుచేయు
**daltonism** వర్ణాంధత
**dam** ఆనకట్ట
**damage** చెరుపు. *certificate of* ~ సరుకు దెబ్బతిన్నదనే ధ్రువీకరణ పత్రం. *consequential* ~ అనంతర కాల నష్టపరిహారం. ~ *for breach of contract* ఒప్పంద భంగ నష్టపూర్తి. ~ *for mesne profits* మధ్యస్థ నష్టపరిహారం. *liquidated* ~ ముందే నిర్ణయించిన నష్టపరిహారం. *nominal* ~ నామమాత్ర నష్టపరిహారం. *punitive* ~ శిక్షాత్మక నష్టపరిహారం. ~ *suit* నష్టపరిహార దావా. *ultra* ~ అత్యధిక నష్టపరిహారం

**damaging confession** నష్టదాయకమైన, నేరం ఒప్పుదల
**dame** హోదా గలిగిన స్త్రీ, సాంఘికంగా ఉన్నతురాలు; డాంబరు, తారు; రంగులేని వార్నిష్
**damn** తిట్టు, దూషించు, నిందించు
**damnable** దూషించదగిన, హేయమైన, రోత పుట్టించే, పాడు
**damnation** ఖండించడం; నిరసించడం; నరకం, నరకదండన
**damned** పతితుడైన, హేయమైన
**damnify** నష్టం కలిగించే
**damning** తిట్టు, శాపం; బలమైన సాక్ష్యం
**damnity** హాని
**damp** చెమ్మ, తేమ, తడి, నిరుత్సాహి; తడిగా ఉండు, చెమ్మగా/ ఆర్ధ్రంగా ఉండు, తేమగా ఉండు; చిత్తడి నేల
**damped** అవరుద్ధ, మందగింపజేసే
**dampen** మందగించిన
**dampener** చెమ్మ వ్యాపించకుండా ఉండడానికి పరిచిన పలకల వరస; నిరుత్సాహపరిచే వ్యక్తి
**damper** నిరుత్సాహపరిచే వ్యక్తి/ వస్తువు
**damping control** అవరోధ నియంత్రణం
**dampness** నెమ్ము
**damp proof** చెమ్మ/ తేమ తగలని
**damsel** అందగత్తె, పడుచు, కన్య. ~ *in distress* ఆపదలో అమ్మాయి
**damson** ఆల్‌బకారా పండు/ చెట్టు
**dan** నీటిపైన తేలే కటాహం
**dancer** నర్తకి, నర్తకుడు
**dander** కోపం, చిరాకు, అసహనం
**dandle** ముద్దుచేయు, లాలించు
**dandruff** చుండ్రు
**dandy** నీటుకాడు, సొగసుకాడు, విలాస పురుషుడు, ఆడంబరమైన, డాబైన, ఆర్భాటమైన
**danger** అపాయం, ప్రమాదం. ~ *money* ప్రమాదకర పరిస్థితులలో పనిచేసే కార్మికులకు ఇచ్చే అధిక వేతనం. ~ *zone* అపాయ ప్రాంతం
**dangerously inflammable** అపాయకరంగా మండే
**dangle** ఊగు, వేలాడు, ఆశగొలుపు
**dapper** చురుకైన, సొగసైన
**dapple** మచ్చలు మచ్చలుగా ఉండడం
**dappled** మచ్చలున్న
**dare** సాహసించు, ఎదిరించు, ధిక్కరించు, తెగించు
**daring** సాహసం, చొరవ, సాహసంగల
**dark** చీకటి, అజ్ఞానం, రాత్రి, ముదురు రంగు; గుప్తమైన, ముదురురంగు గల, తెలియని, జ్ఞానరహితమైన
**darken** నల్లబరచు, కళంకితంచేయు
**darkhorse** రహస్యజీవి/ గుప్తవ్యక్తి
**darkness** తమస్సు, నల్లదనం
**darling** ప్రియమైన, ప్రేమించదగిన, ప్రియుడు, ప్రియురాలు
**darn** అతుకు, తాపు, కలిపి కుట్టు
**dart** బల్లెం; మొనదేలిన బాణం; అస్త్ర ప్రయోగం, కీటకాలు కుట్టడం
**dartle** చిమ్ము, విసురు, తటాలున బయట పడు
**dash** తాకుడు దెబ్బ/ ధ్వని; అడ్డుగీత; రంగు పూత; సాహసం; ఆడంబరం; పరుగు పందెం, కొట్టు, విసిరికొట్టు, తోయు, చిమ్ము, మలినపరుచు, భంగపరుచు
**dashing** చొరవ గల, ఉద్రేకం గల, ఉత్సాహం గల, సాహసం గల
**dastard** దొంగదెబ్బ తీసిన వ్యక్తి, పిరికి పంద



**data** దత్తాంశం, సమాచార గణాంక వివరాలు; కంప్యూటర్‌లో నిలువచేసే సమాచారం. ~ *bank* భద్రపరిచే కేంద్రం. ~ *base* నిలవచేసిన సమాచారం. ~ *management* సమాచార నిర్వహణ
**data capture** సమాచారాన్ని ఎక్కించే విధానం
**data processing** దత్తాంశాల పరిశీలన ప్రక్రియ
**date n.** తేదీ, ఖర్జూరం, ఈతచెట్టు. ~ *palm* ఖర్జూరపు చెట్టు, తేదీవేయు, లెక్కకు వచ్చు, కాలం గణించు
**date line** వార్తను పంపిస్తున్న ఊరిపేరు, తేది
**datum** దత్తాంశం, ఆధార విషయం, వివరాలు
**datura** ఉమ్మెత్తమొక్క
**daub** మట్టి/ సున్నపు పూత; రంగులు పులిమిన చిత్రం, దర్జుచేయు; అలుకు (రంగులు), పులుము
**dauber** అనిపుణ చిత్రకారుడు
**daunt** బెదిరించు, భయం కలిగించు, నిరుత్సాహపరచు
**dauntless** భయంలేని, ధైర్యంగల; పట్టుదలగల
**dawn** వేకువ, తెల్లవారువేళ, ప్రత్యూష, నిశాంతం
**day** పగలు, రోజు, దినం. ~ *and night* దివారాత్రాలు. ~ *off* సెలవు దినం. ~ *today* దైనందిన, రోజువారీ
**daze** విభ్రాంతి, దిగ్భ్రమ, మిరుమిట్లు గొలుపు, దిగ్భ్రాంతి కలిగించు
**dazzle** మెరుపు, తళుకు, మిరిమిట్లు గొలుపు; దిగ్భ్రమ గొలుపు
**deactivate** చైతన్య రహితం చేయు
**deactivation** అనుత్తేజనం, నిరుత్తేజనం
**dead** ఆగిపోయిన, చనిపోయిన, ప్రాణం లేని, మృత; వాడుకలో లేని; మొద్దుబారిన; మందకొడి; చలనరహిత; తిమ్మిరెక్కిన; నిశ్శబ్దమైన. ~ *account* అమలులో లేని ఖాతా. ~ *capital* మదుపు చేయని ధనం; లాభదాయకం కాని పెట్టుబడి. ~ *fence* నిర్జీవావరణం. ~ *freight* ఖాళీ రుసుం. ~ *head* ఉచిత ప్రయాణికుడు. ~ *house* శవాలను భద్రపరిచే గది. ~ *letter* అడ్రసు సరిగాలేని ఉత్తరం; అమలులో లేని శాసనం. ~ *line* గడువు, నిర్ణీత కాలావధి. ~ *lock* సంపూర్ణ ప్రతిష్టంభన. ~ *march* చావు మేళం. ~ *matter* గతించిన విషయం. ~ *of partnership* భాగస్వామ్య ఒప్పందం/ పత్రం. ~ *point* తుది బిందువు. ~ *rent* స్థిరమైన అద్దె. ~ *security* అమలులో లేని పూచీ. ~ *shipping* నిశ్చల భారం. ~ *stock* అమ్ముడు పోని సరుకు; వినియోగం లేని మూలధనం. ~ *weight* జడభారం
**deadcat bounce** వాటాల రేట్లు పునరుత్తేజం పొందడం
**deaden** మొద్దుబారు, తిమ్మిరెక్కు, నిరుత్సాహం గావించు, నిస్తేజంగావించు, అశక్తుడగు
**deadline** చివరి గడువు
**deadly** ప్రాణాంతకమైన, విషపూరితమైన, ఆత్మవినాశకమైన
**deaf-mute** చెవిటి, మూగ
**deal** వ్యవహారం; బేరం; ఒప్పందం
**dealer** వ్యవహర్త; వ్యాపారి, వర్తకుడు
**dealings** వ్యవహారాలు, లావాదేవీలు. ~ *policy* వడ్డీ రేట్లు పెంచి వ్యయాన్ని నియంత్రించడం
**dean** క్రైస్తవ పూజారి; విశ్వవిద్యాలయంలో సంబంధిత విభాగాలకు అన్నిటికీ కలిపి అధిపతి

**dearness** ప్రియం, విలువ పెరగడం. ~ *allowance* కరువు భత్యం

**dearth** లోటు, కొరత

**death rate** మరణాల సంఖ్య

**death rattle** చావుగురక

**deaths man** తలారి

**debacle** పతనం, పరాజయం, సంక్లిష్టం, విధ్వంసం, ఓటమి; గడ్డకట్టిన మంచు కరగడం. ~ *of government* ప్రభుత్వ పతనం

**debar** నిషేధించు, తొలగించు, ప్రతిషేధించు

**debark** ఓడనుంచి దింపు/ లేదా దిగు

**debarment** తొలగింపు; ప్రతిబంధకం

**debase** కల్తీ, స్థాయి తగ్గిన గుణం/యోగ్యత

**debasement** నాణెపు ప్రమాణాన్ని తగ్గించడం

**debatable** వివాదాస్పదమైన, సందిగ్ధ, ఆక్షేపింపదగిన, చర్చచేయదగిన

**debate** చర్చ

**debauchee** నీతిదూరుడు, తాగుబోతు

**debaucher** జారుడు, భ్రష్టుడు, వేశ్యా లోలుడు

**debauchery** వేశ్యాలోలత్వం, జారత్వం

**debenture** రుణపత్రం

**debilitate** విలువ తగ్గించు, బలహీన పరచు, చెరుపు, చెడగొట్టు

**debilitated** దుర్బలమైన, నీరసమైన

**debility** దుర్బలత్వం, బలహీనత, నిస్త్రాణ, అసమర్థత

**debit** ఖర్చు. ~ *note* చెల్లింపులను గుర్తు చేస్తూ ఖాతాదారుకు కంపెనీ జారీ చేసే పత్రం

**debonair** ఉల్లాసకరమైన, సభ్యమైన

**debridement** గాయాన్ని శుభ్రపరచడం

**debris** చెత్త, శిథిలావశేషం, వ్యర్థ పదార్థాలు

**debt** రుణం, అప్పు, బాకీ. *accruing* ~ సంక్రమించే అప్పు. ~ *capital* అప్పుగా తెచ్చిన కంపెనీ డబ్బు. ~ *collector* అప్పు సొమ్ము వసూలు చేసే వ్యక్తి. ~ *conversion* అప్పుమార్పిడి. ~ *free* అప్పులేని. *judgement* ~ డిక్రీ రుణం. ~ *liability* ఇవ్వదేలిన మొత్తం

**debtor** బాకీదారు, రుణగ్రస్తుడు. *absent* ~ గైర్హాజరు బాకీదారు

**debtor's ledger** బాకీదార్ల ఆవర్జా, రుణగ్రస్తుల ఖాతా

**debug** తప్పుల్ని గుర్తించి సవరించు

**debunk** అసత్య నిరూపణ; అపోహ తొలగించు, నిజం బయటపెట్టు

**debut** ప్రప్రథమ ప్రదర్శన

**debutant** మొదటిసారి రంగమెక్కే వ్యక్తి

**debuttor** మత ప్రయోజనాల కోసం ఇచ్చిన అద్దె లేని ఆస్తి

**decade** దశాబ్దం

**decadence** దిగజారుడుతనం, పతనం, పతనావస్థ, క్షీణత, భ్రష్టత

**decadent** భ్రష్టమైన, క్షీణించిన. ~ *period* క్షీణయుగం. ~ *art* క్షీణ కళ

**decagon** దశభుజి

**decamp** పారిపోవు, శిబిరం ఎత్తివేయు

**decant** తేటపరుచు, తేర్చు

**decantation** తేర్చడం

**decapitate** శిరశ్ఛేదన చేయు

**decay** శైథిల్యం. ~ *constant* క్షయ క్రియ స్థిరాంకం. ~ *product* శిథిల పదార్థం

**decease** మరణం

**deceit** మోసం, కుయుక్తి; తప్పుడు ప్రతిపాదన, దగా, కపటం, దంభం

**deceitful** ఏమార్చే, మోసగించే, దగుల్బాజి, వంచనతో కూడిన

**deceive** మోసగించు



**deceiver** మోసగాడు, (నయ) వంచకుడు

**decelerate** వేగం తగ్గు, మందగించు

**decency** సభ్యత, మర్యాద, ఔచిత్యం, యోగ్యత

**decennary** దశాబ్దం

**decennial** దశాబ్ద, దశవార్షిక. ~ *census* దశ వార్షిక జనాభా లెక్క

**decent** తగిన, ఉచిత, సభ్య, యోగ్య. ~ *standard of life* యోగ్యజీవన ప్రమాణం

**decentralisation** వికేంద్రీకరణ

**decentralise** వికేంద్రీకరించు

**deception** వంచన, మోసం, దగా

**deceptive** వంచనాత్మక, తప్పుదారి పట్టించే

**decibel** ధ్వని ప్రమాణం

**decidual** పతనమయ్యే, రాలిపోయే

**deciduous** తాత్కాలికమైన, ఆకులు రాల్చే. ~ *forest* ఆకులురాల్చే అడవులు

**decimal** దశాంశం

**decimate** నాశనం చేయు

**decipher** అవగతం చేసుకొను/ చదువు

**decision** తీర్పు, నిర్ణయం. ~ *making* విధాన నిర్ణయం

**decisive** తిరుగులేని, నిర్ణాయక, నిర్ధారక

**decivilise** అనాగరీకరించు

**deck** ఓడ పైభాగం; చీట్లపేక, అలంకరించు, సింగారించు

**declaim** ఉపన్యాస ధోరణిలో మాట్లాడు, గట్టిగా ఖండించు, నిరాకరించు

**declamation** ఉపన్యాసం; చతుర సంభాషణ నైపుణ్యం

**declarant** వాఙ్మూలకర్త, ప్రకటనకర్త

**declaration** చాటింపు, వెల్లడి, ప్రకటన, వాఙ్మూలం. *dying* ~ మరణవాఙ్మూలం. ~ *of insolvency* దివాలా ప్రకటన. *statutory* ~ శాసనబద్ధ ప్రకటన

**declarative sentence** నిర్దేశోక్తి, నిర్దేశాత్మక వాక్యం

**declaratory** వివరణాత్మక, ప్రకటించే. ~ *act* వివరణాత్మక చట్టం

**declaratory decree** ప్రకటనాత్మక డిక్రీ

**declare** వెల్లడించు, నిర్ణయించి చెప్పు; (అధికారికంగా) ప్రకటించు

**declassify** వర్గీకరించు, వర్గీకృత జాబితా నుంచి తొలగించు; రహస్య సమాచారం బయటపెట్టు

**declension** క్షయం, క్షీణత; నీతి తప్పడం, పతనం; విభక్తి

**declevity** దిగుడు, ఏటవాలు

**declination** వంపు, క్షీణత, నిరాకరణ, అక్షాంశం

**decline** నిరాకరించడం, తిరస్కరించడం; తగ్గిపోవడం; నిరాకరించు; క్షీణించు

**declivous** ఏటవాలుగా ఉన్న

**decoction** కషాయం

**decode** సంకేతం ఛేదించు

**decoding** విసంకేతనం

**decollate** తలతీయు

**decolonization** వలస విముక్తి

**decolouration** విరంజనం, రంగు పోవడం, వివర్ణం కావడం

**decolourisation** వివర్ణీకరణం

**decolourise** విరంజనం చేయు

**decomplex** బాగా చిక్కిన, సంకీర్ణ భాగాలతో కూడిన

**decompose** కుళ్ళిపోవు, చెడిపోవు, కుళ్ళబెట్టు, శిథిలమైపోవు

**decomposite** సంయోగపదార్థం, సమాసం

**decomposition** పంపిణీ; శిథిలం కావడం. ~ *of rocks* శిలా విఘటనం

**decompress** పీడనం తగ్గించు

**decompression** ఒత్తిడి తగ్గించడం

**decongestant** రక్తాధిక్యం తగ్గించడం
**deconsecrate** అపవిత్రంచేయు, మలిన పరుచు
**deconstruction** వినిర్మాణం, *decontaminate* కాలుష్యం తొలగించు, ప్రక్షాళించు
**decontamination** ప్రక్షాళన
**decontrol** నిర్బంధాలను తొలగించు
**decor** అలంకార సామగ్రి
**decorate** సింగారించు, అలంకరించు, బిరుదు/ పతకం ఇచ్చు
**decorated style** అలంకృతశైలి
**decoration** అలంకరణ, విభూషణం
**decorative art** అలంకార కళ
**decorous** యుక్తమైన, మర్యాదతో కూడిన
**decorticate** బెరడు/ పొట్టు తీయు, ఒలుచు
**decorum** ఔచిత్యం, ఉచిత ప్రవర్తన/ వేషధారణ
**decoste** దాయాది సంబంధమైన
**decoupage** పత్రఖండ రచన
**decoy** ఎర, నింద, తిట్టు, వలలో వేసుకొను, చిన్నబుచ్చు, వంచనతో ఆకర్షించు, చిన్నబుచ్చు, నిందించు
**decoyer** వంచకుడు
**decree** కోర్టు తీర్పు/ ఉత్తరువు
**decrement** క్షయం, తగ్గింపు
**decrepit** దుర్బలమైన, చివికిన, జీర్ణించిన
**decrepitate** వేచు, వేయించు
**decrepitude** ముదిమి
**decry** ఖండించు; నిందించు; కొట్టివేయు, వ్యతిరేకించు
**dectrolytic** విద్యుద్విశ్లేషక. ~ *cell* విద్యుద్విశ్లేషక ఘటం. ~ *reduction* విద్యుత్ క్షయకరణం
**decuman** పెద్ద అల
**decumbent** సాగిలపడిన
**decuple** పదింతల మొత్తం
**decussate** పరస్పరం ఖండించుకొనే
**dedicate** అంకితంచేయు, అంకితం అవు
**dedication** అంకితభావం
**deduce** రాబట్టు, నిర్ణయానికి వచ్చు
**deducible** ఊహించి నిశ్చయింపదగిన
**deduct** తీసివేయు, తొలగించు, తగ్గించు
**deducted wages** మినహాయించిన/ తగ్గించిన/ వేతనాలు
**deductible** తొలగించదగిన, తగ్గించదగిన
**deduction** తీసివేత, నిగమనం
**deductive** ఊహింపదగిన. ~ *logic* నిగమనతర్కం
**deed** దస్తావేజు. ~ *of assignment* అప్పగింత దస్తావేజు. ~ *of gift* దానపత్రం. ~*of transfer* బదిలీ పత్రం. *sale* ~ విక్రయ దస్తావేజు
**deem** తలచు, అనుకొను, భావించు
**deep** అఖాతం; సముద్రం; లోతు. ~ *rooted* బలంగా వేళ్ళూనిన. ~ *sea floor* అగాధ సముద్ర భూతలం
**deep case** కారకం
**deep depression** తీవ్రమైన వాయుగుండం
**deepen** తీవ్రమగు
**deep grammar** అంతర్గత వ్యాకరణం
**deep structure** అంతర్నిర్మాణం, గుప్త నిర్మాణం
**deface** విరూపం చేయు, రూపం చెరచు, ముఖం కనబడకుండా చేయు, వికారం చేయు, చెరిపివేయు, చెడగొట్టు
**de facto** యథార్థమైన, నిజమైన. ~ *ruler* అసలు పాలకుడు
**defalcate** అపహరించు
**defalcation** ద్రవ్యాపహరణ, లోటు, కొరత



**defamation** పరువు నష్టం
**defamatory** పరువు నష్టం కలిగించే
**defame** అపకీర్తి తెచ్చు, అపవాదు వేయు
**defamiliarization** అపరిచయీకరణం
**default** అమలు పర్చలేకపోవడం; వాయిదా నాడు కోర్టుకి హాజరు కాకపోవడం; నిర్ణీత కాలానికి డబ్బు చెల్లించలేకపోవడం; కర్తవ్య నిర్వహణలో వైఫల్యం. ~ *book* చెల్లింపు కాని పద్దు పుస్తకం. ~ *in payment* చెల్లింపులో ఉపేక్ష. ~ *of issue* సంతానం లేకపోవడం
**defaulter** ఎగవేతదారు, సకాలంలో డబ్బు చెల్లించని వ్యక్తి, నేరం చేసిన సైనికుడు
**defeasance** విఫలం చేయడం
**defeasible** విఫలంకాగల, రద్దుకాదగిన. ~ *title* హక్కుమూలం
**defeat** ఓటమి
**defecate** నిర్మలంచేయు, శుద్ధిచేయు, శుభ్రపరచు
**defecation** శుద్ధి
**defect** న్యూనత, దోషం, లోపం, దుర్గుణం. *lantent* ~ కనపడని లోపం. *patent* ~ పైకి కనపడే లోపం, బహిర్గత లోపం
**defection** పార్టీ ఫిరాయించడం/ మార్చడం
**defective** లోపంగల, లోపభూయిష్ఠ
**defence** ప్రతివాదం, రక్షణ. ~ *committee* రక్షణ సంఘం. ~ *counsel* నిందితుని పక్షాన వాదించే న్యాయవాది. ~ *department* రక్షణశాఖ. ~ *expenditure* రక్షణ వ్యయం. ~ *in bar* వాద నిరోధక ప్రతిపాదన. ~ *scheme* రక్షణ పథకం. ~ *treaty* రక్షణ ఒడంబడిక
**defend** ప్రతివాదంచేయు; కాచు, కాపాడు, రక్షించు
**defendant** నిందితుడు; ప్రతివాది
**defender** రక్షకుడు
**defender of faith** ధర్మత్రాత
**defending champion** నిరుటి విజేత
**defense** రక్షణ, ఆత్మరక్షణ
**defensible** న్యాయమని నిరూపించదగిన, రక్షింపదగిన, రక్షిత ప్రాంతం
**defensive** రక్షణార్థమైన, సంరక్షకమైన
**defer** కొంతదాచడం; వాయిదా వేయడం; మినహాయించి మొత్తంగా ఒకసారి చెల్లించడం; అన్యమనస్కంగానైనా ఏకీభవించడం, విభేదించటం
**deference** లోబడడం, ఒప్పుకోలు; గౌరవం
**deferred** వాయిదా వేసిన, ఆపి ఉంచిన. ~ *annuity* వాయిదాపడిన వార్షిక చెల్లింపు
**defervescence** ఉష్ణం తరుగుదల, వేడి తగ్గుదల
**defiance** ధిక్కారం, ధిక్కరణ, తిరస్కారం, అలక్ష్యం
**defiant** ఎదురు తిరిగే, ధిక్కరించే, అతిక్రమించే, అవిధేయత చూపే. ~ *attitude* ధిక్కార ప్రవృత్తి
**deficiency** లోపం. లోటు
**deficient** తక్కువ
**deficit** లోటు, ఆదాయాన్ని మించిన వ్యయం
**defier** ఎదిరించే/ జవదాటే వ్యక్తి
**defile** కనుమ: అపవిత్రం చేయు, కలుషితం చేయు, వరుసలో పోవు
**defilement** మైల
**define** వివరించు, స్పష్టీకరించు, నిర్వచించు, హద్దులేర్పరచు
**definitely** ఇదమిత్థంగా, ఖచ్చితంగా, అనుమానాలకు తావులేకుండా
**definition** నిర్వచనం

**definitive** నిశ్చయాత్మక. ~ *edition* నిర్ధారకప్రతి, ప్రామాణిక ప్రతి
**deflagrate** కాల్చు; కాల్చి బూడిద చేయు
**deflate** గాలితీయు, ద్రవ్యోల్బణం తగ్గించు, ద్రవ్యచలామణిని తగ్గించు
**deflation** ప్రతి ద్రవ్యోల్బణం, ఎగురవేత
**deflationist** ద్రవ్యసంకోచక వాది
**deflect** దారి తప్పించు
**deflection** విక్షేపం
**defloration** ఆకులు రాలడం, కన్నెపొర ఛేదించడం, మానభంగం చేయడం
**deflower** పూలు లేకుండా చేయు, కన్యాత్వం చెరచు; బోడిగా చేయు
**deforce** భూమిని బలవంతంగా ఆక్ర మించు
**deforcement** బలవంతపు ఆక్రమణ
**deforestation** అటవీ నిర్మూలన
**deform** వికృతీకరించు, విరూపంచేయు, కురూపిని చేయు
**deformation** విరూపణం, వికృతీకరణ; అంగవైకల్యం
**deformity** వైకల్యం, కురూపితనం, విరూపం, అవయవలోపం
**defossion** సజీవ భూస్థాపన/ దహన శిక్ష
**defraud** వంచించు, మోసగించు, కాజేయు
**defray** వెలచెల్లించు, భరించు
**defrayable** ఖర్చు భరింపదగిన
**deft** నిపుణ, చతుర, నేర్పుగల
**deftly** నేర్పుగా
**defunct** పనిచేయని, క్రియారహిత, క్రియా శూన్య, అమలులో లేని. ~ *company* వ్యాపారం చాలించిన కంపెనీ. ~ *partnership* అమలులో లేని భాగస్వామ్యం
**defuse** తగ్గించడం, తీసివేయడం
**defy** ఉల్లంఘించడం, ధిక్కరించడం

**degenaration** క్షీణత, అధఃపతనం, భ్రష్టత్వం, అధోగతి; విచ్ఛిన్నత
**degeneracy** క్షీణత, హీనత, భ్రష్టత
**degenerate** భ్రష్టమైన, దిగజారుడు
**deglutition** మింగడం, కబళించడం
**degradation** క్రింది శ్రేణికి పంపడం, స్థాయిలోపం, హైన్యం
**degrade** హీనపరుచు, అవమానపరుచు, తగ్గించు, పదవీ భ్రష్టుని చేయు, పరువు పోగొట్టుకొను, నైతికంగా పతనం చెందు
**degratia** దయాపూర్వకమైన
**degree** స్థాయి, కోణం, పరిమాణం. ~ *of accuracy* యథార్థతా స్థాయి. ~ *of association* సాహచర్య స్థాయి. ~ *of discretion* వివేచన స్థాయి. ~ *of dissociation* విఘటన స్థాయి. ~ *of hardness (water)* (జల) కాఠిన్య స్థాయి. ~ *of utility* ఉపయోగస్థాయి
**degression** దశల వారీ తగ్గుదల
**degressive** దశల వారీగా తగ్గే
**dehiscent** పక్వానికి వచ్చిన తరవాత పగిలి విత్తనాలు బయటకు రావడం
**dehydrate** ఎండబెట్టు, నిర్జలీకరించు
**dehydration** ఎండిపోవడం, నిర్జలీకరణం, జలహరణం
**deification** దైవీకరణం, ఆరాధన
**deign** సరిపడుతుందని తలచు, దయతో అంగీకరించు
**deity** దేవత, దైవం, దేవుడు
**deject** చిన్నబుచ్చు
**dejected** అప్రసన్న, దీన
**dejection** ఖిన్నత, దీనత
**de jure** చట్టప్రకారం, న్యాయరీత్యా
**delate** నేరంమోపు; ఫిర్యాదుచేయు
**delay** జాగు, జాప్యం, ఆలస్యం. *inordinate* ~ పెనుజాప్యం, అసాధారణ ఆలస్యం



**delaying tactics** జాప్యయుక్తులు
**delectation** ఆహ్లాదకరమైన, వినోద భరితమైన
**delegacy** ప్రతినిధుల నియామక పద్ధతి, ప్రతినిధి బృందం
**delegate** ప్రతినిధి, ప్రతినిధిగా పంపించు, అధికారం అప్పగించు, ప్రాతినిధ్యమిచ్చు
**delegation** ప్రతినిధి బృందం, దత్తత. ~ *of authority* అధికార దత్తత. ~ *of power* అధికార దత్తత
**delete** తొలగించు, తుడిచివేయు, నిలిపి వేయు
**deleterious** వినాశకర, విషతుల్య
**deletion** తొలగింపు, పరిహరణం, లోపిం పజేయటం. ~ *rule* లోపసూత్రం
**deliberate** సమాలోచించు. ~ *killing* బుద్ధిపూర్వకంగా చంపడం
**deliberately** బుద్ధి/ ఉద్దేశ పూర్వకంగా
**deliberation** ఉన్నతస్థాయి చర్చ/ సమాలోచన, పూర్వాలోచన, నిశిత పరిశీలన
**delicacy** రుచికరమైన ఆహార పదార్థం, నాజూకుతనం, కోమలత్వం, సౌకుమార్యం, రమణీయం, సరసత; దుర్బలత్వం, వివేచన, నైపుణ్యం; ఎదుటివారి మనస్సును నొప్పించక పోవడం; అమర్యాదకర పనుల నుంచి తప్పుకోవడం
**delicate** సుకుమార, సున్నితమైన
**delicious** రుచికరమైన. ~ *meal* రుచికర భోజనం
**delict** దుష్కృతి, శాసన విరుద్ధం, తప్పు, నేరం
**delight** ఆనందం; సంతోషపడు/ పరచు
**delimit** హద్దులేర్పరుచు
**delimitation** హద్దులు నిర్ణయించడం. ~ *of constituencies* నియోజకవర్గాల పునర్విభజన

**delineate** చిత్రించు, వర్ణించు, ప్రదర్శించు
**delineation** చిత్రణ, వర్ణన, సరిహద్దుల నిర్ణయం
**delinking** తెగగొట్టడం, వేరుపరచటం
**delinquency** అపరాధం
**delinquent** ఉపేక్షకుడు, దోషి, అపరాధి, నేరగాడు. ~ *child* అపరాధం చేసిన శిశువు. ~ *juvenile* బాలనేరస్థుడు
**deliquesce** కరుగు, ద్రవించు, కరిగిపోవు
**delirious** ప్రలాపించే, ఉద్రిక్త
**delirium** సన్నిపాతం, ప్రతాపం, సంధి
**deliver** బట్వాడా చేయు, అందచేయు, ఇచ్చు, ముట్టచెప్పు, విముక్తి కలిగించు, కాపాడు, రక్షించు, కను, ప్రసవించు, ప్రకటించు, వెల్లడించు, అర్పణ చేయు, విడుదలచేయు. ~ *a lecture* ఉపన్యసించు
**deliverance** ఇవ్వడం, అందించడం
**delivery** బట్వాడా, ఇవ్వడం, అందచేయడం, అప్పగించడం; ఉపన్యాసం, కాన్పు, ప్రసవం. ~ *book* తపాలా పుస్తకం. ~ *order* అప్పగింత ఉత్తరువు. ~ *premeture* అపరిపక్వ ప్రసవం. ~ *tube* వాహక నాళం
**dell** కనుమ, లోయ
**delta** ఒండ్రు నేల, మైదాన (ప్రాంత)ం
**delude** భ్రమింపజేయు, మోసపుచ్చు
**deluge** జలప్రళయం
**delusion** మోసం, భ్రాంతి, విభ్రమం, మిథ్యావిన్యాసం
**delusive** భ్రమగొలిపే, భ్రాంతి జనకమైన
**de luxe** పరిపుష్టమైన, భోగయుక్తమైన
**delve** బాగా పరిశ్రమించు, (పరిశోధనలలో) తవ్వు
**demagnetisation** నిరయస్కాంతీకరణం
**demagogue** ఆందోళనకారుడు, వాక్శూరుడు

**demand** డిమాండ్, (హక్కుగా) కోరడం, కోరిక, గిరాకీ, అభ్యర్థన. ~ *bill* సమర్పించగానే చెల్లించాల్సిన వినిమయబిల్లు. ~ *price* గిరాకీ ధర. ~ *schedule* గిరాకీ పట్టిక
**demarcate** ఎల్లలు ఏర్పరచు, హద్దులు నిర్ణయించు
**demarcation** (సరి)హద్దు (నిర్ణయం). ~ *dispute* పని హద్దుల వివాదం. ~ *line* హద్దురేఖ
**demarcator** హద్దునిర్ణేత
**demasking agent** అనాచ్ఛాదకం
**dematerialise** ఆధ్యాత్మికం చేయు
**demean** న్యూనపరుచు, అప్రతిష్ఠపాలు చేయు
**demeanour** నడవడి, వైఖరి
**dementi** (పుకారును) అధికార పూర్వకంగా ఖండించడం
**dementia** చిత్తవైకల్యం, విభ్రుతి
**demerit** అవలక్షణం, అయోగ్యత, లోపం, దోషం, దుర్గుణం
**demersal** సముద్రాంతర్భాగ జీవితం
**demesne** హక్కు భుక్తాలలో ఉంచుకొను. ~ *lands* సొంత ఉపయోగం కోసం ఉంచుకొన్న భూములు
**demi** సగం, అర్ధ. ~ *official* అర్ధాధికారి
**demigod** దైవాంశ సంభూతుడు, దివ్య పురుషుడు, భగవత్ స్వరూపుడు
**demilitarisation** నిస్సైనికీకరణ
**demilitarise** సైన్యాన్ని ఉపసంహరించు, నిస్సైనికంచేయు
**demineralisation** విఖనిజీకరణం
**demineralised water** విఖనిజీకృత జలం
**demise** మరణం; దీర్ఘకాల కౌలులీజు, వీలునామా ద్వారా ఆస్తి సంక్రమింపజేయడం. ~ *of the crown* సమ్రాట్టు మరణం; సింహాసనత్యాగం
**demission** రాజీనామా, పరిత్యాగం
**demit** పరిత్యజించు, రాజీనామా చేయు, వదులుకొను
**demitting** రాజీనామా చేసే సందర్భం
**demiurge** మూలమూర్తి
**demobilization** విసైన్యీకరణ, సేన నుంచి తొలగించు
**demobilize** సైన్యం నుంచి తొలగించు
**democles sword** పొంచి ఉన్న ముప్పు, గొంతుమీది కత్తి
**democracy** ప్రజాస్వామ్యం
**democrat** ప్రజాస్వామ్యవాది
**democratic** ప్రజాస్వామికమైన. ~ *centralism* కేంద్రీకృత ప్రజాస్వామ్యం. ~ *convention* ప్రజాస్వామ్య సమ్మేళనం. ~ *forces* ప్రజాస్వామిక శక్తులు. ~ *socialism* ప్రజాస్వామ్య సామ్యవాదం
**democratization** ప్రజాస్వామ్యీకరణ
**demode** పాతపడ్డ, వాడుక తగ్గిన, అలవాటు తప్పిన
**demographic regulation** జనాభా నియంత్రణ
**demography** జనాభా విజ్ఞానం, జన సాంఖ్యకశాస్త్రం, సంఖ్యాధ్యయన (శాస్త్ర)ం
**demolish** నేలమట్టం చేయు, పడగొట్టు
**demolition** విధ్వంసం చేయడం, నాశం చేయడం, కూలగొట్టడం. ~ *order* కూలగొట్టమనే ఉత్తరువు
**demon** దయ్యం, దానవుడు
**demonetization** నాణేల చెలామణి రద్దు
**demonetize** చెలామణి నుంచి నాణేలను, కరెన్సీని రద్దుచేయు/ ఉపసంహరించు
**demoniac** దయ్యం పట్టిన వ్యక్తి; వెర్రి ఆవేశంతో కూడిన



**demoniacal** దయ్యానికి సంబంధించిన
**demonic** అతీంద్రియ శక్తి ఆవేశించిన
**demonism** భూత ప్రేత పిశాచాల్లో నమ్మకం
**demonology** పైశాచిక (శాస్త్ర)ం
**demonstrability** నిరూపణీయత
**demonstrable** నిరూపించదగిన, ప్రదర్శించదగిన, రుజువు చేయదగిన
**demonstrate** నిర్వహించు, ప్రదర్శించు, దృష్టాంతంగా చూపు, నిజపరుచు, రుజువుచేయు, ప్రత్యక్షంగా చూపు
**demonstration** ప్రత్యక్ష నిరూపణ, ప్రదర్శన, తార్కిక నిరూపణ, బాహ్య ప్రదర్శన. ~ *experiment* ప్రదర్శనాత్మక ప్రయోగం
**demonstrative** ప్రత్యక్ష నిరూపణాత్మక
**demonstrator** ప్రత్యక్ష నిరూపకుడు, ప్రదర్శకుడు
**demoralization** నీతిభ్రష్టత, అధఃపతనం, నిరుత్సాహం
**demoralize** నైతికంగా భంగపరచు, హాని చేయు, భ్రష్టుపట్టించు
**demos** ప్రజాసామాన్యం, జనసామాన్యం, సామాన్యజనం
**demote** పదవి/ హోదా తగ్గించు
**demotice** సార్వజనికమైన, సర్వ సాధారణమైన
**demotion** పదవి/ హోదా తగ్గింపు
**dempster** తీర్పరి
**demulcent** ఉపశమనకారి
**demur** ప్రతిబంధించు, శంకించు, ఆలస్యం చేయు, అభ్యంతరం లేవదీయు
**demure** గంభీరమైన; సిగ్గుపడే; నక్క వినయం, నంగనాచి
**demurrage** విలంబ(న) శుల్కం
**demurrer** వాదాక్షేపకుడు; వాదాంశాక్షేపణ
**den** గుహ, బిలం, రహస్య స్థావరం
**denationalization** ప్రైవేటీకరించడం, ప్రైవేటుపరం చేయడం
**denationalize** ప్రైవేటీకరించు, ప్రైవేటుపరం చేయు
**denaturalise** పౌరసత్వం లేకుండా చేయు, స్వభావాన్ని మార్చు
**denature** కల్తీచేయు, సహజ గుణాన్ని పోగొట్టు
**dendritic** శాఖాయుత, శాఖలుగా విస్తరించిన
**dendrology** వృక్షాధ్యయనం
**denegation** నిరాకరణ
**dengue** డెంగ్, డెంగ్యు, డెంగీ జ్వరం
**denial** నిరాకరణ, ఖండన
**denied** నిరాకృత
**denier** నిరాకర్త, కాదనేవాడు, తిరస్కరించేవాడు; చిన్న నాణెం
**denigration** అప్రతిష్ఠపాలు చేయడం
**denization** పౌరత్వ ప్రదానం
**denize** దేశీయుని/ పౌరుని చేయు
**denizen** పౌరుడయిన విదేశీయుడు, వాస్తవ్యుడు
**denominate** నామవర్గీకరణ చేయు
**denomination** నామవర్గీకరణం
**denominative** పేరుపెట్టే, పేరులాగా వాడదగిన
**denominator** హారం, విభాజకం, సాధారణాంశం
**denotation** నైఘంటుకార్థం, మూలార్థం
**denotative** నిర్దేశకమైన, స్థిరార్థం
**denote** సూచించు, నిర్దేశించు
**denotified tribe** విముక్త జాతి/ తెగ
**denouement** పరిణామం, పరిష్కారం, ఉపసంహారం
**denounce** నిరసించు, తప్పులెన్ను, నిందించు, దూషించు, విమర్శించు

**de novo** మళ్లీ మొదటి నుంచి, సరికొత్తగా
**dense** దట్టమైన
**denseness** గుబురు, సాంద్రత, దట్టం
**density** సాంద్రత, (జన) సాంద్రతమీద ఆధారపడ్డ కారకాలు. ~ *gradient* సాంద్రతా ప్రవణత. ~ *of population* జన సాంద్రత
**dent** గంటు, గాటు
**dental** దంత్యదంతాకార. ~ *papilla* దంతసూక్ష్మాంకురం
**dentate** పళ్ళు గల, రంపపు అంచులవలె ఉండే దంతాలు గల
**denticle** చిన్నపల్లు
**denticulate** చిన్న పళ్ళుగల
**dentine** దంత ధాతువు
**dentistry** దంతవైద్యశాస్త్రం. *cosmetic* ~ సౌందర్యవర్థక దంతవైద్య శాస్త్రం
**dentition** పండ్లు మొలవడం, దంతాల అమరిక
**denture** కట్టుడుపళ్ళు, కృత్రిమ దంతాలు
**denudation** నీటికోత
**denude** నగ్నంచేయు, దిగంబరంచేయు
**denunciation** నేరారోపణ చేయడం, సమాప్తి సూచన
**deny** ఖండించు, తిరస్కరించు, నిరాకరించు, కాదను, లేదను
**deoderant** దుర్గంధహారి, దుర్వాసన పోగొట్టేది
**deoderiser** దుర్గంధహారిణి
**deoderization** దుర్గంధహరణం
**deoderize** దుర్గంధాన్ని హరింపజేయు
**deontology** ధర్మశాస్త్రం, నీతిశాస్త్రం
**depart** విడచిపోవు, బయలుదేరు, వెళ్ళిపోవు
**department** విభాగం, శాఖ, భాగం
**departmental** శాఖీయ. ~ *accounts* శాఖాపరమైన లెక్కలు. ~ *action* శాఖాపరమైన చర్య. ~ *enquiry* శాఖాపరమైన విచారణ
**departmentalization** విభాగీకరణం
**departure** బయలుదేరు, వదిలివెళ్ళు, తప్పుకొను, దూరమగు; నిష్క్రమణం, మార్గాంతరం, దారితొలగడం
**depasture** మేపుటకు విడచు, మేపు
**depauperize** దారిద్ర్య విమోచనం
**depend** తటస్థించు, వేలాడు, ఆధారపడు, విశ్వసించు, నిరీక్షించు, నమ్ముకొని ఉండు, అధీనమై ఉండు
**dependable** నమ్మదగిన, ఆధారపడదగిన
**dependence** ఆధారపడి ఉండడం
**dependencies** పరాధీన దేశాలు
**dependency** పరాధీనత, అధీనరాజ్యం
**dependency theory** ఆశ్రయణ సిద్ధాంతం
**dependent** అస్వతంత్ర, ఆధారపడిన, వశ్యం, పరాశ్రయ, పరతంత్రుడు, ఆశ్రితుడు, అధీనుడు
**depict** వర్ణించు, వివరించు, చిత్రించు
**depicture** చిత్రించు
**depilation** రోమనిర్మూలనం
**depilatory** రోమహారి
**deplano** సంగ్రహంగా, సంక్షిప్త గతిలో
**deplete** ఖాళీ చేసిన, క్షీణ, తరిగిపోయిన
**depletion** తగ్గుదల, తరుగు, క్షీణత
**deplorable** దయనీయమైన, విచారకరమైన, శోచనీయ
**deplore** గర్హించు, దూషించు, నిందించు
**deploy** నియోగించు, రంగంలోకి దించు, విస్తరింపచేయు, వ్యూహం ఏర్పరుచు
**deployment** (సైన్యాల) మోహరింపు, వ్యూహరచన; సైన్య విస్తరణ
**deplume** ఈకలుపీకు



**depolarize** వికర్షించు, చెదరగొట్టు
**depoliticisation** రాజకీయ విమోచనం
**deponent** సాక్షి, వాఙ్మూలమిచ్చే వ్యక్తి
**depopulate** జనాభా తగ్గించు
**depopulation** జనాభా తగ్గించడం, నిర్జనీకరణం
**deport** దేశ బహిష్కృతుని చేయు
**deportation** దేశ బహిష్కారం
**deportee** దేశబహిష్కృతుడు
**deportment** నడవడి; వేషభాషలు, ప్రవర్తన, పద్ధతి
**depose** తొసిపుచ్చడం, కాదని చెప్పడం, సాక్ష్యం చెప్పడం, అధికారం నుంచి తొలగించడం
**deposit** ధరావత్తు, జమ. ~ *account* డిపాజిట్ ఖాతా, జమఖాతా. ~ *base* డిపాజిట్ల పునాది, డిపాజిట్ల బలం
**deposition** వాఙ్మూలం, మేటవేయడం, నిక్షేపణం
**depositary** సరుకుల గిడ్డంగి, ధర్మకర్త
**deposit** నిక్షేపం
**depot** సరుకు నిలవచేసే చోటు, బస్సులు, వాహనాలను నిలిపి ఉంచి, శుభ్రపర్చే చోటు
**depravity** నైతిక పతనం
**deprecate** చులకనచేయు, నిరాశకలిగించు, నిందించు
**depreciate** విలువ తగ్గించు, ధర మందగించు
**depreciation** (యంత్రాల) అరుగుదల, (మారకం) విలువ తగ్గడం, తరుగుదల, రవాణాలో/ వాడుకలో కలిగే నష్టం
**depredation** దోపిడీ, కొల్లగొట్టడం; ధ్వంసం
**depredator** దోపిడీదారు, విధ్వంసకుడు
**depress** అధైర్యపరుచు, నిరుత్సాహపరుచు; మందగింపజేయు; ధర తగ్గించు; స్వర స్థాయి తగ్గించు
**depressant** ఉపశమనకారి
**depressed** పీడిత. ~ *classes* దళిత వర్గాలు, పీడిత వర్గాలు. ~ *market* వస్తు సేవలకు విలువలేని విపణి
**depression** విషాదం, నిరాశ, కుంగిపోవడం, వాయుగుండం; ఆర్థిక మాంద్యం. ~ *of freezing point* ఘనీభవన స్థాన నిమ్నత
**deprivation** కోల్పోవడం; నష్టం; సౌకర్యాల తొలగింపు
**deprive** పోగొట్టుకొను; అందకుండా చేయు, నిరోధించు; దోచుకొను; లేకుండా చేయు
**depth** గంభీరత, లోతు
**depurate** శుద్ధిచేయు
**deputation** ప్రతినిధిగా పంపడం, బదులుగా పంపడం, ఉపనియామకం. ~ *allowance* ఉపనియామక భత్యం. ~ *pay* ఉపనియుక్త వేతనం
**deputationist** ఉపనియుక్తుడు
**depute** బదులుగాపంపు, ప్రతిగాపంపు
**deputize** ప్రతినిధిగా వ్యవహరించు, బదులు పంపు
**deputy** ఉప, తాత్కాలిక ప్రతినిధి. ~ *accountant* ఉపగణాధికారి. ~ *minister* ఉపమంత్రి. ~ *speaker* ఉపసభాపతి, ఉపాధ్యక్షుడు
**derail** పట్టాలు తప్పు, దారితప్పించు
**derailment** పట్టాలు తప్పడం, దారి తప్పడం
**derange** కలతపెట్టు, చెల్లాచెదరుచేయు, వెర్రెత్తించు
**deranged** క్రమం తప్పిన
**derangement** అస్తవ్యస్తత, తారుమారు, అపవిన్యాసం

**derasinate** పెకలించు; నిర్మూలించు

**derate** రేటు తగ్గించు

**deregulate** నియంత్రణ నుంచి విముక్తి చేయు, నియంత్రణలను ఎత్తివేయు

**deregulation** నియంత్రణను ఎత్తి వేయడం, నియంత్రణ సడలింపు

**derelict land** ఉపయోగించడం మానేసిన భూమి/ ప్రాంతం, ఉదా॥ పాత రైల్వే రహదారులు, ఉపయోగంలో లేని ఫ్యాక్టరీలు మొ॥

**derelict** పరిత్యక్తుడు; ఉపేక్షించు

**dereliction** అశ్రద్ధ, విడిచిపెట్టడం, ఉపేక్ష

**derequisition** స్వాధీన పరుచుకొన్న ఆస్తిని విడుదల చేయడం

**deride** ఎగతాళిచేయు, అపహాస్యం చేయు

**derision** గేలి, ఎగతాళి, అపహాస్యం

**deritus** రాళ్ళ/ మొక్కల అవశేషాలు

**derivation** ఉత్పాదన; ఉత్పత్తి, శబ్దరూప సాధన

**derivational** నిష్పాదిత. ~ *history* నిష్పాదన చరిత్ర. ~ *path* నిష్పాదన మార్గం. ~ *tree* రూపసాధన వృక్షం

**derivative** ఉత్పన్నం, తద్ధితం. ~ *mortage* రెండవ తనిఖీ, అనుబంధ తాకట్టు. ~ *suffix* నిష్పాదక ప్రత్యయం

**derive** ఉత్పాదించు, సాధించు, శబ్ద వ్యుత్పత్తి చెప్పు, నిశ్చయించు, ఊహించు

**derived** ఉత్పన్న. ~ *unit* ఉత్పన్న ప్రమాణం. ~ *form* ఉత్పన్న రూపం. ~ *title* సాధించిన/ పొందిన హక్కు

**derm** (లో) చర్మం

**dermal** చర్మ సంబంధమైన

**dermatitis** చర్మశోథ, చర్మపు నొప్పి

**dermatologist** చర్మరోగ నిపుణుడు

**dermatology** చర్మరోగ విజ్ఞానం

**dermatomycosis** తామర

**dermatosis** చర్మ వికృతి

**dermis** చర్మం

**derogate** తగ్గించు, న్యూనపరచు, అపయశస్సు కలిగించు

**derogation** తగ్గించడం

**derogatory** నిందాపూర్వమైన

**derrick** బరువులు ఎత్తే చిన్న యంత్రం

**derringer** చిన్న పిస్తోలు

**desalinization** లవణ హరణం

**descant** శ్రావ్యత, పాట

**descendant** ఉత్తరాధికారి, వంశస్థుడు, వారసుడు

**descended** ఉద్భూత, అవతరించిన

**descendible** సంక్రమించదగిన

**descending order** అవరోహణ క్రమం

**descending rhythm** అనులోమ లయ

**descent** అవరోహణ, దిగజారడం, పతనం

**deschooling** పాఠ్య ప్రణాళికా తిరస్కార వాదం

**describe** వర్ణించు, వివరంగా చెప్పు, గుణ వివరణ చేయు, రూపుకట్టు

**description** వర్ణన, వివరణ

**descriptive** వర్ణనాత్మక, వివరణాత్మక. ~ *grammar* వర్ణనాత్మక వ్యాకరణం. ~ *order* వర్ణన క్రమం. ~ *adequacy* వర్ణన సమగ్రత. ~ *adjective* వర్ణనాత్మక విశేషణం

**desecrate** అపవిత్రం చేయు

**desecration** అపవిత్రంచేయడం

**desensitisation** గ్రాహకత తగ్గించడం

**desert** విడిచి పెట్టిపోవు, త్యజించు; ఎడారి. ~ *wind* ఎడారి గాలి

**desertification** మరుభూమీకరణ

**desertion** పరిత్యాగం, పలాయనం

**deserve** అర్హత కలిగిన

**deserving** అర్హమైన



**desiccate** నీరు తీసివేయు, నిర్జలీకరించు

**desiccator** నిర్జలీకరణి

**desiderate** కోరు, లేదని బాధపడు

**desideratum** లోపం, కొరత; కోరదగిన వస్తువు

**design** పథకంవేయు, ఉద్దేశించు; రూప రచన, ఆకృతిరచన, కల్పన, ఉద్దేశ్యం, విన్యాసం

**designataion** పదవి (పేరు), హోదా, అభిదానం

**designate** పేర్కొను, గుర్తింపు కలిగి ఉండు; నియుక్తుడై ఇంకా పదవి చేపట్టని

**designated court** నిర్దిష్ట న్యాయస్థానం

**designed** ఆకృతిచేసిన

**designedly** ఉద్దేశపూర్వకంగా

**designer** నిర్మాత, నమూనా కర్త

**designing** అచ్చుపని; జిత్తులమారి/కపటి అయిన

**desipience** అల్పత్వం, కొంటెతనం

**desirability** వాంఛనీయత, అపేక్షణీయత

**desirable** అపేక్షణీయ, వాంఛనీయ. ~ *tenant* భూస్వామి

**desire** కోరిక, వాంఛ, వాంఛించు

**desired** అభిలషిత, కోరిన, వాంఛిత. ~ *result* కోరిన ఫలితం

**desirous** అపేక్షగల, ఇచ్ఛగల, వాంఛగల

**desist** నిరోధించు, ఆపు

**desk** సొరుగులబల్ల, రాతబల్ల, మేజా

**desolation** దిక్కుమాలిన స్థితి, ఒంటరితనం, నిస్సహాయస్థితి

**despair** నైరాశ్యం, నిర్వేదం

**despatch** పంపు, జారీచేయు, రవాణా చేయు. ~ *note* సరుకుతోపాటు పంపే లేఖ. ~ *rider* ఉత్తరాలను, సందేశాలను, వస్తువులను వాటి గమ్యానికి చేర్చే వ్యక్తి. ~ *advice* పంపినట్టు అందించిన సమాచారం

**despatches** అధికార లేఖలు

**desperado** దుస్సాహసి, ఆకతాయి, తెంపరి

**desperate** తెగించిన, నిరాశతో కూడిన; ఆశలేని, ఉపాయంలేని, అసాధ్య

**desperately** తెగువతో, నైరాశ్యంతో

**despersion** పృథక్కరణం, వేరుపరచటం

**despicable** నీచ, నికృష్ట, హేయ

**despise** తృణీకరించు, నిరసన భావంతో చూచు, రోయు

**despoil** దోపిడీచేయు, కొల్లగొట్టు

**despondency** నైరాశ్యం, విషణ్ణత

**despondent** విషణ్ణ

**despot** నియంత, నిరంకుశ/ వ్యక్తి/ పాలకుడు

**despotism** నియంతృత్వం, నిరంకుశత్వం

**dessert** అంత్య ఖాద్యం

**destabilise** అస్థిరపరచు

**destination** లక్ష్యం, గమ్యం

**destine** ఏర్పరచు, విధించు, నిర్దేశించు, నిర్ణయించు

**destiny** తలరాత, విధి, దైవం

**destitute** నిరుపేద, అభాగ్య, అనాథ, ఆశ్రయ రహిత దరిద్ర. ~ *of property* ఆస్తి హీనుడు. ~ *person* నిరాశ్రయుడు

**destroy** నాశంచేయు, విచ్ఛిన్నం చేయు, ధ్వంసం చేయు, అంతంచేయు

**destroyed** నష్టమైన, ధ్వంసమైన

**destroyer** యుద్ధనౌక, వినాశకుడు

**destroying** నాశంచేయడం

**destructible** నాశంచేయదగిన

**destruction** నాశం, విధ్వంసం

**desturctive** విధ్వంసక. ~ *activity* విధ్వంసక చర్య. ~ *wave* వినాశక తరంగం

**desuetude** అప్రయోగ/ అనుపయోగ/ స్థితి
**desultary** నిలకడలేని, క్రమపద్ధతి లేని, సంబంధంలేని, అసంబద్ధ
**detach** విడగొట్టు, విడదీయు
**detached view** నిర్లిప్త/ అనాసక్త దృక్పథం
**detachment** నిర్లిప్తత, విడిపోవడం. *retina* ~ నేత్రపటలం విడిపోవడం
**detail** తబ్సీలు, వివరం; పనికేటాయించు, వివరించు
**detailed** సమగ్రమైన, వివరణాత్మకమైన, పనికి కేటాయించిన. ~ *account* సవివరణ ఖాతా. ~ *analysis* సమగ్ర విశ్లేషణ. ~ *estimates* సవివరమైన అంచనాలు. ~ *heads* శీర్షికలు, సవివరమైన పద్దులు. ~ *inspection* సవివరమైన తనిఖీ. ~ *instructions* సవివర ఆదేశాలు. ~ *report* సవివర నివేదిక
**detain** నిర్బంధంలో ఉంచు, నిరోధించు, ఆపిపెట్టు
**detained** నిరోధించిన, నిర్బంధించిన, ఆపిపెట్టిన
**detainee** నిర్బంధితుడు, బందీ
**detect** ఆచూకీతీయు, కనుగొను, కనిపెట్టు
**detection** (పరి)శోధన, ఆచూకీ, ఆరా
**detective** డిటెక్టివ్, పత్తేదారు, అపరాధ పరిశోధకుడు
**detector** శోధని, శోధకుడు
**detente** ఉద్రిక్తతల సడలింపు, సయోధ్య: సామరస్యం
**detention** నిర్బంధం, (పాఠశాలలో) పైతరగతికి పంపకపోవడం. *preventive* ~ నివారక నిర్బంధం
**detenue** బంది, అవిచారిత నిర్బంధితుడు, రాజకీయ ఖైదీ
**deter** నిరోధించు, అడ్డగించు, ఆపు, నివారించు
**detergent** అపక్షాలకం, మురికిని తొలగించేది, శుభ్రం చేసేది
**deteriorate** తగ్గు, క్షీణించు, క్షీణింపచేయు, చెడగొట్టు, హీనస్థితి నొందు, గుణం చెడు, విలువతగ్గు
**deterioration** క్షీణత, క్షయం, పతనం, దెబ్బతినడం, క్రియాశక్తి హీనత. ~ *index* క్షీణతాసూచిక
**determinable** నిశ్చయింపదగిన, నిర్ధరింపదగిన
**determinant** నిర్ణాయకం, నిర్ధారకం, నియంత్రించే అంశం
**determination** సంకల్పం, పూనిక, నిష్కర్ష, (దృఢ) నిశ్చయం, (న్యాయ) నిర్ధారణ
**determinative** నిర్ణాయకమైన
**determine** నిర్ణయించు, సంకల్పించు, నిర్ధరించు, సమాప్తిచేయు, నిశ్చయించు
**determined** నిశ్చిత, సమాప్త, నిరూపిత
**determinedly** నిశ్చితంగా, పట్టుదలగా
**determinism** నియతివాదం, నిర్ణాయక పద్ధతి. *economic* ~ ఆర్థిక నియతివాదం. *linguistic* ~ భాషానియతివాదం
**determinist** నియతివాది
**detersive** పరిశుభ్రపరిచే
**detest** అసహ్యించుకొను, ద్వేషించు
**detestation** ఏవగింపు, రోత, ద్వేషం
**dethrone** గద్దెదించు, పదవి నుండి/ సింహాసనం నుండి తొలగించు
**detonate** పెద్దగా పేల్చు, విస్ఫోటించు
**detonation** విస్ఫోటనం
**detonator** విస్ఫోటకం
**detour** చుట్టుదారి
**detoxication** నిర్విషీకరణ
**detract** అపకర్షించు, గౌరవ లోపంచేయు, తక్కువచేయు, నిందించు



**detraction** ఖ్యాతిలోపం, అపకర్షణ, గౌరవలోపం, శ్రద్ధ కోల్పోవడం
**detractor** అపకర్షకుడు, దారి తప్పించే వ్యక్తి, గౌరవలోపం కలిగించే వ్యక్తి
**detrain** రైలుదిగు/ రైలు నుంచి దింపు
**detribalize** గిరిజనత్వం విచ్ఛిన్నం చేయు
**detriment** ప్రయోజనాలకు భంగం కలిగించడం, నష్ట(పరచడం), చెరుపు, హాని
**detrimental** హాని, వినాశకరమైన, అయోగ్యమైన
**detrition** అరుగుదల
**detritus** అరిగిన రాళ్ళ గుట్ట
**deuce** డ్యూస్, రెండు చుక్కల పేక ముక్క, పాచిక, మహామారి, కొంటెపని; టెన్నిస్‌లో ప్రత్యర్థులు సమ ఉజ్జీగా ఉండే దశ
**devaluation** మూల్య న్యూనీకరణ, అపమూల్యనం, విలువ తగ్గింపు
**devalue** విలువ తగ్గు/ తగ్గించు
**devastate** విధ్వంసం చేయు, సర్వనాశం చేయు, పాడుచేయు
**devastation** వినాశం, భారీ నష్టం
**develop** అభివృద్ధి/ క్రమవృద్ధిచేయు, ఉన్నతికి చెప్పు
**developable** అభివృద్ధి చేయదగిన
**developed** అభివృద్ధిచెందిన
**developing** అభివృద్ధి చెందుతున్న, వర్ధమాన. ~ *countries* అభివృద్ధి చెందుతున్న/ తృతీయ ప్రపంచ దేశాలు
**development** ప్రగతి, అభివృద్ధి; నూతన సంఘటన/ పరిణామం
**developmental** పురోగమనశీల
**deviance** వక్రత, అతిరిక్తత
**deviant** అతిరిక్త. ~ *behaviour* అతిరిక్త ప్రవర్తన
**deviate** మార్గంతప్పు, దారితొలుగు, మార్గావసరణం చేయు
**deviation** క్రమభంగం, విచలనం; తొలగడం, అపసరణం, అతిక్రమణం; తప్పు, భేదం, వ్యత్యాసం; ఉల్లంఘించు, వైదొలగిపోవు, దిశమార్పు. *standard* ~ ప్రమాణ విచలనం
**deviationism** ఉల్లంఘనవాదం
**device** ఉపాయం, పరికల్పన, సాధనం, పరికరం, యుక్తి, పద్ధతి
**devil** దయ్యం, పిశాచం; దుష్టుడు, క్రూరుడు. *printer's* ~ అచ్చు తప్పు, ముద్రారాక్షసం
**devil's advocate** కుతర్కవాది
**devilish** పైశాచిక, ఘోరమైన
**devilism** పైశాచికత్వం, దారుణప్రవర్తన
**devilment** దుర్మార్గం, క్రౌర్యం, దారుణ దృశ్యం
**devilry** దానవత్వం
**devious** వక్రమైన, పొరపడిన, వంచక
**devisable** వీలునామా ద్వారా ఇవ్వదగిన
**devise** వీలునామా ద్వారా ఆస్తిని పొందే వ్యక్తి
**devisor** వీలునామా దాత, వీలునామా కర్త
**devitalize** నిర్వీర్యపరుచు, నిస్త్రాణంచేయు
**devoid** విహీనమైన, లేని, రహిత, లోపించిన
**devolute** అప్పగించు, అధికారమిచ్చు, సంక్రమింపచేయు
**devolution** సంక్రమించడం, క్రమక్షీణత. ~ *of property* ఆస్తిసంక్రమణం. ~ *rules* ఆస్తి సంక్రమణ నియమాలు
**devolve** సంక్రమించు, ప్రాప్తించు
**devote** శ్రద్ధవహించు, అర్పించు, వినియోగించు, నిష్ఠవహించు, సమర్పించు
**devotedly** దీక్షగా, భక్తివిశ్వాసాలతో
**devotee** భక్తుడు, దాసుడు
**devotion** దీక్ష, పరాయణత్వం, అంకిత భావం. ~ *of duty* కర్తవ్య నిష్ఠ

**embodiment** అవతారం/ లక్షణం, గుణం, మూర్తి. ~ *of knowledge* విజ్ఞాన మూర్తి
**embody** రూపొందించు, తయారుచేయు, చేర్చు
**embog** బురదలోకి పడతోయు
**embolden** ధైర్యం ఇచ్చు, నమ్మకం కలిగించు
**embrace** కౌగిలి; కౌగిలించు; గుండెకు హత్తుకొను, స్వీకరించు, పట్టుకొను
**embranchment** శాఖోపశాఖలు కావడం
**embrangle** చికాకుపరుచు
**embrasure** కోటగోడపై రంధ్రం
**embrology** పిండోత్పత్తి శాస్త్రం
**embrittlement** పెళుసుదేరడం
**embrocate** తోము, రుద్దు, మర్దనచేయు
**embrocation** మర్దనం
**embroider** కుట్టుపనిచేయు, అల్లు; సూదితో చేసిన అల్లిక పని
**embroidery** కసీదా/ బుటేదారు పని
**embroil** చిక్కుల్లోపడు, కలవరపడు, వివాదంలో చిక్కుకొను, జగడంలో తలదూర్చు, సందిగ్ధంలో పడు
**embryo** పిండం. ~ *transfer* పిండం మార్పిడి. ~ *transfer technology* పిండ ప్రవేశన ప్రక్రియ
**embryology** పిండోత్పత్తి/ పిండపరిణామ శాస్త్రం
**emend** పరిష్కరించు, సవరించు, పొరపాట్లు దిద్దు, తప్పులు సరిదిద్దు
**emerald** మరకతం. ~ *green* మరకత హరితం, గరుడ పచ్చరంగు
**emerge** ఉదయించు, ఉద్భవించు, కొత్తగా బయల్పడు
**emergence** ఉద్భవం, నూత్న రూప వ్యక్తీకరణం
**emergency** అత్యవసర పరిస్థితి, అత్యయిక పరిస్థితి
**emergent evolution** ఉద్గామి/ నిర్గమన పరిణామవాదం
**emeritus** గౌరవాచార్యుడు
**emersion** గ్రహణం విడుపు
**emetic** వమనకారి, వాంతికలుగజేసే
**emigrant** ప్రవాసి, వలస వెళ్ళిన వ్యక్తి
**emigration** వలస, ప్రవాసం, దేశాంతర గమనం
**eminence** ఔన్నత్యం, పేరుప్రతిష్ఠలు
**eminent** సుప్రసిద్ధమైన, ప్రఖ్యాతమైన
**emissary** ఆంతరంగిక దూత, రహస్య ప్రతినిధి
**emission** ఉద్గారం, ప్రసరణ, స్ఖలనం
**emission standard** ఉద్గార ప్రమాణం
**emit** ప్రసరించు
**emitted** ఉద్గారిత
**emitter** ఉద్గారిణి, ప్రసారకం
**emmenia** (బహిష్టు సమయంలో) రక్తస్రావం
**emmetropia** సామాన్యదృష్టి
**emolument** రాబడి, ఆదాయం
**emotion** ఆవేశం, మనోద్వేగం
**emotive language** భావావేశ భాష
**empathy** తాదాత్మ్యం, సహానుభూతి
**empericism** అనుభూతివాదం
**emperor** సార్వభౌముడు, చక్రవర్తి, సామ్రాజ్యాధినేత
**emphasis** అవధారణ, ఏవకారం, ఉద్ఘాటన, నొక్కిచెప్పడం
**emphasize** నొక్కిచెప్పు, ఉద్ఘాటించు
**emphatically** దృఢంగా, గట్టిగా
**emphysema** ఊపిరితిత్తులలోని వాయుగోళాల వాపు
**empire** సామ్రాజ్యం, హద్దులు లేని అధికారం
**empiric** అనుభవసిద్ధ, ప్రయోగాత్మక, అనుభవాధార



**empirical** అనుభవంపై ఆధారపడిన, అనుభావిక; నిదర్శన పూర్వకమైన. ~ *formula* అనుభావిక సూత్రం. ~ *law* స్వానుభవ పూర్వక న్యాయం/ సూత్రం
**empiricism** అనుభవవాదం
**empiricist** అనుభవవాది
**employ** నియమించు, నియోగించు, ఉపయోగించుకొను
**employee** ఉద్యోగి. ~ *participation* నిర్ణయాలు తీసుకోవడంలో కార్మికుల, ఉద్యోగుల పాత్ర
**employees's buyout** ఉద్యోగులు ఎక్కువ వాటాలు కొని సంస్థపై నియంత్రణ సాధించడం
**employer** యజమాని. ~ *strategies* యాజమాన్య వ్యూహాలు
**employment** ఉపాధి, వేతనంతో కూడిన పని. ~ *agency/ exchange* ఉపాధి కల్పన కేంద్రం. ~ *exchange offices* ఉద్యోగ సూచక కార్యాలయాలు. ~ *protection* ఉద్యోగుల రక్షణ. ~ *seasonal* కాలికోద్యోగిత
**empoison** విషంపెట్టు, చెరుచు, చెడగొట్టు, పాడుచేయు
**emporium** విక్రయ కేంద్రం, వర్తక స్థలం, వ్యాపార భండారం
**empower** అధికారం ఇచ్చు
**empowerment** అధికార సంపాదన. ~ *strategies* అధికార సంపాదన వ్యూహాలు
**empress** సామ్రాజ్ఞి
**emptiness** శూన్యత, ఖాళీ, నిరర్థకత
**empty** ఉత్త, ఖాళీ, వట్టి, రిక్త
**empyema** చీముచేరడం
**emulate** అనుకరించు, అనుసరించు
**emulsification** తరళీకరణ, పాయసీకరణ
**emulsifier** తరళీకారకం, పాయసీకారకం
**emulsifying agent** తరళీకారక పదార్థం
**emulsion** తరళపదార్థం, పాయసం, రసాయనం
**enable** సాధ్యమయ్యేట్లు చేయు, శక్తి కలిగించు
**enact** చట్టంచేయు, శాసనంచేయు, నటించు
**enactment** చట్టం, శాసనం
**enamel** ఎనామిల్, దంతాలమీది/ పింగాణి పైపూత; పూతపూయు
**enamoured** వలపించే, మరులుగొల్పే
**enantimorphism** ప్రతిరూపత
**enantiomorph** ప్రతిరూపం, ప్రతిబింబం
**enantiomorphic** ప్రతిరూపాత్మక
**enantiotropy** రూపపరివర్తనం
**en bloc** అన్నీ ఒక్కటిగా, మూకుమ్మడిగా
**encamp** విడిదిచేయు, మకాంవేయు
**encampment** (సైనిక) శిబిరం, సైనికావాసం
**encapsulated** పొరతో ఆవృతమైన, చుట్టూ పొరలున్న
**encapsulation** సంపుటీకరణం
**encashment** నగదుగా మార్చుకొనడం
**encephalic** మెదడుకి సంబంధించిన
**encephalitis** మెదడువాపు వ్యాధి
**encephalogram** మస్తిష్కలేఖ, మస్తిష్క చిత్రం
**encephalograph** మస్తిష్కలేఖనం, మస్తిష్క చిత్రణ
**encephalomyelitis** మెదడు/ వెన్నుపాము నొప్పి
**encephalon** మెదడు
**encephalopathy** మస్తిష్కవికృతి
**enchain** గొలుసుతో బంధించు, శృంఖలాబద్ధుణ్ణి చేయు
**enchant** మంత్రముగ్ధుణ్ణి చేయు, వశపరచుకొను

**enchantment** వశీకరణ
**encircle** చుట్టుముట్టు, పరివేష్టించు
**encirclement** చుట్టివేత, చక్రబంధం
**enclave** విదేశంలో ఉన్న స్వదేశ భాగం
**enclose** జతచేయు, పరచు, చుట్టుకొను
**enclosed** ఆవృత
**enclosure** ఆవరణం, జతచేసినది
**encode** సంకేత నిర్మాణం
**encomium** స్తుతి, పొగడ్త, కీర్తనం, ప్రశంస
**encompassed** వ్యావృత, చుట్టుముట్టిన
**encore** పదే పదే ప్రదర్శించడం
**encounter** ఎదురగు, ఎదుర్కొను; ఎదుర్కోలు, ఎదురు కాల్పులు
**encouragement** ప్రోత్సాహం, ఉత్తేజనం
**encroach** అన్యాయంగా ఆక్రమించు/ ప్రవేశించు
**encroacher** దురాక్రమణదారు
**encroachment** అక్రమ ప్రవేశం, కబ్జా, స్వాధీనం, అతిక్రమణ, దురాక్రమణ
**encrustation** అవశిష్ట పటం
**encryption** సంకేత నిక్షిప్త సందేశం
**enculturation** నిరంతర సంస్కృతీకరణ
**encumber** గతి నిరోధంచేయు, భారం వేయు
**encumbered** తాకట్టు భారం ఉంచిన, రుణగ్రస్త
**encumbrance** రుణభారం, చిక్కు. ~ *certificate* రుణభార ధ్రువపత్రం
**encyclopaedia** విజ్ఞాన సర్వస్వం/ కోశం
**end** అంతం, అంత్య
**endanger** అపాయం కలిగించు
**endangered species** అంతరించే ప్రమాదం ఉన్న జీవజాతులు
**end consumer** ఉత్పత్తిని ఉపయోగించే వ్యక్తి
**endear** ఇష్టం కలిగించు, అభిమానం రేకెత్తించు
**endearingly** గోముగా
**endeavour** కృషి, ప్రయత్నం, సన్నాహం, ప్రయాస; శ్రమించు, కష్టపడు, పోటీపడు, ప్రయత్నంచేయు
**endemic** విశిష్టమయిన, విలక్షణమయిన, ఏకప్రదేశగత, స్థలవిశిష్ట, స్థానిక. ~ *disease* స్థానపరవ్యాధి
**endocardium** గుండె లోపలి పొర
**endocarp** అంతఃకవచం
**endocrine** అంతస్స్రావ, వినాళగ్రంథి, అంతఃస్రావి. ~ *glands* అంతర్ముఖ గ్రంథులు
**endocrinology** అంతస్స్రావ విజ్ఞాన శాస్త్రం, వినాళగ్రంథి శాస్త్రం
**endoderm** అంతరత్వచం, పిండం లోపలి పొర
**endodermis** అంతశ్చర్మం
**endogamy** సజాతి వివాహం
**endogenous** అంతర్జాతం, శరీరంలో జనించిన
**endometrium** గర్భాశయం లోపలి పొర
**endoparasite** అంతఃపరాన్నజీవి
**endophasia** సైగల ద్వారా భావ ప్రసారం
**endophyte** పరాన్నజీవి
**endoplasm** అంతర్జీవద్రవ్యం
**endorse** ఆమోదించి, సంతకంచేయు, సమ్మతించు, అంగీకరించు; ఆమోదం, సమ్మతి
**endorsed** ఆమోదించిన
**endorsement** ఆమోదం, సమ్మతి రాత, పత్రం వెనుక వైపు రాత
**endorser** పీటీ లేఖకుడు
**endoscope** కుహరాంతర్దర్శని
**endoscopy** కుహరాంతర్దర్శనం
**endoskeleton** అంతఃకంకాళం, ఎముకల గూడు



**endothelial** నాళం లోపలి పొర
**endothermic** ఉష్ణగ్రాహక, తాపచూషకం, వేడిని మింగేది. ~ *reaction* ఉష్ణగ్రాహక ప్రతిచర్య
**endothermicity** ఉష్ణగ్రాహకత్వం
**endotoxin** జీవాంతస్థ విషపదార్థం
**endotracheal** శ్వాసనాళాలలోని
**endow** దానం చేయు, ఇచ్చు
**endowment** ధర్మనిధి, దానం. ~ *fund* ధర్మాదాయ నిధి. ~ *speech* ధర్మనిధి ప్రసంగం
**end-product** అంతిమోత్పత్తి
**endrin** పురుగుమందు, క్రిమిసంహారక రసాయనం
**ends** ప్రయోజనాలు. *serve their own* ~ స్వప్రయోజనాలను/ స్వార్థానికి ఉపయోగించే. ~ *and means* లక్ష్యాలు, సాధనాలు, ఆశయాలు, మార్గాలు
**endurance** సహన శక్తి, ఓర్పు
**endure** సహించు, భరించు, ఓర్చు; చాలా కాలంగా ఉండు
**end user** చరమోపయోక్త
**enema** ఉదర శుద్ధి
**energetic** శక్తిమంతమైన
**energetics** శక్తిశాస్త్రం
**energism** శక్తివాదం
**energy** శక్తి, విద్యుత్తు, బలిమి. ~ *barrier* శక్తినిరోధం. ~ *constant* శక్తి స్థిరాంకం. ~ *level* శక్తిస్థాయి. ~ *resonance* అనునదన శక్తి. ~ *spectrum* శక్తి వర్ణపటం. ~ *translational* స్థానాంతరణ శక్తి
**enervate** బలంకోల్పోవు
**enfant terrible** అల్లరిపిల్లవాడు, గడుగ్గాయి
**enfeeblement** బలహీనత, నిస్సత్తువ
**enforce** అమలు పరచు, ఆచరణలోకి తెచ్చు, బలవంతం చేయు. ~ *a right* హక్కు అమలుపరచు
**enforcement** అమలు, దావావేయడం, జప్తుచేయడం, ఆచరణ
**enfranchise** ఓటుహక్కు ఇచ్చు, విముక్తుని చేయు, స్వేచ్ఛనిచ్చు
**engage** పనిలో నియమించు
**engaged** నియమితుడైన, పనిలో నిమగ్నుడై ఉండిన; (టెలిఫోన్) ఉపయోగంలో ఉన్న, పెళ్ళిచేసుకోవ నిశ్చయించిన
**engagement** సమయ నియమం, వివాహ నిశ్చితార్థం; రోజువారీ కార్యక్రమం
**engender** కారణమగు
**english mortgage** అడుమానం
**engorge** ఆబగాతిను
**engorged** ఉబ్బిన
**engraft** అంటుకట్టు, ఇముడ్చు, కలుపు
**engram** జీవ రసాయన భేదం
**engraved** ప్రగాఢమైన ముద్రవేసిన, చెక్కిన, ముద్రించిన
**engraver** నగిషీలు చెక్కే శిల్పి
**engraving** నగిషీ చెక్కడం పని
**engross** నిమగ్నంచేయు, శుద్ధప్రతి రాయు
**engulf** ముంచు, మింగివేయు
**enhance** వృద్ధిచేయు, అధికంచేయు, మెరుగుపడు, మెరుగుపరుచు
**enigma** రహస్యం, సమస్య, గూఢప్రశ్న
**enigmatic** సమస్యాత్మక, నిగూఢ, తికమక పెట్టే
**enigmatist** తికమక పెట్టే వ్యక్తి
**enjoin** ఆదేశం జారీచేయు, నియమించు
**enlace** కౌగిలించుకొను
**enlarge** పొడిగించు, విస్తరింపజేయు
**enlargement** విస్తరణ, పరివర్ధనం
**enlarging** విపులీకరణ

**enlighten** విశదపరచు, స్పష్టంచేయు, తెలియజేయు, ప్రబోధాత్మకం చేయు
**enlightenment** విశదీకరణ, ప్రబోధాత్మకత, జ్ఞానోదయం
**enlist** పట్టీలోచేర్చు, భర్తీచేయు, సహకారం పొందు. ~ *support* మద్దతు పొందు
**en masse** అంతా కలిసి, కలసికట్టుగా, మూకుమ్మడిగా, సంఘటితంగా
**enmeshed** చిక్కుకొన్న
**enmity** శత్రుత్వం, విరోధం, వైరం
**ennoble** ఉన్నతినికలిగించు, ఘనతను చేకూర్చు, పదవీవృద్ధి చేయు, ప్రతిష్ఠ కలిగించు
**ennui** గ్లాని, నిరుత్సాహం, మానసికమైన అలసత్వం
**enophthalamos** కనుగుడ్డు లోనికి పోవడం
**enormity** అమితత్వం, సువిస్తృతి
**enormous** అపరిమితమైన, విస్తారమైన. ~ *crime* ఘోరనేరం
**enquire** విచారణజరుపు
**enquiry** సంశోధన, విచారణ, దర్యాప్తు, వాకబు, పరిశీలన
**enragement** రెచ్చిపోవడం, కోపోద్రిక్తత
**enrapture** పరమానందం కలిగించు, పారవశ్యం కలిగించు
**enrich** వృద్ధిచేయు, ధనవంతునిచేయు, సుసంపన్నంచేయు
**enriched isotopes** సంవర్ధిత సమస్థానీయాలు
**enrichment** సుసంపన్నత
**enroll** నమోదు చేసుకొను, జాబితాలో ఎక్కించు, సభ్యునిగాచేరు, భర్తీచేయు
**enroute** మార్గమధ్యంలో
**ensanguined** రక్తబాంధన
**enshrine** ప్రతిష్ఠించు, పవిత్రస్థానమగు
**enshroud** మరుగుపరచు, కనబడకుండా చేయు
**ensilage** పచ్చగడ్డి
**enslave** బానిసగా చేయు
**enslaved** బానిసగా చేసిన
**ensnare** వలలో వేసుకొను
**ensue** రాబోవు, సంభవించు
**ensuing year** రాబోయే సంవత్సరం
**ensure** హామీఇచ్చు, గట్టిపరచు
**ensuring** స్థిరపరచడం, చేకూర్చడం
**entail** అనివార్యంచేయు, అవకాశం కల్పించు, వారసత్వపు హక్కు కల్పించు; అన్యాక్రాంతం కాకుండా చూచు, పరిమితం చేయు
**entailed** సంక్రమింపజేసిన
**entailment** వారసత్వ నిరూపణ/ నిర్ణయం, అనుబంధార్థం
**entangle** చిక్కుల్లో పడవేయు, చిక్కుకొను, చిక్కునపడు, సమస్యలో పడదోయు
**entanglement** చిక్కు, సమస్య
**entente** సామరస్యభావం, మైత్రి
**enter** ప్రవేశించు, ఆరంభించు, ప్రారంభించు, ఖాతాపుస్తకంలోకి ఎక్కించు/ నమోదుచేయు. ~ *into contract* కాంట్రాక్టు కుదుర్చుకొను
**enteric** ఆంత్రసంబంధి
**enteritis** ఆంత్రప్రకోపం, పేగునొప్పి
**enterogastric** ఆంత్ర ~ జఠర
**enterogenous** పేగునుంచి పుట్టిన, ఆంత్రజన్య
**enteropathy** ఆంత్రవికృతి
**enterprise** సాహసం; కంపెనీ, వ్యాపారం; తత్పరత
**entertain** వినోదపరచు, అతిథి సత్కారం చేయు, స్వీకరించు
**entertainer** మనోరంజనం/ వినోదం కలిగించే వ్యక్తి



**entertainment** వినోదం. ~ *allowance* వినోద బత్తెం
**enthral** ఆకర్షించు, సమ్మోహింపచేయు
**enthusiasm** ఉత్సాహం
**enthusiast** ఉత్సాహి
**enthusiastic** ఉత్సాహభరితమైన
**entice** ప్రలోభపెట్టు, మభ్యపెట్టు, ఆకర్షించు
**enticement** ఎర, ప్రలోభం
**enticer** ప్రలోభకుడు, ఆశచూపి ఆకర్షించే వ్యక్తి
**enticing** శృంగారమైన, సరసమైన, నయవంచకమైన, మనోహరమైన
**entire** నిశ్శేష; నిఖిల, సకల, సమస్త, అఖండ, అంతా, మొత్తం, పూర్తి
**entirely** పూర్తిగా
**entireness** సమస్తం, సంపూర్ణత
**entirety** సమగ్రత, సంపూర్ణత
**entitle** అధికారమిచ్చు, హక్కు కలుగచేయు, హక్కు కలిగి ఉండు
**entomic** కీటక సంబంధమైన
**entomologist** కీటక సంబంధమైన
**entomologist** కీటక శాస్త్రవేత్త
**entomology** కీటక శాస్త్రం
**entrails** పేగులు
**entrammel** చిక్కుల్లో ఇరికించు, ప్రతిబంధం కలిగించు
**entrancement** మైమరుపు
**entrant** ప్రవేశకుడు లోపలికిపోయే/ వచ్చే వ్యక్తి
**entrap** చిక్కులో పెట్టు, బోనులోపెట్టు
**entreat** వేడుకొను, యాచించు
**entreaty** వేడుకోలు, యోచ, బతిమిలాట, వినతి
**entrepot** ఎగుమతి సరుకునుంచు గిడ్డంగి. ~ *trade* నౌకా గిడ్డంగి దగ్గరి కొనుగోళ్లు అమ్మకాలు
**entrepreneur** వ్యాపార సమారంభకుడు, పారిశ్రామికవేత్త, వ్యవస్థాపకుడు
**entrepreneurial** వ్యాపార సామర్థ్యం
**entrepreneuship** వ్యవస్థాపకత
**entropy** అయోమయ స్థితి, జడోష్ణత
**entrust** అప్పగించు
**entrustement** అప్పగింత
**entry** ఆరోపణ, ప్రవేశం, చేరిక, నమోదు, ప్రవేశార్హత, సమాచారం. ~ *norms* ప్రవేశ నిబంధనలు. ~ *tax* ప్రవేశ సుంకం
**enucleation** సమూలంగా తీసివేయడం
**enumerate** ఎంచు, లెక్కపెట్టు; మార్పు/ బదలాయింపు పద్దు
**enumerative universals** గణనాత్మక సార్వత్రికాలు, సార్వత్రిక ప్రతిజ్ఞా వాక్యం
**enumerator** పరిగణకుడు
**enunciate** పద్ధతిప్రకారం చెప్పు, స్పష్టంగా ఉచ్చరించు, వివరించు, ప్రతిపాదించు, ప్రకటించు
**enuresis** పక్కలో మూత్ర విసర్జన
**enviable** అసూయ కలిగించే, అపేక్షణీయమైన, ఆశించదగిన
**envious** అసూయపడు
**environment** పరిసర (వాతావరణ)ం, పర్యావరణం. ~ *interests* పర్యావరణ ప్రయోజనాలు
**environmental** పర్యావరణ సంబంధి. ~ *balance* పర్యావరణ సంతులనం/ పరిస్థితి/ సమతౌల్యం. ~ *pollutant* పరిసర కాలుష్యకారకం
**environmentalism** పరిసర ప్రాధాన్యవాదం
**environmentalist** పర్యావరణవేత్త
**environmentally friendly** పర్యావరణ స్నేహశీలి

**environmental psychology** పరిసర సంబంధి మనస్తత్త్వాధ్యయనం
**envisage** ఊహించు, పరికించు, ఎదుర్కొను
**envoy** రాయబారి, దూత, ప్రతినిధి
**enwind** పెనవేయు
**enzyme** కిణ్వం
**eolith** రాతిపనిముట్టు
**eon** మహాయుగం, సుదీర్ఘకాలం
**epee** (ఫెన్సింగ్‌లో) కత్తి
**ephemeral** అశాశ్వత, అల్పాయుష్కమైన, క్షణభంగుర
**epic** ఇతిహాసం, పురాణం
**epicedium** శ్మశానగీతం, విలాపగీతం
**epicene** ఉభయలింగి. ~ *plural* ఉభయలింగ/ బహువచనం
**epicentre** భూకంపన కేంద్రం. ~ *of earth quake* భూకంప కేంద్రం
**epics** పురాణేతిహాసాలు
**epicure** భోజనప్రియుడు, భోగపరాయణుడు
**epidemic** అంటువ్యాధి. ~ *disease* సాంక్రామిక/ వ్యాపకజాడ్యం
**epidemiological** సాంక్రమిక వ్యాధుల అధ్యయనానికి సంబంధించిన
**epidemiology** సాంక్రమిక రోగ విజ్ఞానం
**epidemologist** సాంక్రామిక వ్యాధి శాస్త్రజ్ఞుడు
**epidermis** బాహ్యచర్మం; చర్మం పైపొర
**epigenesis** కొత్త క్రిమి పుట్టడం
**epiglottis** ఉపజిహ్వ, కందమూలం
**epigon(e)** అనుకర్త
**epigram** సూక్తి, చతురోక్తి, సంక్షిప్తరచన
**epigraph** శిలాశాసనం
**epigraphist** పురాలేఖన విజ్ఞాని
**epigraphy** శాసనాధ్యయనం, ప్రాచీన లిపిశాస్త్రం
**epilate** రోమాలను తొలగించు
**epilation** రోమచ్ఛేదన, వెంట్రుకల తొలగింపు
**epilepsy** మూర్ఛ, స్పృహతప్పడం, అపస్మారం
**epileptic fit** మూర్ఛ
**epilogue** ఉపసంహారం, చివరిమాట, భరతవాక్యం
**epipetalous** పువ్వుల రేకులపై పుట్టిన
**epiphenomenalism** అనుఘటనవాదం
**epipholoedal** చెట్టు బెరడు ఉపరితలంపై పెరిగే
**epiphora** కన్నీరు ఎక్కువగా కారడం
**epiphyllous** ఆకులపై పెరిగే
**epiphysis** ఎముక కొనభాగం
**epiphytic** వృక్షోపజీవి
**episepalous** రక్షక పత్రంపై ఉండే
**episode** ఉపాఖ్యానం, సంఘటన, ఉపకథ, ఉదంతం, సంఘటన అంతర్గాథ
**episodic way** కథన రీతి
**epistaxis** ముక్కునుంచి రక్తం కారడం
**epistemological dualism** జ్ఞానాత్మక ద్వైతవాదం
**epistemology** జ్ఞానమీమాంస
**epistle** ఉత్తరం, లేఖారూప రచన, ధర్మపత్రం
**epistolary** లేఖల ద్వారా చెప్పిన కథ
**episiotomy** భగచ్ఛేదన
**epitaph** చివరిమాట, సమాధి మీది రాత
**epithelium** ఉపతలం
**epithet** విశేషణం, బిరుదు, గుణవాచకం
**epitome** పార (సంగ్రహం), సారాంశం, సంక్షేపం
**epitomization** సంగ్రహీకరణం, సారాంశ కథనం
**epixylous** చెక్కలపై ఉండే



**epoch** యుగం, శకం, కాలం
**eponym** వ్యక్తుల నుంచి ప్రదేశాలకు మారిన పేరు
**eponymous** ఒక వ్యక్తి గుర్తుగా పేరుపెట్టి
**equal** దీటు, సమాన, సరి. ~ *opportunity* సమానావకాశం. ~ *pay* సమాన వేతనం. ~ *protection of laws* సమానమైన రక్షణ కల్పించే చట్టాలు
**equalise** సమానం చేయు
**equalising** సమానం చేయడం
**equalitarianism** సర్వమానవ సమానత్వం
**equality** సమానత్వం, సమానత. ~ *before law* చట్టం దృష్టిలో సమానత
**equanimity** సమదృష్టి, సమబుద్ధి, శాంతం, సమభావం, శాంతి
**equatarianism** సమతావాదం
**equate** సమానమని భావించు, సమానం చేయు, సమదృష్టితో చూచు, సమపరచు, సమంచేయు
**equation** సమీకరణం, సమానత
**equator** భూమధ్యరేఖ
**equatorial** భూమధ్యరేఖకు సంబంధించిన. ~ *region* భూమధ్య రేఖా ప్రాంతం. ~ *zone* భూమధ్య రేఖా మండలం
**equilateral** సమబాహు
**equilibrium** సమతౌల్యస్థితి, సమాన స్థితి, సమతౌల్యం, సమస్థితి, సమతులనం, సమతూకం. ~ *approach* సమతా పద్ధతి
**equine** అశ్వ సంబంధమైన
**equinox** విషువత్తు (రాత్రింబగళ్ళు సమంగా ఉండే రోజు)
**equinoxes** విషువత్తులు: పగలు, రాత్రి సమాన పరిమాణంలో ఉండే దినాలు. మార్చి 21, సెప్టెంబరు 22
**equip** సమకూర్చుకొను
**equipage** సరంజామా
**equipartition** సమవిభజనం
**equipment** పరికరం, సాధన సామగ్రి, సరంజామా
**equitable** ధర్మమైన, సమధర్మ, న్యాయబద్ధ. ~ *allocation* న్యాయబద్ధ కేటాయింపు
**equitably** ధర్మ (బద్ధ)ంగా
**equity** సమానత్వం, సమధర్మం. ~ *capital* సమాన మూలధనం. ~ *dividend* సమాన లాభాంశం. ~ *jurisprudence* సమధర్మ న్యాయశాస్త్రం
**equivalence** సమతుల్యత, సమానత
**equivalent** సరిసమానం, సమానమైన, అస్పష్టం, సందిగ్ధం, తుల్యమైన. ~ *rank* సమానహోదా. ~ *temperature* తుల్యోష్ణోగ్రత. ~ *weight* తుల్యభారం
**equivocation** సందిగ్ధత
**eradicate** తుడిచిపెట్టు, నిర్మూలించు, నాశనంచేయు
**eradication** నిర్మూలనం
**erase** తుడిచివేయు, తీసివేయు
**erasure** చెరిపివేత, రద్దు
**erect** నిలబెట్టు, స్థాపించు, నెలకొల్పు, తిన్నగా నిలువు, నిర్మించు
**erection** ఉత్థానం, స్థాపన, నిర్మాణం, నెలకొల్పడం
**eremphobia** ఏకాంతభయం
**erg** ఎడారిలోని ఇసుక లోయ
**ergonomics** సమర్థతా అధ్యయనం
**ergophobia** పని అంటే భయం
**eristic** వాదకళ
**erode** కోయు, కోసుకపోవు
**erosion** (క్రమ) క్షయం, కోత, అరుగుదల, ఒరపిడి. *soil* ~ భూమి కోత

**erotic** కామోత్తేజక, కామోద్దీపక
**erotica** ప్రణయ/ శృంగార/ సంబంధి సాహిత్యం
**erotomania** మదపిచ్చి; విపరీత కామ వాంఛ
**err** పొరపాటు/ తప్పుచేయు
**errant** వక్రమార్గం, సాహసయాత్ర
**errata** తప్పొప్పుల పట్టిక
**erratic** నియమరహిత, అనియత, అవ్యవ స్థిత, అపసవ్య
**erring** తప్పుచేయడం
**erroneous** పొరపాటైన, తప్పుడు. ~ *statement* తప్పుడు ప్రకటన
**error** తప్పు, పొరపాటు, దోషం. *absolute* ~ నిరపేక్ష దోషం. ~ *prone* తప్పుచేసే
**erstwhile** ఒకప్పటి, పాత, ఇదివరకటి
**erudition** ఆర్జిత, పాండిత్యం, సంచిత జ్ఞానం
**erupt** పేలు, పగులు, జరుగు, బద్దలగు, విస్ఫోటనం చెందు, హింసాత్మకంగా మారు, విరుచుకుపడు
**eruption** విస్ఫోటనం, పగలటం. *drug* ~ మందువల్ల వచ్చే దద్దుర్లు
**erythema** చర్మం ఎర్రబడడం/ కందడం
**erythrocyte** ఎర్ర రక్తకణం
**escalation** క్రమంగా పెరగడం
**escapade** పలాయనం, విముక్తి
**escape** తప్పించుకొను, పారిపోవు, పలాయనం చిత్తగించు
**escape velocity** పలాయన వేగం
**escaping electron** పలాయక విద్యుత్కణం
**eschatology** మరణానంతర జీవచరిత్ర
**escheat** (వారసులు లేకపోవడం వల్ల) ప్రభుత్వానికి ఆస్తి
**escheats** చట్టబద్ధమైన యజమాని లేని స్థిరాస్తులు
**eschew** పరిహరించు, తొలగిపోవు, దూరమగు
**escort** రక్షకదళం, వాహనశ్రేణి, వెంటపోవు, వెంబడించు
**escrow** ప్రతిబంధ హక్కుపత్రం/ దస్తావేజు
**esophagitis** అన్నవాహిక నొప్పి
**esophagus** అన్న/ ఆహార వాహిక
**espionage** గూఢచర్యం, వేగుపద్ధతి
**esplanade** నడిచేమార్గం
**espouse** సహచరిగా/ సహచరునిగా స్వీకరించు, పెండ్లాడు
**esprit de corps** గుంపులోని వ్యక్తుల మధ్య ఉండే సన్నిహితత్వం/ ఏకతాభావం
**essay** వ్యాసం, సాధన, ప్రయత్నం
**essayist** వ్యాసకర్త
**essence** ముఖ్యాంశం, సారాంశం
**establish** స్థాపించు, నిరూపించు
**estate** ఆస్తి, సంపద, భూసంపత్తి. ~ *duty* సంపద పన్ను
**esteem** గౌరవం, ప్రతిష్ఠ
**estimate** అంచనావేయు, తూచు, మదించు; అంచనా
**estoppel** అడ్డు, ప్రతిబంధకం, స్వచ్ఛందంగా ఏర్పరచుకొనే నిషేధం, వాద నిషేధం
**estrange** వేరుచేయు, విడదీయు, విముఖత/ విరోధం కలిగించు
**estray** తప్పిపోయిన పశువు
**estuaries** నదీముఖాలు
**estuarine creeks** ఉప్పునీటి కయ్యలు
**estuary** నదీముఖద్వారం, ఉప్పుకయ్య
**et al** ఇంకా, ఇతరులు, ప్రభృతులు, ఇతరాలు మొదలైనవి
**etch** చెక్కు (నమూనా) తయారీచేయు



**etched** చెక్కిన, అచ్చొత్తిన
**eternal** అనశ్వర, అనంత. ~ *flame* అఖండజ్యోతి
**eternity** నిత్యత్వం, శాశ్వతత్వం
**ethereal** చాలా తేలికైన, సుకుమారమైన, దేవతా/ ఖగోళ సంబంధి
**ethical** నైతిక, నీతిసంబంధమయిన. ~ *values* నైతిక విలువలు
**ethics** నీతిశాస్త్రం
**ethnic** నిర్దిష్టజాతికి/ భాషకు సంబంధించిన. ~ *conflict* జాతుల వివాదం. ~ *group* జాతి సమూహం. ~ *problem* జాతి సమస్య
**ethnicity** స్వజాతీయత, స్వకులీనత
**ethnocentrism** స్వజాతి సంస్కృతి వ్యామోహం
**ethnography** మానవజాతి శాస్త్రం
**ethnological** మానవజాతి శాస్త్రానికి చెందిన
**ethnology** మానవజాతి శాస్త్రం
**ethnomusicology** భిన్నజాతుల సంగీతాధ్యయనం
**ethogram** జంతు ప్రవర్తన విశ్లేషణ
**ethology** జంతు పరిణామాధ్యయనం
**ethos** శీలం: కులం, వర్గం, జాతి, పద్ధతి, లక్షణాలు
**etiology** రోగోత్పత్తి శాస్త్రం
**etiquette** శిష్టాచారం; మర్యాద, రివాజు
**etude** అనుశీలనం, అధ్యయనం
**etymology** వ్యుత్పత్తి (శాస్త్రం)
**eucalyptus** నీలగిరితైల వృక్షం
**eugenics** సుజనన సంతతి విజ్ఞానం, నరవంశ శుద్ధి శాస్త్రం. *negative* ~ గర్భస్థ శిశువు లోపనివారణ. *positive* ~ గర్భస్థ శిశు వాంఛనీయతా నిర్ణయం
**eukaryote** కేంద్రక యుత జీవి
**eulogise** ప్రశంసలతో ముంచెత్తు, స్తుతించు, పొగడు
**eulogy** స్తుతి, ప్రశంస, ప్రశస్తి, పొగడ్త
**eumelanic** క్షీరదాల జుట్టురంగు
**eunomy** సుపరిపాలన
**eunuch** కొజ్జా, నపుంసకుడు
**eunuchism** నపుంసకత్వం
**euphemism** సభ్యోక్తి, మృదూక్తి, శిష్టోక్తి
**euphony** శ్రావ్యత
**euphoria** ఉల్లాసస్థితి
**euro** యూరోపియన్ యూనియన్ వారి నాణెం; ఐరోపాకు/ ఐరోపా సమాజానికి సంబంధించిన
**europa** గురుగ్రహం
**euroxic** ఎక్కువ ప్రాణవాయుడు భరించగల
**euryhaline** ఎక్కువ లవణ శాతాన్ని భరించగల
**euryphagic** బహువిధాహారాలు వాడే
**eurythermal** ఉష్ణోగ్రతలో మార్పు భరించడం
**euteetic** సులభ ద్రవీకరణం
**euthanasia** బాధానివారణ కోసం చంపడం
**eutrophia** సాధారణ పౌష్టికాహారం
**euyecious** చాలా నివాసాలు గల
**evacuant** రేచకం
**evacuate** ఖాళీచేయు/ చేయించు, రక్షిత స్థానాలకు తరలించు
**evacuation** ఒక ప్రాంతం నుండి ప్రజల తరలింపు, శూన్యీకరణం, గాలి లేకుండా చేయడం
**evacue** నిర్వాసితుడు. ~ *property* నిర్వాసితాస్తి
**evade** తప్పించుకొను, టలాయించు, ఎగవేయు

**evanescent** అశాశ్వతమైన, క్షణిక
**evangel** సువార్తా గ్రంథం
**evaporate** ఆవిరిచెందు, పరిశోషించు
**evaporation** బాష్పీభవనం, ఇగురబెట్టడం, ఆవిరవడం, పరిశోషణం
**evaporator** పరిశోషకం
**evasion** ఎగవేత; తప్పించుకోవటం
**evasively** సందిగ్ధంగా, తప్పించుకొంటూ
**evenhanded** ఉభయపక్షాలకు న్యాయం చేయడం; సమతుల్య
**event** సంఘటన, ఉదంతం
**event history analysis** సంఘటనాత్మక చరిత్ర విశ్లేషణ
**eventually** క్రమంగా, చివరికి, ఆఖరున
**ever** ఎల్లప్పుడు
**evergreen** సతతహరిత
**everlasting** శాశ్వత, నిత్య, అనంత, చిరంజీవియైన
**ever since** అప్పటినుంచి
**evict** (చట్టసహాయంతో) వెళ్ళగొట్టు/ తొలగించు, బేదఖలు చేయు
**eviction** వెళ్ళగొట్టడం, తొలగించడం. ~ *proceedings* తొలగింపు చర్యలు
**evidence** సాక్ష్యం
**evident** స్పష్ట, వ్యక్త
**evidentiary status** ప్రత్యక్షస్థాయి
**evidently** ప్రత్యక్షంగా, నిస్సందేహంగా
**evil** చెడ్డ, దుష్ట. ~ *doer* అపకారి. ~ *intent* దురుద్దేశం. *necessary* ~ వికృతిలో అవసరం. ~ *propensity* దుష్ట ప్రవృత్తి
**evince** సూచించు, స్పష్టంగా కనిపింపచేయు, వ్యక్తీకరించు
**evirate** పౌరుషహీనుణ్ణి చేయు, మగతనం పోగొట్టు
**evisceration** శరీరకుహరంలోని అవయవచ్ఛేదనం

**evocation** పిలుపు, పరీక్షాధికారం
**evodeviant** అసహజ జీవి
**evoke** రేకెత్తు, పిలుచు, వివాదాన్ని పై న్యాయస్థానానికి తీసుకొని వచ్చు, ఆమంత్రణంచేయు
**evolution** క్రమవికాసం, క్రమంలో సంభవించే మార్పు/ పరిణామం
**evolutionary** పరిణామాత్మక. ~ *theory* జీవపరిణామవాదం
**evolve** రూపొందించు
**evolved constitution** పరిణమిత రాజ్యాంగం
**ex** మాజీ
**exacerbate** పెరిగిపోయేటట్లుచేయు
**exacerbation** (వ్యాధి) ప్రకోపం, జబ్బు ముదరటం
**exact** బలవంతంగా చేయించు, సరి అయిన, ఖచ్చితమైన. ~ *science* విస్పష్ట శాస్త్రం
**exaction** బలాత్కారంగా చేయించుకోవడం, బలవంతపు వసూలు
**exactitude** నిర్దిష్టత
**exactly** ఖచ్చితంగా
**exaggerate** ఎక్కువచేసి చెప్పు
**exalt** పొగడు, పెద్దదిచేయు, ఉన్నత స్థానంలో ఉంచు
**exaltation** ఉన్నతస్థితి, గొప్పదనం
**examination** పరీక్ష. ~ *in chief* న్యాయవాది తన ప్రశ్నించి సాక్ష్యం చెప్పించటం. ~ *medico legal* న్యాయ ~ వైద్యపరీక్ష. ~ *sputum* ఉమ్మిపరీక్ష, కఫ పరీక్ష. ~ *stool* మలపరీక్ష
**examine** పరీక్షించు, విచారించు
**examinership** పరీక్షక పదవి
**example** ఉదాహరణ, తార్కాణం
**exanimate** మృత, నిర్జీవ, ప్రాణరహిత



**exanthema** స్ఫోటక జ్వరం
**exasperate** రెచ్చగొట్టు, విసిగించు, వేధించు
**excathedra** అధికార పూర్వకంగా
**excavate** తవ్వితీయు, వెలికితీయు
**excavation** తవ్వకం, ఉత్ఖాతనం
**excavators** ప్రాచీన శిథిలాల కోసం తవ్వకాలు జరిపేవారు, ఉత్ఖాతకులు
**excel** అధిగమించు, ముందుకుపోవు, మించు
**excellence** శ్రేష్ఠత, ఉత్కృష్టత, సమర్థత, ప్రాశస్త్యం, ఉత్తమత, శ్లాఘ్యత
**excellent** ఉత్తమ, శ్రేష్ఠ, దివ్య
**excellently** భేషుగ్గా
**except** మినహా, తప్ప, అపవాదంగా
**excepted** మినహాయించిన, వర్జించిన
**exception** అపవాదం, మినహాయింపు, అసామాన్యం
**exceptional** అసామాన్యమైన, ప్రత్యేకత గల, మినహాయించిన
**exceptionally** అసామాన్యంగా
**excerpt** సంగ్రహం, సారాంశం, ఉద్ధరణ
**excess** మితిమీరిన, అతి, మించిన, ఎక్కువ, అధిక(మొత్తం). ~ *capacity* అధిక సామర్థ్యం. ~ *demand* అధిక డిమాండు. ~ *supply* అధిక సరఫరా
**exchange** మారకం, మార్పిడి, వినిమయం; చదరంగంలో పరస్పరం పావుల బలి. ~ *control* మారకపు నియంత్రణ. ~ *of contracts* మార్పిడి చేసుకునే ఒప్పంద పత్రాలు. ~ *of fire* ఎదురు కాల్పులు. ~ *rate* మారకపు రేటు. ~ *rate mechanism* మారకం రేటు విధానం
**exchangeability** వినిమయయోగ్యత, మార్పిడికి వీలుగా ఉండటం

**exchangeable** మార్పిడి చేయదగిన
**exchequer** ఖజానా, కోశాగారం
**excipient** ఆక్షేపణ తెలుపు, అభ్యంతరం తెలుపు
**excise** వస్తువుల తయారీపై వేసే పన్ను; శస్త్రచికిత్స. ~ *duty* ఉత్పాదన సుంకం, ఆబ్కారీ సుంకం. ~ *sleuth* ఆబ్కారీ గూఢచారి
**excission** విచ్ఛేదనం
**excitation** ఉత్తేజన, ప్రేరణ, అదనపుశక్తిని చేర్చడం. ~ *energy* ఉత్తేజన శక్తి
**excite** ఉద్వేగపడు, ఉత్తేజపరుచు
**excited** ఉత్తేజిత. ~ *state* ప్రేరిత/ ఉత్తేజిత స్థితి
**excitement** ఆవేగం, ఉద్వేగం
**excitent** ఉత్తేజకం
**exciting** ఉత్తేజక, ఉద్రేకం కలిగించే, ఉత్సాహకరమైన
**exclude** తొలగించు, తోసివేయు, పరిహరించు, మినహాయించు, విడిచిపెట్టు
**exclusion** తప్పించడం, వదిలిపెట్టడం. ~ *principle* వర్జన నియమం
**exclusive** ప్రత్యేకమైన, పరిమితమైన, విశిష్టమైన. ~ *distributor* ఒకే ఒక పంపిణీదారుడు. ~ *economic zone* ప్రతేకార్థిక మండలం. ~ *powers* ప్రత్యేకాధికారాలు
**exclusively** ప్రత్యేకంగా
**excommunicate** వెలివేయు, బహిష్కరించు
**excrement** విసర్జన, మలం, పెంట, రెట్ట
**excrescence** అవాంఛనీయ వృద్ధి
**excreta** విసర్జక పదార్థాలు
**excrete** విసర్జించు, విసర్జన
**excretion** విసర్జన
**excruciate** బాధ/ వ్యథ కలిగించు/ పుట్టించు

**excuria** కోర్టు వెలుపల
**excursion** వినోద/ విజ్ఞాన పర్యటన
**excursus** అవాంతర ప్రసంగం
**excusable** క్షమించదగిన, క్షమార్హమైన
**excuse** క్షమాపణకోరు; మిష, సాకు, నెపం
**exdividend** లాభంలో వాటాలేని
**execute** అమలు జరుపు; మరణదండన అమలు జరుపు
**execution** అమలు, ఉరి, మరణశిక్ష; (కార్య) నిర్వహణ, అమలు జరపడం
**execution petition** అమలు జరపవల సిందిగా కోరే అర్జీ
**executive** అమలుచేసే, నిర్వహించే; నిర్వ హణాధికారి, కార్యనిర్వాహకవర్గం. ~ *committee* కార్యవర్గం. ~ *director* బోర్డ్ ఆఫ్ డైరెక్టర్లలో ఒకరైన పూర్తికాలపు ఉద్యోగి. ~ *order* అధికారిక ఉత్తరువు. ~ *powers* కార్యనిర్వహణాధికారాలు. ~ *privilege* ప్రత్యేక కార్యనిర్వాహకణాధి కారం
**executor** కార్యనిర్వహణాధికారి, అమలు దారు
**exegesis** భాష్యం, వ్యాఖ్య
**exegete** వ్యాఖ్యాత, భాష్యకారి
**exemplary** ఆదర్శప్రాయమైన, అనుకరణ యోగ్యమైన
**exemplary** ఆదర్శ, మార్గదర్శక, అను కరణ యోగ్యమైన. ~ *damage* నష్టపరి హార ధనానికి మించిన నష్టం
**exemplon** ఆదర్శ/ అనుసరించదగిన వ్యక్తి
**exempt** మినహాయించు. ~ *gifts* మొత్తం వడ్డీని చెల్లించే ప్రభుత్వ సెక్యూరిటీలు. ~ *gilts* ఆదాయ పన్ను నుంచి మినహా యింపు ఇచ్చి వడ్డీ మొత్తాన్ని చెల్లించే ప్రభుత్వ సెక్యూరిటీలు
**exempted** మినహాయించిన
**exemption** మినహాయింపు, మినహాయిం చడం
**exercise** వినియోగ వ్యాయామం. *breathing* ~ శ్వాసకు సంబంధించిన వ్యాయామం. *post partum* ~ ప్రసూతి వ్యాయామం
**exert** ఉపయోగించు, శ్రమించు, విని యోగించు, ప్రయత్నించు
**exertion** శ్రమ, పని
**exfiltration** నీరు బయటకు కారడం
**exfoliation** కణాలు రాలిపోవడం
**ex gratia** పరిహారం
**exhalation** ఊపిరివిడవడం, నిశ్వాసం
**exhale** ఊపిరివిడుచు, విశ్వసించు
**exhaust** అయిపోవు, అలసిపోవు, వట్టిపోవు చేయు, ఖాళీ అయిపోవు
**exhaustion** అలసిపోవడం, నిస్త్రాణ, ఖాళీ అయిపోవడం. ~ *of ore* ధాతు నిష్కా సనం
**exhibit** చూపెట్టు; కోర్టులో సాక్ష్యంగా దాఖలు చేసిన పత్రం, ఇతర వస్తువులు
**exhibition** (వస్తు) ప్రదర్శన
**exhibitionism** ప్రదర్శనాత్మక ప్రవర్తన, ఆడంబర స్వభావం
**exhibitionist** దేహ ప్రదర్శన చేసే వ్యక్తి, దాంభికుడు
**exhibitor** ప్రదర్శకుడు
**exhilarant** ఉల్లాసకారణం
**exhort** ఉద్బోధించు, ప్రేరేపించు, ప్రోత్స హించు, బోధించు
**exhortation** ఉద్బోధ, ప్రేరేపణ, ప్రోత్సాహం
**exhumation** పాతిన శవాన్ని పైకి తీయడం, పై రాళ్ళను తొలగించడం
**exhume** తవ్విబయటకు తీయు, పూడ్చిన శవాన్ని వెలికితీయడం



**exile** నిర్వాసితుడు, నిష్కాసితుడు, దేశ బహిష్కారం చేయు
**exilement** దేశబహిష్కరణ
**exima** కర్పాణి, ఒక చర్మ వ్యాధి
**exim bank** అంతర్జాతీయ వాణిజ్యావస రాలు తీర్చే బాంకు
**exim policy** *(export import policy)* ఎగుమతి దిగుమతుల విధానం
**exist** బతుకు (జీవించి) ఉండు
**existence** ఉనికి, స్థితి, అస్తిత్వం, జీవిత కాలం
**existentialism** అస్తిత్వవాదం
**existential sociology** అస్తిత్వవాది సామా జిక శాస్త్రం
**exit** నిర్గమనం, వెళ్ళేదారి
**exit polls** ప్రజాభిప్రాయ సేకరణ
**exobiology** గ్రహాంతర జీవశాస్త్రం
**exocrine** బహిస్స్రావి
**exodus** పెద్ద సంఖ్యలో ప్రజల వలస, మహానిర్గమనం, మహా ప్రవాహం
**ex-officio** ఉద్యోగకారణంతో పదవిరీత్యా. ~ *member* అధికార పదవిరీత్యా సభ్యత్వం; పదవి ద్వారా సభ్యుడు
**exogamy** బహిర్వివాహం
**exogenous** బహిర్జాత
**exonerate** నేరారోపణ నుంచి విముక్తి చేయు, నిర్దోషిగా నిర్ణయించు/ ప్రక టించు, అపవాదు తీసివేయు, పూచీ తప్పించు
**exorbitant** అత్యధిక. ~ *price* అత్యధిక ధర
**exorcism** దయ్యాలను వదలగొట్టడం, ఉచ్చాటన
**exosphere** వాతావరణం చివరి పొర
**exostosis** ఎముక అసాధారణంగా పొడుచుకొని రావడం
**exothermal** ఉష్ణమోచక
**exothermic** ఉష్ణమోచక, తాపక్షేపక వేడిని వెలిపెట్టే. ~ *reaction* ఉష్ణ మోచక చర్య
**exotic** అసాధారణ, అపరిచితమైన. ~ *foods* విదేశీయ ఆహార పదార్థాలు. ~ *species* విలక్షణ సజీవ జాతులు
**exotoxin** బహిర్జీవ విషం
**expand** విప్పారు, విస్తరించు, వ్యాకోచించు
**expansion** విస్తరణ, పొడిగింపు, వ్యాకోచం. ~ *isothermal* సమోష్ణోగ్రతా వ్యాకోచం
**expansionism** విస్తరణ వాదం
**ex parte** ఏకపక్షీయ, పరోక్ష
**expatiate** వివరంగా చెప్పు, వ్యాఖ్యానించు
**expatriation** స్వదేశ/ త్యాగం/ బహిష్కృతి
**expect** ఎదురుచూచు, ముందుగా ఊహించు, ఆశించు, కాచుకొని ఉండు
**expectant** ఎదురుచూసే, ప్రసవించబోయే
**expectation** ఆశంస, నిరీక్షణ
**expected value** అపేక్షిత విలువ
**expected yield** అపేక్షిత దిగుబడి
**expectorant** కఫోత్సారకం
**expectoration** కఫాన్ని ఉమ్మడం
**expediency** ప్రయోజనకారిత్వం
**expedient** ఉచిత లాభసాటి ఉపయోగకం
**expedite** త్వరపరచు, వేగిరపరచు. ~ *action* శీఘ్రచర్య తీసికొను
**expediting** వేగిరపరచటం
**expedition** (సాహస) యాత్ర, దండ యాత్ర
**expeditiously** శీఘ్రంగా
**expel** వెళ్ళగొట్టు, బహిష్కరించు
**expend** ఖర్చుపెట్టు
**expenditure** వ్యయం, ఖర్చు; వ్యయం చేసిన డబ్బు

**expense** ఖర్చు, వ్యయం. ~ *account* పనికి సంబంధించి ఖర్చయిన మొత్తాన్ని తెలిపే ఖాతా. *productive* ~ ఉత్పాదక వ్యయం. *trade* ~ వర్తక వ్యయం

**expensive** ఖర్చుతో కూడుకొన్న; వ్యయ భరితమైన, ఖరీదైన

**experience** అనుభవం; లౌకికజ్ఞానం

**experiment** ప్రయోగం

**experimental** ప్రయోగాత్మక. ~ *error* ప్రయోగదోషం

**experimentalism** ప్రయోగవాదం

**experimental method** ప్రయోగవిధానం

**expert** నిపుణుడు, సమర్థుడు, కుశలుడు, నేర్పరి, దిట్ట

**expertise** నైపుణ్యం, నిపుణవర్గం, ప్రత్యేక జ్ఞానం

**expiate** ప్రాయశ్చిత్తం చేసుకొను, పశ్చాత్తాపం ప్రకటించు

**expiration** ముగింపు, సమాప్తి, మరణం. ~ *of sentence* శిక్షాకాల సమాప్తి

**expire** చనిపోవు, ముగియు

**expiry** సమాప్తి, ముగింపు, కాలం తీరిపోవడం, మరణం

**explain** వివరించు, అర్థంచెప్పు, వ్యాఖ్యానించు

**explanation** సంజాయిషీ

**explanatory** వివరణాత్మక

**explication** విశదీకరణ

**explicit** విశదం, స్పష్టం

**explicitly** స్పష్టంగా, వివరంగా

**explicitness** స్పష్టత

**explode** పేలు, విస్ఫోటించు

**exploit** దోచుకొను/ దోపిడి చేయు

**exploitation** దోపిడి

**exploitative system** దోపిడి వ్యవస్థ

**exploiting** కొల్లగొట్టడం, దోపిడి చేయడం

**exploration** అన్వేషణ, శోధన

**exploratory** అన్వేషణాత్మక

**explore** అన్వేషించు, వెతుకు, దేవులాడు

**explosion** పేలుడు. *population* ~ జనసంఖ్యా విస్ఫోటనం

**explosive** విస్ఫోటకం

**explosives** పేలుడు పదార్థాలు

**exponent** వ్యాఖ్యాత, వివరణకర్త, ఘాతాంకం

**export** ఎగుమతి, వస్తు సేవలు. *export-promotion* ఎగుమతులను ప్రోత్సహించు. ~ *licence* ఎగుమతికి అనుమతి. ~ *of capital* పెట్టుబడి ఎగుమతి. ~ *oriented units (EOUS)* ఎగుమతి కంపెనీలు. ~ *profitability* ఎగుమతుల లాభదాయకత. ~ *quota* ఎగుమతుల కోటా, ఎగుమతులపై అనుమతించిన పరిధి

**exporter** ఎగుమతిదారు

**expose** బయటపెట్టు, వెల్లడించు, బహిరంగపరచు, బహిర్గతపరచు, విశదపరుచు

**exposing** అంగాంగ ప్రదర్శన

**exposition** వివరణ, వ్యాఖ్యానం, ప్రతిపాదన

**ex post facto** గడచిన దానిని గురించి ఆలోచించడం

**expostulate** మందలించు, స్నేహపూర్వకంగా నిరసన తెలుపు

**expostulation** మందలింపు, హితోపదేశం

**exposure** వెల్లడి, బహిరంగ పరచడం, బహిర్గత పరచడం, వెలుగులోనికి తేవడం, బయలు పరచడం, అపాయానికి అవకాశం ఇవ్వడం, దేహ ప్రదర్శన, విశదపర్చడం, అవగాహన



**expound** అర్థవివరణచేయు, వివరించు

**expression** అభివ్యక్తి, వ్యక్తీకరణ, తెలియజేయడం, వెల్లడి

**expressionism** భావ ప్రకటన వాదం

**expressionist** విభావకుడు

**expressionless** నిర్వికార

**exprobration** దూషణ

**expropriate** హక్కు స్వాధీనం చేసుకొను

**expropriation** హక్కు స్వాధీనత, దుర్వినియోగం, హరణం

**expulsion** బహిష్కరణ, వెళ్లగొట్టడం, తొలగించడం

**expunge** తొలగించు, పరిహరించు. ~ *from records* రికార్డుల నుంచి తొలగించడం

**expurgate** కత్తిరించు

**exquay** అమ్మేవారు భరించే సరుకు విలువ

**exquisite** చాలా అందమైన/ సున్నితమైన, నైపుణ్యంతో తయారుచేసిన

**exrights** మార్కెట్లో నేరుగా అమ్మడానికి పెట్టే వాటాలు

**exservice men** మాజీ సైనికులు, మాజీ రక్షణ దళోద్యోగులు

**exship** నౌకా రవాణా చార్జీలు అమ్మకందారు భరించే సరుకు విలువ

**exstock** సరఫరా చేసే సరకు ప్రస్తుత ధరలు

**extempore** ఆశువుగా

**extend** పొడిగించు, వ్యాపింపచేయు

**extended family** ఉమ్మడి కుటుంబం

**extennate** తప్పులు కప్పిపుచ్చు, నేర తీవ్రతను తగ్గించు

**extension** పొడిగింపు, కొనసాగింపు, విస్తరణ, వ్యాప్తి, విస్తృతి. ~ *education* విస్తరణ విద్య

**extensive** పెద్దఎత్తున, ఎక్కువగా, విస్తృతమైన, విశాలమైన. ~ *service* విస్తృత సేవ

**extent** విస్తృత, వ్యాప్తి

**extenuate** తగ్గించు, సన్నగిల్లజేయు

**exterior** బాహ్య, వెలుపల ఉన్న

**extern** బహిష్కరించు, ప్రవేశించరాదని నిషేధించు

**external** బయటి, విదేశీ. ~ *affairs* విదేశీ వ్యవహారాలు. ~ *cardiac massage* ఛాతీని మర్దించటం. ~ *commercial borrowings (ECBs)* విదేశీ వాణిజ్య రుణాలు. ~ *economics and diseconomics* బహిర్గత ఆదాయ వ్యయాలు. ~ *liabilities* ఇతరులకు తీర్చవలసిన అప్పులు

**extinct** లుప్తమైన, నిర్మూలమైన. ~ *animals* అంతరించిన జంతుజాలాలు

**extinction** విలుప్తత, లేకుండా పోవడం

**extinguish** లేకుండా చేయు, ఆర్పివేయు, తుడిచివేయు, నిర్మూలించు, నాశనం చేయు, శమింపజేయు, పడగొట్టు, రద్దు చేయు

**extinguisher** ఆర్పే. *fire* ~ మంటలార్పే స్థానం

**extinguishment** ఆర్పివేయడం, నిర్మూలనం, రద్దుచేయడం

**extirpate** సమూలంగా నాశనం చేయు, సర్వనాశనం చేయు

**extol** పొగడు, కొనియాడు, కీర్తించు

**extort** బలవంతంగా తీసుకొను, జులుం చేయు

**extortion** బలవంతపు వసూలు. *day light* ~ పట్టపగలు దోపిడీ. ~ *money* పీడించి తీసుకున్న డబ్బు

**extortioner** బలవంతంగా తీసుకునే వ్యక్తి
**extortionist** బెదిరించి డబ్బు అడిగే వ్యక్తి
**extra** అతి, ఇతర, అతీత, అధిక, అదనపు
**extra-cellular** కణబాహ్య, కణానికి వెలుపల
**extract** గుంజు, సంపాదించు, పేర్కొను, ఉదాహరించు, ఉదాహరించిన భాగం, ఉదాహృతి, సారం
**extractabilty** నిష్కర్షణీయత. ~ *of metal* లోహ నిష్కర్షణం
**extraction** పొందడం, వెలికితీయడం, పీకడం, తీయడం
**extradiate** పారిపోయి వచ్చిన వ్యక్తిని తిరిగి అప్పగించు
**extradition** ప్రత్యర్పణ, ప్రతిసమర్పణ, తిరిగి అప్పగించటం. ~ *treaty* దోషుల అప్పగింతపై రెండు దేశాల ఒప్పందం
**extra-galactic** పాలపుంతకి ఆవల వైపున్న
**extra-marital affairs** వివాహేతర సంబంధాలు
**extramural** ఆవరణేతర, విశ్వవిద్యాలయేతర. ~ *gang* బయటపని చేసే ఖైదీలు
**extraneous** సంబంధంలేని, అన్యమైన. ~ *matter* అన్యవిషయం
**extraordinary** అసాధారణమైన. ~ *general meeting (EGM)* అసాధారణ సమావేశం
**extrapolation** బాహ్య గణనం నిక్షేపం
**extrateritorial** స్వదేశాధికార పరిధికి లోబడని. ~ *jurisdiction* అతిప్రాదేశిక పరిధి. ~ *loyalty* విదేశానికి విధేయత
**extraterrestrial** గ్రహాంతర
**extravagance** అతివ్యయం, దుబారా (ఖర్చు)
**extravagant** విశృంఖల, మితిమీరిన, విపరీత, అనియంత్రిత
**extravaganza** కోలాహల, ఆడంబర ప్రదర్శన
**extravasation** పరిస్రావం
**extreme** తీవ్ర, చివరి, కడపటి
**extremism** అతివాదం, తీవ్రవాదం
**extremist** తీవ్రవాది, అతివాది
**extremity** వైపరీత్యం
**extricate** రక్షించు, విడిపించు, తప్పించు, బయటపడు
**extrication** వెలికితీత, విడుదల
**extrinsic** బయటి, వెలుపలి, సంబంధంలేని, విజాతీయ
**extrovert** బహిర్ముఖుడు
**extrude** బలవంతంగా బయటకు లాగు
**exuberance** అతిశయం, ప్రకర్ష
**exuberant** సమృద్ధ, అఖండమైన, సంపన్న
**exudate** రసి, వాపు; శోథస్రావం
**exude** ప్రదర్శించు, వెలువర్చు
**exult** ఆనందించు, సంతోషించు
**exultation** ప్రహర్షం, బ్రహ్మానందం
**exviate** కత్తిరించిన శరీర భాగాలు
**exvoto** మొక్కుబడి, అర్పణ
**eye** నేత్రం, కన్ను, చూపు. ~ *ball* కనుగుడ్డు. ~ *brow* కనుబొమ్మ. ~ *lash* కనురెప్ప వెంట్రుక. ~ *lid* కంటిరెప్ప. ~ *orbits* అక్షికూపాలు, కళ్ళ గుంటలు. ~ *opener* కళ్ళు తెరిపించే, గుణపాఠం నేర్పే. ~ *piece* దూరదర్శిని కటకం. ~ *sight* కంటిచూపు. ~ *sore* కళ్ళకలక, కళ్ళమంట, బాధించే, అసహ్యమైన, కళ్ళు కుట్టే. ~ *wash* మోసం, దగా. ~ *witness* ప్రత్యక్షసాక్షి
**eye rhyme** నేత్రప్రాస
**eyrie** గద్దగూడు



# F f

**fable** కట్టుకథ, కల్పితకథ, అద్భుతకథ
**fabric** వ్యవస్థ, నాణ్యమైన గుడ్డ, అల్లిక, చట్రం, నేసినబట్ట, (భవన) నిర్మాణం
**fabricate** సృష్టించు, కల్పించు, నిర్మించు
**fabrication** కూటసృష్టి, కట్టుకథ, కృత్రిమ కల్పన. ~ *of evidence* దొంగ సాక్ష్యం సృష్టించడం
**fabricator** కల్పించే వ్యక్తి, నిర్మాత
**fabulist** కట్టుకథలు చెప్పే/ అబద్ధాలాడే వ్యక్తి
**fabulous** నమ్మరాని, అద్భుతమైన, కథల్లో ఉండేలాంటి, మహత్తరమైన
**facade** ముఖభాగం, భవనం మొత్తం ముఖ భాగం, గృహముఖం
**face** n. ముఖం. *loose* ~ అవమానం పొందడం. *on the* ~ *of it* స్పష్టంగా. *put a good* ~ *on* ధైర్యంగా నిలబడు. ~ *save* మాట దక్కించు. ~ *to relations* ముఖాముఖి సంబంధాలు. ~ *value* ముఖవిలువ, పైవిలువ, నామ మాత్ర విలువ, ముద్రిత విలువ
**face** v. ఎదుర్కొను, ఒక దిశగా చూచు
**face lift** ముఖంలో ముడుతలు పోగొట్టే చికిత్సా విధానం. *non-surgical* ~ శస్త్రచికిత్స చేయకుండా ముఖం ముడతలు పోగొట్టే విధానం
**face pack** ముఖలేపనం
**facet** దశ, లక్షణం, ఫలకం, పెట్టె
**facial** ముఖ సంబంధమైన. ~ *expressions* ముఖంలో కనిపించే భావాలు. ~ *features* ముఖకవళికలు
**facies** ముఖవైఖరి. ~ *leonine* సింహాకృతి గల ముఖం
**facile** సులభంగా సాధించిన, నేర్పుగల, మృదువైన, తేలికయిన, సరళమయిన
**facilitate** సులభంచేయు, సదుపాయం కలుగజేయు
**facing** ఎదురు, ఎదుర్కోవడం
**facsimile** ఖచ్చితమైన ప్రతిరూపం, నకలు, నమూనా. ~ *signature* సంతకం ప్రతిరూపం, నకలు తయారుచేయు
**fact** వాస్తవం. ~ *finding* నిజనిర్ధారణ
**faction** భాగం, (చీలిక) వర్గం; ముఠా
**factionalism** ముఠాతత్వం
**factionalist** ముఠాదారు
**factor** అంశం, కారకం, మూలకం, పదార్థం. *anti-anaemic* ~ రక్తహీనతా నివారక (పదార్థం). *anti-neurotic* ~ నాడీవేదన నివారక (పదార్థం). *anti-sterility* ~ వంధ్యత్వ నివారక (పదార్థం). *diabetogenic* ~ మధుమేహ కారకం. *environment* ~ పర్యావరణ కారకం. *growth* ~ వృద్ధి కారకం. *host* ~ ఆతిథేయ కారకం. ~ *of production* ఉత్పత్తి కారకం
**factory** కర్మాగారం
**factual** వాస్తవమైన
**facultative** ఐచ్ఛిక, వైకల్పిక. ~ *parasite* వైకల్పిక పరాన్నజీవి
**faculty** సామర్థ్యం, నిగూఢశక్తి, ప్రావీణ్యం, బుద్ధి, విజ్ఞాన విభాగం, (విశ్వవిద్యాలయాల్లో) కొన్ని శాఖల సమూహం. *psychology* ~ మేథాశక్త్యాధ్యయన (శాస్త్రం)
**fad** వ్యామోహం, వేలంవెర్రి
**fade** వాడిపోవు, మాసిపోవు, వెలిసిపోవు, సన్నగిల్లు, క్రమంగా అంతరించు
**faded** వాడిపోయిన
**fading** వర్ణక్షయం, రంగు పోవడం

**faecal** మలసంబంధమైన
**faeces** మలం. *retention of* ~ మలం నిలిచిపోవడం
**fag** డీలాపడు, అలసిపోవు, కష్టించిపని చేయు. ~ *end* మిగిలిన/ చివరి భాగం
**fagged** అలసిపోయిన
**faggot** కట్టెల మోపు
**fail** విఫలమగు, ఓడిపోవు, పరాజయం పొందు, మాట నిలబెట్టుకోలేకపోవు, పరీక్ష తప్పు
**failing** దుర్బల, విఫలమవుతున్న
**failure** పరాజయం, భంగం, ఓటమి, అపజయం, దివాలా, వైఫల్యం, తప్పుడం. *circulatory* ~ రక్తప్రసార వైఫల్యం. *heart* ~ హృదయ స్పందన వైఫల్యం. *hepatic* ~ కాలేయ క్రియా లోపం. *peripheral circulatory* ~ పరిధీయ రక్త ప్రసరణ లోపం. *renal* ~ మూత్ర పిండ క్రియాలోపం
**faint** దుర్బలమైన, మూర్ఛిల్లే. ~ *hearted* పిరికి
**faint glow** మందదీప్తి
**fair** సుందరమైన, చక్కనైన, న్యాయమైన, ధర్మమైన, ఉచితమైన, సంత, తిరునాళ్ళు. ~ *colour* తెల్లరంగు, శ్వేత వర్ణం. ~ *play* నిష్పాక్షిక వ్యవహారం. ~ *price* సరసమైన ధర, చౌక ధర. ~ *rent* తగిన బాడుగ, సముచిత కౌలు. ~ *report* సముచిత నివేదిక. ~ *sex* స్త్రీలు. ~ *share* సరైన భాగం. ~ *wage* తగిన వేతనం
**fairly widespread** చాలావరకు విస్తృతంగా
**fairness** నిష్పక్షపాతం, న్యాయవర్తన
**fairnose** పిండి/పొడి పదార్థం
**fairy tale** అద్భుతకథ, జానపద సాహస గాథ

**fait accompli** జరిగిన పని, నెరవేరిన నిజం
**faith** (మత) విశ్వాసం, ధర్మం ~ *and credit* పరపతి, విశ్వాసం. ~ *healing* నమ్మకం వల్ల రోగం నయం కావడం. *in bad* ~ దురుద్దేశంతో. *in good* ~ సదుద్దేశంతో
**fake** నకిలీ, కుహనా
**fake shares** నకిలీ షేర్లు
**falcate** కొడవలి వలె ఒంపు తిరిగిన
**falcato secund** ఒకవైపు ఒంపు తిరిగిన
**falcon** గద్ద, డేగ
**falconry** డేగలకు వేటలో శిక్షణ ఇవ్వటం
**fall** n. పడడం, పతనం, తగ్గుదల; ఆకు రాలు కాలం. ~ *short of* కొరతపడు
**fall** v. పడు, రాలు, తగ్గు, సంభవించు, దిగిపోవు
**fallacious** భ్రమజనకమైన, అవాస్తవమైన
**fallacy** అవాస్తవం, కుతర్కం, భ్రమ, తప్పుడు భావం, మిధ్యాహేతువు. ~ *of composition* సమూహాభాస. ~ *of mal-observation* కుపరిశీలనాభాస. ~ *of ambiguity* అస్పష్టార్థాభాస
**falling rhythm** అనులోమ లయ
**fallopian tube** స్త్రీ బీజ వాహిక
**fall out** విరోధపడు; సంభవం, అవపాతం. *radio-active* ~ రేడియోధార్మికావపాతం
**fallow** పశువుల కొవ్వు; బీడు. ~ *land* ఊసరక్షేత్రం, బాడవభూమి
**falls** జలపాతం
**false** అబద్ధమైన, కృత్రిమమైన. ~ *charge* అసత్యారోపణ. ~ *hood* అసత్యం, అబద్ధం. ~ *hypothesis* అయథార్థ ప్రాక్కల్పన. ~ *prestige* బూటకపు ప్రతిష్ఠ. ~ *pride* బూటకపు అభిజాత్యం, దురభిమానం



**falsification** ఛద్మకరణం, కూటసృష్టి
**falsify** తప్పుగా కల్పించిరాయి, అబద్ధీకరించు, మోసగించు
**falter** తొట్రుపడు, ఆగిపోవు, బలహీనపడు, సంకోచించు
**fame** కీర్తి, ప్రతిష్ఠ, ప్రసిద్ధి
**familiar** సుపరిచిత
**familiarity** పరిచయం, స్నేహం
**familiarize** పరిచితం చేయు
**family** కుటుంబం. ~ *court* కుటుంబ న్యాయస్థానం. ~ *heirloom* పారంపర్యంగా సంక్రమించే వస్తు సామగ్రి. *joint* ~ సమష్టి కుటుంబం. ~ *planning* కుటుంబ నియంత్రణ. ~ *physician* కుటుంబ వైద్యుడు. ~ *tree* వంశవృక్షం
**famine** కరువు, కాటకం
**famish** ఆకలితో బాధపడు
**fanatic** మూఢవిశ్వాసి
**fanaticism** అహేతుక విశ్వాసం, మత మౌఢ్యం
**fancy** వినోదకరమైన, అత్యవసరంకాని; మోజు, మోహం, కల్పన, భ్రమ
**fanfare** అట్టహాసం, ఆర్భాటం, వైభవం
**fang** కోర
**fantasia** ఆకాశ సౌధ నిర్మాణం
**fantasm** రూపంలేని ఆకారాన్ని ఊహించుకోవడం
**fantastic** వింతైన, విచిత్రమైన, చోద్యమైన, లేనిపోని, అసహజమైన, అసందర్భమైన, అద్భుతావహమైన, నమ్మశక్యంగాని
**fantasy** కల్పనాశక్తి, స్వప్నం, భ్రమ, విపరీత భావన, వాస్తవాతీత గాథ
**farandole** రైతుల నృత్యం
**farce** ప్రహసనం, హాస్యరూపకం
**farfetched** సుదూర

**farinaceous** పిండితో చేసిన
**farm** కమతం, సేద్యపు భూమి
**farrow** ఈత, ఈను, కానుపు, పిల్లలు పెట్టు
**fascia** చర్మంకింద, కండరాల చుట్టూ ఉండే పొర
**fasciculus** కండర/ నాడీతంత్రీ సముదాయం
**fascinate** ఆకర్షించు, ఇష్టం కలిగించు, భ్రమింపచేయు
**fascination** మోహం
**fascism** నియంతృత్వం
**fashion** రీతి, విధం, వాడుక, నాగరికం
**fast** ఉపవాసం, లంఖణం, ఒక్కపొద్దు; వడిగా, వేగంగా, దృఢంగా, బిగువుగా
**fasten** కట్టు, బంధించు
**fastidious** ఒక పట్టాన నచ్చని
**fastidiousness** సులభంగా మెచ్చకపోవడం
**fasting** నిరశనం
**fatal** ప్రమాదకరమైన, పూర్తిగా వ్యతిరేకమైన
**fatalism** విధి నియతి వాద, కర్మవాదం
**fatalist** విధివాది, నియతివాది
**fatality** విధివిలాసం, దురదృష్టం, ప్రారబ్ధం
**fate** విధి, ప్రారబ్ధం, అదృష్టం, దురదృష్టం, అంతం
**fathom** నీటిలోతును తెలిపే ప్రమాణం, నిలువులోతు
**fatigue** ఆయాసం, అలసట, నిస్త్రాణ, బడలిక
**fatty acids** కొవ్వు ఆమ్లాలు
**fatuous** తెలివి తక్కువైన
**fauces** గొంతూ, నోరూ కలిసేచోటు, అంగిలి
**fault** తప్పు, పొరపాటు, తప్పిదం, భ్రంశం

**faulting** భూమ్యుపరితలాన్ని పగలకొట్టడం
**faulty goods** దెబ్బతిన్న/ చెడిపోయిన వస్తువులు
**fauna** జంతు జాలం/ సముదాయం
**fauvism** వన్యవాదం
**faux pas** జరగగూడని పెద్ద పొరపాటు
**favour** ఆదరం, పక్షపాతం, సహాయం, అభిమానం, ఉపకారం
**favourableness** సుముఖత
**favourably** సానుకూలంగా, సుముఖంగా
**favouritism** (ఆశ్రిత) పక్షపాతం
**faze** అవరోధం కలిగించు
**fealty** విశ్వాసంగా ఉండు
**fearful** భీకర
**feasibility** సాధ్యత, సంభావ్యత. ~ *report* సాధ్యాసాధ్యాల నివేదిక. ~ *study* సాధనీయతాధ్యయనం
**feasible** ఆచరణ యోగ్యం, సాధ్యం
**feast** విందు
**feat** అద్భుతకృత్యం, అసాధారణ కార్యం
**feature** రూపురేఖ, ఆకృతి, లక్షణం, ఒక ప్రాంతపు భౌతిక ఆవరణపు గుర్తులు; ప్రత్యేక వ్యాసం/ ప్రదర్శన/ కార్యక్రమం; ప్రదర్శించు
**febrifuge** జ్వర సంహారి
**febrile** జ్వరంతో కూడిన, జ్వరిత
**fecundate** సారవంతంచేయు, ఫలవంతం చేయు
**fecundation** పిండోత్పత్తి
**fecundity** అధికోత్పత్తి, జననశక్తి, పిండోత్పత్తి శక్తి
**federal** సమాఖ్య (రూపి), బహుకేంద్రక. ~ *government* సమాఖ్య ప్రభుత్వం
**federalism** సమాఖ్య పద్ధతి
**federation** సమాఖ్య
**feeble** అస్పష్టమైన, బలహీనమైన, నిర్వీర్య, నీరస, దుర్బలం. ~ *mindedness* దుర్బల మానసిక స్థితి
**feed** మేత, తిండి, ఆహారం, తినిపించు, తిండిపెట్టు
**feedback** ప్రతిపుష్టి
**feeding** ఆహారమివ్వడం (జంతువులకు) మేపడం. *bottle* ~ సీసాపాలివ్వడం. *breast* ~ తల్లిపాలివ్వడం. *infant* ~ శిశుపోషణ. *intravenous* ~ సిరల ద్వారా పోషక పదార్థాన్ని శరీరంలో ఎక్కించడం
**feeler** స్పర్శిక, స్పర్శాంగం
**feeling** అనుభూతి, స్పందన, సంవేదన
**feign** నటించు, కల్పించు, సృష్టించు, నేరంమోపు, కుంటిసాకు చెప్పు
**felicitate** సన్మానించు, సత్కరించు, అభినందించు
**felicitation** సత్కారం. ~ *function* సన్మానోత్సవం
**fellow** స్నేహితుడు, సహచరుడు, పరిశోధకుడు
**fellowship** విశిష్ట సభ్యత్వం, సహవాసం, స్నేహం
**fellow traveller** సహగామి
**fellow writer** సాటి/ సోదర రచయిత
**felon** ఘోరాపరాధి; గోరుచుట్టు
**felony** (తీవ్రమైన) నేరం
**femerity** దూకుడు, నిర్హేతుకత
**feminism** స్త్రీ (పురుష సమానత్వ) వాదం
**feminist** స్త్రీ (పురుష సమానత్వ) వాది. ~ *criminology* మహిళా నేర అధ్యయనం. ~ criticism స్త్రీవాద విమర్శ
**feminity** స్త్రీత్వం
**feminization** స్త్రీత్వకల్పన
**femur** తొడ ఎముక
**fence** కంచె, దడి
**fender** రక్షకం, రక్షకుడు



**feneration** వడ్డీకి అప్పు ఇవ్వడం
**fenestra** రంధ్రం, గవాక్షం
**fenugreek** మెంతులు
**feral child** జంతువులు పెంచిన బిడ్డ
**feretory** ధాతుగర్భం, జ్ఞాపక చిహ్న పేటిక
**ferment** పులియబెట్టు
**fermentation** పులియబెట్టడం, కిణ్వనం
**ferocious** క్రూరమైన, నిర్దయ
**ferret out** వెలికితీయు, అన్వేషించు
**ferriage** పడవ రుసుం, కేవు
**ferric** ఇనుముకు సంబంధించిన
**ferropaper** లోహముద్రణ కాగితం
**ferrous** ఇనుము, ఇనుముకు సంబంధించిన
**ferruginous** తుప్పు రంగు గల, తుప్పు లాంటి
**ferry** రహదారి పడవ, బల్లకట్టు, రేవు
**fertile** సారవంతమైన, సంతాన యోగ్యమైన
**fertility** ప్రజనన శక్తి, గర్భధారణ శక్తి. ~ *clinic* సంతాన సాఫల్య కేంద్రం. ~ *rate* కాన్పుల రేటు
**fertilization** గర్భధారణ; ఫలదీకరణం
**fervent** ఇష్టంగల, అపేక్షగల, శ్రద్ధగల
**fervour** అత్యుత్సాహం
**fester** జీర్ణించు, కుళ్లు, బాధించు, చీముపట్టు
**festival** పబ్బం, పండుగ, ఉత్సవం
**festivity** సంబరం, ఆనందం
**festschrift** అభినందన సంచిక
**fetalization** గర్భస్థ దశలోనే అవయవాల పెరుగుదల ఆగిపోవడం
**fete** పండుగ, వనభోజనం; గొప్ప వినోదం
**fetid** దుర్గంధం
**fetish** దివ్య/ అప్రాకృత వస్తువు
**fetishism** వస్తుకాముకత
**fetor** దుర్గంధం
**fetters** సంకెళ్లు
**feud** అంతఃకలహం, కుటుంబ కలహం, రుసుము
**feudal** భూస్వామ్య సంబంధి. ~ *lords* భూస్వాములు, జాగీర్దారులు. ~ *system* భూస్వామ్య వ్యవస్థ
**feudalism** జమీందారీ పద్ధతి, పెత్తందారీ పద్ధతి, భూస్వామ్య వ్యవస్థ
**feudatory** అధీన, సామంతమైన, జాగీరు, జమీన్దారీ
**feul** ఇంధనం
**fever** జ్వరం. *enteric* ~ సన్నిపాత జ్వరం. *filarial* ~ బోద జ్వరం. *intermittent* ~ అంతరాయంతో వచ్చే జ్వరం. *malarial* ~ చలి జ్వరం. *puerperal* ~ ప్రసూతి/ బాలింత జ్వరం. *rheumatic* ~ కీళ్లవాపు జ్వరం
**feverishness** తాపం, జ్వర లక్షణం
**fiasco** వైఫల్యం, పరాజయం, హాస్యాస్పదమైన చర్య, ఘోరపరాజయం, భంగపాటు
**fibre** పీచు, పోగు, నార, తంతువు, తంతి. ~ *muscle* కండరపు పోగు. ~ *nerve* నాడీ తంతి. ~ *glass* గాజునార. ~ *optics* సమాచారాన్ని గాజునార ద్వారా ప్రసారం చేసే పద్ధతి. ~ *reinforced plastics* గాజునార ప్లాస్టిక్
**fibroid** గర్భాశయంలోని కణితి. ~ *tumour* తంతుయుత నిర్మాణం గల కణితి
**fibrositis** తంతీ వేదన
**fibrous** తంతుయుత; నారవంటి, పీచుగల
**fibrous tissue** తంతుయుత కణజాలం
**fibula** కాలిలో వెలుపలి ఎముక, బహిర్జంఘిక
**ficker** మిణుకు మిణుకుమను
**fickle** చంచల, చపల
**fickleness** స్థిరంగా ఉండని, చంచల
**fiction** కల్పన, సృజనాత్మక రచన

**fictional** కాల్పనికమైన, కథాత్మకమైన
**fictitious** కల్పితమైన, అవాస్తవికమైన
**fictitious account** దొంగలెక్క
**fiddle** కాలాన్ని వృథాచేయు, వ్యర్థ సంభాషణచేయు, వాయులీనం, ఫిడేలు
**fideism** నమ్మకం ముఖ్యం అనే వాదం
**fidelity** విశ్వసనీయత
**fiduciary** విశ్వాసపాత్రమైన. ~ *capacity* నమ్మకస్తుని హోదా. ~ *character* విశ్వసనీయ ప్రవర్తన. ~ *duties* విశ్వాసబద్ధ విధులు. ~ *issue* బంగారం మద్దతు లేని కాగితపు కరెన్సీ. ~ *limit* విశ్వాస పరిమితి. ~ *money* విశ్వాసబద్ధ ద్రవ్యం. ~ *relation* నమ్మకం మీద ఆధారపడ్డ సంబంధం. ~ *reserve* విశ్వాస బద్ధ నిధి
**field** పంటపొలం, క్షేత్రం. ~ *bean* చిక్కుడుకాయలు. ~ *channels* పంట బోదెలు. ~ *of vision* దృష్టిక్షేత్రం
**fiend** క్రూరుడు, దయ్యం, దుష్టదేవత, మైకం కమ్మిన వ్యక్తి
**fiendish** అతిక్రూరమైన
**fierce** తీవ్రమైన, భయంకరమైన
**fiercely** క్రోధపూర్వకంగా, ప్రచండంగా
**fierceness** తీవ్రత, భయంకరత్వం, ఉగ్రత
**fiery** జ్వలించే, భగ భగ మండే, స్ఫుటమైన, తేజోవంతమైన, ఘాటైన, ఆవేశ పూరిత
**fifth column** పంచమాంగ (దళం)
**fig** అత్తిపండు
**fight** జట్టీ, కొట్లాట, జగడం, యుద్ధం చేయు, పోరాడు
**fig leaf** కప్పి పుచ్చడం; ప్రయత్న పూర్వకంగా దాచిపెట్టడం
**figurative language** ఆలంకారిక భాష, కవితాత్మక భాష
**figure** మూర్తి, రూపం, శరీరాకారం. ~ *head* నామమాత్రపు నాయకుడు. ~ *of speech* అలంకారం
**filament** సూక్ష్మతంతువు, కేసరం
**filaria** బోద (వ్యాధి)
**file** దాఖలు చేయు, దస్త్రం, ఆకురాయి, పంక్తి. ~ *a petition* అర్జీ దాఖలుచేయు
**filial** పెద్దల బాధ్యతకు సంబంధించిన
**filiality** పితృభావన
**filiation** వంశక్రమం, పుత్రత్వం
**filibuster** కాలయాపన ప్రసంగం
**filiform** తంతురూపి, దారం వంటి
**fillip** ప్రేరణ, ప్రోత్సాహం
**filter** వడపోసే సాధనం; వడపోయు. ~ *cloth* గాలన వస్త్రం. ~ *paper* వడపోత కాగితం. ~ *paper pulp* వడపోత కాగితం గుజ్జు. ~ *photometer* నిర్గలన కాంతి మాపకం
**filterable** వడపోయ దగిన
**filth** రోతపుట్టించే మలినం
**filtrate** వడపోసిన ద్రవం, గాలితం
**filtration** వడపోత, గాలనం
**final** తుది. ~ *cause* అంతిమకారణం. ~ *demand* అంతిమ అభ్యర్థన. ~ *hearing* తుది విచారణ
**finalism** పార్యంతిక వాదం
**finance** ద్రవ్యం, విత్తం. ~ *bill* ఆర్థిక బిల్లు, విత్తశాసనం. ~ *company* ఫైనాన్స్ కంపెనీలు, ఆర్థిక రుణాలు ఇచ్చే కంపెనీలు. ~ *house* రుణాలిచ్చే సంస్థ. ~ *ministry* ఆర్థిక మంత్రిత్వ శాఖ
**financial** ద్రవ్య/ విత్త సంబంధమైన, ఆర్థిక వనరులకు సంబంధించిన. ~ *accountant* ఆర్థిక వనరుల గణకుడు. ~ *adviser* ఆర్థిక సలహాదారు. ~ *crisis* ఆర్థిక సంక్షోభం. ~ *instrument* ద్రవ్య సాధనం. ~ *sector* ఆర్థిక సేవారంగం. ~ *year* ఆర్థిక సంవత్సరం



**finding** కనుక్కొన్న విషయం, నిర్ణయం
**find spot** దొరికిన చోటు
**fine art** లలితకళ
**fine coating** పలుచని పూత, సూక్ష్మ లేపనం. ~ *porosity* సూక్ష్మసచ్ఛిద్రత, ~ *texture* నాజూకు నేత
**fine rate** వడ్డీకి ప్రాతిపదిక అయిన రేటు
**finger plan** నగరాన్ని ఆనుకొని వెలసిన కొత్త పట్టణాలు
**finicky** చాదస్తం
**fink** చాడీలు చెప్పు
**fire** నిప్పు, అగ్ని. ~ *clay* బంకమట్టి, అగ్ని మృత్తిక. ~ *extinguisher* మంటలార్పే యంత్రం. ~ *proof* అగ్ని నిరోధకం
**firing** బట్టీ/ తుపాకి కాల్పు
**firm** పటిష్ఠసంస్థ; స్థిరమైన, దృఢమైన; క్రమంగా పెరుగు. ~ *market* స్థిర విపణి. ~ *opinion* నిశ్చితాభిప్రాయం
**firmness** స్థైర్యం, గట్టిదనం, పట్టుదల
**first** తొలి, మొదటి, ప్రారంభపు. ~ *aid* ప్రథమ చికిత్స. ~ *coating* తొలి పూత. ~ *person narrative* ఉత్తమ పురుష కథనం
**fiscal** విత్త సంబంధమైన. ~ *policy* విత్త విధానం, కోశ విధానం
**fish glue** చేప జిగురు
**fishing** చేపలవేట
**fission** అణు విచ్ఛేదన/ విచ్ఛిత్తి/ విభజన
**fissionable** విభజన యోగ్యమైన, విచ్ఛిత్తికి అనువైన
**fissure** చీలిక, పగులు, నెరియ
**fist** పిడికిలి
**fistula** నాళవ్రణం. ~ *in ano* భగందరం. *visisco vaginal* ~ మూత్రాశయ/ యోని నాళవ్రణం
**fit** మూర్ఛ; ఉపయుక్త
**fitch** విచ్ఛిక
**fitment** గృహోపకరణ
**fitness** యోగ్యత, అర్హత, దృఢత్వం. *physical* ~ శారీరక దృఢత్వం
**fix** స్థిరపరచు, స్థాపించు, నిర్ణయించు; అయోమయం, ఎటూతోచని స్థితి
**fixation** ఘనీకరణ, స్థాయీకరణ, స్థిరీకరణ
**fixative** స్థిరకారి, స్థిరంగా ఉంచే
**fixed** నియమిత, స్థిర. ~ *asset* స్థిరాస్తి. ~ *cost* స్థిరవ్యయం. ~ *deposit* నియమిత కాలానికి నిల్వచేసే పైకం. ~ *form* స్థిర సాహిత్య రూపం. ~ *investment* స్థిరమైన పెట్టుబడి. ~ *orbit* స్థిరకక్ష్య. ~ *star* నిశ్చల నక్షత్రం
**fixing** స్థిరపరచడం, నిర్ధరించడం, అమర్చడం, పాతడం
**fixture** స్థాపిత వస్తువు (క్రీడల్లో) నిర్ణీత కాలం
**fixtures** స్థావరాలు (భవనాలు, అడవులు, రోడ్లు మొ॥వి), బిగింపులు, అమరికలు
**flabelliform** విసనకర్రలాగుండే
**flaccid** బిగితప్పిన, పట్టుసడలిన
**flag bearer** పతాకధారి, ముఖ్యమైన వ్యక్తి
**flagellation** దండించడం
**flagellum** కశాభం
**flagitious** దూషించదగిన, దారుణమైన
**flagrant** ఘోరమైన
**flagship** (నౌకాదళంలో) ప్రధానమైన నౌక
**flake** పెచ్చు, పేడు
**falke white** మంచు తెలుపు, తుషార శ్వేతం
**flame** మంట, జ్వాల. ~ *proof* అగ్ని నిరోధకం. ~ *spectrophotometer* జ్వాలా వర్ణపట కాంతిమాపకం. ~ *spectrum* జ్వాలా వర్ణపటం. ~ *test* జ్వాలా పరీక్ష

**flandrian** మంచునదుల నుండి నేటివరకు గల కాలం. ~ *trangression* మంచు కరిగి సముద్ర మట్టం పెరగడం
**flank** పక్క, పార్శ్వం, రెండువైపులా ఉండడం; భవనం, కొండ మొ. వాటి పక్కభాగం; పక్కన/ సాయంగా వచ్చు
**flap** దళం, రెక్క
**flare up** వ్యాపించు, విశాలమగు
**flash** మెరుపు, అకస్మాత్తుగా కలిగే భావం
**flashback** కాలక్రమ వ్యత్యయం
**flashy** మెరిసే
**flat** మంద్రం. ~ *colour* మంద్ర వర్ణం. ~ *foot* చదునైన పాదం. ~ *rate* నిర్ణీతమైన రేటు
**flatogen** కడుపుబ్బరం కలిగించే పదార్థం
**flatter** పూర్తి నష్టం/ ఓటమి; అవిధేయత; పొగడు
**flattery** మెరమెచ్చు మాటలు, ముఖస్తుతి
**flatulence** కడుపు ఉబ్బరం
**flatus** అపాన వాయువు, పిత్తం
**flat yield** పెట్టుబడులపై వచ్చే వడ్డీ
**flauid** వాడిపోయేటట్లు చేయు
**flavour** రుచి, సువాసన
**flavouring** రుచిని, సువాసనను కల్పించడం. ~ *agent* రుచిని, సువాసనను కల్పించే పదార్థం
**flaw** పగులు, తప్పు, బలహీనత, దోషం, పొరపాటు
**flawless** దోష రహిత
**flax** అవిసె చెట్టు
**flay** తీవ్రంగా విమర్శించు
**flea pit** పాత సినిమా హాలు
**fleas** గోమార్లు
**fledgling** రెక్కలు తొడుక్కుంటున్న, రూపు దిద్దుకుంటున్న
**flee** పారిపోవు
**fleece** ఉన్ని, గొర్రెబొచ్చు; ఉన్ని కత్తిరించు; దోచుకొను, ఆస్తులను కాజేయు
**fleeing** పలాయనం
**fleet** నౌకాదళం, ఓడల బారు
**fleeting** నశించు, నిత్యం కాని
**fleming** దేశనివాసి
**flex** వంగు, వంచు, వంచడానికి వీలైన విద్యుద్వాహక తంత్రి. ~ *muscle* వంగే కండరం
**flexibility** వశ్యత, మెత్తదనం, మలచదగిన, లొంగదీయదగిన, ఒదుగుబాటు
**flexible** మెత్తని, నమ్య, వశ్య. ~ *constitution* అదృఢ రాజ్యాంగం
**flexi time** కార్మిక సులభ శ్రమ సమయం
**flexor** ముడిచే
**flibberti gibbet** వదరుబోతు, నిష్ప్రయోజకుడు, నిందా ప్రచారకుడు
**flick** ఒక్కసారిగా కదలడం, వేగంగా వస్తువును వేళ్ళతో తీయడం, కొరడాను/ తుండుగుడ్డను ఒక చివర పట్టుకుని గట్టిగా విసరడం
**flicker** మినుకుమినుకు మని వెలగడం
**flickleness** చంచలత
**flimsy** స్వల్పమైన, దుర్బలమైన, తేలికైన
**flinch** జంకు
**fling** విసురు, రువ్వు
**flip flop** ఊగిసలాట
**flippant** తెలివి తక్కువగా మాట్లాడే
**flirt** ఆనందంగా కాలం గడుపు
**float** తేలు, ఈదు, కరెన్సీ విలువను స్వేచ్ఛగా సవరించు, స్థాపించు, ప్రారంభించు, తెప్ప, కొట్టుకొనిపోవు, వాటాలను అమ్మకానికి పెట్టడం, చిల్లర
**floating loan** రుణం విడుదల చేయడం
**floating assets** చరాస్తి
**floating rate bond** సవరించే రుణపత్రం



**floctulation** సూక్ష్మకణాల ఘనీభవనం
**flog** విమర్శాస్త్రం, బెత్తంతో/ కొరడాతో కొట్టడం, విమర్శాస్త్రం ప్రయోగించు, తప్పుపట్టటానికి అవకాశం తీసుకొను
**flogging** తరమడం, బెత్తంతో కొట్టడం
**flood** వరద. ~ *plains* వరద మైదానాలు
**flooding** ముంపు
**floor** భూతలం, నేల; భవనంలో అంతస్తు; సముద్రపుటడుగు, చర్చ జరిగే చోటు, శ్రోతలు కూర్చునే చోటు, రంగస్థలం. *go to the* ~ *s* చిత్రీకరణకు వెళ్ళు
**floor crossing** ఫిరాయింపు
**flooring** నేల మీద బండలు పరచడం
**flora** వృక్ష జాతులు, పుష్పించే మొక్కల జాతులు, ఒక ప్రాంతంలో ఉన్న వృక్ష జాలం, మొక్కల సముదాయం. *bacterial* ~ సూక్ష్మజీవి సమూహం. *intestinal* ~ పేగులోని సూక్ష్మజీవి సమూహం
**floriculture** పూల పెంపకం, పుష్ప వర్ధనం
**florid** ఎర్రబారిన
**flotilla** యుద్ధనావల చిన్న గుంపు. ~ *supervisor* యుద్ధనౌకా పర్యవేక్షకుడు
**flourish** వర్ధిల్లు, వృద్ధిపొందు, బాగుపడు, చురుకుగా ఉండు, ఝళిపించు, అలంకరించు
**flout** ఉల్లంఘించు, నిర్లక్ష్యం చేయు
**flow** ప్రవాహం. *menstrual* ~ రుతుస్రావం
**flowage** ఘనపదార్థ ప్రవాహం
**flow chart** వివిధ దశలలో ప్రగతిని సూచించే చిత్రం
**flower fossils** పుష్పావశేషాలు
**flowing** ప్రసృత
**fluctuate** ఊగిసలాడు, నిలకడలేని, హెచ్చుతగ్గులున్న; మార్పు చెందు
**fluctuation** హెచ్చుతగ్గులు, నిమ్నోన్నతాలు, చాంచల్యం
**fluency** ధారాళ
**fluent** స్థిరంకానిది, నిలకడలేనిది, ప్రవాహి
**fluffy** మెత్తని (బొచ్చు)
**fluid** ద్రవం. ~ *cerebro spinal* మస్తిష్క మేరుద్రవం. *intraocular* ~ అంతరక్షి ద్రవం. *seminal* ~ శుక్రం, వీర్యం
**fluidity** ద్రవత, అస్థిరస్థితి, ప్రవాహస్థితి. ~ *pressure* ప్రవాహపీడనం. ~ *situation* అనిశ్చిత పరిస్థితి. ~ *therapy* నోటిద్వారా/ రక్తనాళం ద్వారా గ్లూకోజ్ నీటిని లవణాలను ఎక్కించే చికిత్స
**fluke** అదృష్టం
**flume** కృత్రిమ ప్రవాహం
**flunial** నదులకు సంబంధించిన
**flunkeys** నౌకర్లు
**fluorecence** ప్రతిదీప్తి
**fluorescent** ప్రతిదీప్త. ~ *lamp* ప్రతిదీప్త దీపం. ~ *screen* ప్రతిదీప్తయానకం. ~ *tube* ప్రతిదీప్త నాళిక
**fluroscopy** ప్రతిదీప్తి దర్శనం
**flurry** తొట్రుపాటు, ఉద్రేకం
**flush** రెక్క విచ్చి ఎగిరిపోవు, శుభ్రంగా కడుగు, ముఖం కందిపోవు
**fluvial action** నదీ క్రమక్షయం
**flux** ప్రవాహం, చలనం, ప్రస్రవణం
**fly ash** థర్మల్ విద్యుత్తు కేంద్రాల నుంచి వెలువడే బూడిద
**flying saucers** ఎగిరే పళ్ళాలు
**flying squad** ఆకస్మిక పరీక్షా దళం
**foam** నురుగు
**focal** కేంద్ర సంబంధమైన. ~ *length* నాభ్యంతరం. ~ *point* ప్రధాన కేంద్రం, దృష్టినాకర్షించే స్థానం
**focus** అధికేంద్రం, నాభి. *primary* ~ నాభికేంద్రం

**fodder** మేత, పశుగ్రాసం. ~ *crops* పశుగ్రాస సస్యాలు
**foe** శత్రువు
**foetal** పిండసంబంధమైన
**foetus** పిండం, గర్భస్థ శిశువు
**foetus in f (o) eto** పసిబిడ్డ కడుపులో కవల పిండం
**fog** మసకగా ఉన్న, దట్టమైన పొగమంచు
**foible** చిన్న తప్పిదం, లోపం, దుర్బలత
**foil** రేకు, సాము చేయడంలో వినియోగించే పలచని కత్తి; నిరోధించు, విఫలం చేయు, దెబ్బతీయు, ఓడించు, పాడుచేయు, చెడగొట్టు
**foist** సృష్టించు, అంటగట్టు, బనాయించు. ~ *a case* దొంగ కేసు బనాయించు
**foliage** (ఆకు) గుబురు
**foliar** ఆకులను పోలిన, ఆకులకు సంబంధించిన
**foliation** సదళం
**foliose** పత్రాభం
**folk** ప్రజలు, జానపదులు, గుంపు; ప్రజా సమూహం. ~ *art* జానపద కళ. ~ *dance* జానపద నృత్యం. ~ *literature* జానపద సాహిత్యం. ~ *lore* జానపద విజ్ఞానం, జానపద కళ. ~ *song* జానపద గీతం. ~ *tale* జానపద గాథ. ~ *ways* జానపదరీతులు
**follicle** పుటిక, చిన్నకోశం, ద్రవాలు స్రవించే చిన్న కుహరం
**follower** అనుయాయి
**follow through** నెమ్మదిగా వెంబడించు
**follow up** ప్రారంభించిన పనికోసం వెంటబడి చేయించుకోవడం; చికిత్సానంతర పరీక్ష; అనంతర పరిణామాలను వార్తగా రాయడం. ~ *action* తదనంతర చర్య
**folly** తప్పు, మూర్ఖత్వం
**foment** ప్రజ్వలింపజేయు, రగుల్కొల్పు, కాపడం పెట్టు
**fomentation** కాపడం, పురికొల్పడం, ప్రోత్సహించడం, ఉద్రేకింపజేయడం
**fomties** రోగవ్యాప్తిచేయు
**fondle** నిమురు, వాత్సల్యంతో తట్టు
**fondling** బుజ్జగించు, లాలించు, శరీరాన్ని స్పృశించు, ఒంటి మీద చేత్తో రాయు
**fondness** మక్కువ, అనురాగం
**fontanelle** మాడు, తలమీది ఉచ్చిగుంట
**food** ఆహారం. ~ *allergy* ఆహార పదార్థాలంటే సరిపడకపోవడం. ~ *articles index* ఆహార వస్తువుల సూచి. ~ *aversion* ఆహార పదార్థాలంటే ఏవగింపు. ~ *for thought* మెదడుకు మేత. ~ *grains* తిండి గింజలు. ~ *intolerance* ఆహార పదార్థాలంటే పడకపోవడం. *protective* ~ సంరక్షకాహారం. *supplementary* ~ సంపూరకాహారం
**food web** ఆహార జాలం
**fool hardy** అవివేకి
**fool proof** కట్టుదిట్టమయిన; బెదిరింపులకు, దాడులకు లొంగని
**foot** పాదం, అక్షర గణం, నియ తాక్షర సమూహం. ~ *and mouth disease* గాలికుంటు వ్యాధి. ~ *drop* వేలాడే పాదం. ~ *hold* ఆధారం. ~ *rest* కాలు నిలిపే చోటు, పాదపీఠం. ~ *root* కాండం కుళ్లు వ్యాధి
**fora** వేదికలు
**forage** మేత, పశుగ్రాసం, ఆహారం కోసం దేవులాట/ వెదుకులాట
**foramen** రంధ్రం
**foray** దోచుకొను, దొంగిలించు, అపహరించు, అక్రమంగా తీసుకొనిపోవు; అపహరణ, దోపిడి, దాడి



**forbearance** సహనం, సహిష్ణుత
**forbid** వర్జన, నిషేధం; వద్దని ఆజ్ఞాపించు
**forbidden** నిషిద్ధ, ప్రతిషిద్ధ
**force** బలప్రయోగం. *compressional* ~ సంపీడన బలం. ~ *line* బలరేఖ. *tangential* ~ స్పర్శ రేఖాబలం
**forceful** ప్రబల, బలమైన, శక్తిమంత
**force majeure** అనూహ్య, అనివార్య పరిస్థితి
**forceps** శ్రావణం
**fore arm** ముంజేయి
**fore brain** అగ్రమస్తిష్కం
**fore cast** ముందుగా తెలిసికొను/ దూరం ఊహించు; భావిసూచన
**forecaster** భావిసూచకుడు
**fore closure** విడుదల చేసుకోలేకపోవడం, విమోచన హక్కు కోల్పోవడం
**fore dune** లోతట్టు ప్రాంతాల్లో ఉండే ఇసుక నేలలు
**fore front** ముందు, అగ్రభాగం, ముఖ్యమైన స్థానం
**forego** కోల్పోవు
**foreground** పురోభూమి
**foregrounding** అసాధారణీకరణం, వక్రత, పురస్కరణం, అపరిచయీకరణం; వ్యవహారం భిన్నంగా చేసే కవిత్వ భాషా ప్రయోగం
**forehead** నుదురు, లలాటం
**foreign** ఇతరమైన, విదేశీయమైన, బయటి. ~ *affairs* విదేశీ వ్యవహారాలు. ~ *aid* విదేశీ సాయం. ~ *body* అన్య పదార్థం. ~ *collaborator* విదేశీ సహకారి. ~ *debts* విదేశీ రుణాలు. ~ *exchange* విదేశీ మారకం. ~ *exchange market* విదేశీ ద్రవ్య మారక విపణి. ~ *language* పరభాష. ~ *office* విదేశీ కార్యాలయం. ~ *policy* విదేశాంగ విధానం. ~ *sales* విదేశాలకు అమ్మిన వస్తువుల సంఖ్య/ విలువ
**foreigner** విదేశీయుడు
**foreman** అజమాయిషీ చేసే అనుభవజ్ఞుడైన పనివాడు
**forensic** న్యాయసంబంధమైన. ~ *chemistry* న్యాయ-వైద్య రసాయన శాస్త్రం. ~ *medicine* న్యాయసంబంధ వైద్య శాస్త్రం
**foresee** ముందుగానే ఊహించు/ అంచనా వేయు
**forest park** అటవీ ఉద్యానవనం
**foreward** మున్నుడి
**forex** విదేశీ మారకం. ~ *market* విదేశీ మారక విపణి. ~ *reserves* విదేశీ మారక ద్రవ్య నిలువలు
**forfeit** జప్తు, స్వాధీనం, కోల్పోవడం, పోగొట్టుకొను
**forfeiture** జప్తు, కోల్పోవడం
**forge** దొంగపత్రాలను రూపొందించు; కమ్మరం చేయు
**forged** నకిలీ, దొంగ రాత రాయు
**forgery** దొంగ సంతకం, కూటకరణం
**forget** మరచిపోవు, పరాకుపడు
**forgo** వదులుకొను, విడిచిపెట్టు
**for hire** అద్దెకు/ కిరాయికి/ బాడుగకు
**form** కారం, ఆకృతి (సాహిత్య) రూపం, క్రీడా సామర్థ్యం, క్రీడాకారుడి స్థాయి
**formal** లాంఛనప్రాయ. ~ *cause* ఆకృతిక కారణం. ~ *consistency* ఆకృతిక సంగతత్వం. ~ *education* నియత విద్య. ~ *implication* ఆకృతి కాంతర్భావం
**formalism** రూపవాదం
**formally** లాంఛనప్రాయంగా
**formation** నిర్మాణం

**formative** (రూప) నిష్పాదక

**former** మాజీ, భూతపూర్వ

**formication** శరీరంపై కీటకాలు పాకుతున్నట్టుండడం

**formidable** అశక్య, బలీయ, కఠిన, బలవత్తర, మహత్తరమయిన, భయంకర, ఎదురులేని, దాటలేని, అసాధ్య

**formula** సూత్రం

**formulation** సూత్రీకరణ, సిద్ధాంతీకరణ

**fornication** అవివాహితుల మధ్య వ్యభిచారం

**forsake** నీళ్ళువదులు, విడిచిపెట్టు, పరిత్యజించు, తోసివేయు

**forswear** దొంగశపథం చేయు, శపథపూర్వకంగా విడిచిపెట్టు

**forte** విశిష్టత, విలక్షణత, విశేషగుణం, దృఢత్వం, పిడినుంచి సగం వరకు గల కత్తి భాగం

**forthwith** ఇకముందు, తక్షణం, వెంటనే

**fortification** ప్రబలీకరణ, రక్షణ (నిర్మాణ)ం

**fortify** బలపరచు, పటిష్ఠంచేయు, పోషక శక్తి వృద్ధిచేయు, గట్టిపరచు, దృఢపరచు

**fortitude** స్థైర్యం, ధైర్యం, సహనం, మనోనిగ్రహం

**fortnight** రెండు వారాల కాలం, పక్షం

**forum** వేదిక

**forward army** అగ్రశ్రేణి సైనిక దళాలు

**forwarder** పంపే వ్యక్తి

**forward integration** ఒక కంపెనీ పనికి వచ్చే తక్కిన కంపెనీలను తనలో కలుపుకొనడం

**forward reaction** పురోగామిచర్య

**fossil** శిలాజం. ~ *fuel* శిలాజ ఇంధనం

**fossilization** శిలాజీకరణ

**fossorial** బొరియలు కలిగిన

**foster** శ్రద్ధతో పెంచుకొను/ పోషించు, ప్రోత్సహించు

**fostering** సంరక్షణ, పెంపకం

**fouling** మలినం చేయు

**founder** వ్యవస్థాపకుడు, సంస్థాపకుడు

**founding** నిర్మాణం

**foundling** అనాథ శిశువు, పరిత్యక్త శిశువు

**found object** ప్రాప్త వస్తువు

**foundry** లోహాలు కరిగించే కొలిమి, లోహకార పరిశ్రమ

**fourth estate** పత్రికా రంగం

**fovea** లొత్త

**fowl** కోడి, పక్షి

**foxing** పసిమి మచ్చ

**fractional** ఆంశిక. ~ *crystalization* ఆంశిక స్ఫటికీకరణం. ~ *distillation* ఆంశిక స్వేదనం. ~ *rendering* ఆంశిక చిత్రణ. ~ *testmeal* ఆంశిక ప్రయోగాహారం

**fractionation column** అంశీకరణ స్తంభం

**fractography** భగ్నతాపరీక్ష

**fracture** పగులు, విరుపు

**fragile** పెళుసు, సులువుగా విరిగే, దుర్బల, సున్నితమైన. ~ *relationship* భంగుర సంబంధం

**fragility** దౌర్బల్యం, దుర్బలత్వం, పెళుసుదనం

**fragrance** పరిమళం, సువాసన

**frame** చట్రం, ప్రణాళిక, కట్టడం, వ్యవస్థ

**franchise** వాణిజ్య హక్కు/ అనుమతి; ఓటుహక్కు. *universal adult* ~ సార్వత్రిక వయోజన ఓటుహక్కు

**frankincenase** గుగ్గిలం, సాంబ్రాణి

**frantic** ఉద్రిక్తత, ఉద్విగ్న, పిచ్చి; అత్యావేశపూరితమైన



**frass** కీటకాల విసర్జన

**fraternal turins** రెండు అండాల నుండి జన్మించే కవలలు

**fraternity** సౌభ్రాతృత్వం/ సోదరభావం

**fratricide** అనుజ/ భ్రాతృ హత్య

**fraud** కూటకరణం, వంచన, మోసం, దగా

**fraudulent** వంచనతో కూడిన

**fraudster** మోసగాడు

**fraught with** నిండిన, కూడిన, ఉన్న

**fray** జగడం, పోట్లాట, పోరాడు

**freak** అసహజ, చపల, స్వభావ విరుద్ధ, విచిత్రవ్యక్తి

**free** విడుదల చేయు; స్వేచ్ఛగా ఉన్న, ముక్త, అసంయుక్త, స్వతంత్ర. ~ *acid* అసంయుక్తామ్లం. ~ *and fair* స్వేచ్ఛ, న్యాయబద్ధమైన. ~ *association* స్వేచ్ఛా పదస్ఫురణ. ~ *atmosphere* శూన్య వాతావరణ ప్రదేశం. ~ *booter* దోపిడి దొంగ. ~ *from want* దారిద్ర్య నిర్మూలన స్వాతంత్ర్యం. ~ *hand drawing* స్వచ్ఛంద లేఖనం. ~ *hold* సంపూర్ణ యాజమాన్యపు హక్కులు. ~ *hold property* స్వేచ్ఛాయుతాస్తి. ~ *issue* ఉచితంగా పంపిణీ చేసే వాటాలు. ~ *on the high sea* అన్ని దేశాల నౌకలకు స్వేచ్ఛ. ~ *list* సుంకం లేకుండా దిగుమతులకు అనుమతించిన వస్తువుల జాబితా. ~ *living* స్వేచ్ఛాజీవనం; స్వేచ్ఛగా జీవించే. ~ *offer* ఉచిత కానుక: కొనుగోలుతో పాటు అదనంగా ఇచ్చే. ~ *of particular average* ఓడలోని సరుకుపై చేసే బీమా. ~ *radical* స్వేచ్ఛా ప్రాతిపదిక. ~ *sample* ఉచిత నమూనా/ మాదిరి/ మచ్చు. ~ *state* స్వేచ్ఛాస్థితి. ~ *surface energy* స్వేచ్ఛోపరితల శక్తి. ~ *thinking* స్వేచ్ఛాలోచన. ~ *trade* స్వేచ్ఛా వాణిజ్యం. ~ *verse* స్వేచ్ఛా ఛందం, వచన పద్యం/ కవిత్వం. ~ *will* నిర్ణయ స్వేచ్ఛ

**free carrier** రవాణా ఖర్చులను అమ్మేవారే భరించడం

**freedom** స్వేచ్ఛ, స్వాతంత్ర్యం. ~ *of assembly* సమావేశ స్వాతంత్రం. ~ *of association* సంఘ నిర్మాణ స్వాతంత్రం. ~ *of speech* వాక్ స్వాతంత్రం. ~ *of debate* చర్చించే స్వాతంత్ర్యం. ~ *of enterprise* స్వేచ్ఛా వాణిజ్యం. ~ *of expression* భావ ప్రకటన స్వాతంత్ర్యం. ~ *of form shapes* స్వేచ్ఛా రూపాలు. ~ *of press* పత్రికా స్వాతంత్ర్యం. ~ *of religion* మత స్వాతంత్ర్యం.~ *struggle* స్వాతంత్ర్య పోరాటం, స్వాతంత్ర్య సమరం

**freelance** అనిబద్ధ, స్వేచ్ఛగా పనిచేసే. ~ *journalism* స్వతంత్ర పాత్రికేయత

**freelancer** స్వతంత్ర పత్రికా రచయిత/ రాజకీయవేత్త

**freely** యథేచ్ఛగా

**free trade zone** స్వేచ్ఛా వాణిజ్య ప్రాంతం

**freeze** స్తంభింపజేయు, ఘనీభవించు, నిలిపివేయు

**freezing** ఘనీభవనం, హిమీకరణం. ~ *mixture* హిమీకరణ మిశ్రమం. ~ *point* ఘనీభవన స్థానం

**freight** రవాణా బాడుగ. ~ *rate* రవాణా ధర

**french bean** బీనీసు/ బీన్సు అనే చిక్కుడుకాయ

**french polish** ఫ్రెంచి మిసిమి

**frenzied** ఆవేశం గల, ఒళ్ళుతెలియని కోపం గల

**frequency** తరచుగా సంభవించడం, మరల మరల చెప్పడం, పౌనఃపున్యం. ~ *distribution* పౌనఃపున్య విభాజనం. ~ *histogram* పౌనఃపున్య సోపాన చిత్రం. ~ *polygon* పౌనఃపున్య క్రమభుజి. ~ *table* పౌనఃపున్య పట్టిక
**fresco** గోడమీది బొమ్మ, భిత్తి చిత్రం
**freshers** కళాశాలల్లో కొత్తగా చేరినవాళ్ళు
**freshness** తాజాతనం, నవత, కొత్తదనం
**friable** సులభంగా పొడి/ నుగ్గు అయ్యే
**friction** ఘర్షణ, రాపిడి, కొట్లాట
**friendliness** మిత్రత్వం, స్నేహం, నెయ్యం
**friendship** స్నేహం, మిత్రత్వం, సౌహార్దం
**frig** కాలం వృథాచేయు
**frigate** రక్షణ నౌక, యుద్ధ నౌక
**fright** జడుపు, భయంకర వ్యక్తి/ వస్తువు
**frigidity** జడత్వం, నిరుత్సుకత
**frigivore** పండ్లను తిని బతికే జీవులు
**frills** కుచ్చిళ్ళు
**fringes** గ్రహాలచుట్టు కనిపించే వలయాలు
**frisk** వెదుకు, తనిఖీచేయు
**frisking** తుళ్ళింత
**frivolous** అల్ప, నిస్సార, చపల, నిరర్థకమైన, అవివేకమైన. ~ *complaint* పసలేని ఫిర్యాదు
**frivolously** జల్సాగా
**frolic** చిలిపి చేష్టలు చేయు; వేడుక, సంతోషం
**from now** ఇప్పటి నుండి
**front** ముందరి భాగం, యుద్ధభూమి, కూటమి. ~ *line* రెండు సేనలు తలపడిన చోటు. ~ *organization* అనుబంధ సంస్థ
**frontage** ముందు ప్రవేశం
**frontal** నుదుటి ఎముక, లలాటాస్థి; లలాటం, నుదుటిభాగం
**frontier** సరిహద్దు, ఎల్ల
**frost** తుషారం, మంచు, నురుగు. ~ *action* తుహిన క్రియ. ~ *bite* మంచు దెబ్బ, చలికొరుకుడు. ~ *thrusting* తుహినాతిక్షిప్తం
**frown** ముఖం చిట్లించు, కోపదృష్టి
**frozen** గడ్డకట్టిన, ఘనీభూత. ~ *bank accounts* స్తంభింపజేసిన బ్యాంకు ఖాతాలు
**fructify** సఫలీకృతమగు
**fructose** పళ్ళలో చక్కెర
**frugal** పొదుపుగల, జాగ్రత్తగల, తక్కువ ఖర్చుచేసే
**frugality** పొదుపు చేయడం, తక్కువ ఖర్చు చేయడం
**fruitful** ఫలప్రదమైన, సఫలమైన
**fruitless** విఫల, నిరర్థక
**fruit rot** దాగు తెగులు
**frustrate** నిష్ఫలంచేయు, నిరాశపరచు, విసిగించు
**frustration** నిరాశ, నిస్పృహ, విసుగు, ఆశాభంగం
**frying** వేయించడం
**fudge** మోసగించు, దాటవేయు, వక్రీకరించు, కప్పిపుచ్చు
**fuel** ఇంధనం, వంటచెరకు. ~ *gas* ఇంధన వాయువు
**fugacious** తక్కువకాలం జీవించే
**fugacity** తరళత, పలాయనత
**fugitive** కాందిశీకుడు, పలాయితుడు
**fulcrum** ఆధార(స్థానం)
**fulfilment** పరిపూర్తి, ఫలసిద్ధి
**fuliginous** మసిరంగు
**full bench** ఐదుగురు, అంతకు మించి న్యాయమూర్తులు గల ధర్మాసనం
**full blood** ఒకే తల్లిదండ్రులకు జన్మించిన



**full capacity** పూర్తిపాటవం/ స్తోమత/ ఉత్పత్తి సామర్థ్యం
**fuller's earth** చవిటిమట్టి
**full-fledged** పరిపూర్ణమైన
**full length** పూర్ణాకృతి
**full strength** పూర్తి పటిమ
**full time** పూర్తికాలం
**fully** పూర్తిగా, నిండుగా
**fulminate** తీవ్రంగా ఖండించు, పేల్చు. ~ *powder* విస్ఫోటక చూర్ణం
**fulminating** హఠాత్తుగా ప్రారంభమైన, తీవ్రమైన, విస్ఫోటకమైన
**fulmination** ఖండన, పేలడం, విస్ఫోటనం
**fulvous** కమిలిన వన్నెగల, పింగళ వర్ణం గల
**fumarole** అగ్నిపర్వత బిలం
**fumble** తడబడు, జారవిడుచు
**fume** పొగ, విషవాయువు
**fumigant** పొగలా వ్యాపించే రసాయన పదార్థం
**fumigate** ధూపనం వేయు, పొగబెట్టు
**fumigation** పొగ వేయడం, ధూపనం
**function** ప్రమేయం, విధి, వృత్తి, క్రియ, కార్యం; ప్రవర్తన, ప్రయోజనం. *vital* ~ జీవనక్రియ
**functional** ప్రయోజనాత్మక, క్రియాత్మక. ~ *group* ప్రమేయ సమూహం/ వర్గం. ~ *language* వినియోగ భాష. ~ *literacy* ప్రయోజనకారి అక్షరాస్యత
**functional food** పౌష్టికాహారం
**functionalism** వ్యవహరణ వాదం, కార్య కారణవాదం
**functionary** కార్యనిర్వాహకుడు
**fundamental** మౌలిక, ప్రాథమిక, ప్రధాన. ~ *colours* ప్రధాన వర్ణాలు. ~ *duties* ప్రాథమిక విధులు. ~ *equation* మూలసమీకరణం. ~ *particles* మూలకణాలు. ~ *right* ప్రాథమిక హక్కు. ~ *unit* మూల ప్రమాణం
**fundamentalism** సనాతనవాదం, ప్రామాణ్యవాదం, మతవాదం
**fundus** మూలం. ~ *oculi* నేత్రగోళ మూలం. ~ *of stomach* జఠరమూలం. ~ *uteri* గర్భాశయ మూలం
**funeral** అంతిమ సంస్కారం. ~ *rites* అంత్యక్రియలు
**fungal** శిలీంధ్ర సంబంధమైన
**fungation** కుక్కగొడుగు మాదిరిగా ఉండటం
**fungibles** తూచేవి, తూకం వేసేవి, కొలిచేవి, లెక్కించేవి
**fungicide** శిలీంధ్రనాశని
**fungus** శిలీంధ్రం
**funk** స్థితి, భయం; వెనుకంజవేయు, జారుకొను, తప్పు
**funnel** గరాటు
**fur** ఉన్నిబొచ్చు
**furious** కోపంతో నిండిన, ఉగ్రమైన, ప్రబలమైన, ప్రచండమైన
**furnace** కొలిమి, బట్టీ. ~ *products* బట్టీ ఉత్పన్నాలు
**furnish** సమకూర్చు, ఇచ్చు
**furnishings** సమకూర్చినవి
**furniture** గృహోపకరణాలు, సామాను
**furor** హంగామా, గందరగోళం, కలవరం, రభస
**furrow** ముడత, చీలిక, నాగలి చాలు; దున్ను, దుక్కిచేయు
**furtive** రహస్యాచరణ
**furtively** చాటుగా, రహస్యంగా
**furuncle** సెగగడ్డ

**fury** కోపం, కోపావేశం, క్రోధం
**fuscous** నల్లని, ముదురు రంగున్న
**fuse** కరిగించు, సమ్మిశ్రణం చేయు
**fusibility** జ్వలనీయత
**fusible alloy** జ్వలనీయ మిశ్రలోహం
**fusiform** కదురు ఆకారం గల
**fusilade** వెల్లువ, ఒక్కపెట్టున, మారణాయుధాలు ప్రయోగించడం
**fusion** కరగడం, కలయిక, వివిధ మూలకాలు కలసి పోవడం, విలీనీకరణ, ఏకీకరణ
**fuss** హంగామా
**futile** ఫలితంలేని, ఫలవంతం కాని, వ్యర్థ
**futility** నిరర్థకత
**futurism** భవిష్యద్వాదం
**futuristic** భవిష్యత్తుకు సంబంధించిన, భావికాల లక్షణాలున్న
**futurology** భవిష్యద్దర్శనం
**fuzzy** అస్పష్టమైన, సూచించని, సందేహాస్పదమైన. ~ *area* అస్పష్ట విషయం. ~ *picture image* అస్పష్ట చిత్రప్రతిబింబం. ~ *sound* అస్పష్ట ధ్వని

# G g

**gap** పోచుకోలు/ సొల్లుమాటలు
**gabble** పిచ్చిమాటలు పేలడం, సణగడం, వదరు, వాగు, గబగబా మాట్లాడు, బిగ్గరగా చదువు
**gad fly** జోరీగ; జోరీగలాగ రొదచేసే మనిషి
**gadget** ఉపాయం, యుక్తి (యంత్రంలో) చిన్న అమరిక/ కీలకం, యంత్రపరికరం
**gaff** రహస్యాన్ని బహిర్గతం చేయడం
**gag** వాకట్టు, నోరుమూసివేయు
**gagged** నోట్లో ఏదైనా కుక్కి మాట్లాడకుండా చేయు, నోరు మూయు
**gaggle** బాతులాగా అరుచు; బాతులగుంపు, గలగల మాట్లాడే గుంపు
**gaiety** ఆనందం, సంతోషం, ఉల్లాసం
**gaily** చురుకుగా, ఆనందదాయకంగా
**gain** పొందు, లాభించు, రాబడి, సంపద, లాభం, అంశంలో పెరుగుదల. ~ *and loss account* లాభ నష్టాల ఖాతా
**gainful** లాభకర, లాభదాయక, లాభసాటి, లాభప్రద
**gainsay** కాదని వాదించు, తప్పులెన్ను
**gait** నడిచే రీతి. *cerebellar* ~ చిన్న మెదడు వ్యాధి వలన నడకలో మార్పు. *scissor* ~ కత్తెర నడక. *waddling* ~ బాతునడక లాంటి నడక
**gala** ఉత్సాహపూరిత వాతావరణం, ఆనందమయమైన సమయం
**galactogogue** క్షీరవర్ధని
**galactose** పాల చక్కెర
**galaxy** పాలపుంత, నక్షత్ర వీధి, నక్షత్ర మండలం, వస్తు సముదాయం, ప్రతిభావంతుల సభ/ సమావేశం
**gall** మొక్కల్లో అసాధారణ పెరుగుదల
**gallant** సాహసోపేత, ధైర్యంగల
**gallantry** శౌర్యం, సాహసం, పరాక్రమం. ~ *award* శౌర్యబహుమతి
**gall-bladder** పిత్తాశయం
**gallery** శ్రేణిక, ప్రదర్శనశాల, సభా స్థలం, నాటకశాల, క్రీడామైదానం, అంచెలంచెలుగా కట్టిన ప్రేక్షక స్థానం
**gallop** గుర్రపు దౌడు; వేగంగా పరిగెత్తు. ~ *rhythm* గుండె వేగంగా కొట్టుకోవడం
**gallows** ఉరికంబం
**gallstone** పిత్తాశయంలో రాయి
**gallup poll** నమూనా ఎన్నిక



**galore** చాలా, ఎక్కువగా
**galvanise** ఉద్రిక్తపరచు, ఉత్సాహపడు, జీవంపోయు, మలాం/ కళాయి పూత పూయు
**galvanised iron** మలాంపూసిన ఇనుము
**galvanism** విశేషధాతుస్పర్శ, ప్రవాహ విద్యుత్తు
**galvanometer** గాల్వనీదర్శని
**gambit** తొలి అడుగు, తొలి కదలిక (చదరంగంలో), ఎత్తుగడ, వ్యూహం
**gamble** జూదం; జూదమాడు
**gambler** జూదరి, జూదగత్తె, జూదగాడు
**gamete** బీజకణం
**gamit** సంయోగ బీజం
**gamophobia** పెళ్ళి అంటే భయం
**gamut** సరిగమలు, స్వరసప్తకం, మొత్తం స్వరాలు
**gang** ముఠా, గుంపు, సమూహం. ~ *up* గూడుపుఠాణి చేయు, ముఠాకట్టు
**ganglion** నాడీగ్రంథి. *cervical* ~ గ్రీవ నాడీగ్రంథి. *lumbar* ~ కటి నాడీ గ్రంథి. *sympathetic* ~ సహానుభూత నాడీగ్రంథి
**gang rape** సామూహిక అత్యాచారం
**gangrene** కుళ్లిన పుండు. *diabetic* ~ మధుమేహ వ్రణం. *septic* ~ క్రిమియుక్త పిటకం
**gangster** బందిపోటు, గూండా
**gangue** ఖనిజ మాలిన్యం
**gangway** నడిమిదారి, మెట్లదారి, నిచ్చెన
**gaol** ఖైదు, చెరసాల, జైలు, బందిఖానా. ~ *bird* జైలుపక్షి
**gaoler** జైలరు, చెరసాల అధికారి
**garb** ఉడుపులు, ముసుగు వేషం
**garbage** చెత్త, వ్యర్థ పదార్థం
**garbling** కడగడం, ఆరబెట్టడం, తుడవడం, దుమ్ము దులపడం
**garden cultivation** తోట సేద్యం
**gargle** పుక్కిలింత
**garish** మిలమిల మెరిసే
**garland** పూలమాల; దండవేయు
**garments** దుస్తులు, బట్టలు, వస్త్రాలు
**garner** సంపాదించు, పొందు
**garnering** కూడగట్టు
**garnish** నోటీసు ఇచ్చు, వ్యవహారంలోకి దించు, డిక్రీదారు నుంచి రాబట్టు; అలంకరించు
**garnishee** తన రుణదాతపై డిక్రీ పొందిన వ్యక్తికి నేరుగా చెల్లించవలసిన బాకీదారు. ~ *order* రుణగ్రస్తుడి బాంకు ఖాతాలను నిలిపివేసేందుకు కోర్టు ఇచ్చే ఉత్తర్వు
**garrison** సైన్యం, సైనిక స్థావరం
**garrot** సముద్రపు బాతు
**garrulous** అతివాగుడుతనం
**gas chamber** వాయుకోష్ఠం
**gaseous** వాయుసంబంధ. ~ *state* వాయుస్థితి
**gasp** వేగంగా ఊపిరిపీల్చు (నోటితో), ఊపిరాడకపోవు
**gastrectomy** జీర్ణాశయాన్ని తీసివేయడం
**gastric** జీర్ణాశయ సంబంధమైన
**gastritis** జఠర/ జీర్ణాశయ రోగం
**gastroenteritis** కలరా, ఆంత్రశోథ
**gastroentrologist** ఉదరకోశవ్యాధి నిపుణుడు
**gastroenterology** జీర్ణాశయాంతర వైద్యశాస్త్రం
**gastrolith** పక్షులు మింగే రాయి
**gastrology** పాకశాస్త్రం
**gastronome** పాకనిపుణుడు
**gastronomy** పచన/పాక నైపుణ్యం
**gastroscope** జీర్ణాశయదర్శిని

**gastroscopy** జీర్ణాశయ/ జఠర దర్శనం
**gastrostomy** జఠరరచ్ఛిద్రీకరణం
**gate crash** చొచ్చుకుపోవటం, చొరబాటు
**gate crashed** అనాహూతుడు
**gathering** (ప్రజా) సమూహం
**gauche** కలుపుగోలుతనం లేని వ్యక్తి
**gaudiness** ఆర్భాటం, ఆడంబరం
**gauge** కొలత, మాపనం. *pressure* ~ పీడన మాపకం
**gaunt** బలహీనుడు/ బలహీనురాలు
**gauze** వలగుడ్డ, గాజుగుడ్డ
**gawk** మిర్రిమిర్రి/ తేరిపార చూచు
**gay** ఆనందం, ఆహ్లాదం, స్వలింగ సంపర్కుడు, తత్సంబంధమైన
**gazette** ప్రభుత్వ పత్రిక
**gazump** ఏకపక్షంగా ధర పెంచడం; ఎక్కువ ధర ఇచ్చే మరొకరివైపు మొగ్గు చూపడం
**GDP** *(Gross Domestic Product)* స్థూలదేశీయోత్పత్తి
**gearing** కంపెనీ తెచ్చుకున్న రుణమొత్తాలకు, వాటాల మొత్తానికి మధ్య ఉన్న నిష్పత్తి
**gelatinous** జిగురుగా ఉండే
**Gemini** మిథునం, మిథునరాశి
**gemma** చిగురు
**gemstone** విలువైన రత్నం/ రాయి
**gender** లింగం. ~ *bias* స్త్రీ పురుష వివక్షత. ~ *equality* స్త్రీ పురుష సమానత. ~ *oppression* మహిళల అణచివేత
**gene** జన్యువు
**genealogy** వంశావళి, వంశ పరిణామ క్రమం
**genecology** మొక్కల జన్యు సంఘటన తెలిపే శాస్త్రం
**gene expression** జన్యులక్షణ వ్యక్తీకరణ
**genepool** జన్యునిధి
**general** సాధారణ, సామాన్య. ~ *ability* సాధారణ సామర్థ్యం. ~ *assembly* సాధారణ సభ. ~ *body meeting* సర్వసభ్య సమావేశం. ~ *constituency* సాధారణ నియోజకవర్గం. ~ *discussion* సాధారణ చర్చ. ~ *effectiveness* సాధారణ ప్రభావశాలిత్వం. ~ *election* సాధారణ ఎన్నిక. ~ *enunciation* సామాన్య వివరణం. ~ *lien* అప్పులు చెల్లించే వరకు రుణగ్రహీత ఆస్తులను స్వాధీనం చేసుకునే హక్కు. ~ *partner* సాధారణ భాగస్వామి. ~ *secretary* ప్రధాన కార్యదర్శి. ~ *strike* సార్వత్రిక సమ్మె. ~ *will* ప్రజాభిప్రాయం
**generalisation** సర్వసమన్వయం, సాధారణీకరణం
**generalissimo** రాజకీయాధికారం కూడా చెలాయించే సైన్యాధ్యక్షుడు
**generality** సాధారణత, సాధారణ భావ వ్యాపకత
**generate** ఉత్పత్తిచేయు, ఉత్పాదించు
**generation** ఉత్పాదనం; పురుషాంతరం, తరం. ~ *gap* తరాల మధ్య అంతరం
**generative grammar** నిర్దిష్ట వ్యాకరణం
**generic** సాధారణ, జాతి వ్యాప్తి
**generosity** ఔదార్యం, ఉదారం, దాతృత్వం, పెద్దమనసు
**generous** ఉదార, ఔదార్యం/ గొప్ప మనస్సు గల
**gene** జన్యుకణం
**genesis** ఉత్పత్తి క్రమం, మూలం, ఆధారం. ~ *therapy treatment* జన్యు చికిత్సా విధానం



**genetic** జన్యు సంబంధి. ~ *councelling* జన్యు సంబంధి, హితబోధ. ~ *engineering* జన్యురచన. ~ *psychology* జన్యు మనస్తత్వ శాస్త్రం. ~ *resistance* జన్మసిద్ధ వ్యాధి నిరోధక శక్తి. ~ *resources* జన్యువనరులు
**geneticism** సహజ ప్రవర్తన
**geneticist** జన్యుశాస్త్ర నిపుణుడు
**genetics** జన్యుశాస్త్రం
**genial** ఆహ్లాదకర, సంతోషకరమైన
**geniatric** ముసలితనానికి సంబంధించిన
**geniciology** ఉత్పత్తి శాస్త్రం
**genital** జననేంద్రియ, జననావయవ సంబంధమైన. ~ *organs* జననావయవాలు
**genitalia** జననేంద్రియాలు. *external* ~ బాహ్య జననేంద్రియాలు
**genitourinary** జననేంద్రియ, మూత్ర సంబంధి
**genocide** జాతి విధ్వంసం, సామూహిక హత్యాకాండ
**genome** విశ్వజన్యురాశి
**genotype** జన్యురూపం
**genre** కళా/ సాహిత్య ప్రక్రియ. ~ *painting* నిత్యజీవన చిత్రణ
**gentle** నెమ్మదిగా, మృదువుగా. ~ *folk* మధ్య తరగతి, ఉన్నత తరగతుల ప్రజలు
**gentleness** మృదుత్వం, లాలిత్యం, మర్యాద, పెద్దమనిషి తరహా
**gentry** ఉన్నతవర్గం, పై తరగతి
**genuflect** అణిగిమణిగి ఉండు, మోకరిల్లు
**genuine** వాస్తవ, సరయిన, స్వచ్ఛ, మనః పూర్వక
**genuineness** యాథార్థ్యం, స్వచ్ఛత
**genu valgum** లోపలికి వంగిన మోకాళ్లు, గాడిద కాళ్లు
**genu varum** దొప్పకాళ్ళు (బయటికి వంగిన కాళ్ళు)
**geobiology** భూ జీవాధ్యయనం
**geocarpic** దుంపలు వేసే
**geocentric** భూ కేంద్రీయ. ~ *theory* భూకేంద్రక సిద్ధాంతం
**geochemistry** భూరసాయన శాస్త్రం
**geochronology** భూస్తకవయోధ్యయనం
**geodesy** భూమాపన శాస్త్రం
**geographical** భౌగోళిక, భూగోళ సంబంధమైన
**geography** భూగోళ శాస్త్రం
**geogrosy** భూ నిర్మాణాధ్యయనం
**geological** భూవిజ్ఞాన శాస్త్ర సంబంధి. ~ *age* భౌమకాలం
**geological time scale** భౌమ కాలమానం
**geologist** భూవిజ్ఞాన శాస్త్రజ్ఞుడు
**geology** భూగర్భ శాస్త్రం, భూ విజ్ఞాన శాస్త్రం
**geomagnetic field** భూమ్యయస్కాంత క్షేత్రం
**geometric shape** రేఖాగణిత/ జ్యామితి రూపం
**geometry** జ్యామితి, క్షేత్రగణితం, రేఖాగణితం
**geomorphology** భూస్వరూప శాస్త్రం
**geophagy** మట్టి తినే అలవాటు
**geophysics** భూభౌతికశాస్త్రం
**geopolitical** భౌగోళిక రాజనీతి సంబంధమైన
**geopolitics** భౌగోళిక రాజకీయాలు
**geostationary** భూస్థిర కక్ష్య
**geotropism** భూకేంద్రాభిసరణం
**geriatrician** వృద్ధాప్య చికిత్సా నిపుణుడు
**geriatrics** వృద్ధ వైద్యశాస్త్రం
**germ** క్రిమి, జీవాణువు

**germane** సంబంధితమైన, సుసంగతమైన
**germcide** రోగ క్రిమినాశకం
**germicidal** రోగక్రిమి నాశక
**germinal** బీజ సంబంధమైన
**germinate** ఉద్భవించు, మొలకెత్తు
**germination** అంకురం; అంకురోత్పత్తి, బీజోత్పత్తి
**gerontocracy** వృద్ధుల ప్రభుత్వం
**gerontology** వయోవృద్ధి అధ్యయనం
**gestalt** సమగ్రాకృతి
**gestation** ఫలనదశ, గర్భధారణ నుంచి ప్రసవం అయ్యేవరకు పట్టిన కాలం. ~ *extrauterine* ~ బాహ్య గర్భాశయ గర్భ ధారణ. *period of* ~ గర్భధారణ కాలం
**gesticulate** సైగలు చేయు
**gesticulation** అంగవిక్షేపం, హస్త విన్యాసం
**gesture** అవయవచాలనం, భావసూచన, సైగ, ఆంగికం, సంజ్ఞ
**geyser** వేడినీటి బుగ్గ
**GFD** *(Gross Fiscal Deficit)* స్థూలద్రవ్య లోటు
**ghastly** భయంకరమైన
**ghost writer** కిరాయి రచయిత, తెరచాటు రచయిత
**giant** దీర్ఘకాయుడు; పెద్ద ఆకారం/ పరిమాణం ఉన్న వస్తువు; అసాధారణ కృత్యాలు చేయగలిగిన వ్యక్తి. ~ *cell* బృహత్కణం. ~ *size* బృహత్ పరిమాణం
**gibber** వేగంగా మాట్లాడు
**giddy** తల తిరగడం, కళ్ళు తిరగడం
**gift** కానుక, బహుమతి
**gigantic** చాలా పెద్దదైన, అసాధారణాకృతి గల
**gigantism** మహాకాయత
**giggle** కిసుక్కున నవ్వు, చప్పుడు చేస్తూ నవ్వు

**gild** పూతపూయు, పన్ను (చెల్లింపు)
**gilder** నగిషీలు చెక్కే వ్యక్తి
**gill** మొప్ప
**gilt-edged** శ్రేష్ఠమైన. ~ *market* శ్రేష్ఠమైన విపణి. ~ *security* శ్రేష్ఠమైన రక్షణ
**gilts** నియతకాలిక వ్యవధుల్లో నిర్ధారిత వడ్డీని చెల్లించే ప్రభుత్వ హామీ పత్రాలు
**gim crack** ఆకర్షణీయంగా కనిపించే నాసిరకం వస్తువులు
**gimmick** అసాధారణ చర్య/ వస్తువు
**gingeley** నువ్వులు
**ginger** అల్లం. *dry* ~ శొంఠి. *green* ~ పచ్చి అల్లం. ~ *group* స్వపక్ష విమర్శకులు
**gingivitis** పంటి చిగురువాపు
**gingivus** పంటిచిగురు
**giorn** దినకృషి: ఒక రోజులో చిత్రించిన చిత్రంలోని భాగం
**gird** సవాలు చేయడం
**girdup one's loins** కష్టమైన లేదా ప్రమాదకరమైన దానిని చేయడానికి ఉపక్రమించు
**giro** ఒక బ్యాంకు ఖాతాలో ఉన్న డబ్బును మరో బ్యాంకుకు బదిలీ చేసుకొను వెసులుబాటు; అనారోగ్యంతో ఉన్నవారికి నిరుద్యోగులకు ప్రభుత్వం ఇచ్చే చెక్కు
**girth** పరిధి, చుట్టుకొలత. *abdominal* ~ ఉదరపరిధి
**gist** సారాంశం, సంగ్రహం
**given name** అసలుపేరు, వ్యక్తి నామం, పెట్టిన పేరు
**giver** దాత, దానం చేసేవాడు
**giving into extortion** బెదిరింపులకు లొంగిపోవు
**gizzard** అంతర్జఠరం



**glacial** హిమనదీయ. ~ *age* హిమ యుగం
**glaciation** మంచుతో కప్పు
**glacier** మంచుదిబ్బ, హిమానీనదం
**galciology** హిమాధ్యయనం
**gladden** సంతోషపెట్టు, ఆనందం కలిగించు
**gladness** సంతోషం
**glamour** ఆకర్షణ, సమ్మోహనశక్తి
**glance** దృక్కు. ~ *at* చూపు విసురు, ఓర కంటచూచు. ~ *down* దృష్టిమళ్ళించు
**glancingly** క్షణికవీక్షణంలో
**gland** గ్రంథి. *ductless* ~ వినాళగ్రంథి. *endocrine* ~ వినాళగ్రంథి. *lymphatic* ~ శోషరసగ్రంథి. *mammary* ~ క్షీర గ్రంథి. *salivary* ~ లాలాజల గ్రంథి. *sebaceous* ~ (చర్మంలోని) తైలగ్రంథి
**glans** జననాంగ శీర్షం
**glare** కళ్లు చెదిరేట్టు మెరియు
**glasnost** దాపరికం లేని జవాబుదారీతనం
**glass** గాజు, కాచం. *photochronic* ~ కాంతివర్ణ ఉత్తేజిత కాచం. ~ *wool (glass silk)* గాజు ఉన్ని/ పట్టు
**glaucoma** నీటికాసులు
**glaze** మెరుపు, తళుకు
**glazed** మెరుగుపెట్టిన. ~ *tile* పింగాణి పలక
**glazier** ద్యుతికారుడు, గాజుపలకలు అమర్చే వ్యక్తి
**glazing** ద్యుతికల్పన, గాజుపలకలు అమర్చడం/ మెరుగుపెట్టడం
**gleam** మెరయు; ప్రకాశం
**gleaming** నిగనిగ, ధగధగ
**glee** సంతోషం, ఆనందం
**glide** సున్నితంగా నడవడం, జారు, పాకు
**glimpse** సంగ్రహావలోకనం, క్షణికదృష్టి, అస్పష్ట భావం

**glint** ప్రకాశం, మెరుపు, కాంతి
**glitch** అవాంతరం, చిన్న సమస్య
**glittering** తళతళ, తళుకుబెళుకు; మెరుస్తున్న
**global** అంతర్జాతీయ, గోళాకార, భౌగోళిక, ప్రపంచవ్యాప్త. ~ *positioning system (GPS)* ఉపగ్రహదిక్సూచి. ~ *war* ప్రపంచ యుద్ధం. ~ *warming* భూమి వేడెక్కటం
**globalisation** ప్రపంచీకరణ, భూమీకరణ, భౌగోళీకరణ, విశ్వీకరణ, విశ్వవ్యాప్తీకరణ
**globe trotter** ప్రపంచ పర్యాటకుడు
**globular** గోళాకార
**globule** (ద్రవపదార్థాల) చుక్క, గోళకం
**glomerular** రక్తకేశనాళికల గుత్తి
**gloom** నిస్తేజం, నిరాశ, విచారం
**glorify** కీర్తించు, ప్రశంసించు, ఎక్కువచేసి చూపు
**glorious** ప్రతిష్ఠాకరమైన, కీర్తనీయ, విఖ్యాత
**glory** కీర్తి, పేరు, ప్రాభవం
**gloss** అర్థం, వివరణ; నిగనిగ
**glossary** శబ్దావళి, శబ్దసంగ్రహం, పదకోశం
**glossitis** నాలికపూత, నాలుక మండడం
**glossy** నిగనిగలాడే. ~ *magazine* ఖరీదైన పత్రిక
**glottis** కంఠబిలం, కంఠద్వారం
**glove** చేతి తొడుగు
**glow** వెలుగు, అధికం, ఘనం, పరిదీప్తి, దీప్తి. *cathode* ~ రుణధ్రువ దీప్తి. ~ *discharge* దీప్తి ఉత్సర్గం
**glowing tributes** ఘననివాళులు
**glue** జిగురు, భ్రాంతి కలిగించే ఓ రకం మాదకద్రవ్యం. ~ *sniffing* మానసిక భ్రాంతి పొందడం

**glumed wheat** యవలు
**glume** ఊక, పొట్టు
**glut** వస్తు సమృద్ధి
**gluteal** పిరుదుకు చెందిన
**glutton** తిండిపోతు
**glyphic art** పరికల్పన కళ, అలంకరణ
**glyptography** రత్నాలను చెక్కే కళాధ్యయనం
**gnarled** చివికిపోయిన, ఎగుడు దిగుడుగా ఉన్న
**gnat** కీటకం, దోమ
**gnawing** పళ్ళు పటపటలాడించు
**gnome** నీతివాక్యం
**gnostic** జ్ఞానసంబంధమైన
**goad** ముల్లుగర్ర; పొడిచినట్లు, వెంటాడు
**goal** చెరసాల; ఖైదు చేయు, బంధించు. ~ *directed behaviour* జీవిత లక్ష్యానుసారి ప్రవర్తన
**goatee** మేక గడ్డం వంటి గడ్డం
**gobble up** స్వాహాచేయు
**go between** దూత
**goblin** చిన్న దెయ్యం
**go critical** ఉత్పత్తి ప్రారంభించు
**godfather** సంరక్షకుడు, మాఫియా నాయకుడు
**god forsaken** ఆకర్షణ లేని; మనసు విరిచే
**go down the drain** మట్టిగొట్టుకుపోవు, నష్టపోవు
**go getter** విపరీతమైన అత్యాశ గల వ్యక్తి
**go green** పర్యావరణానికి నష్టం కలిగించని వస్తువుల ఉత్పాదన, వాడకం
**going rate** సాధారణ వేతనం
**goitre** గొంతు కణితి, గ్రంథివాపు వ్యాధి
**gold** బంగారం, పైడి, విలువైన లోహం. ~ *bonds* బంగారం వెల మీద ఆధారపడ్డ పత్రాలు. ~ *paint* బంగారు రంగు. ~ *powder* బంగారుపొడి. ~ *standard* స్వర్ణ ప్రమాణం. ~ *smith* స్వర్ణకారుడు
**gonad** బీజకోశం/గ్రంథి
**gong** జేగంట
**gonorrhoea** సెగరోగం
**good faith** విశ్వసనీయత, గట్టి నమ్మకం, ప్రగాఢ విశ్వాసం
**good relations** సత్సంబంధాలు
**goods** (తయారైన) వస్తువులు
**goofy** అపహాస్యమైన
**goose skin** ఒళ్లు గగుర్పాటు
**gordian knot** చిక్కుముడి/ సమస్య/ పరిస్థితి
**gorge** ద్రోణి, ఇరుకుదారి
**gorgeous** ఆశ్చర్యకరమైన; సంతోషాన్ని సంతృప్తిని ఇచ్చే
**gory** రోతపుట్టించే, అసహ్యమైన, నికృష్టమైన
**go slow** నెమ్మదిగా వెళ్ళు/ పనిచేయు, తాత్సారం చేయు
**gosmetic rehash** పైపై మెరుగులు దిద్ది పునఃప్రదర్శించడం
**gossip** ఊసులాట, వ్యర్థ ప్రసంగం
**gouache** గహన వర్ణ ప్రక్రియ
**gouge** అర్ధ చంద్రాకృతి, నఖాకృతి
**gourmand** తిండిపోతు
**gourmet** నాణ్యత/ రుచులు బాగా తెలిసిన వ్యక్తి
**gout** కీళ్లవాతం
**governance** పాలన, పరిపాలన/ ప్రభుత్వ విధానం
**governing body** పాలక వర్గం
**government** ప్రభుత్వం. ~ *in exile* ప్రవాస ప్రభుత్వం



**governor** రాజ్యపాలకుడు
**grab** దురాక్రమణ, సత్వర నిర్ణయం; స్వాధీనం చేసుకొను, హరించు, కాజేయు, ఆక్రమించు
**grace** ఒయ్యారం, హొయలు; లావణ్యం
**grace period** అప్పు చెల్లించడానికి ఇచ్చే అదనపు కాలం
**gradation** శ్రేణీకరణం, అనుక్రమం, స్థాయి భేదం, దర్జాబందీ
**graded** శ్రేణీకృత. ~ *rivers* శ్రేణీకృత నదులు
**gradient** ప్రవణత, వాలు
**grading** శ్రేణీకరణ
**gradualism** క్రమ పరిణామ వాదం
**gradually** నెమ్మదిమీద, పోనుపోను, రానురాను, క్రమంగా
**graduation parade** దీక్షాంతర విన్యాసం
**graffiti** గోడమీద రాత
**graft** అవినీతి, అక్రమార్జన, అంటుకట్టడం, అంటుకట్టు. *bone* ~ ఎముక అంటుకట్టు. *corneal* ~ శుక్లపటలం అంటుకట్టు. *skin* ~ చర్మం అంటుకట్టు
**grafting** అంటుకట్టడం. ~ *wax* అంట్లమైనం
**grammarian** లాక్షణికుడు, వైయాకరణుడు
**grammatology** లిపిశాస్త్రం
**granary** పాతర, గాదె, ధాన్యపు కొట్టు
**grandeur** వైభవం, అంగరంగ వైభవం, గాంభీర్యం, మహత్వం, ఐశ్వర్యం, శోభ
**grandiloquent** ధారాశుద్ధిగల, ధారాళ
**grand manner** ఉదాత్తశైలి
**granite** నల్లరాయి
**grannular** రేణుయుత
**grant** నిధి; మంజూరు చేయు. ~ *in aid* సహాయక నిధి
**grantor** అనుదాత, అనుదానకర్త
**granulation** కణాంకురణం
**granules** నూకల మాదిరిగా ఉండే రేణువులు
**grapevine** వదంతి
**graph** రేఖాచిత్రం/ పటం, రేఖ
**grapheme** లిపి చిహ్నం
**graphic arts** ముద్రణ/ లేఖన కళ
**graphology** లిప్యధ్యయనం
**grapple** పట్టుకొను; తంటాలుపడు; బిగించు; తలపడు; సాధింపచూచు
**grasp** పట్టు, గ్రహణశక్తి
**grass-root level** అట్టడుగు స్థాయి
**grate** జాలిక; సంపటి బిళ్ల
**gratification** తృప్తి, ప్రతిఫలం
**grating** జాలకం
**gratis** ఉచితం, చెల్లించనవసరం లేని
**gratuity** ఉచితార్థ పారితోషకం
**gravel** గులకరాళ్ళు, కంకర
**gravid** గర్భవతియైన; పరిణతిచెందిన
**gravimetric** భారమాన. ~ *analysis* భారమాన విశ్లేషణం
**gravitation** గురుత్వాకర్షణ. ~ *force* గురుత్వాకర్షణ శక్తి
**gravity** తీవ్రత, ఆకర్షణ బలం
**graze** మేయు, మేపు
**grazing angle** స్పర్శకోణం
**great glaciers** మంచునదులు
**great indian bustard** బట్టమేకపక్షి
**greatly** గొప్పగా, అద్భుతంగా, పెద్దగా
**greatness** గొప్పదనం
**great power chauvinism** అగ్రరాజ్య దురహంకారం
**greedily** ఆబగా
**greedy** అత్యాశగల, లుబ్ధ
**green signal** అనుమతి, అంగీకారం

**green vitriol** అన్నభేది

**green** పర్యావరణ పరిరక్షణకు సంబంధించిన, ఆకుపచ్చని. ~ *earth* శాద్వల భూమి. ~ *pigmants* హరిత వర్ణ ద్రవ్యాలు. ~ *sand and herbs* ఆకులు, అలములు

**green art** యవన కళ, గ్రీకు కళ. ~ *pottery* గ్రీకు పింగాణి

**green belt** హరిత తోరణం

**green book** ఇటలీ ఇరాన్‌ల ఆధికారిక పత్రం, న్యాయస్థాన నిర్వహణకు సంబంధించిన నిబంధనలు

**green card** నివసించడానికి, పనిచేయడానికి అమెరికా ప్రభుత్వం ఇచ్చే అనుమతి పత్రం

**green gram** పెసలు

**green house effect** హరితగృహ ప్రభావం

**green light** అనుమతి, అంగీకారం

**green onion** ఉల్లికాడ

**green revolution** హరిత విప్లవం, వ్యవసాయంలో అధికోత్పత్తి సాధన

**greeting** పలకరింపు

**gregarious** గుంపుల్లో జీవించే అలవాటు

**gregariousness** కలిసి మెలసి ఉండటం

**gremlin** చిన్నభూతం, క్షుద్రదేవత

**grey book** జపాన్, బెల్జియం దేశాల ఆధికారిక నివేదిక

**grey market** కొరతలున్నా చట్టబద్ధంగా సాగే విపణి

**grid** తంత్రీ జాలకం

**grievance** కష్టం, ఇబ్బంది, బాధ, మనోవేదన

**grievances** కోర్కెలు, సాధకబాధకాలు

**grievous** వ్యాకులపరిచే, బాధాకరమైన, దారుణ

**grill** తరిచి తరిచి అడుగు, ఇబ్బందిపెట్టు

**grim** తీవ్రమైన; నిష్ఠురమైన, కఠినమైన; కనికరంలేని, దయలేని, భయంకరమైన, బాధాకరమైన, నిరుత్సాహకరమైన, దుఃఖకరమైన, కలతపరిచే

**grimace** వెక్కిరించు, ముఖం చిట్లించుకొను

**grime** కాలుష్యం, మట్టికప్పు

**grind** నూరడం, రుబ్బడం, విసరడం

**grip** పట్టు, అలుముకొను, వ్యాపించు, అదుపు (లోకి తీసుకొను); పిడికిలి, పంజా

**grisaille** ధూసరిక, ఏక వర్ణ చిత్రం

**groan** మూలుగు

**grocer** పచారికొట్టు/ వెచ్చాల కొట్టు/ కిరాణా కొట్టు/ యజమాని

**grocery** పచారీ/ కిరాణా/ వెచ్చాల కొట్టు

**groggy** జబ్బుగా ఉన్నట్లు అనుకొను

**groin** ఊరుసంధి, గజ్జ

**groove** గాడి, తోట

**grope** గుడ్డిగా వెతుకు, తడుములాడు, అన్వేషించు

**gross** తీవ్రమయిన, పూర్తి, ఏ అంశాన్ని వదిలివేయని; ఉత్పాదన/ సంపాదన మొత్తం. ~ *domestic product* స్థూల దేశీయోత్పత్తి. ~ *earnings* స్థూలాదాయం. ~ *income* స్థూల ఆదాయం. ~ *interest* మొత్తం వడ్డీ. ~ *loss* మొత్తం నష్టం. ~ *margin* మొత్తం ఉపాంతం. ~ *misconduct* దుష్ప్రవర్తన. ~ *national income* స్థూల జాతీయాదాయం. ~ *national product* స్థూల జాతీయోత్పత్తి. ~ *profit* స్థూల లాభం, మొత్తం లాభం. ~ *revenue* స్థూల ఆదాయం. ~ *yield* సంపాదన మొత్తం

**grotesque** విలక్షణమైన



**ground** భూమి, భూమిక, నేల, స్థలం, ప్రాతిపదిక, ఆధారం, కారణం. ~ *breaking* సంచలనాత్మకమైన. ~ *decisions* సంచలనాత్మక నిర్ణయాలు. *dumping* ~ చెత్త పారేసే స్థలం

**groundless** ఆధారరహితమైన

**groundnut** వేరుసెనగకాయ. ~ *kernals* వేరుసెనగ పప్పు

**ground water** భూగర్భ జలం

**group** ముఠా, వర్గం, బృందం, సమూహం, గుంపు, వ్యక్తుల/ వస్తువుల సముదాయం. *blood* ~ రక్తవర్గం

**groupage** సరుకు వివరాలను ఒకే జాబితాలో పొందుపరచడం

**group balance sheet** అనుబంధ కంపెనీల ఆర్థిక స్థితిగతులపై తయారు చేసే నివేదిక

**grouping** సంఘీకరణం

**grouse** గొణుగుడు, ఒకరకమైన పక్షి

**grouting** దట్టించడం

**grovel** పాకులాడు, అఱ్ఱులుచాచు

**grovelling** దేవులాట, బతిమలాడడం

**growth** వృద్ధి, పెరగడం, ఎదగడం. ~ *industry* వస్తుసేవలను అందించే పరిశ్రమ

**groyne** నీటిమట్టాన్ని పెంచడానికి నిర్మించే గోడ

**grub** లార్వా; తిండి

**grubs** లద్దె/ పేడ పురుగులు

**grudge** ద్వేషం, పగ, అనిష్టత

**gruel centre** గంజి కేంద్రం

**gruelly** దారుణంగా

**gruesome** దారుణ, ఘోర, భయానక, భయంకర, భీషణ, బాధాకర, కిరాతక

**grumbling** గునుపు

**grunt** మూలుగు

**guarantee** హామీ, పూచీ, హామీపత్రం. ~ *money* హామీ రుసుము

**guaranteed wage** పనిలేనప్పుడు కూడా వేతనాలు చెల్లించే ఒప్పందం

**guarantor** హామీదారు, పూచీదారు

**guardian angel** సంరక్షక దైవం

**guard of honour** గౌరవ వందనం

**guava** జామ

**gubernatorial** రాజ్యాంగ విధులు నిర్వర్తించే పదవులకు సంబంధించిన, రాజ ప్రతినిధికి సంబంధించిన

**guerilla** గెరిల్లా; హఠాత్తుగా దాడిచేసే ఆరితేరిన వ్యక్తి

**guest** నిమంత్రితుడు, అతిథి

**guidelines** మార్గదర్శక సూత్రాలు. *legally binding* ~ చట్టబద్ధ మార్గదర్శక సూత్రాలు

**guild** నిగమం, వృత్తికార సంఘం

**guilder** సువర్ణితం, ప్రాచీన కాలపు బంగారు నాణెం

**guild socialism** వృత్తి సంఘ సామ్యవాదం

**guile** మోసం, వంచన, కపటం

**guillotine** శిరశ్ఛేదక యంత్రం

**guilt** దోషం, నేరం, అపరాధం, లొసుగు

**guilty** నేరం చేసిన, అపరాధ భావంతో కూడిన

**guinea pig** తోకలేని సీమపందికొక్కు; ప్రయోగాల్లో ఉపయోగపడే వ్యక్తి

**guise** వేషం, మారువేషం, ముసుగు. *political* ~ రాజకీయమనే ముసుగు

**gull** సాధారణ సముద్రపు పక్షి

**gullet** అన్నవాహిక

**gullies** కాలువలు, అపనాళికలు

**gum** బంక, జిగురు; చిగురు. ~ *eraser* తుడుపు రబ్బరు. ~ *tempera* జిగురు రంగు. ~ *tissue* పంటి చిగుళ్ళు, చిగుళ్లకు సంబంధించిన కణజాలం

**gumming up** అతికింపు
**gun cotton** తుపాకీ మందు. ~ *metal* ఫిరంగిలోహం. ~ *powder* తుపాకి మందు
**gunduction** ప్రేరణం
**guneaworm** నారికురుపు
**gunnery** శతఘ్ని విద్య
**gush** వరద, ప్రవాహం, నీటిబుగ్గ, జలధార; ఎగజిమ్ము, అత్యుత్సాహంతో మాట్లాడు
**gusto** ప్రీతి, ఇష్టం, ఆసక్తి, అభిరుచి, ఉత్సాహం
**gusty winds** సంచలన వాయువులు, ఉద్ధతంగా వీచే గాలులు
**gut** పేగు, ఆహారనాళం, ఆంత్రం
**gutted** దగ్ధమైన, తగులబడిన
**gutter** మురికి కాలువ
**gymnasium** వ్యాయామశాల, తాలింఖానా
**gynaecology** స్త్రీ జననేంద్రియ వైద్య శాస్త్రం, స్త్రీరోగ శాస్త్రం
**gynandromorph** ఉభయలింగజీవి
**gynandry** ఆడవాళ్ళలో మగలక్షణాలు
**gynecomastia** పురుషులలో స్తనవృద్ధి
**gynocracy** స్త్రీ రాజ్యం
**gynocriticism** స్త్రీలుచేసు స్త్రీవాద విమర్శ
**gynocritics** స్త్రీవాద, స్త్రీ విమర్శకులు
**gynoecium** పుష్పాండకోశం
**gypsum** ముగ్గుసున్నం
**gyrate** సుడులు తిరుగు

# H h

**habeas corpus** హెబియస్ కార్పస్, బంధితుని హాజరు పరచవలసిందిగా కోర్టు జారీచేసే ఉత్తరువు
**habit** అలవాటు
**habitat** నివాసస్థానం
**habitual** ఎడతెగని, వాడుకైన, నిత్యమైన. ~ *offender* పాత నేరగాడు, అభ్యస్తాపరాధి
**habitually** అలవాటుగా, స్వాభావికంగా
**habituate** అలవాటుపడు/ పరుచు
**habituated** అలవాటుపడిన
**habituation** అలవాటు చేయటం
**hack** కొట్టడం, బూటుకాలితో తన్నడం, ఖండించు, ముక్కలుచేయు, నరుకు
**hackneyed** అర్థరహితమైన, అరిగిపోయిన
**haemarhosis** కీలులో రక్తం చేరడం
**haematemesis** రక్తం వాంతి చేసుకోవడం
**haematinic** రక్తవర్ధిని
**haematite** ముడి ఇనుప ఖనిజం
**haematoma** నెత్తురు గడ్డ
**haematuria** మూత్రంలో రక్తం పోవడం
**haeamoglobin** రక్తవర్ణం
**haemolysis** రక్తం విరగడం
**haemopericardium** గుండె చుట్టూ ఉండే పొరల్లో రక్తం చేరడం
**haemopoiesis** రక్తకణోత్పాదనం, దగ్గినప్పుడు రక్తం పడడం
**haemorrhage** రక్తస్రావం. *antepartum* ~ ప్రసవపూర్వ రక్తస్రావం. *cerebral* ~ మెదడులో రక్తస్రావం. *intestinal* ~ ఆంత్ర రక్తస్రావం. *postpartum* ~ ప్రసవానంతర రక్తస్రావం. *uterine* ~ గర్భాశయ రక్తస్రావం
**haemorrhoids** మొలలు
**haemostatis** రక్తస్తంభన
**haemothorax** ఉరఃకుహరంలో రక్తం చేరడం
**hag** వికారమైన స్త్రీ
**haggard** దుర్బల, రోగగ్రస్త వ్యక్తి
**haggle** వాదం, బేరం; కొసరి బేరమాడు



**hagiography** మహాత్ముల జీవిత చరిత్ర
**haiku** 5-7-5 సంఖ్యలో క్రమంగా అక్షరాలున్న మూడు పాదాల జపనీసు పద్యం. ఇది ముక్తకం
**hail** వచ్చు, ప్రశంసించు, పొగడు
**hairfollicle** రోమకూపం
**halcyon** ఆనంద సమయం
**half life** అర్ధజీవితకాలం, అర్ధాయువు
**halftone** అర్ధస్వరం
**half yearly results** అర్ధసంవత్సర ఫలితాలు
**hall mark** ముద్ర, మొహరు, ప్రమాణ చిహ్నం
**hallophytes** ఉప్పునీటి మొక్కలు
**hallow** పవిత్రీకరించడం, పవిత్రంచేయు
**hallucination** మతిభ్రమ, ఇంద్రియ గుణాలకు అతీతమైన అనుభూతిని పొందడం. *auditory* ~ శ్రవణభ్రమ. *visual* ~ దృష్టిభ్రమ
**hallucinogene** భ్రామకం/ భ్రమింపజేసేది
**hallux** కాలి బొటనవేలు
**hallux valgus** కాలిబొటన వేలు బయటకు తిరిగి ఉండడం
**halo** పరివేషం, చుట్టూ ఉండే వెలుగు
**halophyte** ఉప్పు నీటి మొక్క
**halting** మజిలీ
**ham** పంది మాంసం
**hamlet** శివారు గ్రామం, మజరా, కింది పల్లె
**hamper** ఆటంకం, ఇబ్బంది, అడ్డు, అటకాయింపు, నిరోధం, ప్రతిబంధకం; అడ్డుపుల్ల వేయు, నిరోధించు, అవరోధం కలిగించు, ప్రతిబంధకంగా నిలుచు, అడ్డుకొను
**hamstring** స్నాయువును ఎముకతో కలిపే తాడువంటి నరం
**hand** హస్తం. ~ *book* చేతి పుస్తకం. ~ *cuffs* బేడీలు. ~ *out* కరపత్రం, ప్రకటన, బిచ్చం. ~ *pick* ఏరుకొను. ~ *simian* మర్కట హస్తం. ~ *writing* దస్తూరి, చేరాత
**handicap** అంగవైకల్యం, ప్రతిబంధకం; అవరోధం కలిగించు, ఆటంకం కలిగించు
**handicraft** చేతిపని, హస్తకళ
**handiwork** చేతిపని, మానవకల్పిత వస్తువు
**handle** సంబాళించు, వ్యవహారం నడిపించు, నిర్వహించు; చేతిపిడి
**hang** ఉరితీయు
**hangman** తలారి, ఉరితీసే వ్యక్తి
**hangover** బాధించు, కష్టతరంచేయు; దుష్ప్రభావం
**hank** నూలుకండె
**hanky panky** రహస్య సంబంధం
**haphazard** పద్ధతి ప్రకారం లేని, అనుకోని, ఆకస్మిక, అస్తవ్యస్త, చిందరవందరైన
**hapless** దురదృష్టకరమైన, దౌర్భాగ్యకరమైన, అదృష్టహీనమైన
**happening** ఫలసిద్ధి, సంభావం, దుర్ఘటన
**happiness** సంతోషం, సుఖం
**happy augur** శుభ సూచకం, శకునం
**hara kiri** ఆత్మహత్య
**haram** (ఇస్లాం మత ఆచారాల ప్రకారం) నిషిద్ధాహారం. ఇది *halal*కి వ్యతిరేకం
**harangue** శక్తిమంతమైన, సుదీర్ఘమైన ఉపన్యాసం
**harass** పీడించు, తొందరపెట్టు
**harassment** వేధించడం, బాధించడం. *sexual* ~ లైంగిక వేధింపు
**harbinger** వైతాళికుడు, అగ్రగామి, దూత, భవిష్య సూచకం

**harbour** ఓడరేవు; ఆశ్రయం ఇవ్వడం. ~ *the guilty* నేరస్థునికి ఆశ్రయం ఇవ్వడం
**hard** కష్టమైన, కఠినమైన, దృఢమైన. ~ *and fast rule* ఖచ్చితమైన నియమం. ~ *cash* నగదు, రొక్కం. ~ *to comprehend* దుర్గ్రాహ్యం. ~ *copy* ముద్రిత సమాచారం. ~ *currency* విదేశీ కరెన్సీ; పంపిణీ కొరత వున్న విదేశీ మారక ద్రవ్యం. ~ *earned* కష్టార్జిత. ~ *edge painting* విశిష్ట చిత్రణ. ~ *headed* దృఢవ్యక్తిత్వంగల. ~ *hearted* కఠిన హృదయంగల, జాలిలేని. ~ *hitting* గట్టిదెబ్బతీయగల, అత్యంత విమర్శనాత్మకమైన. ~ *knocks* ధక్కా ముక్కీలు. ~ *liner* మార్పుకు వ్యతిరేకి. ~ *loan* తమదేశం కరెన్సీలో తిరిగి చెల్లించే షరతుపై మరో దేశానికి ఇచ్చే రుణం. ~ *sell* బలవంతంగా కొనుగోలు చేయించే పద్ధతి.
**hardened criminal** బండబారిన నేరగాడు
**hardship** కష్టం, ఆపద
**hardware** లోహ వస్తువులు, పాత్ర సామగ్రి, కంప్యూటర్ పరికరం. *military* ~ ట్యాంకులు, క్షిపణులు, విమానాలు తదితర రూపాల ఆయుధ సంపత్తి
**hard water** ఖారజలం, కఠిన జలం
**hardy** దృఢమైన, సాహసిక
**hare** చెవులపిల్లి
**harelip** తొర్రి పెదవి
**harem** జనానా, రాజాంతఃపురం
**harlot** వేశ్య
**harmone** నిర్నాళ గ్రంథులలో ఊరే రసం
**harmonic** స్వరాత్మకం
**harmonious** సామరస్యపూర్వకమయిన
**harmonise** మేళవించు, సమన్వయించు
**harmony** క్రమబద్ధత, సామరస్యం, ఆకర్షణ, ఏకస్వరం
**harness** సజ్జీకరణ; నియంత్రణకు తెచ్చు
**harp** త్రికోణాకార తంత్రీ వాద్యం, వివరించు, చెప్పు, రగడచేయు, ప్రస్తావించు
**harry** విసుగు తెప్పించేలా అడగడం
**harshness** పరుషత్వం, కరుకుదనం, కాఠిన్యం
**harvesting** మాసూళ్లు, పంటకోతలు, నూర్పిళ్ళు
**hassle free opportunity** అవాంతరం లేని అవకాశం
**haste** దుడుకుతనం, సంవేగం, ఆత్రం, ఆతురత
**hatch** కుట్ర/ పన్నాగం పన్ను, పొదుగు
**hatchery** చేపల/ కోళ్ల ఉత్పత్తి కేంద్రం
**hatchet** చిన్న గొడ్డలి
**hatefully** కంటగింపుగా
**hatred** ద్వేషం, పగ, ఏవగింపు
**haughtiness** మిడిమేళం, గర్వం
**haul** లాకు ఎత్తివేయు, ఒకచోటు నుంచి ఇంకొక చోటుకు మార్చు
**haulage** సరుకురవాణా చేయడం/ వ్యయం
**haulier** వాణిజ్యపరంగా సరుకు రవాణా చేసే సంస్థ/ వ్యక్తి
**haunt** వెంటాడు, తరచుగా సందర్శించు
**have** కలిగి ఉండు. ~ *a human face* మానవీయంగా కనపడు. ~ *the ball at once feet* అవకాశాన్ని పొందు
**havoc** బీభత్సం, ఉపద్రవం, అతలాకుతలం, అధిక నష్టం, విధ్వంసం
**hawk** గద్ద, డేగ, పీడించే వ్యక్తి, దురాశాపరుడు, రణోన్మాది
**hawker** వీధుల్లో తిరిగి వస్తువుల్ని అమ్మే వ్యక్తి



**hawkish generals** యుద్ధోన్మాద సేనానులు
**hay** (ఎండు) గడ్డి; గడ్డి సరిహద్దు. ~ *fever* జలుబు, పడిశంతో వచ్చే జ్వరం. ~ *looked* అపరిపక్వమైన, సగం ఉడికిన. ~ *stack* గడ్డివామి
**hazard** ఆపద. *occupational* ~ వృత్తి సంబంధమైన ఆపద. *radiation* ~ వికరణ సంబంధమైన ఆపద
**hazardous** ప్రమాదకరమైన. ~ *waste* ప్రమాదకర వ్యర్థ పదార్థాలు
**haze** పొగమంచు, అస్పష్టత
**hazy** అస్పష్టమైన, మసకగా ఉన్న, మబ్బుగా ఉన్న, పొగ కమ్మి ఉన్న
**head** తల, నాయకుడు, అధిపతి, శాఖాధిపతి, ఉన్నతాధికారి; ఆధిపత్యం వహించు. ~ *hunt* అర్హుల కోసం (ముఖ్యంగా మరో సంస్థలో) వెదుకు. ~ *line* ముఖ్య సమాచారం, వార్తాశీర్షిక. ~ *office* ప్రధాన కార్యాలయం. ~ *quarters* ప్రధాన/ కేంద్ర కార్యాలయం. ~ *strong* తలబిరుసు. ~ *way* అభివృద్ధి
**header paper** రాసే వ్యక్తి/ సంస్థ పేరు, చిరునామా, టెలిఫోన్ నంబర్లు వగైరా పైభాగాన ముద్రితమై ఉండే కాగితం, లేఖ
**healing touch** స్పర్శవైద్యం
**health** ఆరోగ్యం. ~ *care* ఆరోగ్యరక్షణ. ~ *centre* ఆరోగ్య కేంద్రం. *community* ~ సమాజారోగ్యం. *mental* ~ మానసికారోగ్యం. *public* ~ ప్రజారోగ్యం. ~ *visitor* ఆరోగ్య విచారణ కార్యకర్త
**heap** తెట్టు, కుప్ప, దొంతర, దొంతి
**heaping** పేర్పు
**hearing** న్యాయవాదులు తమ వాదనలు వినిపించడం; వాదోపవాదాల విచారణ దశ
**hearsay** శ్రుత పాండిత్యం, వినికిడి. ~ *evidence* వినికిడి
**heart** గుండె, హృదయం. ~ *block* హృదయ స్పందనావరోధం. ~ *breaking* గుండెను పగులకొట్టే. ~ *burn* గుండె మంట. ~ *failure* హృదయస్తంభన. ~ *felt* హృదయపూర్వక. ~ *rending* హృదయ విదారకమైన
**hearth** అగ్నిగుండం, గాడిపొయ్యి, నిప్పు
**heartily** మనసారా, హృదయపూర్వకంగా
**heat** ఉష్ణత, వేడిమి. ~ *capacity* ఉష్ణధారణ. ~ *conduction* తాపవాహనం/ వాహకం. ~ *exchanger* ఉష్ణవినిమాయకం. ~ *loss* ఉష్ణక్షయం. *latent* ~ గుప్తోష్ణం. ~ *of absorption* శోషణోష్ణం. ~ *of activation* ఉత్తేజనోష్ణం. ~ *of atomization* కణీకరణోష్ణం, పరమాణూష్ణం. ~ *of combustion* దహనోష్ణం. ~ *of decomposition* వియోగోష్ణం. ~ *of fusion* గలనోష్ణం. ~ *of reaction* చర్యోష్ణం. ~ *proof* వేడిచొరని. ~ *resistant* ఉష్ణనిరోధక. ~ *transfer* ఉష్ణ స్థానాంతరణం. ~ *treatment* ఉష్ణోప చారం. ~ *vapourisation* బాష్పీభవ నోష్ణం
**heater** తాపకం, వేడెక్కించే సాధనం
**heating bath** ఉష్ణతాపకం. ~ *capacity* ఉష్ణశక్తి, వేడిచేసే శక్తి. ~ *coil* ఉష్ణ వేష్టనం
**heatprickle** చెమట కాయలు
**heat stroke** వడదెబ్బ

**heavy** బరువైన. ~ *bodied oil* అతి సాంద్ర తైలం. ~ *industry* భారీ పరిశ్రమ. ~ *isotope* భార సమస్థానీయం. ~ *market (UK)* ధరలు తగ్గిన విపణి, *(US)* ధరలలో మార్పులేని విపణి. ~ *paper* దళసరి కాగితం. ~ *particle* భారకణం. ~ *water* భారజలం

**hackle** చెడ్డగా భాష్యం చెప్పు, అడ్డ ప్రశ్నలు వేసి వేధించు, ఎగతాళిచేయు

**hectare** సుమారు రెండున్నర ఎకరాల పొలం, 247 సెంట్ల భూమి

**hectic** భారీ. ~ *actvity* ఎడతెగని కార్య కలాపాలు

**hedge** కంచె, దడి, నివారణ చర్య; కంచె వేయు, దడిగట్టు, పరిరక్షించు

**hedonism** సుఖవాదం

**hedonit** భోగలాలసుడు

**heed** లక్ష్యపెట్టు, ఆదరంగా విను

**heel** మడమ

**heft** దృఢమైన, బలమైన, బరువైనది, పెద్ద మొత్తం

**hefty** ఎక్కువైన, బలమైన, దృఢమైన, భారీ, పెద్ద మొత్తం

**hegemonism** ఆధిపత్యవాదం

**hegemony** ఆధిపత్యం, పెత్తనం

**heighten** పెద్దచేయు, పెంచు

**heinous** అమానుష, అతిదుష్ట, నీచమైన, క్రూరమైన

**heir** వారసుడు

**heliocentric** సౌర కేంద్రీయం. ~ *theory* సూర్యకేంద్రక సిద్ధాంతం

**heliophobia** తీక్షణమైన ఎండ అంటే భయం

**hellenisms** గ్రీకు భాష నుండి అరువు తెచ్చుకున్న పదాలు

**hellenist** గ్రీకు నాగరికతాభిమాని

**helm** అధికారం, యాజమాన్యం, శిరస్త్రాణం, నియంత్రించు

**helmet** శిరస్త్రాణం, శిరః కవచం

**helminth** ఏలిక పాము వంటి పరాన్నజీవి

**helotism** బానిసలను చేసే విధానం

**help** సహాయం

**helter skelter** అస్తవ్యస్తం(గా)

**hemada** ఎడారిలోని పీఠభూమి

**hemisphere** అర్ధగోళం; మెదడులోని అర్ధ భాగం. *cerebral* ~ మస్తిష్కార్ధగోళం

**hemophilia** రక్తం గడ్డకట్టని స్థితి

**hemp** జనపనార. *indian* ~ భంగు, గంజా(యి)

**henceforth** ఇక మీదట

**henchman** నమ్మినబంటు, అనుయాయి, అనుచరుడు

**hen party** కేవలం మహిళల సమావేశం

**hepatic** కాలేయ సంబంధమైన

**hepatitis** కామెర్ల జబ్బు, కాలేయపు వ్యాధి. *viral* ~ వైరస్ వలన వచ్చే కాలేయపు వ్యాధి

**hepatomegaly** కాలేయపు పెరుగుదల

**herald** వైతాళికుడు, చాటించే వ్యక్తి; ప్రకటించు

**herb** గుల్మం, చిన్న మొక్క, మూలిక

**herbage** బీడులో మేపుకొనే హక్కు

**herbarium** మూలికావనం, శుష్కవృక్షశాల

**herbicide** గుల్మనాశని

**herbivore** శాకాహారి

**herculean** ఎక్కువ శక్తి అవసరమున్న. ~ *effort* బృహత్ప్రయత్నం, భగీరథయత్నం, కష్టసాధ్యమైన పని. ~ *task* గొప్ప పని, కష్టసాధ్యమైన పని, మహాభారమైన కార్యం

**herd** మంద

**herding** పశుపోషణ



**hereditary** ఆనువంశిక, వంశానుగత

**heredity** అనువంశికత, వంశ పారంపర్యం

**heresy** అపధర్మం, నాస్తికత్వం

**heretic** అవిశ్వాసి, సంప్రదాయ వ్యతిరేకి

**heritage** పిత్రార్జితం, పూర్వ సంస్కృతి

**herm** శీర్షబింబం

**hermaphroditism** ఉభయ లింగత్వం

**hermeneutic** అధికార పత్రాల అర్థం వివరించే

**hermetic** గాలి అంటు సోకని

**hermetically** గాలి చొరనట్లు

**hermit** సన్యాసి

**hermitage** ఆశ్రమం, పర్ణశాల

**hernia** గిలక. *femoral* ~ గజ్జకింద, తొడపై గిలక. *inguinal* ~ గజ్జపై గిలక

**heroi-comic** వీర హాస్యరసాలు కలసిన

**heroism** శౌర్యం, వీరత్వం

**heron** పొడవైన కాళ్ళూ, మెడగల కొంగవంటి పక్షి

**herostratism** పేరు, ప్రచారం కోసం ఒక ముఖ్యమైన వ్యక్తిని చంపడం/ ముఖ్యమైన వస్తువును తగులబెట్టడం

**herpes** సర్పి బొబ్బ(లు). ~ *zoster* నాడీ సర్పి

**hesitant** ఊగిసలాడు, తటపటాయించు, సంశయించు

**hesitation** సంకోచం, వెనుక ముందాడడం

**hetero** భిన్నజాతీయ, విజాతీయ, అసమ. ~ *basic* విషమాక్షర. ~ *cyclic* విషమ శృంఖలావలయ

**heterogamy** విజాతి వివాహం

**heterogenity** విజాతీయత

**heterogenous** విషమ జాతీయ

**heterologous** విధర్మ

**heterosexual** భిన్న లింగసంపర్క

**heterozygote** విజాతీయ సంయుక్త బీజం

**heuristic** సమస్యా పరిష్కారాన్ని కనుక్కోవడం

**hexadactylism** ఆరువేళ్ళుండడం

**hexagon** షడ్భుజి

**hexagonal** షట్కోణ

**heading** శీర్షిక

**hiatus** అంతరం, ఖాళీ, సందు, విరామం

**hibernate** సుప్తావస్థలో/ నిద్రాణ స్థితిలో ఉండు

**hibernation** సుప్తాస్థ, నిద్రాణస్థితి, క్రియాశూన్యత, మందకొడితనం

**hiccups** వెక్కిళ్లు, అడ్డంకులు, అవాంతరాలు, తాత్కాలిక కష్టం

**hideous** పూర్తిగా చీకాకు తెప్పించే, దుస్సహ

**hide out** దాక్కొనే స్థలం, రహస్య స్థావరం

**hiding power** ఆచ్ఛాదన/ నిగూఢ శక్తి

**hierarchy** అధికార క్రమం, అధిక్రమం, క్రమానుగతి, శ్రేణి

**hierglyph** చిత్రలిపి

**hierodule** దేవదాసి

**higgledy piggledy** అస్తవ్యస్తంగా, అయోమయం

**higgling** బేరమాడడం, ధర కొసరడం

**high** పెద్ద, అగ్ర, అధిక. ~ *command* అధిష్ఠానవర్గం. ~ *energy radiation* అధిక శక్తి వికిరణం. ~ *flown talk* ఊకదంపుడు ఉపన్యాసం. ~ *gearing* బాంకు రుణాలు వాటాల మొత్తానికి మించి ఉండటం. ~ *handedness* హద్దుమీరి ప్రవర్తించడం. ~ *landers* పర్వత ప్రాంత ప్రజలు. ~ *note* తారస్వరం. ~ *precissional balance* సున్నితపు త్రాసు. ~ *priority* అధిక

ప్రాముఖ్యంగల. ~ *profile person* ఉన్నత చరిత్రగల వ్యక్తి. ~ *quality* మేలి ప్రమాణం. ~ *resolution* విపుల విశ్లేషణ

**highbrow** ఉన్నత అభిరుచులున్నట్టు నటించే/ ఇతరులను కించపరచే

**highfives** చేతులు పైకెత్తి చరుచుకునే ఉత్సాహ సూచన

**highlight** ప్రముఖంగా పేర్కొను, మేలితావు, ప్రత్యేక ఆకర్షణ

**highseas** సముద్ర మధ్యం

**hightime** సమయోచితం, సందర్భోచితం

**hijacker** (వాహనాల)ను దారిమళ్ళించే వ్యక్తి

**hijacking** (వాహనాల) దారిమళ్ళింపు. *funds* ~ నిధుల మళ్ళింపు

**hike** పెంపు, హెచ్చింపు; పెంచు, హెచ్చించు

**hill fog** కొండమంచు

**hillock** దిబ్బ, గుట్ట

**hindrance** అవరోధం, ఆటంకం, నిరోధం, బాధకం

**hingels** చప్పి, రక్త నాళాలలో బొబ్బలు

**hinterland** (నివాసాలకు) పోషక ప్రాంతం, లోతట్టు ప్రాంతం

**hire** అద్దె, బాడుగ, కిరాయి

**hired gun** కిరాయి హంతకుడు

**hireling** తొత్తు, కూటికి చెడ్డపనిచేసే వ్యక్తి

**hire purchase** అద్దె/ వాయిదాల పద్ధతి కొనుగోలు

**hirsute** బొచ్చుగల, సంస్కార విహీనమైన

**hirsuties** అతిరోమత్వం

**hispid** పొట్టి జుట్టు, నిక్కబొడిచిన వెంట్రుకలు కల

**histerectomy** గర్భసంచి తొలగింపు

**histogram** సోపాన చిత్రం

**histology** కణజాల శాస్త్రం

**historian** చరిత్ర పరిశీలకుడు/ చరిత్ర కారుడు

**historic** చరిత్ర ప్రసిద్ధమైన. ~ *cost accounting* అసలు వ్యయాన్ని పరిగణనలోకి తీసుకొని ఖాతాలను రాసే పద్ధతి

**historical** చరిత్ర సంబంధమైన. ~ *materialism* చారిత్రక భౌతికవాదం. ~ *novel* చారిత్రక నవల

**historicism** చరిత్రాధ్యయనం

**historiology** చరిత్రాధ్యయనం

**history** చరిత్ర. *clinical* ~ రోగ చరిత్ర. *dietetic* ~ ఆహార చరిత్ర. *menstural* ~ ఋతుక్రమ చరిత్ర. *obstetric* ~ ప్రసూతి చరిత్ర

**histrionics** హావభావ ప్రదర్శన

**hitch** చిక్కు, అవరోధం; కుదుపుతో కదులు

**hitch on** తగులుకొను, ముడివడు

**hitech** ఉన్నత సాంకేతిక

**hit list** హత్యచేయవలసిన వ్యక్తుల పట్టిక

**hoard** దాపుడు నిల్వ; అక్రమంగా నిలువ చేయు

**hoarding** కంచె, దొంగ నిలవ, ప్రకటన ఫలకం

**hoarseness** బొంగురు గొంతు, జీర

**hoary** పాతదైన, ఆదరణీయ

**hoax** బూటకం, నకిలీ, తప్పుదారి పట్టించు

**hobby** అభిరుచి, సరదా వ్యాసంగం

**hobnob** కలిసి పనిచేయడం, కుమ్మక్కు కావడం

**hobnobbing** కలిసిమెలిసి తిరుగు, అన్యోన్యంగా ఉండు

**hocus pocus** అయోమయం చేయు

**hogget** ఒక సంవత్సరం వయస్సు గల గొర్రెపిల్ల



**hold** నిర్ణయించడం, తీర్పు చెప్పడం, పట్టు కోవడం. ~ *the brief* వకాల్తా తీసుకొను

**holder** హక్కుదారు. ~ *for value* వినిమయ బిల్లు పొందిన వ్యక్తి. ~ *in due course* బయానాగా వినిమయ బిల్లు పొందిన వ్యక్తి

**holding** పెట్టుబడి పెట్టిన మొత్తం, కమతం, సాగుభూమి. ~ *company* ఇతర కంపెనీలలో వాటాలు గల కంపెనీ; యాజమాన్య కంపెనీ

**holiday** సెలవుదినం

**holism** ప్రకృతి అవిభాజ్యమని బోధించే తత్వం

**holistic** అవిభాజ్యతత్వ సంబంధమైన

**hollow** బోలు, తప్పుడు, ఆకలిగొన్న. ~ *relief* నతశిల్పం. ~ *ware* బోలు సామగ్రి

**hollowness** (ప్రయోజన) శూన్యత్వం

**holly green** నిత్య హరిత(వృక్ష)

**holocaust** సర్వనాశనం, మహాబలి, మారణహోమం

**holograph** స్వహస్తాలతో రాసిన గ్రంథం, చేరాత

**holy** పవిత్ర

**holymace** పవిత్ర చామరం

**homage** జోహారు, శ్రద్ధాంజలి

**home** గృహం. *nursing* ~ రోగపరిచర్యా గృహం. ~ *rule movement* స్వదేశీ ఉద్యమం

**homeopathy** హోమియోపతి, ఉమాపతి వైద్యం

**homeostasis** సమస్థితి

**homesales** స్వదేశంలో అమ్మకాలు

**homestead** ఇల్లు, ఇంటి ఆవరణం

**hometown** సొంత ఊరు

**homicide** నరహత్య

**homocentric** ఏకకేంద్రక

**homocylic** సమవలయ

**homoeostasis** తటస్థ జీవస్థితి

**homoerotism** స్వజాతి కామన

**homogamy** సమధర్మి వివాహం

**homogenicity** సాధర్మ్యత

**homogeneity** ఏకజాతీయత, సజాతీయత

**homogenous** సజాతీయ, ఏకరీతి, ఏకస్థితి

**homologous** సమజాత, సంగత

**homologue** సమశ్రేణీగత పదార్థం, సామ్యం

**homology** సమధర్మత, సమశ్రేణికత, సాదృశ్యం, సమజాతత్వం

**homolytic** సమవిచ్ఛిత్తి

**homonym** భిన్నార్థబోధక పదం

**homophily** సమస్నేహభావం

**homophobia** స్వలింగ సంపర్క భయం

**homophone** ధ్వన్యేకత

**homophony** ధ్వని ఏకత, ఉచ్చారణైకత

**homopolar** సమధ్రువ

**homo sapiens** బుద్ధిజీవి, మానవుడు

**homosexual** స్వలింగ సంపర్కశాలి

**homosexuality** స్వలింగ సంపర్కం

**homozygous** సమయుగ్మజం

**homy** ఇంటిని జ్ఞాపకం చేసే

**honesty** నిజాయితీ

**honey comb** తేనెపట్టు

**honorarium** గౌరవవేతనం

**honour** n. గౌరవం, ప్రతిష్ఠ, మర్యాద, చెక్కును ఆమోదించి డబ్బు చెల్లించడం, మాట నిలుపుకొను

**honour** v. గౌరవించు, సన్మానించు; మాట నిలుపుకొను

**hooch** నాటుసారా, గుడంబా

**hoodlum** ఒక ముఠాలోని తీవ్ర నేరస్థుడు

**hood wink** మోసంచేయు, కన్నుగప్పు

**hoof** డెక్క, గిట్టలు
**hookworm** కొంకి పురుగు
**hooligan** దాదా, యువరౌడి
**hooliganism** దాదాగిరి, దౌర్జన్యం
**hoover** కంబళిని శుభ్రపరచు
**hope** ఆశ
**hopeless** నిస్పృహచెందిన
**horde** గుంపు, సమూహం
**horizontal** క్షితిజ సమాంతర. ~ *integration* సమాన స్థాయి కంపెనీల విలీనం. ~ *line* క్షితిజ రేఖ
**hormesis** తక్కువ మోతాదుతో ఆరోగ్యాభివృద్ధి
**hormone** అంతర్గత స్రావం. ~ *replacement* అంతర్గత స్రావ పునఃస్థాపన
**horn** కొమ్ము, శృంగం
**hornets' nest** కందిరీగల తుట్టె
**horoscope** జన్మపత్రిక, జాతకచక్రం
**horrendous** భయంకరమైన, భయానకమైన
**horrify** నిర్ఘాంతపోవు, నిరుత్సాహంచెందు, భయపెట్టు
**horrifying** భయం/ భీతి పుట్టించే
**hors concours** అనర్హత
**horsegram** ఉలవలు
**horsepower** అశ్వసామర్థ్యం
**horse trading** గుర్రప్పందేలు, కొనుగోళ్లు
**horticulture** ఉద్యానశాస్త్రం
**hospital** ఆసుపత్రి. *infectious diseaseas* ~ అంటురోగాల ఆసుపత్రి. *leprosy* ~ కుష్ఠురోగుల ఆసుపత్రి. *maternity* ~ ప్రసూతి వైద్యశాల. *mental* ~ మానసిక వైద్యశాల
**hospitalism** ఆసుపత్రి విధానం/ నిర్వహణం, అభద్రతా భావం
**hospitality** అతిథి మర్యాద/ సత్కారం
**hospitalization** ఆసుపత్రిలో చేరడం/ చేర్చడం
**host** ఆతిథేయి. ~ *specific* ఆతిథేయ నిశ్చితత
**hostage** బందీ, గృహనిర్బంధం
**hostile** విరోధి, శత్రువు
**hostile witness** ఎదురు తిరిగిన సాక్షి
**hostility** వ్యతిరేకత, శత్రుభావం, విరోధం
**hotch potch** తీరూతెన్ను లేని, అస్తవ్యస్త
**hotline** నిరాటంక తంత్రీమార్గం
**hot springs** ఉష్ణస్రోతస్సులు
**hound** జాగిలం, వేటకుక్క; వెంటాడు, తరుము
**hounding** వేటాడు, ప్రేరేపించు, ఉసిగొల్పు
**hourly rate** పని గంటకు వేతనం రేటు
**hour of crisis** సంక్షోభ సమయం, ఆపత్కాలం
**house** సభ. ~ *committee* సభా సంఘం. ~ *gardens* గృహోపవనాలు. ~ *journal* స్వవిషయ. ~ *keeping* గృహ నిర్వహణ, ఇంటిని చక్కబెట్టడం. ~ *of commons* సామాన్యుల సభ: (బ్రిటన్‌లో) దిగువ సభ. ~ *of lords* ఎగువ సభ (బ్రిటన్లో) ప్రభువుల సభ
**household** గృహ పరివారం. ~ *goods* గృహోపకరణాలు. ~ *pest* గృహ పీడకం. ~ *policy* ఇండ్లు దెబ్బతిన్నప్పుడు పరిహారం చెల్లించే బీమా సౌకర్యం, దానికి సంబంధించిన బీమా ఒప్పందం
**hover** గాలిలో చుట్టుతిరుగు, ఉపరి భ్రమణం చేయు
**howl** అరచు, కూయు
**howler** స్పష్టమైన/ పెద్ద తప్పు, కూసేవాడు
**howling** పెద్దగా అరవడం; ఘనవిజయం
**HTL** *(High Tide Line)* సముద్రం పోటులో ఉన్నప్పుడు అలలు వ్యాపించే పరిధి



**huddle** రహస్య సమావేశం; గజిబిజిగా పోగుపడు, కలగూర గంపగా కలుపు
**hue** వన్నె: రంగు, కేక, అరుపు
**huffy** కోపం తెచ్చుకొనే
**huge difference** విపరీతమైన తేడా, హస్తిమశకాంతరం
**hulk** భారీ ఓడ
**hum** ఝుంకార ధ్వని, కూనిరాగం
**human** మానుష. ~ *ecological triangle* మనిషి– సంఘం– పరిసరాల సంబంధం. ~ *resource management* మానవ వనరుల యాజమాన్యం. ~ *rights* మానవ హక్కులు. ~ *values* మానవత్వపు విలువలు
**humanising** మానవీకరించటం
**humanism** మానవతావాదం, మానవతా దృష్టి, మానవత్వం
**humanist feminism** మానవీయ స్త్రీవాదం
**humanistic psychology** మానవీయ మనస్తత్వ శాస్త్రం
**humanist** మానవతావాది
**humanitarianism** జీవకారుణ్యవాదం
**humanities** మానవీయ శాస్త్రాలు
**humble** వినయపూర్వకమయిన; కించపరచు
**humbly** సవినయంగా
**humerus** దండ ఎముక. భుజాస్థి
**humidity** ఆర్ద్రత, గాలిలోని తేమ
**humiliate** అవమాన పరచు, చిన్నబుచ్చు
**humiliation** అవమానం, పరాభవం, తలవంపు
**humour** హాస్యం. *good* ~ సరసదృష్టి. *sense of* ~ హాస్యానికి స్పందించే గుణం
**hump** మూపురం
**humus** ఆకుపెంట, పచ్చి ఎరువు
**hunch** గుడ్డి నమ్మకం, గూని
**hunch back** గూనివాడు
**hung assembly** ఏ రాజకీయ పార్టీకీ మెజారిటీ లేని శాసనసభ
**hunger pain** ఆకలి యాతన
**hunger strike** నిరాహారదీక్ష, నిరశనదీక్ష
**hung parliament** ఏ రాజకీయ పార్టీకి మెజారిటీ లేని పార్లమెంటు
**hurdle** అడ్డంకి, ఆటంకం, సమస్య
**hurl** రువ్వు
**hurricane** పెనుతుఫాను, గాలివాన, మహాచక్రవాతం
**hurriedly** చర్రున, తొందరలో
**hurt** దెబ్బ, బాధ, గాయం; మనసుకు కష్టంకలుగు/ కలిగించు
**hush money** బలవంతంగా రాబట్టుకొన్న డబ్బు
**husk** ఊక
**hustler** అక్రమ లాభార్జన చేసే వ్యక్తి
**hutch** పంజరం; చిన్నబోను
**hyacinth** గుర్రపుడెక్క
**hyaline** పారదర్శకం
**hyalography** గాజుపై చెక్కే కళ
**hyalophobia** గాజు అంటే భయం
**hybrid** సంకరజాతి జీవి/ వంగడం, మిశ్రమజాతి
**hybridisation** సాంకర్యం
**hybridism** సాంకర్యం, సంకీర్ణత
**hydel project** జల విద్యుత్ కేంద్రం
**hydration** ఆర్ద్రీకరణం, జల సంకలన చర్య
**hydraulic** జల(శక్తి) చాలిత. ~ *action* జలోత్పీడన చర్య
**hydraulics** ద్రవ/ జలయంత్ర శాస్త్రం
**hydrocele** వరిబీజం, బుడ్డ
**hydro-electricity** జలవిద్యుత్తు

**hydrogen** ఉదజని. ~ *bomb* ఉదజని బాంబు
**hydrogenation** ఉదజనీకరణ
**hydrogeologist** భూగర్భ జలశాస్త్రవేత్త
**hydrogeology** భూగర్భ జలశాస్త్రం
**hydrography** భూజలాధ్యయనం
**hydrological** జలసంబంధ. ~ *cycle* జలపరిణామచక్రం
**hydrologist** జలశాస్త్రవేత్త
**hydrology** జలధర్మశాస్త్రం
**hydrolysis** జలవిశ్లేషణం
**hydrolytic** జలవిశ్లేషణీయ
**hydrometer** జలమాపకం
**hydrometerologist** జలవాతావరణ శాస్త్రవేత్త
**hydromnios** గర్భసంచిలో ఉమ్మనీరు చేరిక
**hydronephrosis** మూత్రపిండంలో నీరు చేరడం
**hydropathy** జలచికిత్స
**hydrophily** జలపరాగ సంపర్కం
**hydrophobia** జలభయరోగం
**hydrophobic** జలభయం కలిగిన
**hydrophyte** నీటిమొక్కలు
**hydroponics** మట్టి లేకుండా మొక్కలను పెంచే పద్ధతి
**hydrosphere** జలావరణం
**hydrostatic** జలస్థితిక. ~ *pressure* జలస్థితిక పీడనం
**hydrostatics** ద్రవస్థితి శాస్త్రం
**hydrotaxis** జలప్రతిస్పందన
**hydrotropism** జలానువర్తనం
**hyena** దుమ్ములగొండి, కొర్నపోతు
**hygiene** ఆరోగ్యం, ఆరోగ్యశాస్త్రం, పారిశుధ్య శాస్త్రం. *personal* ~ వ్యక్తిగత పరిశుభ్రత
**hygienics** ఆరోగ్య పరిరక్షణ శాస్త్రం
**hygrometer** ఆర్ద్రతామాపకం
**hygrometry** ఆర్ద్రతా మాపన శాస్త్రం
**hygrophanous** నీరులా కనబడే
**hygrophilous** తడి పదార్థాలపై పెరిగే
**hylogheism** పదార్థం దైవం రెండూ ఒక్కటే అనే వాదం
**hylozoism** భూత జీవవాదం
**hymn** భక్తిగీతం. ~ *of creation* సృష్టి సూక్తం
**hyoid bone** కంఠాస్థి అధోహన్వస్థి
**hypalgesia** మొద్దుబారడం
**hyper** ఉద్రేక, శక్తిమంతమైన, అతిశయిత, అధిక. ~ *acidity* జఠరాధికామ్లత. ~ *activity syndrome* అతిచైతన్య లక్షణం
**hyperbaton** పదవ్యత్యయం
**hyperbole** అతిశయోక్తి
**hypercholesteroliemia** రక్తంలో అధికంగా కొవ్వు (కొలెస్టరాల్) చేరడం
**hypergamy** అనులోమ వివాహం
**hyperiemia** అధికరక్తత
**hypermania** అతిగా ప్రవర్తించడం
**hypermetropia** దూరదృష్టి
**hyperpyrexia** అతిజ్వరం
**hyper sensitivity** అతిగ్రాహకత్వం
**hypersonics** 500 మెగాహెర్జ్‌ల కన్న ఎక్కువ ఫ్రీక్వెన్సీ కలిగిన ధ్వని తరంగాల ఉత్పత్తి, ప్రయోగితలకు సంబంధించిన శాస్త్రం
**hypertension** రక్తపోటు
**hyperthyroidism** థైరాయిడ్ గ్రంథి అతిక్రియ
**hypertrophy** అతివృద్ధి
**hyphae** శిలీంధ్ర తంతువులు
**hypidiomorphic** ఉపపార్శ్వకరూప
**hypnology** నిద్రాధ్యయనం



**hypnophobia** నిద్రాభయం
**hypnotic** నిద్ర తెప్పించే సమ్మోహక. ~ *suggestion* తాత్కాలిక విస్మృతి సూచన
**hypochondriasis** రోగభ్రమ
**hypocrisy** నటన, కాపట్యం, మిథ్యాచారం
**hypocrite** కపటి, వంచకుడు, నంగనాచి, నాలిముచ్చు
**hypodermic** చర్మంకింది
**hypodermis** అధశ్చర్మం/ అధస్తర
**hypogamy** ప్రతిలోమ వివాహం
**hypogastric** అధోజఠర
**hypogastrium** అధోజఠర భాగం
**hypogean** భూగర్భంలో పెరిగే
**hypoglossal nerve** అధోజిహ్వా నాడి
**hypoglycemia** రక్తంలో గ్లూకోజ్ మాంద్యం
**hypogynous** అండకోశాస్థితం
**hypolimnion** అత్యల్ప ఉష్ణోగ్రతను, తక్కువ కాంతిని కలిగిన అట్టడుగు నీటి పొరలు
**hypomania** అల్పోన్మాదం
**hypopharynx** అధోగ్రసని
**hyposmia** ఆఘ్రాణశక్తి లోపం
**hypospadias** అధశ్శిశ్న మూత్రమార్గం
**hypostatization** మానవత్వారోపణ
**hyposthenia** బలహీనత
**hypotension** అల్పరక్తపోటు
**hypothalamus** అధఃపర్యంకం
**hypothesis** పరికల్పన, ప్రాకల్పన
**hypothetical** కల్పితం, ఊహాత్మక, పరికల్పిత
**hypothication** తాకట్టు, కుదువ, ఆదుమానం
**hypothyroid** థైరాక్సిన్ ఉత్పత్తి లోపం
**hypothyroidism** క్షీరొగ్రైవేయకత్వం, థైరాయిడ్ గ్రంథి మాంద్యం
**hypoxemia** రక్తంలో ఆక్సిజన్ శాతం తగ్గిపోవడం
**hysterectomy** గర్భాశయం తొలగింపు
**hysteresis** శైథిల్యం
**hysteria** అపస్మారం, కాకిసొమ్ము, మూర్ఛ
**hysterography** గర్భాశయ చిత్రణ
**hythergraph** నెలసరి వర్షపాతానికి నెలసరి ఉష్ణోగ్రతల రేఖాపటం

# I i

**iatro chemistry** చికిత్సా రసాయన శాస్త్రం
**iatrogenic** చికిత్సా ప్రేరిత
**ice** మంచు. ~ *bath* మంచుతొట్టి. ~ *cold* హిమశీతలం
**ice age** హిమయుగం
**iceberg** మంచుకొండ
**ice sheet** మంచు పలక. ~ *shelf* మంచు మేట. ~ *stream* హిమప్రవాహం
**ichium** ఆసనాస్థి
**ichthyology** జల జంతు శాస్త్రం
**ichthyosarcotoxins** చేపల్లోని విష పదార్థాలు
**ichthyosis** పొలుసులు ఏర్పడే చర్మవ్యాధి
**icing** పంచదార పూత
**icon** విగ్రహం, ప్రతిమ, మూర్తి
**iconic** సరూపమైన
**iconicity** సారూప్య సంబంధం, తార్కిక సంబంధం
**iconoclasm** విగ్రహ ధ్వంసనం
**iconoclast** విగ్రహ విధ్వంసకుడు, విగ్రహారాధన వ్యతిరేకి
**iconography** ప్రతిమా (నిర్మాణ) శాస్త్రం
**iconology** ప్రతిమాశాస్త్రం

**icterus** పచ్చకామెర్లు. *neonatorum* ~ ప్రసవానంతరం శిశువులలో పచ్చకామెర్లు
**ictus** ఊనిక
**idea** ఆలోచన, భావం, అభిప్రాయం
**ideal** శ్రేష్ఠం, ఉత్తమం, ఆదర్శవంతం, ఆదర్శం. ~ *choice* ఆదర్శావకాశం
**idealism** ఆదర్శవాదం, భావవాదం
**idealistic** ఆదర్శపూర్వక
**idealistic approach** ఆదర్శ మార్గం
**ideational** చింతనాత్మక
**id ego** స్వ-అహం
**identical** సమరూప
**identification parade** (నిందితుల) గుర్తింపు ప్రదర్శన
**identify** v. గుర్తించు, తాదాత్మ్యం చెందు
**identity card** గుర్తింపు చీటి/ పత్రం
**ideological** సైద్ధాంతిక. ~ *conflicts* సైద్ధాంతిక సంఘర్షణలు. ~ *struggle* సైద్ధాంతిక పోరాటం. ~ *veneer* సైద్ధాంతిక ముసుగు
**ideology** ఆదర్శం, సిద్ధాంతం; ఆలోచనా ధోరణి
**ideoplastic** భావ కల్పిత
**idiocy** జడత్వం, మూర్ఖత్వం, తెలివిమాలిన తనం
**idiokinesis** వారసత్వ లక్షణాల్లో మార్పు
**idiolect** వ్యక్తి భాష
**idiom** నుడికారం, జాతీయం
**idiosyncrasy** విపరీత ప్రవృత్తి
**idle money** నిష్కార్యద్రవ్యం, వాడకంలేని/ వడ్డీని ఆర్జించని డబ్బు
**idol** దైవ విగ్రహం, పూజనీయవ్యక్తి, వస్తువు
**idolater** విగ్రహారాధకుడు
**idyllic** ఆహ్లాదకరమైన, శాంతియుతమైన
**iffy** సందిగ్ధ

**igneous rock** అగ్నిశిల
**ignite** మండించు
**ignition** జ్వలనం. ~ *mixture* జ్వలన మిశ్రమం. ~ *temperature* జ్వలనోష్ణోగ్రత
**ignominy** అవమానం, అపకీర్తి, అప్రతిష్ఠ, కళంకం, మచ్చ, పరాభవం
**ignoramus** పండితమ్మన్యుడు, విజ్ఞానిలా నటించే వ్యక్తి
**ignorance** అజ్ఞానం, తెలియనితనం
**ignore** నిర్లక్ష్యం చేయు, విస్మరించు, ఉనికి మరచిపోవు
**ikebena** పువ్వులను అమర్చే పద్ధతి
**ileus** ఆంత్రావరోధం
**ilk** వర్గం, గుంపు
**ill blood** పగ, వైరం
**illegal** చట్టవిరుద్ధమైన, న్యాయబద్ధం కాని. ~ *contract* చట్ట విరుద్ధ ఒప్పందం. ~ *gratification* లంచం, అక్రమార్జన. ~ *partnership* అనైతిక భాగస్వామ్యం
**illegitamacy** అక్రమ సంబంధం, జారత్వం
**illegitimate** అక్రమమైన, నిషిద్ధమైన
**illegitimation** అక్రమసంతానమని ప్రకటించడం
**illfame** అపకీర్తి, దుర్యశం
**ill founded** సరియైన సాక్ష్యంలేని, నిరాధార
**illgotten** అక్రమార్జిత. ~ *gains* మోసగించి ఆర్జించిన సొమ్ము
**illicit** చట్టబద్ధంకాని, దొంగచాటు నిషిద్ధ. ~ *migration* దొంగచాటు వలస. ~ *relation* అక్రమ సంబంధం
**illiteracy** నిరక్షరాస్యత
**illogical** తర్కవిరుద్ధ
**ill-starred** దురదృష్టకర/ మైన



**illuminant** ప్రదీపకం
**illuminate** ప్రకాశింపచేయు, వెలిగించు; (ఆధ్యాత్మిక) జ్ఞానాన్ని కలిగించు
**illuminated** ప్రదీప్త
**illumination** ప్రకాశం, వెలుగు, దీపాలంకరణ; పత్రరంజనం, ప్రదీపనం, పత్రదీపనం
**illumine** ప్రకాశించు, వెలిగించు, వికసింపచేయు
**illusion** మాయ, భ్రమ, ఆభాస, భ్రాంతి. *optical* ~ దృష్టిభ్రాంతి
**illusionary** భ్రాంతిమూలక
**illusionism** భ్రాంతివాదం
**illustrated** సచిత్ర
**illustration** దృష్టాంతం, వ్యాఖ్యాచిత్రం, లక్ష్య చిత్రం
**illustrious** ప్రఖ్యాత, ప్రసిద్ధ, ప్రముఖ, ఉదాహరణప్రాయమైన, ఎన్నదగిన
**ill will** దురభిప్రాయం, శత్రుత్వం, ద్వేషం, అయిష్టం
**ILO** *(The International Labour Organisation)* అంతర్జాతీయ కార్మిక సంస్థ
**image** ప్రతిబింబం, సంకేతం, ప్రాతినిధ్యం, భావచిత్రం, ప్రతిరూపం, ప్రతిచ్ఛందం
**imageability** వ్యక్తులపై వివిధవస్తువుల గాఢ ప్రభావం
**imagery** మనశ్చిత్రం, ప్రతిబింబం
**imagiers** ధార్మిక శిల్పులు
**imaginary** ఊహాత్మక, కాల్పనిక, అవాస్తవిక
**imagination** ఊహ, భావన, కల్పన
**imaginative** ఊహాత్మకమైన
**imagism** ప్రతిబింబవాదం
**imbalance** అసంతులన
**imbecile** అశక్తుడు, దుర్బల (మనస్క), మూఢుడు

**imbecility** (మానసిక) బలహీనత, అశక్తత
**imbibe** జీర్ణం చేసుకొను, అంతఃశోషించు, గ్రహించు
**imbibition** అంతఃశోషణం
**imbricate** చిక్కని
**imbrication** అధ్యలంకరణ
**imbroglio** క్లిష్ట, అనిశ్చిత పరిస్థితి, తికమక, పొట్లాట
**IMF** *(The International Monetary Fund)* అంతర్జాతీయ ద్రవ్యనిధి
**imitation** అనుకరణ
**imitation gold** కాకి బంగారం
**immaculate** మచ్చలేని, తప్పులేని, పరిశుభ్రమైన
**immature** అపరిణత, అపరిపక్వ
**immeasurable** అగణ్యమైన, కొలవలేని
**immediate** తక్షణ, ఆనుకొని ఉన్న. ~ *holding company* మరో కంపెనీ వాటాలలో సగానికి పైగా తన స్వాధీనంలో ఉన్న కంపెనీ
**immediately** సద్యః, తక్షణ
**immemorial** అనాది, స్మృతికందని, గతించిన, పురాతనమైన. ~ *interest* గాఢాసక్తి. ~ *love* గాఢప్రేమ
**immense** చాలా, చెప్పలేనంత, అమిత, అపరిమిత, గొప్ప
**immerse** లీనమైపోవు, మునుగు
**immersed** మగ్నమైన
**immersion** నిమజ్జనం (నీటిలో) ముంచడం
**immigrant** వలసవచ్చిన/ విదేశంలో స్థిరపడిన వ్యక్తి
**immigration** వలస
**imminent** ఆసన్న, తొందరగా జరగబోయే
**immiscible** కలిసిపోని
**immobilization** స్థిరీకరణ

**immodest** అవినీత, అసౌమ్య
**immodesty** అవినయం, అసౌమ్యత
**immorality** దుర్నీతి, నీతిబాహ్యత
**immortal** అమర్త్య, శాశ్వత
**immortality** అమరత్వం
**immovable** కదలికకు వీలుకాని. ~ *joint* అచలసంధి. ~ *properties* స్థిరాస్తులు
**immune** రక్షిత, విముక్త
**immunities** మినహాయింపులు, రక్షణలు
**immunity** రక్షణ, విముక్తి, మినహాయింపు, అసంక్రామ్యత; వ్యాధి నిరోధక శక్తి
**immunization** వ్యాధినిరోధక శక్తిని కలిగించడం, టీకాలు వేయడం
**immuno-assay** ప్రతిజనకాల, ప్రతిరక్షకాల స్థాయిని నిర్ధరించే పరీక్ష
**immuno-chemistry** ప్రతిరక్షారసాయనిక శాస్త్రం
**immuno-deficiency** రోగ నిరోధక వ్యవస్థా వైఫల్యం
**immuno-diagnostics** వ్యాధినిరోధక లక్షణ పరిశీలన వ్యాధి
**immunological tolerence** నిరోధక క్షమత
**immunology** వ్యాధినిరోధక చికిత్సా విధానం
**immuno-suppressant** ప్రతిరక్షా నిరోధకం
**immuno-suppression** ప్రతిరక్షా నిరోధం
**immuno-therapy** వ్యాధి నిరోధక చికిత్స
**immutable** మారని, చెదరని, మార్పులేని
**impact** ప్రభావం, సంఘటన, తాకిడి
**impact day** వాటాల జారీ గురించి ప్రకటించే రోజు
**impact printer** అభిఘాత ముద్రాపకం
**impair** బలహీనపరచు, విలువ తగ్గించు, చెరుచు
**impairment** బలహీనత, అశక్తత
**impanel** పట్టికలో చేర్చు
**impart** నేర్పు కలిగించు, బోధించు, తెలియజేయడం
**impartable** చొప్పించదగిన, బోధించదగిన
**impartial** తటస్థ, నిష్పాక్షిక
**impartible** అవిభాజ్యమైన
**impassable** ప్రవేశించరాని, మూసుకుపోయిన, అడ్డుపడిన, దాటలేని, అగమ్య
**impasse** కఠిన పరిస్థితి, స్తంభన, ప్రతిష్టంభన
**impassive** భావరహిత
**impasto** కుండల తయారీకి ఉపయోగించే మట్టి
**impatience** అసహిష్ణుత, అసహనం
**impeachment** అభిశంసన, మహాభియోగం. ~*motion* అభిశంసన తీర్మానం
**impecunious** తక్కువ డబ్బు గల, పేద
**impediment** అంతరాయం, అవరోధం
**impeding** ప్రతిబంధకమైన
**impel** బలవంతం చేయు, ప్రేరేపించు
**impending** ఆసన్న, సిద్ధ
**impenetrability** అభేద్యత
**impenetrable** అభేద్య, చొరలేని
**imperative** ముఖ్యమైన, అత్యవసర, తప్పనిసరి
**imperceptibility** అతీంద్రియత, అగోచరత
**imperceptible** అతీంద్రియ, అగోచర, అగమ్య, అగుపడని
**imperfect induction** అపరిపూర్ణాగమనం
**imperforate** రంధ్రం/ ఛిద్రంలేని
**imperial** సామ్రాజ్యానికి సంబంధించిన
**imperialism** సామ్రాజ్యవాదం



**imperil** ముప్పుతెచ్చిపెట్టు, అపాయం కలిగించు
**imperium** సంపూర్ణాధికారం, సైనికాధికారం
**impermanence** అశాశ్వతత్వం
**impermeable** చొరలేని, చొర శక్యంగాని, వ్యాపింప శక్యంగాని
**impersonate** అనుకరించి మోసంచేయు, వేరొక వ్యక్తిగా ప్రవర్తించు
**impersonation** ప్రతిరూపవర్తన, మరో వ్యక్తిగా వ్యవహరించడం
**impertinence** అమర్యాద, అగౌరవ ప్రవర్తన, అవిధేయత
**impertinent** మర్యాదలేని, అసంబద్ధమైన, అసందర్భమైన
**imperturbable** కంగారుపడని, చెదరని
**impervious** చొరలేని, ప్రవేశించలేని, అభేద్య, ప్రభావం చూపని. ~ *rocks* అప్రవేశయోగ్య శిలలు
**impetuous** ఆలోచనలేని, అనాలోచిత
**impetus** ప్రోత్సాహం, ప్రేరణ
**impiety** పాపం, ధర్మరాహిత్యం
**impinge** ప్రభావంచూపు, ఢీకొట్టు
**impious** అపవిత్రమైన, ధర్మదూర
**implant** నాటు, శరీరంలో ప్రవేశపెట్టు
**implausible** నమ్మశక్యంగాని, నమ్మలేని
**implead** కక్షిదారుగా చేరు
**implement** అమలుపరచు; పరికరం, పనిముట్టు
**implicate** ఇరికించు, ఇరుకుకొను, చిక్కుల్లోపెట్టు
**implication** గూఢార్థం, అన్వార్థం, చిక్కు
**implicative proposition** అంతర్భావ ప్రతిజ్ఞా వాక్యం
**implicit** దాగి ఉన్న, సూటిగా లేని. ~ *function* అవ్యక్త ప్రమేయం
**implicitly** సూచనగా, గర్భితంగా
**implied powers** సూచితాధికారాలు
**implore** ప్రార్థించు, అడుగు
**imply** సూచించు
**imponderable** అంచనా వేయలేని, అనూహ్య
**import** దిగుమతి. ~ *duty* దిగుమతి సుంకం. ~ *license* దిగుమతికి అనుమతి. ~ *quota* దిగుమతి చేసుకునే వస్తువుల సంఖ్య. ~ *restrictions* దిగుమతి నిబంధనలు
**important** ముఖ్యం, ప్రధానం
**importer** దిగుమతిదారు
**importune** పీడించు, వదలకుండా అడుగు
**importunity** బలవంతం, హఠం
**impose** విధించు
**impossible** అసాధ్యమైన
**imposter** వంచకుడు, మోసగాడు
**impotence** నపుంసకత్వం
**impotent** నపుంసకుడు; సహాయశూన్య, చేతగాని
**impound** స్వాధీనంచేసుకొను, జప్తుచేయు
**impoverish** బీదను చేయు, శక్తిహీనం చేయు
**impoverishment** పేదరికం, పేదతనానికి రావడం
**impracticable** ఆచరణ సాధ్యం కాని
**impractical** అవాస్తవమైన
**imprecise** అస్పష్టమైన
**impregnable** దుర్భేద్య, చేజిక్కించుకోలేని, విరగగొట్టలేని, పగలని, పట్టుకోలేని, ఎదుర్కొనలేని, అన్వయించలేని, సంబాళించలేని
**impregnation** గర్భాదానం, గర్భం చేయడం, పూరించడం, చొరబాటు

**impress** ఆకట్టుకొను, ప్రభావితంచేయు, ముద్రవేయు
**impressed force** ఆరోపిత బలం
**impression** ముద్ర, భావం, ప్రభావం, అనుభావన, అచ్చుపని
**impressionism** అనుభావతా వాదం, అనుభూతి వాదం, మనోముద్రావాదం
**impressionistic criticism** ఆత్మాశ్రయ విమర్శ
**imprimatur** ప్రచురించడానికీ అనుమతి
**imprint** ముద్ర, గుర్తు, అచ్చు, అను ముద్రణ
**imprisonment** చెర
**improbable** అసంభవ
**impromptu** ఆశు, అప్రయత్నపూర్వక
**improper fraction** అక్రమ భిన్నం
**impropriety** అనౌచిత్యం, తగనిది, అధర్మం
**improve** మెరుగుపరుచు
**improvement** మెరుగుపరచడం, సంవర్ధనం
**improvise** ఆశువుగారచించు
**imprudent** దుడుకు, తెలివిలేని, అవివేకమైన
**impudence** అగౌరవ ప్రవర్తన, నీలుగుడు
**impudent** సిగ్గులేని, లజ్జాహీనమైన
**impugn** ప్రతివాదించు, ఖండించు
**impulse** ప్రేరణ, ప్రచోదనం, తాకుడు, గతిశక్తి. ~ *buying* ఆకస్మిక కొనుగోలు. ~ *cardiac* గుండెతాకుడు. ~ *nerve* నాడీ ప్రేరేపణ
**impulsion** యాదృచ్ఛికంగా చేయడం
**impulsive** హఠాత్తుగా కలిగే, ముందుకు తోసే, వేగశీలమైన
**impune** శిక్ష నుండి మినహాయించడం
**impurity** మాలిన్యం

**imputation** ఆరోపణ, అభియోగం
**impute** ఆరోపించు, మోపు
**in abeyance** వర్తమానంలో లేని
**inability** అశక్తత, అసమర్థత, చేతకానితనం
**inaccessible** అప్రాప్య, చేరలేని, చొరలేని, దూరలేని, భేద్యంకాని
**inaccuracy** సరికానిది, తప్పు, తేడా
**inactivation** నిశ్చేష్టంగా/ నిష్క్రియగా/ నిర్వ్యాపారంగా ఉండడం
**inactive** అచేతనమైన, నిష్క్రియ, క్రియారహిత. ~ *money* వ్యర్థ, అనుపయుక్త ధనం
**inactivity** స్తబ్ధత, జడత
**inadequacy** చాలని, సరిపడని, అసంపూర్ణ, అసమగ్ర
**inadmissible** అంగీకరించదగని
**inadvertence** పొరపాటు, అజాగ్రత
**inadvertent** అనుకోని
**inalienable** బదిలీచేయలేని, అన్యాక్రాంతం చేయడానికి వీలులేని
**nane** అర్థంలేని, మూర్ఖ
**inanimate** నిర్జీవ, జడమైన, ప్రాణంలేని
**inanition** అన్నపానరాహిత్యం
**inappropriate** అసందర్భ, సరికాని
**inapt** అయుక్త, తగని
**inattention** పరాకు, ఏకాగ్రత లేమి
**inaudibe** వినబడని
**inaugural** ప్రారంభ
**inaugurate** ప్రారంభించు
**inauspicious** అశుభ
**inborn** పుట్టుకతో వచ్చిన, జన్మసిద్ధమైన
**inbred** పుట్టుకతో; ఒకే వంశంలోని వ్యక్తుల సంతానం
**inbreeding** అంతః ప్రజననం, రక్త సంబంధీకుల కలయిక వల్ల సంతానోత్పత్తి



**inbuilt** సహజమైన
**in camera** రహస్య విచారణ/ సమావేశం
**incandescence** ప్రజ్వలనం, తాపదీప్తి
**incandescent** ప్రకాశించే, ఉజ్జ్వల
**incantation** మంత్రోచ్చారణ, ఆవాహనం
**incapable** అసమర్థ
**incarcerate** నిర్బంధించు, ఖైదుచేయు
**incarnate** అవతరించిన
**in case** ఒకవేళ
**incendiary** దాహక, కొంపలు తగలబెట్టే
**incense** సువాసన, ధూపం
**incentive** ప్రోత్సాహకం
**inception** ప్రారంభం
**incessant** నిరంతరం, ఎడతెగని
**incest** వరుసకాని స్త్రీ పురుష సంగమం
**incharge** ఒకరికి బదులుగా బాధ్యతలు నిర్వహించడం
**inchoate** కొత్తగా మొదలుపెట్టే, అసంపూర్ణ, అస్థిర
**incidence** సంభవం, పతనం, తాకిడి
**incident** సంఘటన
**incinerate** భస్మీకరించు, బూడిదచేయు
**incineration** భస్మీకరణం, కాల్చి బూడిద చేయటం
**incinerator** భస్మీకారి, కాల్చి బూడిద చేసేది
**incipient** ఆరంభదశలో ఉన్న, తొలి
**incise** గంటుపెట్టు, కోయు, చీల్చు, నరుకు, కత్తిరించు
**incision** గంటు, కోత
**incisive** నిశితమైన, తీవ్రమయిన
**incisor** ముందరి పన్ను, కత్తెరపన్ను
**incite** ఉసిగొల్పు, ప్రేరేపించు, ప్రోత్సాహించు, రెచ్చగొట్టు
**inclement** అనాహ్లాద, శీతల, గాలి వానలతో కూడిన. ~ *weather* చలిగాలులతో కూడిన వాతావరణం

**inclination** మొగ్గు, అభిరుచి, ఇష్టం; ధ్యాస, వాలు
**inclusion** చేర్పు
**inclusive** కలిసిన, చేరిన, కూడిన, సంఘటిత
**incognito** మారువేషం/ పేరు
**incoherence** అసంబద్ధ
**incoherent** పొందికలేని
**incombustible** అదాహ్య
**income** ఆదాయం. ~ *and expenditure account* ఆదాయ వ్యయాల ఖాతా. ~ *tax* ఆదాయపు పన్ను
**incommunicado** సమాచారం లేని విధానం, సంభాషణావకాశం లేమి
**incomparable** పోల్చదగని, అసదృశ
**incompatible** అసంగత, విరుద్ధ, అతకని
**incompitability** అసంగతత్వం
**incomplete** అసంపూర్ణ
**incomprehension** అర్థం చేసుకోలేక పోవడం
**incompressibel** అసంపీడ్య
**inconceivable** అనూహ్య
**incongruent** సర్వసమానం కాని, అసమంజస
**incongruous** అసంగతమైన, పొందికలేని, తగని, పొందని, అసంబద్ధమైన
**inconsequential** ముఖ్యంకాని, అప్రధానమైన, నిష్ప్రయోజనమైన
**inconsistency** అసంగతి
**inconspicuous** స్పష్టంగా కనబడని
**incontinence** నిగ్రహరాహిత్యం
**incontinent** నిగ్రహరహిత, అదుపులేని
**inconvenience** ఇబ్బంది, అసౌకర్యం
**incorporate** చేర్చు, అంతర్భూతం చేయు, కలుపు
**incorporated** సమావిష్ట

**incorporeal** కనపడని, ప్రత్యక్షంగాని
**incorrigible** సరిదిద్దరాని, సంస్కరించలేని, చక్కదిద్దలేని, బాగుపరచవీలులేని
**increase** పెరుగు, ఎక్కువగు, అభివృద్ధి చెందు, పెద్దదవు
**incredible** అద్భుతమైన, నమ్మశక్యంగాని
**incredulity** అపనమ్మకం
**incredulous** నమ్మశక్యంగాని, నమ్మటానికి వీలులేని
**increment** పెరుగుదల, పెంపు, ఉపవిభక్తి
**incremental repetition** ఆవృత్తి, పల్లవి
**incrustation** పటలీకరణం
**incubation** పొదగటం. ~ *period* పొదిగే సమయం
**incubator** పొదిగే సాధనం, స్థిరోష్ణ పేటిక
**incubus** గాలి, దయ్యం, బూచి, బాధాకర వస్తువు
**inculcate** నేర్పించు, బోధించు
**inculpate** నేరం మోపు
**incumbent** అధికారంలో ఉన్న వ్యక్తి
**incunabula** శైశవికం
**incurable** నయంకాని
**incursion** అకస్మాత్తుగా దాడిచేయడం, దాడి
**indebted** ఋణపడిన
**indecent haste** మంచీ మర్యాదా లేని తొందరపాటు
**indecipherable** అర్థంకాని
**indecisive** నిర్ణయం తీసుకోలేని, అనిశ్చిత
**indecisiveness** అనిశ్చితి, సందిగ్ధత
**indecorous** మర్యాదలేని
**indefatigable** అలుపు సొలుపు లేని
**indefinite** నిరవధిక
**in-dehiscent** పగిలే స్వభావంలేని
**indelible** మరువలేని, తీయలేని
**indemnity** నష్టపరిహారం, పూరణం
**indent** కావలసిన వస్తువుల పట్టీ
**indentation** గంటుపెట్టడం/ పడడం
**indeterminacy** అనిర్దిష్టత
**independent member** స్వతంత్ర సభ్యుడు
**in depth** లోతుగా
**indestructibility** అవినాశత
**indeterminate** అనిర్ధారితం
**indeterminism** అనియతవాదం
**index** పదసూచిక. ~ *blood* రక్తాధి సూచిక. ~ *cardiac* హృదభిసూచిక. ~ *colour* వర్ణసూచిక
**indexing** అనుక్రమణం
**indian ink** కరక్కాయ సిరా
**indian moorhen** భారతదేశంలో కని పించే నీటికోడి
**indicate** సూచించు, తెలియజేయు
**indication** సూచన
**indicator** సూచిక
**indices** సూచకాలు
**indict** నేరంమోపు
**indictable** ఆధికారికంగా శిక్షించదగిన
**indictee** నిందితుడు
**indictor** ఫిర్యాది, నిందకుడు
**indifference** అనాసక్తి, ఉపేక్ష, ఉదాసీనత
**indigence** నిర్ధనత, పేదరికం
**indigenous** స్వదేశీ, దేశవాళీ
**indigent** పేద, బీద
**indigestible** జీర్ణంకాని, అరగని
**indigestion** మందాగ్ని, అజీర్ణం
**indignant** క్రుద్ధ, దుష్ట, కోపంగల
**indignation** కోపం, అన్యాయం, అసూయ
**indigo** నీలి(మందు)
**indirect** పరోక్ష, కుటిల. ~ *election* పరోక్షఎన్నిక. ~ *speech* పరోక్షానుకరణ, భావ ప్రధాన నివేదన



**indirectly proportional** విలోమాను పాతంలో
**indirect method** పరోక్షపద్ధతి
**indirect verification** పరోక్ష నిరూపణ
**indiscernible** స్పష్టంగా అర్థంకాని, కారణం వెదకలేని
**indispensable** అనివార్య, అపరిహార్య, వదలివేయరాని
**indisposed** అస్వస్థ, నలతగానున్న
**indisputable** వివాదరహిత, చర్చలకు తావులేని, అప్రశ్ననీయ
**in dispute** వివాదంలో ఉన్న
**indissoluble** అవిచ్ఛిన్న, కరగని, రద్దు చేసే, సేవలులేని
**indistinct** అస్పష్టమైన
**indistinctly** లీలగా, అస్పష్టంగా
**indistinctness** అస్పష్టత
**indistinguishable** అవిచక్షణీయ, గుర్తింప వీలులేని
**in deistress** సంకటంలో
**individualism** వ్యక్తి శ్రేయోవాదం, వ్యక్తి వాదం
**individual psychology** మనస్తత్వ శాస్త్రం
**indoctrination** స్వమతబోధన
**indoctrination** బోధించు, ఉపదేశించు, సిద్ధాంతాలను మనస్సుకెక్కించు
**indolence** సోమరితనం
**indolent** ఒళ్లు వంగని, మానని
**indubitable** అనుమానం లేని, నిస్సం శయమైన
**induce** ప్రేరేపించు
**induced** ప్రేరిత. ~ *radio activity* ప్రేరిత రేడియోధార్మికత
**inducement** ప్రేరణ, ప్రలోభం, ప్రోత్సాహం
**induction** ప్రవేశం, ప్రేరణ, ఆగమన (తర్కం). ~ *coil* ప్రేరణ వేష్టం
**induction of labour** ప్రసవ ప్రేరణ
**inductive effect** ప్రేరక ప్రభావం
**inductometric effect** ప్రేరకశీల ప్రభావం
**inductor** ప్రేరకం
**indulge** పాల్గొను, జోక్యం పెట్టుకొను, చనువిచ్చు, గారాబంచేయు, లోలుడగు
**indulgence** చనువు, గారాబం, లోలత్వం, లాలన
**induration** కాఠిన్యం, గట్టితనం
**industrial** పారిశ్రామిక. ~ *area* పారి శ్రామికప్రాంతం. ~ *art* పారిశ్రామిక కళ. ~ *chemistry* పారిశ్రామిక రసా యనశాస్త్రం. ~ *estate* పారిశ్రామిక వాడ. ~ *relations* పారిశ్రామిక సంబం ధాలు. ~ *tribunal* పారిశ్రామిక న్యాయ స్థానం
**industrialism** పారిశ్రామికవాదం
**industrialist** పారిశ్రామికవేత్త
**industrialization** పారిశ్రామికీకరణ
**industries** పరిశ్రమలు. *supplementary* ~ ఉపపరిశ్రమలు
**industrious** శ్రమశీల, కష్టించి పనిచేసే
**industry** పరిశ్రమ, కర్మాగారం
**inebriate** మత్తుకలిగించే
**inebriation** మత్తు, మైకం
**inedita** ప్రచురించని రాతలు
**inedited** పరిశీలించని, పరీక్షించని
**inefficiency** అసమర్థత, నైపుణ్యం లేని
**inefficient** సామర్థ్యంలేని, అసమర్థ
**inelegant** ఆకర్షణ లేని
**ineligibility** అనర్హత
**ineluctable** తప్పించుకోలేని
**inept** అసంగతమైన
**ineptitude** అసంగత్వం

**inequality** అసమానత
**inequitous** అన్యాయమైన
**inert** చలనంలేని, స్తబ్ధ, జడ. ~ *gas* జడ వాయువు
**inertia** జడత్వం, స్తబ్ధత. ~ *uterine* గర్భాశయస్తబ్ధత
**inertion** జడత్వం, నిష్క్రియాపరత్వం
**inevitable** అనివార్య, తప్పనిసరి
**inevitable** తప్పనిసరిగా
**inexpensive** ప్రియంకానిది, చవక అయినది, వ్యయభరితం కానిది
**inexplicable** కారణం చెప్పడానికి వీలు కాని, వివరించలేని
**infallible** తప్పుకాని, పొరపాటుపడని, అమోఘ
**infamy** అప్రతిష్ఠ, అపకీర్తి
**infancy** శైశవం, బాల్యం
**infant** శిశువు. *premature* ~ నెలలు నిండని శిశువు. ~ *stage* శైశవదశ
**infanticide** శిశుహత్య
**infantile** శిశు సంబంధమైన, పసితనం పోని
**infantilism** ఎదుగూ బొదుగూ లేని స్థితి
**infantilization** శైశవదశలో ఒక అవయవం పెరగకపోవడం
**infantry** పదాతిదళం, కాల్బలం
**infatuated** వ్యామోహంగల, మోహవశ
**infatuation** వ్యామోహం, మోహం
**infection** సంక్రమణ. *air borne* ~ వాయు వాహిత సంక్రమణ. *secondary* ~ ద్వితీయ సంక్రమణ. *silent* ~ ప్రచ్ఛన్న సంక్రమణ. *sub-linical* ~ రోగ లక్షణ హీన సంక్రమణ
**infectious** సంక్రమించు, సంక్రమించే, సాంక్రామిక. ~ *disease* అంటువ్యాధి
**infecundity** స్త్రీలలో వంధ్యత్వం

**infer** భావించు, అనుమానించు
**inference** ఒక అంశం నుండి గ్రహించే సారాంశం, ఆకళింపు, అనుమితి
**inferior** న్యూన, నాసిరకమైన, చౌక, తక్కువ
**infernal** ఆహ్లాదకరం కాని, వేదనామయ
**inferno** నరకం లాంటి ప్రదేశం, భయంకర స్థలం
**infertile** వంధ్య
**infertility** వంధ్యత్వం
**infestation** పురుగులతో బాధపడడం, పరాన్నజీవులు/ వ్యాధికారక శిలీంధ్రాలు/ కీటకాల సంక్రమణ, మూగి ఉండడం
**infibulation** లైంగిక చర్యలకు అవరోధం కల్పించడం
**infidelity** దాంపత్యద్రోహం, అవిశ్వాసం
**infight** అంతర్గత కలహం, కుమ్ములాట
**infiltration** చొచ్చుకునిపోవడం, చొరబాటు
**infinite** అపరిమిత
**infinitesimal** అత్యంతసూక్ష్మ, చాలా చిన్నదైన
**infirm** బలహీనమైన, అశక్త
**infirmary** వైద్యశాల, ఆసుపత్రి
**infirmity** లోపం, బలహీనత, అనారోగ్యం. *bodily* ~ శారీరక దౌర్బల్యం
**inflammable** జ్వలనశీల, మండే స్వభావం గల
**inflammation** మండించడం, బాధ, వాపు, నొప్పి
**inflatable** గాలితో నింపదగిన, పెంచదగిన
**inflate** ఉబ్బు, పెరుగు, పెంచు
**inflation** ద్రవ్యోల్బణం; గాలితో నిండడం
**inflection** పదనిష్పత్తి, (నామ) విభక్తి
**inflict** తెచ్చిపెట్టు, విధించు



**inflow** లోపలికి ప్రవహించు
**influence** పలుకుబడి, ప్రాబల్యం, మాట చెల్లుబడి
**influenza** విషపడిశం, శీతలజ్వరం
**influx** లోనికి రావడం/ ప్రవహించడం
**informal** ఇష్టాగోష్ఠి, అనధికార, లాంఛన ప్రాయం కాని
**informative distortion** సంసూచక వికృతీకరణ
**infra** కింద
**infraction** భంగం, అవస్థాపన
**infrared** పరారుణ. ~ *radiation* పరారుణ వికిరణం. ~ *ray* పరారుణ కిరణం
**infrastructure** అవస్థాపన, ప్రాథమిక సదుపాయాలు
**infringe** ఉల్లంఘించు, అతిక్రమించు
**infringement** అతిక్రమణ, ఉల్లంఘన
**infructuous** వ్యర్థ
**infundibulum** గరాటు రూపం గల
**infuriated** క్రోధాంధ, ఉద్రిక్త
**infusible** అగాలనీయ
**infusion** కషాయం, శరీరంలోకి ద్రవాన్ని ఎక్కించడం
**ingenious** చతుర, తెలివిగల
**ingenuity** చాతుర్యం, తెలివి
**ingestion** మింగడం, అంతర్గ్రహణం
**ingot** ముద్ద. ~ *iron* లోహపు కడ్డీ
**ingrain dye** అంతర్నిహిత రంజనం
**ingrained** మారకంలేని, చెదరని అలవాట్లు గల, అభ్యస్త, స్థిత, గత
**ingratiate** అనుగ్రహీతుడగు
**ingratitude** విశ్వాసహీనత, కృతజ్ఞతలేమి
**ingredient** భాగం, అంశం, మసాలా (దినుసులు)
**ingress** ప్రవేశం, ప్రవేశాధికారం

**inguinal** గజ్జకు సంబంధించిన
**inhabit** నివసించు, కాపురముండు
**inhalation** ఊపిరి పీల్చడం, నిశ్వాసం
**inhaler** పీల్చేందుకు వాడే సాధనం
**inherence** స్వాభావికత, జన్మసిద్ధత. ~ *of acquired character* ఆర్జిత స్వభావ సంక్రమణం
**inherent** స్వాభావిక, స్వతఃసిద్ధ. ~ *power* స్వతసిద్ధాధికారం. ~ *vice* అంతర్గత దోషం
**inherently** అంతర్గతంగా, నైసర్గికంగా, స్వతస్సిద్ధంగా
**inheritance** వారసత్వం
**inherited character** సంక్రమిత లక్షణం
**inhibit** నిరోధించు, ఆపు
**inhibiting growth** నిరోధక, వృద్ధి
**inhibition** ఆటంకం, నిరోధం
**inhibitor** చురుకు తగ్గించే; అవరోధకం
**inhuman** అమానుష
**inhumane** అతిక్రూరమైన
**inimical** ప్రతికూలమైన, హానికరమైన, విరుద్ధ
**inintegrum** కొత్తగా
**iniquitous** అన్యాయపూరిత, దుష్ట
**initial** ఆద్య, మొదటి; పొట్టి సంతకం
**initiate** చొరవ తీసుకొను, ప్రారంభించు
**initiation** ప్రారంభం
**initiative** చొరవ; అభిప్రాయ నివేదిక
**injection** సూదిమందు, సూదితో మందు ఎక్కించడం. *circum corneal* ~ స్వచ్ఛపటలం చుట్టూ సూది మందు ఇవ్వడం. *intramuscular* ~ కండరంలోకి సూది మందు ఎక్కించడం. *intra-venous* ~ నరాలలోకి (సిరలలోకి) సూది మందు ఇవ్వడం

**injunction** (కోర్టు) నిషేధాజ్ఞ. *ex-parte* ~ ఏకపక్షాభ్యర్థనపై ఇచ్చే ఉత్తరువు. ~ *injuria* హానికర చర్య. *inter locutary* ~ వ్యాజ్య కాలీన నిషేధాజ్ఞ. *mandatory* ~ కర్తవ్యదేశ నిషేధాజ్ఞ. *perpetual* ~ శాశ్వతనిషేధాజ్ఞ. *preliminary* ~ ప్రాథమిక నిషేధాజ్ఞ. *preventive* ~ నిరోధక నిషేధాజ్ఞ. *provisional* ~ తాత్కాలిక నిషేధాజ్ఞ. *temporary* ~ తాత్కాలిక నిషేధాజ్ఞ
**injury** హాని, గాయం
**injustice** అన్యాయం, అధర్మం
**inky** చాలా నల్లనైన
**inlay** పొదగడం
**inlet** ప్రవేశిక, సముద్రతీరంలో చిన్న దారి, లోనికి ద్వారం. *pelvic* ~ కటి వలయ ద్వారం
**inmate** కలిసి జీవిస్తున్న వారిలో ఒకరు
**inn** సత్రం
**innards** (శరీరంలో) లోపలి భాగాలు
**innate** అంతర్లీన, సహజమైన, పుట్టుకతోనే వచ్చిన. ~ *ideals* స్వతస్సిద్ధ భావాలు
**inner** లోపలి, ఆంతర. ~ *conscious-ness* అంతఃకరణ. ~ *garment* లోదుస్తు. ~ *party democracy* పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం. ~ *voice* అంతర్వాణి, అంతరంగ ప్రబోధం
**innocent** అమాయక, నిరపరాధి
**innocuous** అపాయంలేని, హానిచేయని, చెడ్డకాని, ప్రమాదంలేని
**innominate** అధిగ్రీవ, గొంతు కింద
**innovation** కొత్త ఆలోచన, నవప్రవర్తన
**innuendo** గర్భితనింద, ఛలోక్తి
**innunodermatology** చర్మవ్యాధి నిరోధక శాస్త్రం
**inoculation** టీకాలు (వేయడం)
**inomnibus** అన్నివిషయాలలో
**inoperable** శస్త్ర చికిత్సకు వీలుకాని
**inordinate** మితిమీరిన, ఎక్కువ, అమితమైన. ~ *delay* తాత్సారం
**inordinate** అదుపులేని, అత్యధిక
**inorganic** అకర్బన, నిరింద్రియ. ~ *chemistry* అకర్బన రసాయన శాస్త్రం
**inpainting** అంతశ్చిత్రణ, అభిచిత్రణ
**inputs** అవసరాలు, ఉత్పాదకాలు
**in quadruplicate** నాలుగు కాపీలతో
**inquest** దుర్మరణకారణ విమర్శ, శవ పంచాయతీ. *coroner's* ~ ఆధికారిక శవ పంచాయతీ. *magesterial* ~ మేజిస్ట్రేట్ చేసే శవ పంచాయతీ. *police* ~ పోలీసు అధికారి చేసే శవ పంచాయతీ
**inquire** విచారించు, ప్రశ్నించు, అడుగు
**inquisition** పరిశీలన, విచారణ, దర్యాప్తు
**inroad** దురాక్రమణజేయు, దండెత్తు, చొచ్చుకొనిపోవు
**insalubrious** అనారోగ్యకరమైన
**ins and outs** మొత్తం నిజాలు
**insanitary** అపరిశుభ్రమైన
**insanity** వెర్రి, ఉన్మత్తత, పిచ్చి
**insatiable** తృప్తిలేని, తనివితీరని
**inscribe** అభిలిఖించు, చెక్కు, చిత్రించు
**inscribed** అంతర్లిఖిత. ~ *circle* ఆంతర వృత్తం
**inscription** కృతి, అంకితం, శిలాశాసనం, అభిలేఖనం
**insect** కీటకం. ~ *borne* కీటకవాహిత. ~ *repellent* కీటకాల నిరోధక
**insecticide** కీటక సంహారి
**insemination** శుక్ర నిక్షేపణ, వీర్యనిక్షేపం
**insenisibility** జడత్వం, అతీంద్రియత
**insensible** అచేతన, స్మృతిలేని, కఠిన, క్రూర



**insensitive** స్పందించని, సున్నితంకాని, చురుకుదనం లేని
**insertion** ప్రవేశపెట్టడం, గుచ్చటం
**inside** లోతట్టు, కడుపు
**insidious** ప్రచ్ఛన్నమైన, కపట, ద్రోహపూర్ణ
**insignificant** ముఖ్యంకాని, స్వల్పమైన
**insinuate** వ్యంగ్యంగా సూచించు, తప్పు అభిప్రాయంతో సూచించు
**insinuation** పరోక్షనింద
**insipid** రుచిలేని, నిస్సార
**insist** నొక్కిచెప్పు, పట్టుపట్టు, నిర్దేశించు
**in situ** సహజస్థితిలో, యథాస్థానంలో
**insolence** మిడిసిపాటు, దార్ష్టికం
**insolent** పొగరుబోతు, తలబిరుసు
**insolubility** అద్రావణీయత
**insoluble** కరగని, అద్రావ్య
**insolvency** దివాలా(కోరుతనం)
**insolvent** దివాలాకోరు
**insomnia** నిద్రలేమి (వ్యాధి)
**insouciance** పట్టించుకోనితనం
**inspection** తనిఖీ, సోదా
**inspiration** అంతఃశ్వాసనం, ప్రోత్సాహం, ఉత్సాహం, ఉచ్ఛ్వాసం, ఊపిరిపీల్చడం
**installed capacity** ప్రతిష్ఠాపిత సామర్థ్యం, ఉత్పత్తి సామర్థ్యం
**instalment** వాయిదా, కిస్తు, కిస్తీ
**instance** ఉదాహరణ, దృష్టాంతం, ప్రేరణ, సంకేతం
**instantaneous** తొందరగా, వేగంగా, తక్షణం
**instead of** మారుగా, బదులుగా
**instigation** ప్రోద్బలం, దుష్ప్రేరణ, పురికొల్పటం
**instillation** (మందు) చుక్కలు వేయడం
**instinct** ప్రవృత్తి, స్వభావం; సహజ జ్ఞానం
**institutional buying** సంస్థల కొనుగోళ్ళు
**instruction** బోధన, పురమాయింపు
**instructor** బోధకుడు
**instrument** అధికారపత్రం, ఆయుధం, యంత్రవాద్యం, దస్తావేజు
**insubordination** అవిధేయత
**insufferable** భరించలేని
**insufficiency** చాలని
**insular** ఛాందస, సంకీర్ణ, ద్వీపసంబంధి
**insulate** వేరుచేయు, వేడి/ విద్యుత్తు ప్రసరించే మార్గాలను అడ్డగించు
**insulated** బంధిత
**insulating board** సంలగ్న ఫలకం
**insulation** వ్యాప్తి నిరోధకం
**insulator** సంలగ్నిక, బంధకం
**insuperable** దాటరాని, అధిగమించరాని, పరిష్కరించలేని, వేరు చేయలేని
**insurance** బీమా
**insurgency** తిరుగుబాటు, విద్రోహం
**insurgent** తిరుగుబాటుదారు
**intaglio** అంతఃపాతి. ~ *methods* ఆంతర్రేఖా పద్ధతులు. ~ *print/collagraph* రేఖోల్బణ ముద్రణ
**intake** లోనికి తీసుకోవడం, అంతర్గ్రహణం
**intangible** అగోచర, గోచరం కాని, కనిపించని. ~ *asset* అభౌతిక సంపద
**integer** పూర్ణాంకం
**integral** సమాకలని, పూర్ణాంక ప్రమేయం. ~ *evolution* పూర్ణపరిణామం
**integration** సమాకలనం, ఏకీకరణం, సమైక్యం. *limits of* ~ సమాకలనా వధులు
**integument** పొర, త్వచం
**integumentary** ఆచ్ఛాదన, శరీరావరణకు సంబంధించిన

**macho** పురుషాహంకృతి
**mackintosh** రబ్బరుగుడ్డ, పూతపూసిన/ తడవని పైకోటు
**macro** స్థూల. ~ *analysis* స్థూల విశ్లేషణం. ~ *cephaly* బృహత్ శిరస్సు. ~ *cyte* బృహత్ కణం. ~ *dactyl* బృహదంగుళీయత. ~*economic imbalance* స్థూలార్థిక వ్యవస్థ అసమతుల్యత. ~ *ecomonics* స్థూలార్థ శాస్త్రం. ~ *glossia* బృహత్‌జిహ్వ. ~ *scopic particle* స్థూలకణం
**macrobiotic diet** బౌద్ధమతానికి సంబంధించిన ఆహార నియమం
**macula** (గ్రహం ఉపరితలంపై గల నల్ల) మచ్చ, నింద
**madcap** తెలివి తక్కువైన, బుర్రలేని
**madden** కోపం తెప్పించు
**made known** తెలియజేసిన
**madly** వేగంగా చేయు
**maesta** మంగళ చిత్రం
**maestro** గొప్ప వాగ్గేయకారుడు, సంగీతోపాధ్యాయుడు
**mafia** చట్టవ్యతిరేకమైన పనులు చేసే రహస్యముఠా
**magazine** సమాచార పత్రిక, సంచిక, పత్రిక
**maggot** ఈగ డింభక దశ
**magic** మంత్రవిద్య
**magic realism** మాంత్రిక వాస్తవికత, మాయావాస్తవికత
**magistrate** న్యాయాధిపతి
**magma** శిలాద్రవం
**magnacarta** హక్కులపత్రం
**magnanimity** ఉదారత, మహత్తు
**magnanimous** గొప్పబుద్ధిగల, ఉదాత్తమైన
**magnate** సంపన్నుడు, ముఖ్యమైన వ్యాపారవేత్త
**magnetic** అయస్కాంత. ~ *compass* అయస్కాంత దిక్సూచి. ~ *deflection* అయస్కాంత విచలనం. ~ *dip* అయస్కాంతనతి. ~ *field* అయస్కాంత క్షేత్రం. ~ *flux* అయస్కాంతాభివాహం. ~ *induction* అయస్కాంత ప్రేరణ. ~ *lines of force* అయస్కాంత బలరేఖలు. ~ *moment* అయస్కాంత భ్రమణం
**magnetisation** అయస్కాంతీకరణం
**magnetise** అయస్కాంతీకరించు
**magnetism** అయస్కాంతత్వం
**magneto chemistry** అయస్కాంత రసాయనశాస్త్రం
**magnification** పెద్దదిగా చేయడం, వర్ధనం
**magnificent** జేగీయమాన, బ్రహ్మాండమైన
**magnifying glass** భూతద్దం
**magnum opus** సర్వోత్కృష్ట రచన/కృషి/ కార్యం
**maiden** పెండ్లికాని యువతి, కన్య; మొట్టమొదటిసారిగా జరిగే, ప్రప్రథమంగా సంభవించే, కొత్తదైన, అనుభవంలేని; విత్తనం నుండి వచ్చే మొక్క ~ *aunt* అవివాహిత మహిళ. ~ *name* వివాహిత పుట్టింటివారి ఇంటిపేరు. ~ *over* పరుగులు ఇవ్వకుండా వేసిన ఓవరు. ~ *speech* మొట్టమొదటిసారిగా ఇచ్చే ఉపన్యాసం. ~ *voyage* మొట్టమొదటి సముద్రయానం
**mail** లేఖలు, ఉత్తరాలు, తపాలా/ బట్వాడా వ్యవస్థ. ~ *machine* తపాలా యంత్రం. ~ *man* ఉత్తరాలు చేరవేసే వ్యక్తి. ~ *merge* ఒక లేఖను, సందేశాన్ని వివిధ వ్యక్తుల పేర్లు, చిరునామాలతో అనుసంధానం చేసి ముద్రించడం. ~ *order* పత్రికా ప్రకటన చూసి వస్తువులను తెప్పించుకోవడం. ~ *shot* ముఖ్యమైన ఖాతాదారులకు పంపే (ప్రచార) సామగ్రి



**mailing list** చిరునామాల జాబితా
**maim** వికలాంగుణ్ణిచేయు, చిత్రవధచేయు
**maimed** అంగహీన
**maiming** అవయవచ్ఛేదన శిక్ష
**main** ప్రధాన, ప్రముఖ, ముఖ్యమైన. ~ *crop* ప్రధాన పంట. ~ *drag* ప్రముఖ వీధి. ~ *market* ప్రధాన విపణి
**mainframe** విస్తృత కంప్యూటర్ వ్యవస్థలో కేంద్రస్థానం వహించే భాగం
**mainstream** ప్రధాన/ జనజీవన స్రవంతి
**maintain** నిర్వహించు, కొనసాగించు, నిలబెట్టుకొను
**maintainable suit** విచారణకు యోగ్య వ్యాజ్యం
**maintenance** జీవిక, యథాస్థితి రక్షణ
**maize** మొక్కజొన్న
**major** యుక్తవయస్కుడు; ఈడు వచ్చిన సేనాని
**majority** అధికసంఖ్య, వయస్కత. ~ *attainment* యుక్త వయస్సు రాక. ~ *floor-leader* అధికార పక్ష నాయకుడు. ~ *interest* నిర్ణయాధికారం, నియంత్రణాధికారం కలిగి ఉండడం. ~ *rule* అధిక సంఖ్యాకుల పాలన. ~ *will* అధిక సంఖ్యాకుల అభిప్రాయం
**majuscule** పెద్ద అక్షరం, పెద్దదిగా రాసిన మొదటి అక్షరం
**make** తయారుచేయు, ఉత్పత్తిచేయు, నిర్మించు, కట్టు, ఉత్పత్తి చేసిన సంస్థ పేరు, సంస్థ ఉత్పత్తి. ~ *a fuss* రాద్ధాంతం చేయు. ~ *a loss* నష్టం తెచ్చుకొను. ~ *away with* దొంగిలించు. ~ *believe* నమ్మకం పుట్టించు. ~ *for* ముందుకి కదులు. ~ *good* బాగుచేయు. ~ *off with* దొంగిలించి తీసుకొనిపోవు. ~*out* పూర్తిచేయు, బదిలీచేయు. ~ *over* యాజమాన్యాన్ని బదిలీ చేయు. ~ *shift* పని విధానం/ ఏర్పాటు
**make up** పేజీ కూర్పు, ముఖాలంకరణం, ముఖాలంకరణ సామగ్రి; స్వభావం
**maladjustment** అనుగుణ్యంలేమి
**maladroit** ఉపాయం లేకుండా/ గజిబిజిగా చేసిన
**malady** వ్యాధి, జబ్బు, రోగం
**mala fide** దుర్బుద్ధితో/ చెడ్డబుద్ధితో (చేసిన, ప్రవర్తించే); నమ్మలేని, కపటమైన, కృతకమైన, కలుషిత, అయోగ్యమైన, వక్రమైన
**malaise** వ్యాకులత, అనారోగ్యం
**malapropism** అపప్రయోగం, తప్పు మాట; సందర్భశుద్ధి లేనిమాట
**malaria** చలి జ్వరం
**malcontent** అసంతుష్ట, అప్రసన్న
**maldevelopment** అభివృద్ధి సరిగ్గా లేకపోవడం, అనుచిత వికాసం
**malechauvinism** పురుష దురహంకారం
**malechauvinist** పురుష దురంహకారి
**malefactor** చెడుపనులు/ హాని చేసే వ్యక్తి, దురాచారి
**malevolence** ద్వేషం, హానిచేసే బుద్ధి
**malevolent** ద్రోహబుద్ధి, కీడుచేయాలనే ఆలోచన గల
**malfeasant** దుర్వర్తనుడు
**malformation** వైకల్యం, వికృతి
**malfunction** వైఫల్యం, లోపం
**malice** ఈర్ష్య, విద్వేషం, చెడుబుద్ధి
**malicious** ఇతరులకు హాని తలపెట్టే
**malign** ద్వేషించు, చెడుచేయు, దుర్భాషలాడు

**malignancy** దుర్మాంసవృద్ధి, ప్రాణాంతకత్వం
**malignant** హానికరమైన, తీవ్ర ద్వేషంగల, ప్రాణాంతక
**malinger** పనిదొంగ, రోగం నటించు
**mall** వాహనాలకు ప్రవేశం లేని విపణులు
**malleability** ఘాతక్షమత; సాగేగుణం
**malleable** సాగే, సుతిమెత్తని
**malnutrition** పోషకాహారలోపం
**malodorous** చెడువాసన గల
**maltreatment** బాధపెట్టే, అసభ్య ప్రవర్తన
**malversation** నమ్మక ద్రోహం చేయడం, చెడునడత
**mammal** క్షీరదం, పాలిచ్చే జంతువు
**mammaplasty** స్తనరూపీకరణ చికిత్స
**mammary** స్తనసంబంధమైన
**mammectomy** స్తనచ్ఛేదన
**mammilla** చనుమొన
**mammillated** స్తనాకార నిర్మిత
**mammography** స్తనచిత్రణ, స్తన గ్రంథులకు సంబంధించిన శాస్త్రం
**mammoth** పెద్ద, గొప్పవైన, ఎక్కువ
**mamonography** స్తనగ్రంథులకు సంబంధించిన శాస్త్రం
**man** n. మనిషి, మానవుడు, పురుషుడు. ~ *hour* ఒక గంటలో ఒక వ్యక్తి చేయగల పనిమొత్తం. ~ *of business* న్యాయ వ్యవహారాలలో ప్రతినిధి. ~ *of letters* విద్యాధికుడు, సాహితీవేత్త. ~ *of straw* నిర్ధనుడు, తృణప్రాయుడు. ~*slaughter* మానవ వధ. ~ *of war* యుద్ధనౌక
**man** v. పనివాళ్ళను కుదుర్చు, నిర్వహించు, పనిచేయించు, పనిచేయు, అమలుచేయు, ఆచరించు
**mana** మానవాతీత శక్తి/ ప్రభావం
**manage** నిర్వహించు, నియంత్రించు
**managed currency** వినిమయ రేటును ప్రభుత్వం నియంత్రించే కరెన్సీ
**managed fund** నిర్వాహిత నిధి
**management** నిర్వహణ, యాజమాన్యం. ~ *accountant* యాజమాన్య గణకుడు. ~ *audit* నిర్వహణ తనిఖీ. ~ *buy out* ఉద్యోగులు నిర్వహణాధికారం కొనుక్కోవటం. ~ *by exception* అనూహ్య వ్యయపరిమాణాల నిర్వహణ. ~ *by objectives* లక్ష్య నిర్దేశ యాజమాన్యం. ~ *consultant* యాజమాన్య సలహాదారు. ~ *development* యాజమాన్యాల వృద్ధి విధానం. ~ *information system* నిర్వహణ సమాచార వ్యవస్థ
**manager** నిర్వాహకుడు. *area* ~ ప్రాంతీయ నిర్వాహకుడు. *departmental* ~ శాఖా నిర్వాహకుడు. *deputy* ~ సహనిర్వాహకుడు. *product* ~ ఉత్పత్తి నిర్వాహకుడు. *production* ~ ఉత్పాదన నిర్వాహకుడు
**manageress** నిర్వాహకురాలు
**managerial** నిర్వహణసంబంధి. ~ *revolution* నిర్వహణ విప్లవం
**managing director** నిర్వాహక సంచాలకుడు
**managing partner** నిర్వహణ భాగస్వామి
**mandake** గందరగోళం, తారుమారు
**mandamus** ప్రవర్తకాధిలేఖ
**mandate** ఆదేశం, ఆజ్ఞ, పార్లమెంటుకు ఓటర్లు ఇచ్చిన రాజకీయాధికారం
**mandatory state** ఆదేశక రాజ్యం
**mandible** కిందిదవడ ఎముక, అధోహనువు
**mangle** వంచు, చించు
**mangled** ఛిన్నభిన్న



**mangroves** మడ అడవులు
**manhandle** చెయ్యి చేసుకొను, దౌర్జన్యంగా కొట్టు
**manhole** ప్రవేశబిలం, దిగుడుబిలం, మోరీ
**manhunt** నేరగాణ్ణి గుంపుకట్టి వేటాడటం
**mania** ఉన్మాదం, పిచ్చి
**manifest** రవాణా చేసే సరుకు; ప్రయాణికుల జాబితా వివరాలు; వ్యక్తమగు
**manifestation** రుజువు, అభివ్యక్తి, సాక్షాత్కారం
**manifesto** ప్రణాళిక, కార్యాచరణ పత్రం; వివరణపత్రం
**manila** దళసరి కాగితపు కవరు
**manipulation** హస్తనైపుణ్యం, అభిసంధానం
**manipulator** అవినీతిపరుడు, చేతిపనివాడు
**manism** చనిపోయినవారి ఆత్మలను పూజించడం
**mannequin** టోపీలు, బట్టలు కట్టి కొట్టు ముందు నిలబెట్టిన రూపం
**manner** రీతి, ధోరణి, ఫక్కీ
**mannered** రీతిబద్ధ, కృత్రిమమైన
**mannerism** అలవాటు, ధోరణి, రీతివాదం
**mannerist art** రీతి సంప్రదాయకళ
**manning agreement** నిర్వహణ ఒప్పందం
**manoeuvrable** వివిధ రకాలుగా మార్చే
**manoeuvre** నైపుణ్యం, యుక్తి విన్యాసం
**manor** మొఖాసా, జమీను
**man power** మానవ వనరులు/ శ్రమశక్తి. ~ *planning* అవసరమైన పనివారి సంఖ్యను అంచనా వేయడం
**manque** అప్రసిద్ధ రచయిత/ నటుడు
**mantle** ఉత్తరీయం; ఆవరణ, మూత
**manual** శారీరకమైన, సూచనల పుస్తకం, పరిచయపత్రం, వివరణపత్రం
**manufacture** తయారీ, నిర్మాణం, ఉత్పత్తి
**manufacturer** తయారీదారు, నిర్మాత, ఉత్పాదకుడు
**manumission** దాస్య విముక్తి
**manure** ఎరువు
**manuring** ఎరువు వేయడం
**manus** హస్తం, చేయి. ~ *valgus* బయటకు వంకర తిరిగిన చెయ్యి. ~ *varus* లోపలికి వంకర తిరిగిన చెయ్యి
**manuscript** లిఖిత ప్రతి, అచ్చు ప్రతి
**maoism** మావో సిద్ధాంతం
**map** రేఖాచిత్రం, పటం, ఆకారం, మానచిత్రం
**marasmus** శుష్కించడం, ఎండిపోవడం
**maraud** కొల్లగొట్టు, దొంగిలించు
**marble** పాలరాయి, గోలీ (కాయ)
**margin** అంచు, ఉపాంతం, లాభం, మోతాదు
**marginal** ఉపాంత, పరిమిత. ~ *cost* ఉపాంత వ్యయం. ~ *costing* వ్యయాన్ని అంచనా వేసి అమ్మకపు ధర నిర్ణయించడం. ~ *group* కొత్త విలువలను పాటించే సమూహం. ~ *productivity* ఉపాంతోత్పాదకత
**marginally** స్వల్పంగా, కొద్దిగా
**margosa** వేపచెట్టు
**marine** సముద్ర సంబంధి, వాణిజ్య నౌకాదళం, నావికుడు. ~ *insurance* సముద్ర బీమా
**maritime** సముద్ర/ నౌకా సంబంధి, నావిక. ~ *law* నౌకా వాణిజ్య న్యాయం
**marjare** ఒక మత్తుమందు
**marjuyans** మత్తుమందు

**mark** గుర్తింపు చిహ్నం
**mark down** అమ్మకపు ధర తగ్గించు
**marked cheque** చెల్లించవచ్చునని బాంకు గుర్తించిన చెక్కు
**market** అంగడి, బజారు, సంత, విపణి, మండీ; ధర, గిరాకీ; అమ్ముకొను. ~ *capitalization* కంపెనీ విలువ. *come on to the* ~ కొత్తగా అమ్మకాలు జరుపు. ~ *demand* గిరాకీ. *flood the* ~ విపణిని ముంచెత్తు. ~ *forces* విపణి శక్తులు. *on the* ~ అమ్మకానికి పెట్టిన, కొనేందుకు లభించే. ~ *sentiment (behaviour)* విపణి పోకడలు. ~ *town* వాణిజ్య నగరం
**marketable** అమ్ముదగిన
**marketeer** వస్తుసేవల అమ్మకాలను ప్రోత్సహించే వ్యక్తి/ సంస్థ
**marketing** క్రయ విక్రయాలు. ~ *strategy* వ్యాపార వ్యూహం
**marksman** నిశానీదారు, గురికాడు
**marksmanship** గురిపెట్టే నేర్పు, లక్ష్య శుద్ధి
**maroon** వ్యర్థంగా పొద్దుపుచ్చు, పెద్ద ధ్వనితో పేలే బాణసంచా, ముదురు ఎరుపు రంగు
**marriage** పెళ్ళి, కళ్యాణం, వివాహం. ~ *by bride price (or purchase)* కన్యాశుల్క వివాహం. ~ *by capture* పరిగ్రహణ వివాహం. ~*by elopement* పలాయిత వివాహం. ~ *by exchange* వినిమయ వివాహం. ~ *by force* బలాత్కార వివాహం. ~ *by intrusion* అనాహూత వివాహం. ~ *by mutual love* గాంధర్వ వివాహం. ~ *by negotiation* సంప్రదింపుల వివాహం. ~ *by service* సేవా వివాహం. ~ *by trial* ప్రయోగాత్మక వివాహం
**marrow** మజ్జ, మూలుగ, ఎముకలోని సారం
**marsh** పంకం, ఊబి, బురద. ~ *gas* పంకవాయువు
**marshes** చిత్తడి నేలలు
**marsupial** కడుపుసంచిలో పిల్లను మోసుకు తిరిగే
**marsupialization** సంచిలాగా కుట్టడం
**martial law** సైనిక శాసనం
**martinet** కఠిన పరిపాలకుడు
**martyr** మృతవీరుడు, బలిఇచ్చు
**marvellous** విస్మయకర, అద్భుత
**marxism** గతి తార్కిక భౌతిక వాదం
**marxist** మార్క్స్ సిద్ధాంతాలను గాఢంగా నమ్మే వ్యక్తి. ~ *criticism* మార్క్సిస్టు విమర్శ
**mascaron** చిత్రాపముఖం
**mascot** చిహ్నం, గుర్తు, తాయెత్తు, రక్షరేకు
**masculinisation** పుంస్త్వీకరణ
**masculinity** పురుషత్వం, పుంస్త్వం
**mask** ముసుగు, ఛద్మముఖం
**masochism** స్వపీడనరతి
**masquerade** మారువేషం, ముసుగు నృత్యం
**mass** ద్రవ్యరాశి, ముఖ్యాంశం. ~ *communication* విస్తృత భావ ప్రసారం. ~ *media* ప్రసార మాధ్యమాలు. ~ *tone* బాహ్యస్థాయి
**massacre** ఊచకోత, సామూహిక వధ, నరమేధం
**masses** ప్రజలు, జనాలు, జనసందోహం
**massier** కళాశిక్షణాలయంలో విద్యార్థి పెద్ద
**massline** ప్రజా పంథా/ మార్గం
**mass psychology** గుంపు/ మంది మనస్తత్వం, సామూహిక చిత్తవృత్తి
**mastectomy** స్తనచ్ఛేదనం



**master** ఆచార్యుడు, నిష్ణాతుడు. ~ *piece* ప్రకృష్ట రచన, ఉత్తమ రచన
**masterliness** ప్రౌఢత్వం
**mastermind** మూలకారకుడు
**masturbation** హస్తప్రయోగం
**match fixing** లాలూచీ క్రీడ
**matching** సరిపోల్చడం, సరిపోలడం
**material** ద్రవ్యం, భౌతిక. ~ *culture* భౌతికసంస్కృతి. ~ *fallacies* అర్థగతాభాసలు. ~ *logic* అర్థతర్కం, ఆగమన తర్కం
**materialise** కార్యరూపం దాల్చు
**materialism** భౌతికవాదం
**materia medica** ఔషధ నిఘంటువు, వస్తుగుణ దీపిక
**maternal heart** మాతృ హృదయం
**maternity** ప్రసూతి, మాతృత్వం
**martriarch** మాతృస్వామిని
**matriarchal** మాతృస్వామ్య
**matriarchy** మాతృస్వామ్యం
**matrimonial** వివాహ సంబంధమైన, వివాహం వల్ల కలిగే
**matrimony** వివాహం
**matrix** మాతృక, మాత్రిక
**matron** సంరక్షకురాలు, వివాహిత స్త్రీ
**matter** పదార్థం, ద్రవ్యం; మెదడుకు కప్పి ఉండే పొర. ~ *and form* పదార్థం, ఆకృతి. *grey* ~ మెదడు, నాడీ పదార్థం. *organic* ~ జీవపదార్థం. *white* ~ శ్వేత పదార్థం
**maturation** పరిణతి, పరిపక్వత, యుక్త వయస్సు
**mature** (పరి)పక్వ, సంపూర్ణంగా అభివృద్ధి చెందిన, ప్రౌఢ, యుక్తవయస్సు పొందిన
**matured** పక్వ
**maturity** గడువు, పక్వత, యుక్తవయస్సు
**mausoleum** సమాధి (మందిరం)
**mauve** లేత ధూమ్రవర్ణం/ రక్తవర్ణం; తారుతో కూడిన పదార్థం
**maxilla** పై దవడ ఎముక, పక్వ, ప్రౌఢ
**maxim** సూక్తి, సామెత, నీతి
**maximisation** గరిష్ఠీకరణ
**mayor** పురపాలకాధ్యక్షుడు
**meagre** మిడిమిడి, కొద్ది, తేలిక, సామాన్య
**meal** తిండి, భోజనం
**mealy bugs** పిండి పురుగులు/ నల్లులు
**mean** నీచ, సగటు, మధ్యమ. ~ *deviation* సగటు విచలనం. ~ *difference* సగటు భేదం. ~ *free path* మధ్యమ స్వేచ్ఛా పథం. ~ *square velocity* వేగ వర్గ మధ్యమం
**meander** నదీ ప్రవాహం, చిక్కుదారి, మెలికలు తిరుగుతూ ప్రయాణించు
**meanders** నదీవక్రతలు
**meaningful** సార్థక, అర్థవంతమైన
**meanness** నైచ్యం
**means of production** ఉత్పత్తి సాధనాలు/ కారకాలు
**mean thoughts** పిదప బుద్ధులు, అల్ప బుద్ధులు
**measles** తట్టు, అమ్మవారు, దద్దు, పొంగు, తడపర
**measurement** కొలత, ఆది
**meatus** సొరంగం. *auditory* ~ కర్ణాంతర సొరంగం. *external acoustic* ~ బాహ్య కర్ణ సొరంగం. *internal acoustic* ~ లోపలి చెవిలో సొరంగం. *urinary* ~ మూత్రద్వారం
**mechanical** యాంత్రిక. ~ *equivalent* యాంత్రిక తుల్యాంకం
**mechanics** యాంత్రిక శాస్త్రం. *quantum* ~ పరిమాణ యాంత్రిక శాస్త్రం

**mechanism** యాంత్రికవిధానం, యాంత్రికవాదం, క్రియావిధానం, సంవిధానం, చర్యాంతర సూత్రం. *homeostatic* ~ శరీర ధాతుసామ్య క్రియ. ~ *of reaction* చర్యా సంవిధానం. *protective* ~ రక్షక విధానం
**medal** పతకం
**meddle** అనాహూతంగా ప్రవేశించు, అనవసరంగా జోక్యం చేసుకొను, కలుగ చేసుకొను, జోక్యం చేసుకొను
**media** ప్రసారసాధనాలు, యానకం
**mediation** మధ్యవర్తిత్వం
**mediator** మధ్యవర్తి
**medicament** ఔషధ సంబంధమైన
**medication** ఔషధప్రయోగం
**medicinal** ఔషధ సంబంధమైన. ~ *herb* మూలిక
**medicine** ఔషధం, వైద్యశాస్త్రం. *clinical* ~ రోగ వైద్యశాస్త్రం. *preventive* ~ వ్యాధినిరోధక వైద్యశాస్త్రం. *psychosomatic* ~ మనఃకాయిక వైద్యశాస్త్రం. *social* ~ సామాజిక వైద్యశాస్త్రం. *social and preventive* ~ వ్యాధి నిరోధక సామాజిక వైద్యశాస్త్రం. *social* ~ సామాజిక వైద్యశాస్త్రం
**medicrea** విశేషం లేని, సామాన్య సామర్థ్యం గల
**medieval** మధ్యయుగానికి సంబంధించిన. ~ *art* మధ్యయుగ కళ
**mediocre** మామూలు/ సగటు (మనిషి)
**mediopolis** మధ్యస్థనగరం
**medium** మాధ్యమ(ం), యానకం, వాహకం
**medulla** మూలుగ, మజ్జ, అంతస్థ పదార్థం
**medullary** అంతస్థ
**megacephaly** పెద్దతల
**megacolon** బృహదాంత్రం
**mega fauna** కంటికి కనబడే జంతువులు
**megalomania** మహత్వోన్మాదం
**megalomaniac** మహత్వోన్మాది
**meiosis** క్షయకరణ విభజన
**melancholic** విషాదభరితమైన. ~ *song* విషాదగీతి
**melancholy** గుబులు, విషాదస్థితి
**melanoblast** అపరిపక్వ వర్ణకణం
**melanoma** పుట్టకురుపు. *malignant* ~ చర్మంమీది పుట్టకురుపు
**mellifluous** మధురమైన, కోమల
**mellow** కాఠిన్యంసడలిన, కోమల, మెత్త బడిన
**melodious** శ్రావ్యమైన. ~ *music* శ్రావ్య సంగీతం. ~ *song* శ్రావ్యగీతి
**melodiousness** శ్రావ్యత
**melodrama** భావప్రధాన, అద్భుత నాటకం
**melted** ద్రవీభూత
**melting pot** భిన్న సంస్కృతి సమ్మేళన స్థితి
**member** అంగం, అవయవం, సభ్యుడు
**membrane** పొర, స్తరం. *basement* ~ ఆధారస్తరం. *limiting* ~ సీమాంత స్తరం
**memorable** చిరస్మరణీయ. ~ *event* చిరస్మరణీయ సంఘటన
**memorandum** నివేదిక, జ్ఞాపకపత్రం, యాదాస్తు
**memory** జ్ఞాపకం, స్మృతి, ధారణ
**menace** బెదిరించు, భయపెట్టు, హానికలిగించు; ప్రమాదం, భయం
**menacing** ప్రమాదకారి
**menarche** రజస్వల
**mend** బాగుచేయు, చక్కదిద్దు
**mendacious** సత్యదూరమైన; మిథ్యావాది



**menial** నౌకరు, నీచసేవకుడు. ~ *jobs* చిన్న ఉద్యోగాలు
**meninges** నాడీమండలాన్ని కప్పే పొర
**meningitis** నాడీ మండల పుటల శోథ
**meningoencephalitis** మెదడు పైపొర నొప్పి
**meningomyelitis** వెన్నుపాముపై పొర నొప్పి
**meniscus** చంద్రవంక వంటి; వక్రతలం
**menopausal bleeding** రజోనివృత్తి కాల స్రావం
**menopause** ముట్లుడగటం, రుతువిరతి
**menses** బహిష్టు
**menstruation** రుతువు
**mensuration** క్షేత్రమితి, కొలతలు
**mental** మానసిక. ~ *attitude* మనః ప్రవృత్తి. ~ *development* మానసికాభివృద్ధి, బుద్ధి వికాసం
**mental agony** మనోవేదన
**menticide** మనోనాశకం
**mention** ప్రసక్తి, ప్రస్తావన, నిర్దేశం, చర్చ
**mercenary** ధనలుబ్ధ సేవకుడు, కూలి సిపాయి
**mercerize** నూలుకు మెరుగుపెట్టు
**merchant bank** వాణిజ్య బాంకు
**mercy** దాక్షిణ్యం, దయ
**mercy killing** మరణభిక్ష
**merge** విలీనమవు, కలిసిపోవు, మేళవించు
**merger** విలీనం, కలపటం
**merging** కలయిక, విలీనత
**meridian** ధ్రువరేఖ, మధ్యాహ్నరేఖ
**meristamatic tissue** విభాజ్య కణజాలం
**meristic** విభక్త
**merry** ప్రసన్న, ఉల్లాసకర
**mesh** జాలిక, జాలరంధ్రం
**mesmerism** కనికట్టు
**mesolithic period** మధ్య శిలాయుగం
**mesomorphy** దృఢశరీరాకృతి
**mesophyte** సాధారణ వాతావరణ పరిస్థితులలో పెరిగే మొక్క
**mesosphere** మధ్యస్తరం
**mess** భోజనశాల, అయోమయం, మురికి, క్రమపద్ధతి లేని
**message** సందేశం, సమాచారం, వార్త, సంకేతం
**messenger** వార్తాహరుడు, దూత
**messianic** పునరావిర్భావ విశ్వాసి
**mess up** గందరగోళ పరచు
**mesta** గోగునార
**mesurdar** కేసరిపప్పు
**metabolism** జీవక్రియ
**metacriticism** అధి విమర్శ
**metagalaxy** విశ్వసమస్తం
**metal** కంకర; లోహం. *alkaline earth* ~ క్షార మృత్తికా లోహం. ~ *filings* లోహరజం. *mobile* ~ ఉత్కృష్ట లోహం. *transitional* ~ పరివర్తన లోహం. ~ *welding* లోహాలను అతకటం
**matalanguage** అధిభాష
**metalling** రహదారి ఉపరితలం
**metallization** లోహకరణం
**metallography** లోహచిత్రణం
**metallurgist** లోహశోధకుడు
**metallurgy** లోహశోధన, లోహ సంగ్రహణ శాస్త్రం
**metamerism** వర్ణాభాసత, సమావయవత
**metamorphism** రూపాంతరణం, పూర్ణ పరివర్తన
**metamorphic change** రూపవిక్రియత
**metamorphosis** రూపవిక్రియ
**metanym** అర్థపల్లవం

**metaphor** రూపకం
**metaphorisation** సదృశీకరణం
**metaphysical** అధిభౌతిక. ~ *emptiness* ఆధిభౌతికశూన్యత. ~ *idealism* అతి భౌతిక భావవాదం. ~ *painting* అధి భౌతిక చిత్రణ
**metaphysics** అధిభౌతిక శాస్త్రం, తత్త్వ జ్ఞానం
**metapsychology** అధిమానసిక శాస్త్రం
**metastasis** రోగసంబంధి కణవ్యాప్తి
**metatarsalgia** అరికాలి ఎముకలనొప్పి
**metatarsus** అరికాలు
**metathesis** వర్ణవ్యత్యయం
**meteorology** వాతావరణశాస్త్రం
**meteor** ఉల్క; ఉల్కాపాతం
**methileaf** మెంతికూర
**method** పద్ధతి, విధానం. ~ *of difference* విభేద విధానం. ~ *of questionnaire* ప్రశ్నావళి విధానం. ~ *of tenacity* అభినివేశ విధానం
**methodology** పరిశోధనపద్ధతి
**meticulous** జాగరూకంగా పరిశీలించే, ఖచ్చితమైన
**metonomy** అర్థవిస్తృతి
**metre** ఛందస్సు
**metrology** తూనికలు, కొలతలకు సంబంధించిన శాస్త్రం
**metropolis** మహానగరం, రాజధాని
**mezzanine finance** సహాయక రుణం
**mezzanine floor** రెండు అంతస్తుల మధ్య ఎత్తు తక్కువగా ఉండే మరో అంతస్తు
**micelle** జిగట పదార్థంలోని పరమాణువుల సమూహం
**micro** సూక్ష్మ. ~ *analysis* సూక్ష్మ విశ్లేషణం. ~ *film* సంక్షిప్తీకృత చిత్రం. ~ *wave* సూక్ష్మతరంగం
**microbiology** సూక్ష్మజీవశాస్త్రం
**microcephaly** లఘుశిరస్సు, చిన్నతల
**microcosm** సూక్ష్మజగత్తు, సూక్ష్మ ప్రపంచం
**microcyte** లఘుకణం
**microgenetic** సూక్ష్మజీవ సంబంధి
**micrology** సూక్ష్మ వస్తువుల అధ్యయనం
**micropsia** వస్తు పరిమాణాన్ని సరిగా గుర్తించలేకపోవడం
**microscope** సూక్ష్మదర్శిని. *electron* ~ విద్యుత్కణ సూక్ష్మదర్శిని
**microsurgery** సూక్ష్మదర్శినితో చేసే శస్త్ర చికిత్స
**micturition** మూత్రవిసర్జన
**middle management** మధ్యస్థాయి యాజమాన్యం
**midgut** మధ్యాంతర
**midriff** రొమ్మును, ఉదరాన్ని వేరుచేసే మాంసపు పొర
**midstream** నీటియేరు
**midterm poll** మధ్యంతర ఎన్నికలు
**midwife** మంత్రసాని
**midwifery** ప్రసూతివైద్యం
**mighty** శక్తిమంతమైన, ప్రబల
**migraine** శిరః పార్శ్వశూల, ఒపదలయేరు
**migrate** వలసపోవు, తరలిపోవు
**migration** వలస
**mil** శ్రేణి, వరుస
**mild** సౌమ్య, మృదుల. ~ *alkali* మృదుల క్షారం. ~ *steel* మెత్తని ఉక్కు
**mildew** బూడిద తెగులు, బూజు
**milestone** మైలురాయి, ముఖ్యమైన సంఘటన
**miliary** జొన్నగింజ వంటి
**milieu** సాంఘిక పరిసరాలు, పని పరిసరాలు, జీవన వాతావరణం



**militancy** సమరశీలత, రణప్రీతి
**militarism** సైనికవాదం
**military** సైన్యం, సేనా సంబంధి, సైనిక. ~ *alliance* సైనిక కూటమి. ~ *base* సైనిక స్థావరం. ~ *government* సైనిక ప్రభుత్వం. ~ *psychology* సేనా మనస్త త్వాధ్యయనం
**militia** పౌరసైన్యం
**milk** పాలు. *breast* ~ తల్లిపాలు. *humanized* ~ చనుబాలను పోలుపాలు. ~ *of lime* సున్నపు నీటి తేట
**milky way** పాలవెల్లి, పాలపుంత
**millets** చిరు ధాన్యాలు, మొక్కజొన్న
**million** పదిలక్షలు
**millipede** సహస్రపాది
**mime** మూకాభినయం (చేయు)
**mind** మనస్సు. ~ *blowing* ఆశ్చర్యాన్ని/ విభ్రమాన్ని కలిగించే. ~ *bogging* మనస్సును కలవరపరచే, అతిక్లిష్టమైన. *unsound* ~ చిత్త భ్రమణం
**mine** గని
**mineral** ఖనిజం, లోహం. ~ *chemistry* ఖనిజ రసాయన శాస్త్రం. ~ *salt* ఖనిజ లవణం
**minerology** ఖనిజ విజ్ఞాన శాస్త్రం
**mingle** కలియు, కలుపు
**mingled** మిశ్ర, మిశ్రిత
**miniature** సూక్ష్మ లఘుచిత్రం
**minima** కనిష్ఠాలు
**minimum** కనీసం, అతితక్కువ, కొద్దిపాటి. ~ *support price* కనీస మద్దతు ధర. ~ *wage* కనీస వేతనం
**minor arts** ఉపకళలు
**minorities** అల్పసంఖ్యాకులు
**minority group** అల్పసంఖ్యాక వర్గం
**mint** టంకసాల
**minth** పొదీనా ఆకు
**minus** మినహా (యింపు), తీసివేత, రుణం
**minuscule** చిన్నది, సూక్ష్మమైనది, స్వల్ప మైనది
**miracle** అద్భుతం, అలౌకికం, ఆశ్చర్య కరం, మాయ
**mirage** ఎండమావి, మరీచిక, కాల్పనిక వస్తువు
**mirror** అద్దం, దర్పణం
**misappropriate** దుర్వినియోగం చేయు
**misappropriation** దుర్వినియోగం
**miscarriage** గర్భ స్రావం/ పాతం, విఘాతం
**miscellaneous** ప్రకీర్ణ, వివిధ, చిల్లర, నానావిధమైన, సంకీర్ణ
**mischief** దుండగం, దుశ్చేష్ట, చేటుపని, హాని, అఘాతం, అపహాస్యం
**miscibility** మిశ్రణీయత
**miscible** మిశ్రణీయ
**misconception** భ్రమ, దురభిప్రాయం
**miscreant** దుండగుడు
**misdeed** దుశ్చర్య
**miser** పిసినారి
**miserliness** పిసినారితనం, పీనాసితనం
**miserly** లుబ్ధ, పిసినారి
**misfeasance** అపకార్యం, ఉల్లంఘన, అతిక్రమణ, అక్రమప్రవర్తన
**misfeasor** అపకారి, అక్రమవర్తి
**misfortune** గ్రహచారం, దురదృష్టం
**misgiving** అపోహ, అనుమానం
**mishap** దుర్ఘటన, జరగకూడనిది, దుస్సంఘటన
**misinterpret** తప్పుగా అర్థంచేసుకొను, వక్రభాష్యం చెప్పు
**mislead** తప్పుదారి పట్టించు
**misnomer** అపప్రయోగం, అపోహ, దురభిప్రాయం

**missing link** తప్పిన లంకె, మధ్యలో తప్పిన విషయం/ సమాచారం
**mist** మంచు
**mistake** పొరపాటు, నేరం
**mistrust** అపనమ్మకం
**mite** పురుగు. *itch* ~ గజ్జిపురుగు
**mitigate** ఉపశమనం కలిగించు, తగ్గించు
**mitral** ద్విపత్ర
**mixed bag** కలగూర గంప, రకరకాల మనుష్యుల స్వభావం, దృఢ సంకల్పం
**mixed constitution** మిశ్రమ రాజ్యాంగం
**mixed farming** మిశ్రవ్యవసాయం
**mixoscopia** ఇతరుల లైంగిక చర్యలను గమనించడంద్వారా ఉత్పన్నమయ్యే కోరిక
**mixture** మిశ్రమం
**mnemonic** ధారణానుకూలమైన, జ్ఞాపక శక్తికి సహాయపడు
**moan** మూలుగు
**mob** గుంపు, క్రమశిక్షణ పాటించని జన సమూహం, మూక
**mobbing** ఇతర జంతువులను భక్షించ డానికి చేసే వేధింపు
**mobile** చలనశీల, గమన, కదిలే, చలత్ శిల్పం. ~ *clinic* సంచార వైద్యశాల
**mobilisation** సమీకరణ, పోగుచేయడం
**mobocracy** మూకస్వామ్యం, మందిపాలన
**mock** పరిహసించు, ఎగతాళిచేయు, వెక్కి రించు
**mockery** అవహేళన, తిరస్కారంతో మాట్లాడటం, విజయవంతం కాని, విలువలేని
**mockingly** వెక్కిరింతగా
**model** మాదిరి, ప్రతిమ, నమూనా; వ్యాపార ప్రకటనలలో పాల్గొనే కళా కారిణి/ కళాకారుడు
**modelling** వ్యాపార ప్రకటనలకు నటించడం, చిత్రకారుని చిత్రాలకు నమూనాగా భంగిమలు ప్రదర్శించడం
**modello** వర్ణిక
**moderate** మితవాది, మితస్వభావం గల; స్నేహపూర్వకంగా చర్చించు/ పరిష్కరించు
**moderation** సమన్వయం, వివాదపరిష్కరణ
**modern** నవీన, ఆధునిక
**modernisation** ఆధునికీకరణ, నవీకరణ
**modernism** ఆధునికవాదం, కొత్తదనం
**modernist** ఆధునికతావాది, నవ్యతావాది
**modest** నమ్ర, నిగర్వి, సచ్ఛీల, వినత
**modesty** నిరహంకార, నమ్రత, బిడియం
**modification** మార్పు, రూపాంతరణం
**modus operandi** కార్యనిర్వహణ పద్ధతి
**mofussil** గ్రామీణ, నగరేతర, నగర పరిసర
**mohava seed** ఇప్పగింజ
**moiety** అర్ధం, సగం, అంశం, భాగం
**moist** ఆర్ద్ర, తడి, తేమ
**moisture** తడి, ఆర్ద్రత, చెమ్మ (గాలిలోని) తేమ
**moisturizer** తేమ కలిగించే
**molar formula** అణుసంకేతకం
**molar weight** అణుభారం
**molecular** అణు. ~ *biology* అణుజీవ శాస్త్రం. ~ *collision theory* అణ్వాభి ఘాత సిద్ధాంతం. ~ *composition* అణుసంఘటనం. ~ *configuration* అణువిన్యాసం. ~ *diffusion* అణు విస్త రణం. ~ *genetics* అణు జన్యుశాస్త్రం. ~ *heat* అణూష్ణత. ~ *physics* అణు భౌతికశాస్త్రం
**molecule** అణువు
**molest** అత్యాచారం చేయు, గేలిచేయు, తొందరపెట్టు



**mollify** శాంతపరచు, సమాధానపరచు
**molomitable** కఠినమైన, దృఢమైన, ఆచరణ సాధ్యంకాని
**moment** క్షణం, లిప్త
**momentary** క్షణిక, తాత్కాలిక, అస్థిర
**momentum** కదలిక, ద్రవ్యవేగం, గతి భారం, వేగ గతి
**monadism** చిదంశవాదం
**monarch** రాజు/ రాణి
**monarchy** రాచరికం
**money** డబ్బు, ద్రవ్యం. ~ *lender* వడ్డీ వ్యాపారి. ~ *spinner* పెద్దలాభాలను చేకూర్చే చిన్న అంశం
**monism** ఏకతావాదం
**monistic theory of sovereignty** ఏకసార్వభౌమాధికార సిద్ధాంతం
**monitor** పర్యవేక్షకుడు, బడిపెద్ద, ఇనప నౌక, విదేశీ కార్యక్రమ శ్రోత. *cardiac* ~ హృదయమాపకం
**monk** సన్యాసి
**mono** ఏక, ఒకే. ~ *acidic* ఏకామ్లక. ~ *atomic* ఏకపరమాణుక. ~ *basic* ఏకక్షారక. ~ *chromatic* ఏక వర్ణక. ~ *tropic* ఏకరూపక. ~ *tropy* ఏకరూపత. ~ *valent* ఏకసంయోజక
**monocentric** ఏకకేంద్రీకృత
**monochrome** ఏకవర్ణకం
**monocular** ఏకాక్షి
**monodrama** ఏకపాత్రాభినయం
**monogamous** ఏకభర్తృత్వం/ పత్నీత్వం
**monogram** సంక్షిప్తముద్ర
**monograph** ఏకవిషయక రచన
**monolith** ఏకశిల, ఏకాండ శిల్పం
**monologue** స్వగతం, ఏకభాషణ
**monomial** ఏకపదం
**monophagous** ఏకభక్షక
**monophthog** ఏకస్వరం
**monoplegia** ఏకాంగవాతం
**monopolised trade** గుత్తవ్యాపారం, ఏక స్వామ్య వ్యాపారం
**monopolist** గుత్తేదారు. ~ *competition* ఏకస్వామ్య స్పర్ధ
**monopoly** ఏకస్వామ్యం, గుత్తాధిపత్యం. ~ *capitalism* గుత్త పెట్టుబడిదారీ విధానం
**monopsony** ఏకస్వామ్యం
**monosaccharide** ఒకే కర్బన శృంఖలం గల చక్కెర
**monotheism** ఏకేశ్వరవాదం
**monotonous** ఒకే విధమైన, మార్పులేని
**monsoon** ఋతుపవనాలు
**mons pubis** కామపీఠం
**monstrous** విపరీతం, భయానక, రాక్షస, అసహజ
**montage** ప్రకీర్ణకం
**monument** కీర్తి స్తంభం, స్మారక (స్తంభ)ం
**monumental** స్మరణీయ, సముదాత్త
**mood** మనస్థితి, చిత్తవృత్తి, అర్థం, విధం
**moods** ప్రాకారాలు
**moongbean** పెసరపప్పు
**moonlight** వెన్నెల, జ్యోత్స్న
**mooring** లంగరు స్థానం, ఆశ్రయం
**mora** మాత్ర
**moraic metre** మాత్రాఛందస్సు
**moraine** హిమానీ మృత్తిక
**moral code** నైతిక నియమావళి
**morale** నైతిక స్థితి, ఉత్సాహం, ధైర్యం
**moral fibre** నిశ్చయ స్వభావం, నైతిక శక్తి
**moral intution** నైతికాంతర్బుద్ధి
**moralist** నీతివాది
**moral judgement** నైతిక నిర్ణయం
**moral obligation** నైతిక బాధ్యత

**moral saying** సూక్తి, నీతివాక్యం
**moratorium** రుణస్థగనం/ విరామం
**morbid** వ్యాధిగ్రస్తమైన
**morbidity** అనారోగ్య స్థితి, రోగవ్యాప్తి, వ్యాధిగ్రస్తత, వికారం, వికృతి
**morbidity rate** రోగాల సంఖ్య
**mores** ఆచారాలు, సంప్రదాయాలు, కట్టుబాట్లు
**moribund** మరణోన్ముఖ, చావుకు దగ్గర పడ్డ, జీవితం చివరి దశకు చేరబోతున్న
**moribunde** మృత్యున్ముఖమైన, అవసాన దశ
**morlify** అవమానించు
**moron** బుద్ధిహీనుడు, మూర్ఖుడు
**morose** బాధాకరమైన, కోపంగా ఉన్న
**morpheme** పదాంశం
**morphine** నల్లమందు, అభిని
**morphology** పదనిర్మాణ (శాస్త్రం)
**morphospecies** విలక్షణ జీవుల సమూహం
**mortal** మర్త్య, అనిత్య, మర్త్యుడు
**mortality** మృతుల సంఖ్య, మృత్యువు. *infant* ~ శిశుమరణాలు. *maternal* ~ ప్రసూతి మరణాలు
**mortgage** తాకట్టు, తనఖా, కుదువ, ఆడుమానం
**mortido** చావాలనే కోరిక
**mortification** అవమానానికి గురిచేయు, మనసు గాయపరచు
**mortuary** శవగృహం
**mosaic** పొడతెగలు, చిత్రాస్తరం. ~ *gold* మచ్చు బంగారం
**mosque** మసీదు, ముస్లిముల ప్రార్థనాస్థలం
**moss gold** శైవల స్వర్ణం
**most favoured nation** అధికాదృతజాతి మర్యాద

**motel** మార్గమధ్యంలో కారుతో సహా బస చేసే గృహం
**moth** చిమ్మట
**mother** అమ్మ, తల్లి. *expectant* ~ గర్భవతి. *lactative* ~ పాలిచ్చే తల్లి. ~ *liquor* మాతృద్రవం. ~ *pearl* శుక్తి గర్భం. ~ *tongue* మాతృభాష
**motherhood** మాతృత్వం
**moth-proof** క్రిమి నిరోధకం
**motif** వివిధ గాథల మూలాంశం
**motile** చలనం ఉన్న
**motility** చలనశీలత
**motion** గమనం, చలనం, గతి, తీర్మానం. *angular* ~ కోణీయ చలనం. *relative* ~ సాపేక్ష చలనం. *resulting* ~ ఫలిత చలనం
**motivation** ప్రేరణ, ప్రేరేపణ
**motivator** ప్రోత్సాహకుడు
**motive** అభిమతం, ఆశయం, అర్థం, ఉద్దేశం
**motor** ప్రేరక, చోదకయంత్రం
**mould** అనుకూలంగా మార్చు, మలచుకొను, నమూనా, మూస
**moulding** పరిష్కరణం, పోతపొయ్యడం
**mount** ఆరోహించు, అలంకరించు, అతికించు, పెరుగు, అధికమగు; వాహనం, కొండ
**mourn** ఏడ్చు, విచారించు, దుఃఖించు
**mouse** చుంచెలుక (కంప్యూటర్) చాలని
**mouth** నోరు. ~ *of the furnace* కొలిమి ముఖం. ~ *to mouth respiration* ముఖాముఖి శ్వాసక్రియ
**movable joints** కదిలే కీళ్ళు
**movable property** చరాస్తి
**muck** బురద, పేడ, ఎరువు. ~ *raking* బురద చల్లడం



**mucus** బంక; శ్లేష్మం
**mud** బురద, పంకం, రొంపి. ~ *flows* పంక ప్రవాహాలు. ~ *rock* గడ్డ కట్టిన బురద
**muff** తప్పులు చేయు
**mull** దీర్ఘంగా ఆలోచించు
**multi-accentuality** బహు సంకేతికత
**multi-culturalism** బహు సంస్కృతీ పరత్వం
**multi-discursive** అర్థవైవిధ్యం
**multifarious** బహువిధ, అనేక(ప్రకారక)
**multigravida** బహుప్రసూతి
**multi-lingual** బహుభాషీయ
**miltilingualism** బహుభాషీయత
**multinational** బహుళజాతీయ. ~ *corporation* బహుళజాతిసంస్థ, ~ *states* బహుళజాతి రాజ్యాలు
**multiparty system** బహురాజకీయ పక్ష విధానం
**multiple taxation** బహుళ శుల్క విధానం
**multiplex** బహు విభాగాలు/ ముఖాలు
**multiplice** గుణకం
**multiplicity** బహుళత్వం, అనేకత్వం
**multipurpose** బహుళప్రయోజక
**multivalent** బహుసంయోగ సమర్థ. ~ *vaccine* బహు ప్రయోజనకారి టీకాలు
**mum** మౌనం, నిశ్శబ్దంగా ఉండు
**mumbo jumbo** నిరర్థకం, నిర్హేతుకం, అసంబద్ధం
**mummification** మృతదేహాలను భద్రపరచటం
**mummy** ప్రాచీన మానవ కళేబరం. ~ *portraits* శవపేటికల మీది మూర్తి చిత్రాలు
**mumps** గవద బిళ్లలు

**munch** నములు
**mundane** ప్రాపంచిక, ఐహిక, లౌకిక
**munificent** దానశీల, ఉదార
**munsiff** న్యాయాధిపతి
**mural** కుడ్యచిత్రం. ~ *painting* కుడ్య చిత్రణ
**muriform** ఇటుకల గోడవలె
**murine** చుంచు (ఎలుక జాతి) లాంటి
**murk** చీకటి; దట్టమైన మంచు పొగ, మసక
**murky** చీకటిగా ఉండే, రోత పుట్టించే, మసకబారిన
**murmur** గుసగుస, గొణుగుడు. *cardiac* ~ హృదయం నుంచి పుట్టే అపక్రమ శబ్దం
**murmuring** నసుగుడు, గొణుగుడు
**muse** కవితాశక్తి, గాఢాలోచన, పరధ్యానంగా ఉండు
**mushroom** పుట్టగొడుగు, కొత్తగా ధనవంతుడైన వ్యక్తి, తాత్కాలిక, సాధారణ
**musicologist** సంగీతశాస్త్ర ప్రవీణుడు, కొత్తరాగాల సృష్టికర్త
**muskmelon** కర్బూజ
**muslin** దువ్వలువ, సూక్ష్మవస్త్రం
**musty** ముదిగిన, దుర్గంధపూరిత
**mutation** ఆకస్మిక పరివర్తనం, ఉత్పరివర్తన
**mutilate** వికృతీకరించు, ముక్కలు చేయు, ఖండించు, ఛిన్నభిన్నమైన
**mutilation** ఖండనం, విరూపణం
**mutiny** తిరుగుబాటు, పితూరీ, విద్రోహం
**myalgia** కండరాల నొప్పి
**myasthenia** కండరాల దుర్బలత్వం
**mycelium** శిలీంధ్రజాలం
**mycology** శిలీంధ్రశాస్త్రం
**myelitis** వెన్నుపాము నొప్పి
**myelography** వెన్నుపాము చిత్రణ

**myocarditis** గుండె కండరాల నొప్పి
**myocardium** గుండె కండరం
**myology** కండరశాస్త్రం
**myomectomy** గర్భాశయం నుంచి కణితి తొలగింపు
**myopathy** కండరాల జబ్బు
**myopia** హ్రస్వదృష్టి
**myosistis** కండరాల బాధ
**myriad** అనేక, పదివేల సంఖ్య
**myrobalan** కరక్కాయ
**mystery** మర్మం, రహస్యం, అద్భుతం
**mystical power** మహాత్మ్యం, మహత్తు
**mysticism** మార్మిక వాదం, అనుభూతి వాదం
**mystification** గూఢపరచటం, మభ్య పెట్టడం
**mystique** సంభ్రమకారిత్వం
**myth** కల్పితకథ, పురాణ గాథ
**mytheme** పురాణ గాథాంశం
**mythology** పురాణ గాథా సర్వస్వం
**mythopoeia** పురాణీకరణ
**myxoedema** సంజువంటి వ్యాధి

# N n

**nab** అదుపులోకి తీసుకొను, పట్టుకొను, చుట్టుముట్టు
**nabis** ప్రవక్తృ వర్గం
**nacre** ముత్యపు చిప్పలోని మెరిసే పొర; పూత
**nacreous pigment** ముత్యక్తా వర్ణదం
**nacrissism** స్వరూప/ ఆత్మకాముకత
**naevus** పుట్టుమచ్చ
**nag** చాడీలు చెప్పు, సాధించు, తప్పుపట్టు
**nagging** సాధింపు
**nail** గోరు. ~ *biting* గోళ్ళు కొరుక్కోవడం. ~ *ingrowing* వక్రనఖం, వంకరగోరు
**nailbed** గోరుకింద మెత్త(టిభాగం)
**nailing** మేకు కొట్టడం
**naive** కల్లాకపటం లేని, కుటిలం కాని, అయామక, సరళ
**naivete** ఆలోచనలలో, వేషధారణలలో అతి సామాన్యంగా ఉండడం, బోళాతనం
**naked debenture** హామీగా ఆస్తులను భద్రపర్చకపోవడం
**namby pamby** తేలికగా ఆవేశాలకు లోనయ్యే
**nanism** మరుగుజ్జుతనం
**nano metre** మీటరులో వెయ్యికోట్ల వంతు
**napalm** రసాయనికాయుధం
**nape** వెనుకభాగం
**narcissism** స్వయం ప్రేమ, స్వానురక్తి, స్వరూప కాముకత
**narcissist** స్వయంమోహితుడు
**narcoanalysis** నిద్రావస్థలో మానసిక చికిత్స చేయడం
**narcolepsy** నిద్రపోవాలనే బలమైన కోరిక
**narcomania** మత్తుపదార్థాలు సేవించాలనే కోరిక
**narcosis** మత్తు, సుషుప్తి
**narcotic** మత్తు మందు, మాదక ద్రవ్యం
**narcotization** మత్తెక్కించడం
**nares** నాసికా రంధ్రాలు, ముక్కుపుటాలు
**narratee** (ఊహా) శ్రోత
**narration** కథనం
**narrative** కథనాత్మకం, వర్ణనాత్మకం, వృత్తాంతం, కథ
**narratology** కథనాధ్యయనం
**narrator** కథకుడు, కథకురాలు
**narrow casting** పరిమితప్రసారం



**narrow market** సంకుచిత విపణి
**narrow transcription** సూక్ష్మలేఖనం
**nasal** ముక్కుకు సంబంధించిన; అనునాసిక(ం). ~ *bone* ముక్కు ఎముక. ~ *passages* నాసికా ద్వారాలు. ~ *septum* నాసికా విభాజకం
**nascent** ఆరంభం, సద్యోజాతం, నవజాత
**nasolabial** నాసికకూ పై పెదవికీ సంబంధించిన, నాసోష్ఠ సంబంధి
**nasolacrimal** నాసాశ్రు
**nasolacrimal duct** నాసాశ్రునాళం
**nasty** అసహ్యకర, నీచ, చీకాకుతో కూడిన
**natalist** జనాభా పెరుగుదలను ప్రోత్సహించే వ్యక్తి
**natality** జనన సూచి
**nation** జాతి, దేశం, ఒక దేశ పూజ
**national** జాతీయ. ~ *liberation movement* జాతీయ విమోచనోద్యమం. ~ *liberation struggle* జాతీయ విమోచన పోరాటం
**national accounting** జాతీయాదాయ గణనం
**national bank** జాతీయ బాంకు
**national bourgeoisie** జాతీయ బూర్జువా వర్గం
**national chauvinism** జాతీయ దురహంకారం, సంకుచిత జాతీయ భావం
**national debt** జాతీయ రుణం
**national democracy** జాతీయ ప్రజాస్వామ్యం
**national income** జాతీయాదాయం
**nationalisation** జాతీయీకరణం
**nationalise** జాతీయం చేయు: కేంద్ర ప్రభుత్వ నియంత్రణలోకి తెచ్చు
**nationalised bank** జాతీయం చేసిన బాంకు
**nationalism** జాతీయతావాదం
**nationality** జాతీయత
**national minorities** జాతీయాల్ప సంఖ్యాకులు
**national question** జాతుల సమస్య. ~ *socialism* జాతీయ సామ్యవాదం
**nation states** జాతి–రాజ్యాలు
**native country** జన్మభూమి
**native language** మాతృభాష
**nativity** దేశీయత, వాస్తవ్యత, జన్మ, జననం
**natter** పిచ్చాపాటీ
**natural** ప్రాకృతిక, సహజ, స్వభావసిద్ధ, జన్మసిద్ధమైన
**natural citizen** జన్మతః పౌరుడు
**natural hazard** ప్రకృతి వైపరీత్యం
**naturalism** సహజవాదం, ప్రకృతి వాదం
**naturalist** ప్రకృతి ధర్మవాది/ ప్రియుడు
**naturalistic fallacy** ప్రాకృతికాభాస
**naturalization** పౌర(స)త్వ ప్రదానం, సహజీకరణ, వాస్తవీకరణ
**natural law** ప్రకృతి సూత్రం
**natural manure** స్వాభావికపు/ స్వత సిద్ధంగా లభించే ఎరువు
**naturalness** స్వాభావికత
**natural philosophy** ప్రాకృతిక తత్త్వశాస్త్రం
**natural vegetation** సహజ వృక్ష సమూహం
**natural wastage** సహజనష్టం
**nature** ప్రకృతి, స్వభావం. ~ *conservation order* ప్రకృతి పరిరక్షణ చట్టం
**naturialism** ప్రకృతి వాదం, సహజాత వాదం

**naughty** కొంటె
**nausea** డోకు, వికారం, ఏహ్యాభావం, రోత
**nauseant** వికారం కలగజేసే
**navel** బొడ్డు, నాభి
**navicular** నౌకాకార
**naxalites** తీవ్రవాదులు, అతివాద కమ్యూనిస్టులు
**nazism** నాజీవాదం
**nearest** సత్వర, తక్షణ, అత్యంత సన్నిహిత
**near money** సులభంగా మారకం చేయ గలిగే ద్రవ్యసాధనాలు
**nearness** దగ్గరితనం, చుట్టరికం, సాన్ని హిత్యం
**nebula** నీహారిక, ఆకాశగంగ, నేత్రపటలం లోని నల్లమచ్చ
**nebulosity** మబ్బువలె ఉండడం
**nebulous** మబ్బులాంటి, నీహారిక వంటి, అస్పష్ట, ఆకారరహిత
**necessity** అవసరం, ఆవశ్యకం
**neck** గొంతుక, గ్రీవం, మెడ
**necromancy** మంత్రవిద్య, భూతవైద్యం
**necromania** శవాలపై విపరీత ఆకర్షణ
**necrophilia** శవమైథునం
**necrophiliac** మృతశరీర సంబంధం గల
**necrophobia** శవాలంటే భయం
**necrosis** ధాతు విచ్ఛిన్నత/ నిర్జీవత
**necrospermia** శుక్రంలో జీవకణ నిర్జీవత
**necrotic** నిర్జీవమైన
**necroscopy** *(autopsy)* శవ పరీక్ష
**nectar** అమృతం
**needle** సూది, సూచి. *hypodermic* ~ మందు సూది
**needling** కంటి శుక్లానికి సూదితో చేసే వైద్యం
**neem seed** వేప విత్తనం
**nefarious** క్రూరమైన, ఆటవికమైన, దారుణమైన, అనైతికమైన, చట్టవిరుద్ధ మైన
**negate** ఖండించు, తిరస్కరించు, నిషే ధించు
**negation** వ్యతిరేకించడం, నిరాకరణ, అభావం
**negationist** వ్యతిరేకవాది, విధ్వంసక విమర్శకుడు
**negative** ఋణాత్మకం, ఋణరాశి. ~ *charge* ఋణావేశం. ~ *deviation* ఋణ విచలనం. ~ *glow* ఋణ దీప్తి. ~ *ion* ఋణ అయాన్
**negatively** ఋణాత్మకంగా, వ్యతిరేకంగా
**negative phase** సాధారణ కార్యక్రమా లను కొనసాగించలేని సమయం
**negative term** అభావార్థక/వ్యతిరేకార్థక పదం
**negativism** వ్యతిరేకతత్త్వం
**negotiable** బదలాయించదగిన, మార్చ దగిన, వినిమయం చేయదగిన
**negotiable instrument** బదలాయించ దగిన పత్రం, అన్యాక్రాంతయోగ్య పత్రం
**negotiate** చర్చించు, సంప్రదించు, అమ్ము, బదిలీచేయు
**negotiating table** చర్చా వేదిక
**negotiation** అన్యాక్రాంతత్వం, సంప్ర దింపు, బదలాయింపు, వినిమయ విధానం
**negotiations** మంతనాలు, సంప్రదింపులు
**negotiator** చర్చలలో పాల్గొనే/ ప్రాతినిధ్యం వహించే వ్యక్తి
**neighing** (గుర్రపు) సకిలింత
**nematode** గోళక్రిమి
**neo** నవ
**neo-behaviorism** నూతన ప్రవర్తన వాదం



**neo-classical art** నవ్య ప్రామాణిక కళ
**neo-classicism** నవ్య ప్రామాణిక వాదం, నవీన సంప్రదాయవాదం
**neo-colonialism** నయా/ కొత్త వలస వాదం
**neo-expressionism** నవ్య విభావనవాదం
**neo-expressionist** నవ్య విభావనవాది
**neo-historicism** నవ్య చారిత్రకవాదం
**neo-humanism** నవ్యమానవవాదం
**neolithic** కొత్త రాతియుగానికి చెందిన. ~ *period* నవీన శిలాయుగం
**neologism** నూత్న పదసృష్టి
**neology** కొత్తపదాల సృష్టి
**neonatal** పుట్టిన మాసంలోపల
**neonate** నెల నిండని శిశువు. ~ *larvae* డింభకం, అప్పుడే పుట్టిన జీవి
**neophobia** కొత్త అంటే భయం
**neoplasm** కణితి
**neoplasticism** నవ కల్పనావాదం
**neorealism** నవ్యవాస్తవతావాదం
**neoteny** పెద్దవాళ్ళలోని అపరిపక్వ లక్ష ణాలు
**nephritis** మూత్రపిండ బాధ
**nephrogenic** మూత్రపిండజ (న్య)
**nephrolithiasis** మూత్రపిండంలో రాళ్ళు ఉండడం
**nephrolithotomy** మూత్రపిండాల నుంచి రాళ్లు తొలగించటం
**nephrology** మూత్రపిండ శాస్త్రం
**nephrosis** మూత్రపిండ వ్యాధి
**nephrostomy** మూత్రపిండాల ఛిద్రీకరణ
**nepotism** ఆశ్రిత పక్షపాతం, బంధు ప్రీతి
**nerve** నాడి. *afferent* ~ అభివాహినాడి. *automatic* ~ స్వయంచోదిత నాడి. *cranial* ~ కపాలనాడి. *motor* ~ ప్రేరక నాడి. ~ *deafness* నరాలు దెబ్బ తినడం వల్ల కలిగే చెముడు. *efferent* అపవాహినాడి ~ *grafting* నాడిని అంటుకట్టు. *parasympathetic* ~ పరానుభూతనాడి. *peripheral* ~ పరిధీయనాడి. *sensory* ~ స్పర్శనాడి. ~ *suture* నరాన్ని కుట్టి అతికించడం
**nerve gas** నాడీ వాయువు
**nervism** నాడీ నియంత్రణ వాదం
**nervous** నాడీ సంబంధమైన, ధైర్యంలేని
**nervously** అధైర్యంగా, భయంతో
**nervousness** అధైర్యస్థితి, నరాల బల హీనత
**nest** గూడు, గుంపు, సమూహం. *cell* ~ కణ సమూహం
**net** వల, నికరం. ~ *asset value (NAV)* నికర ఆస్తి విలువ. ~ *asset value per share* వాటా ఒక్కంటికి నికర ఆస్తి విలువ. ~ *book value* తరుగుదలను తీసివేయగా మిగిలిన విలువ. ~ *cash* నికర నగదు. ~ *expenditure* నికర వ్యయం. ~ *foreign investment* నికర విదేశీ పెట్టుబడి. ~ *gain* నికరలాభం. ~ *income* నికర ఆదాయం. ~ *loss* నికర నష్టం. ~ *national product* నికర జాతీయోత్పత్తి. ~ *price* నికర ధర. ~ *profit* నికర లాభం. ~ *revenue* నికర రాబడి. ~ *value* నికరమూల్యం. ~ *salary* నికర జీతం. ~ *weight* నికర బరువు. ~ *worth* నికర సంపత్తి. ~ *yield* నికర దిగుబడి
**network** జాలాకార వ్యవస్థ, యంత్రాంగం
**neural** నాడీ సంబంధమైన
**neuralgia** నాడీ సంబంధమైన నొప్పి
**neurasthenia** నరాల బలహీనత
**neurectomy** నాడీచ్ఛేదన
**neuritis** నాడీ బాధ. *alcoholic* ~ మద్య పానం వల్ల వచ్చే నాడీ బాధ. *diabetic* ~ మధుమేహం వల్ల వచ్చే నాడీ బాధ

**neuro** నాడీ సంబంధమైన
**neurogenesis** నరాల పెరుగుదలను వివరించటం
**neurologist** నాడీ శాస్త్ర నిపుణుడు
**neurology** నాడీ శాస్త్రం
**neuropathology** నాడీ (సంబంధ) వ్యాధి విజ్ఞాన శాస్త్రం
**neuropathy** నరాలవ్యాధి
**neurophysician** నాడీ శాస్త్ర వైద్యుడు
**neurosis** మనోదౌర్బల్యం. *anxiety* ~ మనోవ్యాకులత. *cardiac* ~ గుండెజబ్బు ఉందేమోనన్న చింత
**neuro-surgeon** నాడీ శస్త్రచికిత్సకుడు
**neurosurgery** నాడీ శస్త్ర చికిత్స
**neurosyphilis** నరాలకు సోకిన సవాయి వ్యాధి
**neurotic** మానసిక రోగి
**neurotransmitter** నాడీ ప్రసారిణి
**neutral** తటస్థ
**neutralisation** తటస్థీకరణం
**neutralism** తటస్థత
**neutrality** తాటస్థ్యం, నిష్పాక్షికత, ఉదాసీనత
**neutron** అణుసంబంధి
**nevus** పాలిపోవడం
**newborn** అప్పుడే పుట్టిన
**new class** నూతన వర్గం
**new criticism** నూత్న విమర్శ పద్ధతి
**new humanism** నవ్య మానవతా వాదం
**new international economic order** నూతన అంతర్జాతీయార్థిక వ్యవస్థ
**new left** నూతన వామపక్షం
**new objectivity** నవ్య స్వానుభవ వాదం
**news agency** వార్తా సంస్థ
**news agent** పత్రికా విక్రేత/ ప్రతినిధి
**news cast** ప్రసార కార్యక్రమం
**news caster** వార్తలు చదివే వ్యక్తి
**news conference** పత్రికా విలేఖరుల సమావేశం
**news copy** వార్తాప్రతి
**news flash** మెరుపు వార్త
**news letter** సమాచార పత్రం, వార్తాలేఖ
**newsman** విలేకరి
**newspaper** వార్తాపత్రిక
**newspaper man** ఒక పత్రిక తరఫున పనిచేసే విలేకరి/ ఫోటోగ్రాఫర్
**newsprint** పత్రికలువాడే నాణ్యత తక్కువ గల కాగితం
**newsreader** వార్తలు చదివే వ్యక్తి
**newsreel** వార్తాదర్శిని, వార్తాచిత్రం
**news release** పత్రికా ప్రకటన
**news room** వార్తలు సేకరించే, రాసే గది
**news stand** పత్రికలు విక్రయించే దుకాణం
**news values** ప్రసార మూల్యాలు, వార్తా ప్రమాణాలు
**newsworthy** ప్రచురణకు/ ప్రసారానికి యోగ్యమైన వార్త
**newsy** వార్తాభరిత
**new wave** కొత్త పోకడలు
**new world information order** నూతన ప్రపంచ సమాచార విధానం
**nexus** సంబంధం, సంపర్కం
**nib** పాళి, ములికి
**niche** (గోడ) గూడు; సముచిత స్థానం
**nictonasty** నిద్రలో కదిలికలు
**nidifugous** గూడు వదిలి పోయే చిన్న పక్షి
**nidus** నివాసం, ఉనికి పట్టు
**niger seed** వెర్రి/ గడ్డి నువ్వులు
**niggard** లోభి; చాలా చిన్నమొత్తంలో ఇచ్చే
**niggardly** లుబ్ధ, పిసినారి



**niggle** అముఖ్యం, విషయశ్రద్ధ
**night blindness** రేజీకటి
**nightmare** పీడకల
**night soil** మలం
**nihilism** శూన్యవాదం
**nimbus** దీప్తి మండలం, వర్షాకాల మేఘం
**nipple** చనుమొన
**nisi** తాత్కాలిక, లేకపోతే, లేని పక్షంలో
**nit** పేనుగుడ్డు
**nitre** సూరేకారం
**nival** మంచువల్ల సంభవించే భౌగోళిక మార్పులు
**nivation** గడ్డకట్టి కరిగిపోవడం
**nobb** (ధనిక) భూస్వామి
**nobble** అక్రమ పద్ధతిలో డబ్బు సంపాదించు
**nobility** ఉదాత్తత, కులీనత
**no confidence motion** అవిశ్వాస తీర్మానం/ విశ్వాస రాహిత్య తీర్మానం
**nocturnal** రాత్రి సంబంధి, నిశాచరి
**nod** అంగీకారం, సమ్మతి, తల ఊపడం
**node** తరంగంలో ఒక బిందువు; కణుపు
**nodule** బుడిపె
**noiety** ద్విశాఖ
**noise** రొద, శ్రుతికటువైన (ధ్వని, చప్పుడు), శబ్దాంతరాయం
**noiseless** నిశ్శబ్ద
**nomad** దేశదిమ్మరి, అస్థిరవాసి; పర్యటనశీల
**nomadism** దేశదిమ్మరి తనం
**no man's land** వివాదగ్రస్త భూమి, అధికారరహిత ప్రాంతం
**nomenclature** నామ(కరణ)పద్ధతి, నామనిర్దేశనం; పరిభాష, శబ్దావళి, నామావళి
**nominal** నామమాత్ర, స్వల్పమైన, చిన్న మొత్తం. ~ *account* నామమాత్రపు ఖాతా. ~ *capital* నామ మాత్ర మూల ధనం. ~ *ledger* నామమాత్రపు ఆవర్జా. ~ *partner* నామమాత్ర భాగస్వామి. ~ *price* నామమాత్రపు వెల. ~ *yield* నామమాత్రపు రాబడి
**nominalism** మిథ్యావాదం
**nominate** నియమించు, నియోగించు, ఎంపికచేయు
**nomination** నియోగం, అభ్యర్థిత్వం, నియామకం
**nominator** ఎంపిక చేసే/ సూచించే వ్యక్తి
**nominee** నియుక్తుడు, ప్రతినిధి
**nominee holding** కొనుగోలు చేసిన వాటాలను మరొకరి పేరుపై ఉంచడం
**nom de plume** కలంపేరు, మారుపేరు, గుప్తనామం
**non-acceptance** తిరస్కరించడం
**non-aligned countries** అలీన దేశాలు
**non-alignment** అలీన/ తటస్థ విధానం
**non-antogonistic contradiction** మైత్రీపూరిత వైరుధ్యం
**nonce word** సద్యఃకల్పిత పదం
**non-chalant** కంగారులేని, స్థిమితమైన
**non-coginzable offence** స్వల్పనేరం
**non-combatant** పోరాటంలో పాల్గొనని (సైనికుడు)
**non-conductor** అవాహకం
**non-cooperation** సహాయ నిరాకరణ, సహకార నిరాకరణ
**non-crystalline** అస్ఫాటిక
**non durables** ఎక్కువ కాలం మన్నిక ఉండని పదార్థాలు
**non elumene** నిర్వాసితప్రజలు వెదజల్ల బడినట్లుగా ఉన్న ప్రదేశాలు
**non-formal education** అనియతవిద్య
**non greasy** వసారహిత

**non-infective** సంక్రమించని
**non-intoxicating** మత్తు కలిగించని
**non-metal** అలోహం, అధాతువు
**non-metallic** అలోహ
**non-motile** కదలికలేని
**non-naturalistic theories** అప్రకృతి వాద సిద్ధాంతాలు
**non-negotiable** పరిష్కరించలేని, మార్చ లేని; మరొకరు నగదుగా మార్చుకోలేని
**non-objective** విషయాతీత, విషయ రహిత, వస్తురహిత
**non-performing assets** నికర నిరర్థక ఆస్తులు
**non-playing captain** పర్యవేక్షక సారథి
**non-poisonous** విషరహిత
**non-price competition** మూల్యేతర స్పర్థ
**non-radio active** రేడియో ధార్మికేతర
**non-representational** ప్రతికల్పనేతర
**non-resident** అస్థానిక, అవాస్తవ్య. ~ *indians* ప్రవాస భారతీయులు
**nonsense** అర్థరహిత
**nonsense verse** అర్థశూన్య పదం
**nonsocial** అసాంఘిక
**non-suit** వ్యాజ్యం దాఖలుచేసి ఆసక్తి చూపని వాదికి వ్యతిరేకమైన కోర్టు తీర్పు
**non-supporters of combustion** జ్వలన నిరోధక ద్రవ్యాలు
**non-verbal communication** భాషేతర సమాచార ప్రసారం
**non-volatile** అబాష్పశీల, అస్థిర, చంచల
**noose** ఉచ్చు, పాశం
**norm** సూత్రం, నియమం, కట్టుబాటు, ప్రమాణం
**normal** సామాన్య, సాధారణ, యథాస్థితి. ~ *pressure* సాధారణ పీడనం. ~ *temperature* సాధారణ ఉష్ణోగ్రత
**normative** ప్రమాణీకారక, అనుశాసనిక
**north pole** ఉత్తర ధ్రువం
**nose-dive** అనూహ్యంగా పతనమగు, అక స్మాత్తుగా తగ్గు
**nosology** వ్యాధి వర్గీకరణ శాస్త్రం
**nostalgia** ఇంటిధ్యాస; గతవ్యామోహం
**nostril** ముక్కురంధ్రం
**nostro-account** బాంకుకు విదేశాలలోని మరో బాంకులోగల ఖాతా
**nostrum** రహస్యౌషధం
**notable** గమనార్హ, పరిశీలించదగిన
**notation** సంజ్ఞీకరణ, సంకేతనం, స్వర కల్పనం, స్వరలిపి
**notch** గంటు, నరుకు
**notched up** సాధించు, సిద్ధింపచేసుకొను
**note**స్వరం, చిహ్నం, టీక, నివేదిక, (ఉద్దేశ) పత్రం
**note worthy** గమనార్హ, రాసుకోదగిన
**notice** గమనిక; గుర్తింపు ప్రకటన, సూచన పత్రం, హెచ్చరిక
**notification** అధికారిక ప్రకటన, అధి సూచన
**notified area** ప్రకటిత ప్రాంతం
**notify** సూచించు, ప్రకటించు, తెలియ జేయు
**notion** భావం, సంకల్పం, ఉద్దేశం
**notorious** అపఖ్యాతి పాలైన
**nought** శూన్యం; విఫలత
**nourishment** (పరి) పోషణ, ఆహారం, పుష్టి
**nouvean** కొత్త విద్యార్థి. ~ *realism* నవ్య వాస్తవికతా వాదం
**novation** కొత్త ఒప్పందం/ కరారు, నవీ యనం
**novel** నవల; కొత్త, విచిత్ర, ఇంతవరకూ తెలియని
**novelty** నూతనత్వం, వైచిత్రి



**novice** ఆరంభకుడు, అనుభవంలేని (వ్యక్తి)
**no-war pact** నిర్యుద్ధ సంధి
**noxious** అనారోగ్యకరమైన, హానికర, దూషిత
**nuance** స్వల్ప భేదం, అర్థచ్ఛాయాభేదం
**nub** ప్రాథమిక
**nuclear** కేంద్రక, కేంద్రీయ, పరమాణు సంబంధి. ~ *chain reaction* కేంద్రక శృంఖలా క్రియ. ~ *deterrence* అణ్వా యుధ నిరోధం/ భయనివారిణి. ~ *particle* కేంద్రక కణం. ~ *reactor* అణు రియాక్టర్. ~ *free zone* అణ్వస్త్ర రహిత మండలం
**nuclear house** వ్యష్టి కుటుంబం
**nucleus** కేంద్రకం, మధ్య భాగం
**nude** దిగంబర, నగ్న
**nugget** (బంగారు) ముద్ద
**null** శూన్యం; నిరర్థక, విఫల, నిష్ఫల
**null and void** చెల్లనేరని, పూర్తి నిష్ఫలం; శూన్యం
**nullify** రద్దుచేయు, నిర్వీర్యంచేయు, శూన్యీ కరించు
**nullity** రద్దు
**numb** స్పర్శరహితమైన
**number** అంకె, సంఖ్య; వచనం; ఎక్కువ, చాలా, లెక్కించు, కలుపు
**numbness** తిమ్మిరి
**numerator** లవం
**numerology** సంఖ్యా శాస్త్రం
**numismatology** ముద్రాశాస్త్రం
**nursery** శిశు సదనం. ~ *rhymes* పిల్లల పాటలు
**nurture** అభివృద్ధిపరచు, పోషణచేయు, బోధించు
**nut** విత్తనం, పోక; మర, తల; కఠినఫలం
**nutmeg** జాజికాయ
**nutrient** పోషక పదార్థం
**nutriment** పోషకాహారం
**nutrition** పోషణ (విజ్ఞానం)
**nutritionist** పోషణ విజ్ఞానవేత్త
**nutritious** పౌష్టిక, బలవర్ధకమైన
**nutshell** సూక్ష్మంగా, ఒక్కమాటలో
**nutter** పిచ్చివాడు
**nycology** బూజు గురించిన శాస్త్రీయాధ్య యనం
**nyctalopia** రేజీకటి
**nyctophobia** చీకటి అంటే భయం
**nymph** అప్సరస
**nymphomania** స్త్రీలలో అధిక కాముకత; లైంగికేచ్ఛ

## O o

**Oaf** తెలివి తక్కువ వ్యక్తి
**oak** సింధూర వృక్షం
**oak tag** ఓకు అట్ట
**oasis** ఎడారిలో నీటి చెలమ; పచ్చగడ్డి బీడు
**oath** ప్రమాణం, ఒట్టు
**obbligato** వాద్య సహకారం; ఏక వాద్యంతో గాయకుడికి సహకరించడం
**obcordate** విపరీత హృదయాకారం
**obduracy** దురాగ్రహం
**obdurate** దృఢమైన, కఠినమైన
**obedience** విధేయత, ఆజ్ఞానువర్తనం
**obedient** విధేయతగల, ఆజ్ఞానువర్తి అయిన
**obeisance** వందనం
**obelisk** స్మృతి, చిహ్నం
**obelus** పుస్తకాల్లో వాడే హంసపాదు గుర్తు
**obese** స్థూలమైన
**obesity** స్థూలకాయం

**obey** ఆజ్ఞ పాలించు; లొంగు
**obfuscate** మాంద్యం కలగచేయు, కలవరపరచు, అర్థం కాకుండా చేయు, మసకబరచు
**obit** మరణం
**obiter dictum** ప్రాస్తావికాంశాలు, ప్రాసంగిక కథనం
**obituary** సంస్మరణ, స్మృతి, మరణవార్త
**object** వస్తువు. ~ *lens* వస్తుకటకం
**objecte d'art** కళాభాజనం
**objection** అభ్యంతరం, ఆక్షేపణ
**objectionable** ఆక్షేపణీయమైన
**objective** వస్తునిష్ఠమైన, నిష్పాక్షిక, వాస్తవిక. ~ *art* వస్తు కళ
**objective correlative** బాహ్య సమాంతరత, నిష్పాక్షికంగా పోల్చతగిన అంశం/ సంఘటన
**objective lens** వస్తు కటకం
**objectivism** వాస్తవిక/ నిష్పాక్షిక దృక్పథం
**objectivity** నిష్పాక్షిక దృక్పథం, విషయైక దృష్టి, వస్త్వాశ్రయత
**objectless** ప్రేమరాహిత్యం
**object trouve** ప్రాప్త వస్తువు
**objuration** ఒట్టుపెట్టడం, ప్రమాణం చేయించటం
**objure** ఒట్టుకు కట్టుబడి ఉండు, ప్రమాణం చేయు
**oblanceolate** విపరీత శూలాకారం
**oblate** అంకిత భావంగల, చిత్తశుద్ధిగల; ఎదురెదురు దిశల్లో ఉబ్బి ఉన్న
**oblation** ఆహుతి, పిండదానం, అర్పణ; బలి, నైవేద్యం, ఆరాధన
**obligate** న్యాయ/ ధర్మ బద్ధం చేయు
**obligation** (ధర్మ) విధి, బాధ్యత
**obligatory** విధ్యుక్తమైన, ఉపకార బద్ధమైన, తప్పనిసరి అయిన, అనివార్యమైన. ~ *parasite* వైకల్పిక పరాన్న జీవి
**oblige** ఉపకారం చేయు; బలవంతపెట్టు, నిర్బంధించు
**obliging** సహాయకారి, మర్యాదపూర్వకమైన
**oblique** వక్ర, కుటిల, సూటిగాలేని, నింద, అపకీర్తి, అపవాదు; తిర్యక్, దాపల, కుటిల: కొంచెం ఎడమవైపుకు వాలి ఉండే అక్షర ముద్రాశైలి
**obliquity** వంకర, వంపు, కపట మనస్తత్వం. ~ *perspective* వామదృష్టి
**obliterate** నాశనంచేయు, ఆనవాలు లేకుండా చేయు, తుడిచివేయు, రద్దు చేయు
**obliterated** రూపుమాపిన
**obliteration** తుడిచివేత, చెరిపివేత
**oblivion** ఉపేక్షితావస్థ, విస్మృతి, మరుపు, తెరమరుగు, మరచిపోయే స్థితి
**oblivious** విస్మృతి కలిగించే, మరచే
**obliviscence** మతిమరుపు
**oblong** ఆయతాకార, దీర్ఘచతురస్రాకార
**obloquy** అపనింద, (ప్రజా) దూషణ
**obnoxious** గర్హ్యమైన, అసహ్యకరమైన
**obreption** అబద్ధంచెప్పి బహుమతి పొందడం/ పొందడానికి ప్రయత్నించడం
**obrune** కుక్కు, బలవంతంగా దూర్చు; చొచ్చుకుని వచ్చు
**obscene** అశ్లీల, అసభ్య
**obscenity** బూతు, అశ్లీలత, అసభ్యత
**obscurant** తిరోగమనం, ఛాందస
**obscurantism** ఛాందసత్వం, అభివృద్ధి నిరోధకత్వం
**obscurantist** తిరోగమనవాది
**obscure** అప్రసిద్ధ, నిగూఢ
**obscurity** ప్రాబల్యంలేని, ప్రాచుర్యంలేని, బోధపడని, అర్థం చేసుకోలేని, అస్పష్ట
**obsequies** అంత్యక్రియ, అపరకర్మ



**obsequious** అతివినయశీల
**observable** చూడదగిన, పరిశీలించదగిన
**observance** శ్రద్ధతో చూడడం; పాలన, ఆచరణ, పరీక్ష
**observant** శ్రద్ధతో చూసే, ఆచరించే
**observation** పరిశీలన, నిరీక్షణ. ~ *post* సైనికులు కాపలాకాసే స్థావరం
**observatory** నక్షత్ర వేధ శాల; వాతావరణ పరిశోధనాలయం
**obsess** కష్టం కలిగించు, పట్టి పీడించు
**obsession** పీడించడం, స్వీయభావావరోధం
**obsessive** మనసంతా నిండి ఉన్న, స్థిర భావంగల
**obsolescence** వ్యవహారదూరత, పురాతనత్వం
**obsolescent** నిరుపయోగమైన, కాలం చెల్లిన, అప్రచలిత
**obsolete** వ్యవహారభ్రష్ట, ఉపయోగించడానికి తగని
**obstacle** ఆటంకం, విఘ్నం, అవరోధం
**obstetric** ప్రసవ సంబంధమైన
**obstetrician** ప్రసూతి వైద్యుడు
**obstetrics** ప్రసూతి శాస్త్రం
**obstinacy** మొండిపట్టు, హఠం, దురాగ్రహం
**obstinate** జడ్డి; ముక్కుసూటిగా పోయే, మొండి
**obstreperous** జగడాలమారి
**obstruct** ఆటంకం కలిగించు, అభ్యంతర పెట్టు, అడ్డుపెట్టు
**obstruction** ఆటంకం, అవరోధం
**obtain** పొందు, సంపాదించు; గ్రహించు
**obtainable** పొందదగిన, దొరికే
**obtrusion** పిలవని పేరంటం, బలవంత ప్రవేశం, అవాంఛనీయ ధోరణిలో పలువురి దృష్టిని ఆకర్షించడం
**obtuse** మూఢ, మొద్దయిన, పదునులేని, కొనతేలని
**obtuse angle** గురుకోణం
**obverse** ముఖభాగం, ప్రతిలోమ
**obviate** పనికిరానిదిగా చేయు, నివారించు, తొలగించు
**obvious** ప్రత్యక్షమైన, స్పష్టమైన
**occasion** సమయం, సందర్భం, తరుణం, కారణం, సంగతి, సంఘటన
**occassional** అడపదడపా, అప్పుడప్పుడు
**occassionally** అప్పుడప్పుడు, కదాచిత్తుగా
**occident** పశ్చిమం, పాశ్చాత్య (దేశాలు)
**occidental** పాశ్చాత్య దేశాలకు సంబంధించిన, పశ్చిమ
**occiputal** తలవెనుక భాగానికి సంబంధించిన
**occiput** (శిరస్సు/ కపాలం) వెనుక భాగం
**occlusion** దారిమూయడం, రక్త నాళం మూసుకుపోవడం. *coronary* ~ గుండె రక్తనాళం లోపలి అడ్డు
**occular** నేత్ర సంబంధి
**occulist** నేత్రవైద్యుడు
**occulomotor** అక్షిచాలక, కనుగుడ్డును తిప్పే
**occult** గుప్త, గూఢ (విద్యలు), క్షుద్ర (విద్యలు)
**occultation** గోపనం, దాచటం
**occupancy** స్వాధీనత, ఆక్రమణ, భుక్తిదారు, భోగి, యజమాని
**occupant** నివాసి
**occupation** వృత్తి, ఉద్యోగం, పని, జీవిక
**occupational** వృత్తికి సంబంధించిన. ~ *culture* వృత్తి సంస్కృతి. ~ *diseases* వృత్తి (సంబంధమైన) వ్యాధులు. ~ *hazards* వృత్తిలో గల కష్ట నష్టాలు, వృత్తి వల్ల వచ్చే సమస్యలు

**occupier** కబ్జాదారు, ఆక్రమయిత, భూమిని సొంతం చేసుకున్నవాడు
**occupy** ఆక్రమించు, అనుభవంలో ఉంచుకొను; కాపురం ఉండు
**occur** తటస్థించు, సంభవించు, స్ఫురణకు వచ్చు, జరుగు
**occurrence** సంఘటన, ఉపస్థితి
**ocean** మహార్ణవం, మహాసముద్రం, సాగరం
**oceanic art** సాగరిక కళ
**oceanography** సాగర శాస్త్రం
**ocellus** అక్షిక, కటకం, కంటిలోని సూక్ష్మ కన్ను
**ochlocracy** ప్రజల వద్ద అధికారంగల ప్రభుత్వం
**ochre** గైరికం, ధాతురాగం
**octagon** అష్టభుజి, అష్టకోణి
**octavo** ఎనిమిది పుటల గ్రంథాకృతి
**octet** అష్టాంశాలు గల సమూహం
**octo** అష్ట
**octobarists** రష్యా కమ్యూనిస్టు పార్టీలోని సభ్యులు
**octogenarian** 80 సం॥ నుంచి 89 సం॥ మధ్య వయస్సు గల వ్యక్తి
**octopus** అష్టపది, అష్టదంతి
**octovdo** కాగితానికి ఎనిమిది పుటల చొప్పున గల
**octroi** రవాణా పన్ను, నగర సుంకం
**odalisque** రాజగణిక
**odd** విపరీతమైన, బేసి అయిన; చిల్లర
**odd even pricing** చిల్లర రూపంలో వేసే ధర (రూ. 99.95 లాగా)
**oddity** అపూర్వత, విషమత, అసాధారణ, విలక్షణత
**odd jobs** చిన్నా, చితకా ఉద్యోగాలు
**odd man out** సమూహంలో విభిన్నంగా ఉండే వ్యక్తి/ అంశం
**oddment** చవకగా అమ్మే వస్తువు, అసంపూర్ణ వస్తు సంచయంలో ఒక భాగం
**odds** హెచ్చు తగ్గులు; వ్యత్యాసం; విభేదం, విరోధం
**odds and ends** క్రమపద్ధతిలో లేని వస్తువుల సమూహం
**ode** పాట, భావగీతం
**odious** అసహ్యకరమైన
**odium** అసహ్యత, ద్వేషభావం
**odontography** దంతాల గురించిన అధ్యయనం
**odontology** దంతాల పెరుగుదల నిర్మాణం గురించిన అధ్యయనం
**odorant** గంధిలం, మంచి వాసన గల నూనె
**odorous** (సు)వాసన/ పరిమళం/ గంధిల
**odour** వాసన, సువాసన, పరిమళం
**odourless** నిర్గంధ, నిష్పరిమళ
**odyssey** సాహసయాత్ర, ఉత్కంఠభరితమైన ప్రయాణం
**oedema** నంజు, ఉబ్బరోగం. *nutritional* ~ పోషక పదార్థ లోపం వల్ల శరీరంలో నీరు చేరడం. *pulmonary* ~ ఊపిరితిత్తుల్లో నీరుచేరడం. *renal* ~ మూత్రపిండ వ్యాధి వల్ల శరీరంలో నీరు చేరడం
**oedipus complex** మగపిల్లలకు తల్లితో ఉండే అధికానుబంధం
**oesophageal** అన్నవాహిక సంబంధమైన
**oesophagitis** అన్ననాళ బాధ
**oesophagoscopy** అన్నవాహికాదర్శనం
**oestrogen** స్త్రీలలో ఉండే లైంగిక హార్మోన్
**oestrous** అత్యుత్సాహం, ఉన్మత్తత, క్షీరదాల్లో లైంగికేచ్ఛ
**offal** పనికిరానిది, చెత్త



**off beat** మూసకు భిన్నంగా ఉండే; అసాధారణ, ఆనవాయితీకి భిన్నమైన
**off-colour** తగ్గిన, అనుమానాస్పద
**offence** నేరం. *cognizable* ~ కేసు పెట్టదగిన నేరం
**offensive** ప్రమాదకారి, హానికర; కోపం పుట్టించే, అసహ్యమైన
**offer** ఇవ్వజూపు, అమ్మజూపు, అమ్మజూపిన వస్తువు ధర
**offering** సమర్పణ, నైవేద్యం; బలి; కానుక
**off hand** అనాలోచితంగా; అలవోకగా, త్వరగా
**office** కార్యాలయం, బాధ్యత, బాధ్యతాయుత స్థానం, పదవి. ~ *of fair trading* వాణిజ్య సంస్థలపై తనిఖీ నిర్వహించే ప్రభుత్వ శాఖ
**official** అధికారి; అధికారిక, శాసన సంబంధి
**officialdom** ఉద్యోగస్వామ్యం
**officialese** డొంకతిరుగుడు భాష, అధికారిక భాష
**officially** ఆధికారికంగా, ఉద్యోగరీత్యా
**official rate** ఆధికారిక ధర
**official receiver** వ్యవహారాలను పర్యవేక్షించేందుకు ఆధికారికంగా నియుక్తుడైన వ్యక్తి
**officiate** పదవి నిర్వహించు; ఒక ఉద్యోగికి బదులుగా పనిచేయు; పౌరోహిత్యం చేయు
**officious** అవాంఛిత/ అయాచిత సేవలందించే
**off line** కంప్యూటర్‌కు, డేటాబేస్‌కి నేరుగా జతపర్చని
**off market** స్టాక్ మార్కెట్ వెలుపల, ఎక్స్ఛేంజిల బయట
**off peak** వస్తు సేవలను ఇతర సమయాల్లో, సందర్భాల్లో కంటే తక్కువగా ఉపయోగించడం
**off scape** ఉపక్షితిజం
**off scouring** చెత్త
**off season** సంవత్సరంలో కొనుగోళ్ళు/ అమ్మకాలు/ వినియోగం/ తగ్గిపోయే కాలం
**off set** n. అధ్యస్తం: ఒక ముద్రణ రీతి
**off set** v. భర్తీచేయు, పూరించు, నష్ట పరిహారం చెల్లించు
**off shore** సముద్రపు ఒడ్డున
**off shore fund** విదేశాలలో పెట్టుబడి పెట్టే డబ్బు, అందుకోసం కూర్చే నిధి
**offspring** పిల్లలు, సంతానం
**off target** లక్ష్యాలను సాధించని
**off the cuff** ఆలోచన లేకుండా, అనధికారకంగా, సంశయించకుండా
**off the shelf** తయారైన, సిద్ధం చేసిన
**often** తరచుగా, పదే పదే
**ogee** అవగ్రాహికం
**ogive** కోణికం
**ogle** వాలుచూపు, మోహదృష్టి; క్రీగంట చూచు
**oil** నూనె, తైలం. ~ *black* తైల మషి. *castor* ~ ఆముదం. *codliver* ~ కాడ్ చేపనూనె. ~ *colours* తైల వర్ణాలు, నూనె రంగులు. ~ *cracking* తైల భంజనం. *euculyptus* ~ నీలగిరితైలం. *gingelli* ~ మంచినూనె, నువ్వులనూనె. *cake* ~ తెలకపిండి. ~ *of cloves* లవంగ తైలం. ~ *of turpentine* కర్పూర తైలసారం. ~ *of vitriol* సల్ఫ్యూరిక్ ఆమ్లం. ~ *paint* తైలప్రలేపం, నూనె పూత రంగు. ~ *painting* తైల చిత్రణ. ~ *primed* తైల లిప్త. ~ *soluble dyes* తైల ద్రావ్య రంగులు: నూనెలో మాత్రమే

కరిగే రంగులు. ~ *stain* తైల విలేపనం, నూనె మరక. ~ *stone* మెరుగురాయి. ~ *technology* తైల సాంకేతిక విజ్ఞానం. ~ *tempera* నూనె జిగురురంగు. ~ *varnish* నూనె వార్నీషు. *safflower* ~ కుసుమ నూనె. *sesame* ~ మంచి నూనె, నువ్వుల నూనె. *sun flower* ~ పొద్దు తిరుగుడు పువ్వు నూనె

**oiling out** వితైలీకరణ

**oil seed crops** నూనె గింజల పంటలు

**oil stuffs** నూనె దినుసులు

**ointment** పైపూత మందు, మలాం

**old** ముసలి, వయసు పైబడిన, పురాతన, జీర్ణ. ~ *world* ప్రాక్ దేశాలు, పూర్వార్ధ గోళం

**old master** ప్రాచార్యుడు

**old school tie** పాత విద్యార్థుల స్నేహ బంధం

**oleander** సతత హరితవృక్షం

**oleograph** తైల లేఖనం

**olifactory** వాసనగల, ఘ్రాణేంద్రియ సంబంధమైన

**oligarchy** అల్పజన పాలన

**oligophernia** అల్పశుక్రాణుత

**oligopoly** పరిమితస్వామ్యం, సాము దాయిక గుత్తవిధానం

**oliguria** అల్పమూత్రత

**olograph** స్వహస్త లేఖనం

**olpe** స్థాలిక

**oltremontam** కొండలకు ఆవలివారు

**olympiad** (ప్రాచీన గ్రీసులో) ఒలింపిక్స్ జరిగే ప్రదేశం; (వర్తమాన కాలంలో) వివిధ అంతర్జాతీయ పోటీలు

**olympian** ఒలింపిక్స్‌లో పాల్గొన్న ఆట గాడు

**olympics** ఒలింపిక్ క్రీడలు

**olympus** స్వర్గం; గ్రీకు దేవతల నిలయం

**ombrotrophic** వర్షపు నీటిపై ఆధారపడే

**ombudsman** స్వతంత్ర న్యాయాధికారి; తీర్పరి

**omen** శకునం

**ominuous** దుశ్శకునరూపమైన, అమంగళ కరమైన

**omit** వదిలిపెట్టు, విడిచిపెట్టు

**omnibus** పెద్దమోటారు బండి, పెద్ద బస్సు

**omnipotence** సర్వ శక్తిమంత

**omnipresence** సర్వవ్యాపి, సర్వాంతర్యామి

**omniscience** సర్వజ్ఞత

**omniscient** సర్వజ్ఞత్వం గల. ~ *person* సర్వజ్ఞుడు

**omnivore** సర్వభక్షకి

**omnivorous** సర్వభక్షక

**omophagia** పచ్చి ఆహారం తినడం

**on account** తరువాత చెల్లించే

**on average** సాధారణంగా, సరాసరిన, సగటున

**oncogenic** కంతులు ఏర్పడడానికి అను వైన

**oncology** కేన్సర్ అధ్యయనం

**on cost** ఉత్పాదనకు అవసరమైన (పెట్టు బడి)

**on demand** సమర్పించిన వెంటనే అనుమ తించాల్సిన వినిమయబిల్లు

**oneitric** స్వాప్నిక

**one man show** వ్యష్టి ప్రదర్శన; ఏక పాత్రాభినయం

**oneness** అఖండత్వం

**onerous** కష్టసాధ్యమైన, దుర్భర, అసాధ్య

**oneself** తాను; తనను

**on-lending** ఒకర్నుండి తెచ్చుకున్న డబ్బు మరొకరికి బదులిచ్చు

**on-line** నేరుగా జతపర్చిన



**onlookers** ప్రేక్షక జనం/ లోకం

**on offer** అమ్మకానికి

**onomasiology** పేర్ల విశేషార్థాల అధ్య యనం

**onomastic** స్థలనామాల అధ్యయనం

**onomastology** పేర్ల అర్థాల ఆధారాల అధ్యయనం శాస్త్రం

**onomatopoeia** ధ్వన్యనుకరణ

**on par with** సాటిగా

**onset** పైబడడం; రాక, ఆరంభం

**onslaught** (ఎదురు) దాడి

**on target** లక్ష్యాలను సాధించే

**ontogenesis** జీవుల పుట్టుక

**ontogeny** జీవి పెరుగుదల

**ontology** ఉనికి, అస్తిత్వం

**onus** బాధ్యత, బరువు, కర్తవ్యం

**onyse marble** గోమేధక చంద్రశిల

**oocyte** మాతృజీవకణం

**oogamy** అండ సంయోగం

**oogenesis** అండోత్పత్తి

**oology** పక్షుల గుడ్లను గురించిన అధ్య యనం

**oomph** శక్తిమంతమైన, బలశాలి, మోహం రేకెత్తించే

**oopherectomy** అండకోశాలు తీసేయడం

**ooze** ఊరడం, కారడం, కురియడం

**oozing** నిర్గళనం

**oozy** కారే, స్రవించే

**opacifier** కాంతిరోధకి

**opacity** అపారదర్శకత, అస్వచ్ఛత

**opalescence** మెరుపు, స్ఫటికాకృతి

**opalescent** మెరిసే, తెల్లరాయిలాగున్న

**opaque** కాంతి నిరోధక, అపారదర్శక

**opaque meal** అపారదర్శకంగా ఉండే ప్రయోగపదార్థం

**opaque projector** కాంతి భేద్య ప్రక్షేపకం

**open** బహిరంగ, దాపరికం లేని

**open-and-shut** స్పష్టమైన, సులభసాధ్య

**open class system** వ్యక్తి తన ఇష్టాను సారం తన సాంఘిక స్థితిని మార్చుకొనే వీలుగల వ్యవస్థ

**open construction** విస్తరణీయ నిర్మాణం

**open door policy** స్వేచ్ఛా వ్యాపార విధానం

**open market** స్వేచ్ఛా విపణి

**open system** వివృత విధానం

**open up** విదేశీ పెట్టుబడుల కోసం, విదేశీ కంపెనీల కోసం తలుపులు తెరవడం

**operating profit** నిర్వహణలాభం

**operation** శస్త్ర చికిత్స. *sterilisation* ~ పిల్లలు పుట్టకుండా శస్త్ర చికిత్స, నాకా బందీ

**operation flood** పాలవెల్లువ

**operative** కార్మికుడు, కూలి; ఆచర ణాత్మక, పనిచేసే

**operative portion** కీలకాంశం

**ophidiphobia** పాములంటే భయం

**opinion leader** భావసారథి

**opium** నల్లమందు

**opponent** ప్రతికూలుడు, ప్రతిద్వంద్వి, ప్రతిరోధి, ప్రతిస్పర్ధి

**opportunism** అవకాశవాదం

**opportunist** అవకాశవాది

**opportunity** అవకాశం, తరుణం

**oppose** అడ్డుచెప్పు, వ్యతిరేకించు, తిరస్క రించు

**opposer** వ్యతిరేకించే, తిరస్కరించే

**opposite** అభిముఖంగా, ఎదురెదురుగా

**opposition** ప్రతిపక్షం

**oppress** అణచివేయు, అణగదొక్కు

**oppressed** దళితులు, పీడితులు

**oppression** అణచివేత

**oppressive** అణచివేసే; భారమైన
**oppressor** అణిచివేతదారు, బాధకుడు, పీడకుడు
**opprobrious** నిందాత్మక
**opprobrium** అపకీర్తి, నింద
**oppugn** వాదనతో తిరస్కరించు, వ్యతిరేకించు
**oppugnant** వ్యతిరేకించే, తిరస్కరించే
**opsomania** ప్రత్యేక ఆహార పదార్థాలు తినాలనే కోరిక
**opt** ఎన్నుకొను, కోరుకొను, సమ్మతించు
**opthalmia** కంటినొప్పి
**opthalmic** నేత్రసంబంధమైన
**opthalmologist** నేత్ర వైద్య నిపుణుడు
**opthalmology** నేత్రవైద్య (శాస్త్రం)
**opthalmoscopy** నేత్రదర్శనం
**opthlmoscope (fundoscope)** నేత్ర దర్శిని
**optic** నేత్ర సంబంధమైన. ~ *nerve* దృక్ నాడి
**optical** ప్రకాశం, దృశా, కాంతీయ, ధ్రువణ. ~ *activity* ధ్రువణ భ్రమణత. ~ *inversion* ధ్రువణ విలోమనం. ~ *isomerism* ధ్రువణ సాదృశ్యం. ~ *microscope* ప్రత్యక్ష కాంతిపై ఆధారపడి పనిచేసే సూక్ష్మదర్శిని. ~ *properties* ప్రకాశ ధర్మాలు. ~ *telescope* సాధారణ ఖగోళ దర్శిని
**optical illusion art** దృగాభాస కళ
**optician** నేత్ర చికిత్సకుడు, దృష్టి నిపుణుడు, కళ్లజోళ్ళు అమ్మే వ్యక్తి
**optics** కాంతి శాస్త్రం, దృశాశాస్త్రం
**optima** సర్వోత్తమానుకూలాంశాలు
**optimum** అభిలషణీయమైన, వాంఛనీయ, సర్వోత్కృష్ట, గరిష్ఠ. ~ *output* అభిలషణీయమైన ఉత్పత్తి
**option** ఐచ్ఛికం, అభిమతం. ~ *to purchase* తక్కువ ధరకు కొనుక్కునే సౌలభ్యం
**optional** ఐచ్ఛిక, వైకల్పిక. ~ *money* ఐచ్ఛిక ద్రవ్యం
**opulent** సంపన్నమైన
**opuntia** బ్రహ్మజెముడు
**opus** స్వరకల్పన, (సంగీత) రచన
**oracle** దైవవాణి, దైవవాక్యం; ఆకాశవాణి, సోదె
**oral** మౌఖిక, వాచిక, మూజువాణీ, నోటి మాటగా
**orality** మౌఖికత, మౌఖిక సంస్కృతి
**oral tradition** మౌఖిక సంప్రదాయం
**orange book** నెదర్లాండ్స్ ప్రభుత్వ ప్రచురణ/ నివేదిక
**orant** ప్రార్థనా శిల్పం
**oration** గంభీరోపన్యాసం, వక్తృత్వం
**orator** వక్త, మహోపన్యాసకుడు
**oratorical** ఉపన్యాసధోరణి గల, ఆలంకారిక
**oratory** ప్రసంగ పటిమ, వక్తృత్వం, వాగ్ధాటి
**orb** వృత్తం, వలయం, గుండ్రంగా ఉండే నిర్మాణం, కంటిపాప
**orbit** కక్ష్య, గ్రహగతి, నేత్ర కుహరం
**orbital** కక్షీయ. ~ *motion* కక్షీయ గమనం. ~ *velocity* కక్షీయ వేగం
**orchard** ఫలోద్యానం
**orchestra** వాద్య బృందం/ సమ్మేళనం
**orchidectomy** వృషణచ్ఛేదన
**orchitis** వృషణాల వాపు
**ordain** అమర్చు; ఆజ్ఞాపించు; అన్వయించు; నియోగించు, దీక్ష ఇచ్చు
**ordeal** విషమపరీక్ష; కత్తిమీద సాము, దివ్య పరీక్ష



**order** n. వ్యవస్థ, స్థాయి, హోదా, ప్రకారం, తాఖీదు, ఉత్తరువు, ఆజ్ఞ, ఆదేశం; వరస క్రమం. ~ *of architecture* వాస్తు సంప్రదాయం
**order** v. ఆదేశించు, ఆజ్ఞాపించు, ఉత్తరువు చేయు. ~ *of the day* ఆనవాయితీ, ప్రస్తుతం అమలులో/ చెలామణిలో ఉన్న. *out of* ~ పనిచేయని, చెలామణిలో లేని, కాలదోషం పట్టిన. *standing* ~ చెలామణిలో ఉన్న స్థాయీ ఆదేశం
**orderliness** సక్రమత, క్రమబద్ధత
**orderly** సక్రమ, సువ్యస్థిత; జవాను, బంట్రోతు, ఆస్పత్రిలో సేవకుడు
**ordinal number** క్రమసంఖ్య, సార్వనామిక విశేషణం
**ordinance** అత్యవసరాదేశం, అధికార శాసనం
**ordinary share** సాధారణ వాటా
**ordinate** ద్వితీయ నిరూపకం
**ordure** మలిన, అపరిశుభ్ర
**ore** ముడిఖనిజం, ధాతువు. *mineral* ~ నిజధాతువు. ~ *dressing* ధాతుశుద్ధి. *refractory* ~ దుర్గలనీయ ధాతువు
**organ** అవయవం, సంస్థా (ప్రచార) పత్రిక
**organelle** కణాంగం
**organic** కర్బన సంబంధమైన, సేంద్రీయ, జీవసంబంధి. ~ *acid* వృక్షసంబంధామ్లం. ~ *architecture* సావయవ వాస్తురీతి. ~ *chemistry* కర్బన/ సేంద్రియ రసాయన శాస్త్రం. ~ *compound* కార్బనిక/ సేంద్రిక సమ్మేళనం. ~ *evolution* జీవపరిణామం. ~ *form* సజీవరూపం, జీవద్రూపం. ~ *manure* సేంద్రీయ ఎరువు. ~ *matter* జీవ/ సేంద్రియ పదార్థం. ~ *soil* సారవంతమైన నేల. ~ *theory of state* ఆంగిక రాజ్యసిద్ధాంతం
**organicism** అంగిక వాదం
**organisation** సంస్థ, సంఘం; వ్యవస్థ, శాఖల సమూహం
**organism** జీవి, ప్రాణి, సంఘటిత శరీరం
**organizer** నిర్వాహకుడు, వ్యవస్థాపకుడు
**organogenesis** అంగాభివృద్ధి
**organography** అవయవ (భాగ) వర్ణన
**organometallic** కార్బనిక లోహం
**organotherapy** అవయవ చికిత్స
**orgasm** భావప్రాప్తి
**orgiastic** అత్యానందంగల
**orgy** ఉన్మత్తోత్సవం; తాగిన మైకంతో చేసే రభస; భావవేశం, ప్రేలాపన
**orient** తూర్పు, ప్రాచి, పూర్వ; ప్రాగభిముఖంగా బయలుదేరు; దిక్సూచికి అనుగుణంగా అమరు; అవగతం చేసుకొను
**oriental** ప్రాచ్య, ప్రాచ్య దేశాలకు సంబంధించిన
**orientalizing period** ప్రాచ్య ప్రభావ యుగం
**orientation** దిగ్విన్యాసం, ధోరణి, నేపథ్య దృష్టి
**orifice** ద్వారం, రంధ్రం, బెజ్జం, కన్నం
**origami** కాగితపు అలంకరణ పద్ధతి
**origin** ఆరంభం, పుట్టుక, జన్మ; వంశం; ఉత్పత్తి
**original** అసలు, ఆది, మొదటి, ప్రాథమిక, మౌలిక. ~ *goods* మౌలిక వస్తువులు
**originality** మౌలికత, సహజత్వం
**originate** ఆవిర్భవించు, పుట్టు, పునాది వేయు, కల్పించు
**orisom** ప్రార్థన
**orlop** ఓడలోని కింది అంతస్తు
**ornament** నగ, ఆభరణం
**ornamental** అలంకారార్థమైన, అలంకార ప్రాయమైన

**ornate** అలంకృతమైన
**ornithologist** పక్షి శాస్త్రజ్ఞుడు
**ornithology** పక్షి శాస్త్రం
**orogenital** ముఖ జననేంద్రియ
**orography** పర్వత వర్ణన
**orology** పర్వతాధ్యయనం
**orphan** అనాథ
**orphanage** అనాథాశ్రమం, అనాథ శరణాలయం
**orphism** గూఢవాదం
**orthodontist** దంతవైద్యుడు
**orthodontia** దంతలోపాల సవరణ
**orthodox** సాంప్రదాయకమైన, స్వతంత్ర యోచనలేని, పూర్వాచారపరాయణమైన; మూఢ; ఛాందస
**orthodoxy** పూర్వాచార పరాయణత్వం; శాస్త్రసమ్మతి, ఛాందసత్వం
**orthoepy** శుద్ధోచ్చారణకు సంబంధించిన శాస్త్రం
**orthogenesis** స్వాభావిక జీవోత్పత్తి పరిణామ(క్రమ)ం
**orthogonal** లంబకోణీయ(ం)
**orthography** లేఖన శాస్త్రం
**orthopaedic** శల్యవైద్యుడు, శల్య వైద్య సంబంధి
**orthopaedics** శల్యవైద్యం, ఎముకలకూ వేళ్లకూ సంబంధించిన వైద్యం
**orthopterary** బొద్దింకలకు చెందిన క్రమం
**orthoptics** వ్యాయామం ద్వారా నేత్ర లోపాలను సరిచేసే విధానం
**orthoscopic** సక్రమదృష్టిగల
**orthotics** బలహీనమైన, కీళ్ళకూ కండరాలకూ కృత్రిమ సాధనాల ద్వారా ఊతం ఇచ్చే వైద్య విధానం
**orthotropism** గురుత్వానువర్తనం

**oryctology** శిలావశేషాధ్యయనం
**os** ద్వారం, రంధ్రం, ఎముక. *external* ~ గర్భాశయ బాహ్యద్వారం. *internal* ~ గర్భాశయ అంతరద్వారం
**oscillate** ఊగిసలాడు, తిరుగు, అల్లాడు
**oscillation** ఊగులాట, డోలనం
**oscillator** డోలకం
**oscitation** ఆవులింత
**osculant** ముద్దాడడం, చుంబనం; సన్నిహితంగా ఉండే; రెండు జాతుల/ ప్రజాతుల మధ్య అనుసంధానంగా ఉండే జీవి
**osmometer** ద్రవాభిసరణ మాపకం
**osmosis** ద్రవాభిసరణ
**osseous** ఎముకలకు సంబంధించిన
**ossicle** చిన్న ఎముక. *ear* ~ చెవిలోని చిన్న ఎముకలు
**ossification** అస్థీకరణ, ఎముకలా గట్టిపడటం, జడత్వం; అభివృద్ధిని, మార్పుని నిరోధించే స్థితి
**ossify** ఎముకగా మారు/ మార్చు, గట్టిపరచు
**osteitis** ఎముకలబాధ
**ostensible** ప్రకట, బాహ్య, ప్రత్యక్ష, కనిపించే, విదిత
**ostentation** ఆడంబర ప్రదర్శన; అట్టహాసం, డంబం
**ostentatious** డాబుసరి, ప్రదర్శనాత్మక
**osteoarthritis** ఎముకల, కీళ్ళ బాధ
**osteocyte** అస్థికణం
**osteology** శల్యశాస్త్రం: ఎముకల అధ్యయనం
**osteomalacia** అస్థిమృదుత్వం, ఎముకలు మెత్తబడే వ్యాధి
**osteomyelitis** అస్థిమధ్యబాధ
**osteopath** మర్దన వైద్యం చేసే వ్యక్తి
**osteoporosis** బోలు ఎముకల వ్యాధి, ఎముకలు గుల్లబారే వ్యాధి



**osteosclerosis** అస్థికాఠిన్యం
**osteotome** అస్థివిచ్ఛేదక పరికరం
**osteotomy** అస్థివిచ్ఛేదన
**ostium** రంధ్రం, ద్వారం
**ostracism** (దేశ) బహిష్కరణ, వెలి
**ostracize** బహిష్కరించు, వెలివేయు
**ostrich** నిప్పుకోడి, ఉష్ట్రపక్షి
**otherness** భిన్నత్వం
**otic** చెవికి సంబంధించిన
**otitis** చెవిపోటు. *external* ~ వెలుపలి చెవి బాధ. *internal*~ లోపలి చెవి బాధ
**otolaryngologist** చెవి, గొంతు వైద్య నిపుణుడు
**otologist** కర్ణవైద్యుడు
**otology** కర్ణవైద్య (శాస్త్ర)ం
**otorhinolaryngology** చెవి, ముక్కు గొంతులకు సంబంధించిన శాస్త్రం
**otoscope** కర్ణదర్శిని
**ottorrhoea** చెవినుంచి ద్రవం కారడం
**ouch** ఉంగరపు గూడు, బాధను వ్యక్తీకరించు
**ounce** పౌనులో పదహారోవంతు
**oust** ఉద్యోగం నుంచి తీసివేయు
**out** బయట, వెలుపల, పూర్తిగా, బయటి, మించిన. ~ *and out* బాహాటమైన, బాహాటంగా
**outbid** వేలంలో పైపాట పాడు
**outbreak** అకస్మాత్తుగా చెలరేగడం, అకస్మాత్తుగా చెలరేగే
**outburst** బద్దలవడం, పేలడం, పగలడం
**outcast** బహిష్కృతుడు, వెలివేతకు గురైన వ్యక్తి, కులభ్రష్టుడు
**outcome** ఫలితం, పర్యవసానం, పరిణామం
**outcry** పెద్ద కేక, అరుపు
**outdated** కాల దోషం పట్టిన

**outdo** మించు, అతిశయించు
**outer** బాహ్య, వెలుపలి
**outermost** బాగా దూరంగా ఉన్న
**outermost orbit** బాహ్యతమ కక్ష్య
**outer orbit** బాహ్యకక్ష్య
**outface** చూపులతో ఎదిరించు
**outfit** సరంజామా; దుస్తులు; సంస్థ; ముఠా, బృందం
**outgo** మించు, మీరు
**outgrow** విపరీతంగా పెరుగు
**outgrowth** బాహ్యవృద్ధి, కొమ్మ, శాఖ; పరిణామం
**outgun** మెరుగైన ఆయుధ సంపత్తితో ఓడించు
**outhouse** ఆవరణలోని చిన్న ఇల్లు
**outing** విహారం, వాహ్యాళి
**outlandish** అసాధారణమైన, వింతైన, విదేశీ
**outlast** ఎక్కువ కాలం మన్ను
**outlaw** బహిష్కృతుడు; బహిష్కరించు
**outlawed** చట్టపరంగాని, బహిష్కృత
**outlay** పెట్టుబడి, (ఉత్పాదక) వ్యయం, ఖర్చు
**outlet** బయిటకు దారి, వ్యక్తీకరణ మార్గం, దుకాణం
**outlie** అబద్ధాలు చెప్పడంలో రాటుదేలటం
**outline drawing** బాహ్య (రేఖా) లేఖనం
**outlive** నిర్ణీతవ్యవధి కన్నా ఎక్కువకాలం/ పనిచేయు/ జీవించు
**outlook** బాహ్యదృష్టి; దృక్పథం, వైఖరి
**outlying** దూరంగా ఉండే, హద్దుల ఆవలి
**outmanoeuvre** అధిగమించు, ఎత్తుకు పై ఎత్తు వేయు
**outmoded** పనికిమాలిన; కాలం చెల్లిన
**outmove** అతి వేగంగా పయనించు
**outnumber** సంఖ్యలో పెరుగు

**outogeny** వ్యక్తి చరిత్ర, ప్రాణి అభివృద్ధి వృత్తాంతం
**outpatient** ఆసుపత్రిలో చేరకుండా చికిత్స చేయించుకుని పోయేరోగి
**outpost** పోలీసు ఠాణా/ సైనిక స్థావరం, గడి కావలి
**outpouring** భావపరంపర, తీవ్రప్రవాహం
**output** ఉత్పాదన, ఉత్పత్తి పరిమాణం; నిర్గమం
**outrage** n. దౌర్జన్యం, దుర్మార్గం, అత్యాచారం, అవమానం, బలాత్కారం, దురంతం, దురాగతం
**outrage** v. దౌర్జన్యం చేయు, అవమానించు, అత్యాచారం చేయు, బలాత్కరించు, కోపం తెప్పించు
**outrageous** మితిమీరిన, అసాధారణమైన, హానికరమైన; సిగ్గు తీసే
**outreach** మించిపోవు, వ్యాపించు
**outright** పూర్తిగా, తక్షణమే
**outsell** ఎక్కువ ధరకు అమ్ము; విలువ పెరుగు; అమ్మకాలు పెరుగు
**outset** ప్రారంభం, ఉపక్రమం, ఆది
**outshine** మితిమీరి ప్రకాశించు
**outsize** సాధారణ ఆకారాల కన్నా పెద్దగా ఉన్న
**outskirt** శివారు, పొలిమేర, పరిసర ప్రదేశం
**outspoken** నిష్కపటంగా మాట్లాడే
**outspread** పరచుకొను, వ్యాపించు, ఆక్రమించు
**outstand** తట్టుకొను
**outstanding** చెల్లించవలసిన, మిగిలిన, విశిష్ట, గొప్ప. ~ *dues* బకాయిలు
**outstay** నియమిత కాలం కన్నా ఎక్కువ కాలం ఉండడం
**outstep** దాటు, అధిగమించు
**outstretch** విప్పారు
**outstrip** అతిక్రమించు, పరిగెత్తు, పారిపోవు
**outturn** ఉత్పత్తి, పని
**outward** బయటి, వెలుపలి; బయటికి
**outweigh** మించు, ఎక్కువగా తూగు, బరువులో ఎక్కువగు
**outwit** ఎత్తుకు పైఎత్తువేయు, మోసగించు
**outworn** చిరిగిన, క్షీణించిన, జీర్ణమయిన
**oval** అండాకారమైన, గోళాకార
**ovary** అండాశయం, స్త్రీ బీజకోశం
**ovation** పొగడ్త; విజయం
**oven** ఆవం, పొయ్యి, బట్టీ, పెనం
**over** ఉపరి, మీది, బయటికి, ముందుకు, ఎత్తైన, పై, ఎక్కువ మిగులు; క్రికెట్‌లో బౌలర్‌వేసే ఆరు బంతులు ఓ ఓవర్
**overaction** విపరీత ప్రవర్తన, అతినటన
**overactive** అసాధారణమైన చురుకుదనం
**overall** మొత్తం, సంపూర్ణ, సమగ్ర
**overawe** భయపెట్టు, బెదరగొట్టు, లొంగదీయు
**overbag** రాత్రిపూట బస చేసినప్పుడు దుస్తులు, సామాన్లు ఉంచుకునే పెట్టె
**overbear** దబాయించు, లొంగదీసుకొను, వశపరచుకొను
**overbearing** అహంకార పూరితమైన; గర్వం గల
**overboard** ఓడనుంచి బయటికి
**overburden** మోయలేని బరువు వేయు
**overcapacity** అవసరానికి మించిన సామర్థ్యం
**overcarry** అతిసహనం చూపు, ఓర్పు ప్రదర్శించు, శక్తికి మించి మోయు
**overcast** మబ్బుకమ్ము; చీకటి పడు



**overcharge** అధిక ధర, అధిక భారం, ఎక్కువ ధర పెట్టు
**overcome** అధిగమించు, లొంగదీసుకొను, జయించు, గెలుచు
**overconfidence** అమితమైన ఆత్మ విశ్వాసం, మితిమీరిన ధైర్యం
**overcrop** ఎక్కువగా పండించు
**overcrowding** కిటకిటలాడటం, అతిజన సమ్మర్థం
**overdo** అతిగా ప్రవర్తించు
**overdose** హెచ్చు మోతాదు
**overdraft** నిల్వ కన్నా ఎక్కువ వాడకం/ చెల్లింపు
**overdraw** రావాల్సిన దానికన్నా ఎక్కువగా తీసుకొను
**overdrawn** జమకంటే అధికంగా తీసుకోవడం
**overdue** సమయం మీరిన, ముందే ఎప్పుడో జరగాల్సి ఉండిన, తిరిగి ఇవ్వాల్సిన; ఎప్పుడో కట్టాల్సిన డబ్బు, గడువు దాటిన, కాలాతీతమైన
**overfeeding** అధికంగా తిను/తినిపించు
**overflow** వరద, పొర్లడం; పొర్లి ప్రవహించు, ముంచివేయు
**overglaze** పై మెరుగు రంగు
**over-ground** భూమిపైన, ఎత్తుగా
**overgrowth** అతిబలుపు
**overhang** ముందుకు వాలు, వంగు, వంచు, వేలాడు
**overhaste** అతి తొందర, ఆతురత
**overhasty** మిక్కిలి తొందరపాటు గల
**overhaul** సమగ్ర పరిశీలన, మరమ్మతు; తిరగదోడి పరిశీలించు, మరమ్మతుచేయు
**overhead** పైన, మీద; వ్యాపార నిర్వహణకు అయ్యే నియత కాలిక వ్యయాలు
**overhear** హఠాత్తుగా విను; పొంచి ఉండి విను
**overlap** అతివ్యాప్తమగు, పాక్షికంగా ఆచ్ఛాదించు/ ఆవరించు
**overlay** అణచివేయు, కప్పు
**overlie** పైన ఉండు
**overload** హెచ్చు బరువు వేయు
**overlook** ఉపేక్షించు; క్షమించు, పర్యవేక్షించు
**overly** అతి, సాధారణం కన్నా/ అవసరం కన్నా ఎక్కువ
**overnight** రాత్రికి రాత్రి, రాత్రంతా, తెల్లవార్లూ
**overpainting** అధిచిత్రణ
**overpitch** ఎక్కువ దూరానికి విసురు
**overplay** ప్రాధాన్యతను నొక్కి చెప్పు; ఎక్కువ చేసి చెప్పు
**overpower** లొంగదీయు; అణచివేయు
**overpraise** అధికంగా వెలకట్టు/ పొగడు
**overpress** అధిక భారాన్ని మోపు, ఎక్కువగా ఒత్తిడిచేయు
**overpressure** విపరీతమైన పనిభారం
**overproduce** అధికోత్పత్తి సాధించు
**overproduction** అధికోత్పాదన
**overrate** ఊహించు; అత్యధికంగా ఎంచు; ఎక్కువ వెలకట్టు
**overrule** తోసివేయు, నిరాకరించు; అతిక్రమించు
**overrun** ధ్వంసం చేయు; అధిగమించు, కొల్లగొట్టు; వరద ఎత్తు
**oversee** పర్యవేక్షించు
**overset** బోర్లించు, తలకిందులుగా చేయు
**overshadow** ముందుకు సాగు, నీడనిచ్చు, రక్షణ ఇచ్చు
**overspread** కప్పి వేయు

**overstaffed** అవసరానికి మించి సిబ్బంది కలిగి ఉండు
**overstay** నిర్ణీత కాలాన్ని మించి నివసించు
**overstock** అధిక నిల్వలు
**overstrain** అధికంగా శ్రమపడు, కష్టపడు
**oversubscription** వాటాలకు మించి దర ఖాస్తులు రావడం
**overt** బహిరంగ, బాహాటమైన
**overtake** వెంటాడి పట్టుకొను; ముందుకు దాటిపోవు
**overthrow** పదవీచ్యుతుని చేయు, పడ దోయు
**overtime** అధికకాలం
**overtone** నర్మ గర్భ పదం; గర్భితార్థం
**overtrading** తక్కువ పెట్టుబడితో, అధికో త్పాదన ఎక్కువ అమ్మకాలు సాధించటం
**overture** ప్రస్తావన, ప్రారంభం, సందేశం, మైత్రీభాషణం
**overturn** తారుమారు చేయు, పడదోయు, బోల్తాపడు, తిరగబడు, ధ్వంసం చేయు
**overvaluation** అతిమూల్యీకరణం
**overvalue** అతిమూల్యం; మూల్యం లేదా ధర కన్నా విలువైనవని భావించు
**overvalued** అతిమూల్యీకరించిన
**overview** పైపై పరిశీలన, స్థూల దృష్టి
**overween** అతిగా ఆశించు, ఎక్కువగా అంచనా వేయు
**overweening** గర్వం, దురహంకారం
**overwhelm** ముంచెత్తు, ఓడించు, నిమగ్నంచేయు
**overwrought** ప్రవర్తనను అదుపులో పెట్టుకోలేని, బాగా అలసిన
**oviduct** అండాశయ నాళం
**oviform** అండాకృతి గల
**ovine** గొర్రె వంటి, గొర్రెలకు సంబంధిం చిన
**oviparous** గుడ్లుపెట్టే, అండజ
**oviposition** గుడ్లను ఒక ప్రదేశంలో నిక్షిప్త పరచడం
**ovolo** కుంభరీతి
**ovulation** అండోత్సర్గం
**ovule** బీజకోశం
**ovum** అండం, గర్భబీజం, స్థూలబీజం
**owe** బాకీపడు, రుణపడి ఉండు; బాధ్యత కలిగి ఉండు
**owing** బాకీ ఉన్న, ఇవ్వవలసిన
**owl** గుడ్లగూబ
**owlet** పిల్ల గుడ్లగూబ
**owlish** గుడ్ల గూబ వంటి
**owner** యజమాని, స్వామి
**ownership** యాజమాన్యం, స్వామ్యం
**ox** ఎద్దు
**ox bow lake** అర్ధ చంద్రాకార సరస్సు
**oxen** ఎద్దులు
**oxidation** ఆక్సీకరణం
**oxide** ఆక్సైదం, భస్మం, బూడిద
**oxidised** ఆక్సీకృత
**oxidising** ఆక్సీకరణం
**oxidizable** ఆక్సీకరణ చెందే, భస్మంకాగల, తుప్పు పట్టే
**oxidize** భస్మం చేయు, భస్మమగు, తుప్పు బట్టు
**oxonion** ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ పట్ట భద్రుడు
**oxygen** ప్రాణవాయువు. ~ *tent* సమృద్ధిగా ప్రాణవాయువు సరఫరా చేసే గూడువంటి ఏర్పాటు
**oxymoron** విరోధాభాస
**oxytocic** గర్భాశయ ప్రేరక ఔషధం
**oyster** ఆల్చిప్ప, నత్తగుల్ల. ~ *mushroom* ముత్యపుచిప్ప పుట్టగొడుగు
**ozaema** పనస



# P p

**pabulum** ఆహారం
**pace** అడుగు, నడకతీరు; వేగం. ~ *bowler* క్రికెట్‌లో వేగంగా బంతి విసరే ఆటగాడు; అడుగువేయు, అడుగులు వేసి కొలుచు
**pacemaker** గతిప్రేరకం. *cardiac* ~ హృదయగతిప్రేరకం
**pace setter** ఒరవడి సృష్టికర్త; జంతువు
**pachyderm** మందమైన, దృఢమైన చర్మం గల
**pacific** శాంతపరచే, శాంతమైన
**pacification** శాంతింపజేయడం, సమా ధాన పర్చడం, శాంతి స్థాపన/ సంధి
**pacificsm** లొంగుబాటువాదం, శాంతి వాదం
**pacificst** శాంతివాది, సాత్త్వికవాది, యుద్ధ వ్యతిరేకి
**pacifier** సమాధానపరిచే వ్యక్తి, శాంతి దూత
**pacify** శాంతపరచు, అంగీకరింపజేయు
**package** బంగీ, మూట, పొట్లం, గణం, సలహా సూచనలు; భావనల కూర్పు. ~ *deal* కలిసికట్టు ఏర్పాటు, టోకు బేరం
**pack animal** బరువులు మోసే జంతువు
**packed** గుమిగూడిన, కట్టిన
**packet ship** రెండు రేవుల మధ్య నియ తంగా తిరిగే ఓడ
**packman** వీధుల్లో తిరిగి సరుకు అమ్మే వ్యక్తి
**pack saddle** బరువులు మోసే జంతు వులపై వేసే జీను
**pact** ఒప్పందం, ఒడంబడిక, సంధి
**pad** మెల్లగా ప్రయాణించు, నడుచు
**paddle** (పడవ నడిపే) చిన్న తెడ్డు, నీటిలో ఆడు, తెడ్డువేసినడుపు
**paddler** టేబుల్ టెన్నిస్ ఆటగాడు
**paddock** గుర్రాలను ఉంచే ప్రదేశం, చిన్న ఆవరణ, గోదురుకప్ప
**paddy** వరి(పంట). ~ *second crop* దాళువా పంట. ~ *third crop* పునాస పంట
**padlock** తాళంకప్ప
**paederasty** పురుషుల మధ్య, పిల్లలతో లైంగిక సంబంధం
**paediatrician** శిశువైద్యప్రవీణుడు
**paediatrics** శిశువైద్యం
**paedodontics** చిన్నపిల్లల దంత సంరక్ష ణకు సంబంధించిన దంత విజ్ఞానం
**paedogenesis** పరిపూర్ణాకృతి పొందడం
**pagan** బహుదేవతారాధకుడు, మతవ్యతి రేకి, క్రైస్తవమతేతరుడు, అనాగరకుడు
**page** పుట; సేవకుడు
**pageant** ప్రదర్శన, ఉత్సవం, ఊరేగింపు
**pageantry** గొప్ప వేడుక, ఉత్సవం, ఆడంబరం
**page boy** పెండ్లిలో పెళ్ళికూతురికి సహాయపడే చిన్న పిల్లవాడు
**pagoda** బౌద్ధ దేవాలయం
**paid** చెల్లించిన (డబ్బు). ~ *up capital* వాటాలు కొంటూ కంపెనీకి చెల్లించే డబ్బు. ~ *up policy* ప్రీమియం కట్ట కుండా నిలిపివేసిన బీమాపాలసీ
**pail** చెక్క/ లోహపు బాల్చీ
**pailful** ముంతెడు
**pain** నొప్పి, బాధ. *cardiac* ~ గుండె నొప్పి. *colicky* ~ శూలనొప్పి. *labour* ~ పురిటి నొప్పి, ప్రసవవేదన. *low back* ~ నడుంనొప్పి
**painstaking** శ్రమించే

**paint** పూత, రంగు. ~ *quality* ప్రలేప లక్షణం. ~ *standard* వర్ణక ప్రమాణం
**painter** (వర్ణ) చిత్రకారుడు
**painting** చిత్రలేఖన కళ; చిత్తరువు, రంగుల చిత్రం
**pair** జంట, యుగ్మం, యుగళం
**pal** స్నేహితుడు; ఆడంబరంగా చూపు, కవాతు చేయు, బారులుతీరి నడుచు
**palaeolithic** పాత రాతియుగం
**palanquin** పల్లకి, మేనా
**palatability** రుచ్యత
**palatable** రుచికరమైన, నోటికి హితమైన, మింగుడుపడే
**palatal** అంగిలికి సంబంధించిన; తాలవ్యం
**palate** అంగిలి. *cleft* ~ అంగిట్లో తొర్రి
**palatial** వైభవ పూర్వకమైన; రాజప్రసాద సంబంధమైన
**palaver** మాటామంతీ, సంభాషణ, పొగడ్త; హద్దు
**pale** కంచె, గుంజ, కొయ్య; తెల్లబోయిన, పాలిపోయిన, కాంతిహీనమైన; వెల వెల బోవు; గుంజలతో ఆవరణ ఏర్పరచు
**paleness** పాలిపోయిన రంగు
**paleoanatomy** పురాజీవ శరీర నిర్మాణ శాస్త్రం
**paleobotany** పురావృక్షశాస్త్రం
**paleographist** పురాతన/ ప్రాచీన లిపి శాస్త్రజ్ఞుడు
**paleography** పురాలిపి శాస్త్రం
**paleolimnology** పురాతన సరోవరాధ్య యనం
**paleolithic age** పూర్వ శిలాయుగం
**paleontology** లుప్తజంతుశాస్త్రం
**palette** చిత్రకారులు రంగులు కలుపుకునే పళ్ళెం
**palfrey** చిన్న స్వారి గుర్రం, స్త్రీలెక్కే గుర్రం
**palimony** (పెళ్ళికాకుండా నివసించే జంటలో ఒకరు కోరే) భరణం
**palindrome** ఎటునుండి చదివినా ఒకే విధంగా ఉండడం. ఉదా॥ కిటికి, వికట కవి
**paling** గుంజలు పాతి ఏర్పరచిన కంచె/ ఆవరణ
**palisade** రక్షణ ప్రదేశం, అవరోధం, భద్ర పరచు
**pall** n. శవపేటిక మీద కప్పే గుడ్డ; తెర; ఆచ్ఛాదక వస్త్రం. ~ *bearer* శవ వాహ కుడు
**pall** v. నిస్సారమగు, నిస్సారంగా చేయు, ఉత్సాహం తగ్గించు
**palladium** మంచి రక్షణ
**pallescent** కళాహీనమైన, పాలిపోయిన, వెలవెలబోయిన
**pallete** తాపీవంటి పరికరం, దిండు
**palliate** క్షమించు, శిక్షను తగ్గించమని ప్రార్థించు, తీవ్రతను తగ్గించు, బాధనుండి ఉపశమనం పొందు
**palliation** ఉపశమనం, క్షమాపణ, పరి హారం
**palliative** ఉపశమనకారి
**pallid** పాలిపోయిన, వెలవెలబోయిన
**pallor** పాలిపోవడం, వెలిసిన రంగు
**palm** తాకు, అరచేతిలో దాచు; అరచేయి, తాటి చెట్టు
**palmar** అరచేతిలోని
**palmary** జయార్హమైన, శ్రేష్ఠమైన
**palmer** పుణ్యక్షేత్రాలను సేవించే వ్యక్తి
**palmist** హస్తసాముద్రికుడు
**palmistry** హస్తసాముద్రికం
**palmy** వర్ధమాన
**palmyra** తాటిచెట్టు
**palp** బొద్దెంకవంటి జీవుల స్పర్శాంగం, స్పృశించి పరీక్షించడం; అనుభూతి చెందడం

**panoptic** సకలాంశ దృష్టి
**panorama** సర్వదిగ్దర్శనం; విశాల దృశ్యం
**pansexualism** హద్దుల్లేని లైంగిక వాంఛ
**pansophobia** నిరాధార భయాందోళన
**pansophy** సర్వజ్ఞానం
**panspermatism** గ్రహశకలాల ద్వారా విశ్వంలో జీవం వ్యాప్తి చెందిందనే సిద్ధాంతం
**pant** ఎగశ్వాస, ఊపిరి సలపక పోవడం; ఆకాంక్షించు, కోరుకొను
**pantaloon** పంట్లాము, షరాయి
**pantheism** సర్వేశ్వరవాదం, సర్వాత్మవాదం
**pantheon** సర్వదేవమందిరం, సర్వదేవతా లయం
**panther** చిరుతపులి
**pantomime** మూకాభినయం
**pantophobia** అన్నింటికీ భయపడడం
**pantothenic** అన్నివైపులనుంచి
**pantry** ఆహార పదార్థాలుంచే చిన్న గది
**panzer** సాయుధశకటం; శతఘ్ని
**pap** విలువ లేని, ముఖ్యంగాని; పిల్లలకు తినిపించే ప్రత్యేక ఆహారం
**papacy** పోప్ అధికారం, ఆధిపత్యం
**papal** (రోమన్ కాథలిక్ మతాధిపతి) పోప్‌కు సంబంధించిన
**paparazzi** వెంటాడే ఛాయాచిత్రకారుడు
**papaver** నల్లమందు (జాతికి చెందిన)
**papaw** బొప్పాయి చెట్టు; బొప్పాయి కాయ
**papaya** బొప్పాయి
**paper** కాగితం; దినపత్రిక, వార్తాపత్రిక; పత్రం, అధికార పత్రం. ~ *back* మామూలు అట్టగల పుస్తకం. ~ *knife* కవర్లను తెరిచే మొండి కత్తి. ~ *loss* కంపెనీ ఖాతాలలో చూపే నష్టం. ~ *money* నోట్ల రూపంలో ఉండే నగదు. *on* ~ కాగితాలకు పరిమితమైన. ~ *profit* కంపెనీ ఖాతాలలో మాత్రం చూపే లాభాలు. ~ *pulp* కాగితపు గుజ్జు. ~ *round* ఒక ప్రత్యేక మార్గంలో పేపర్లు ఇచ్చే ఉద్యోగం. ~ *tiger* కాగితం పులి
**papier mache** కాగితపు గుజ్జు
**papilio** సీతాకోక చిలుక
**papilionacae** చిక్కుడు కుటుంబం
**papilionaceous** సీతాకోక చిలుకలాగుండే
**papilla** చిన్న మొటిమ
**papillary** చనుమొనలను పోలిన, మొటిమల వంటి; సూక్ష్మాంకురం వంటి
**papilloma** పులిపిరికాయ
**pappus** కేశగుచ్ఛం
**papule** బుడిపె, మొటిమ
**par** సమ(త్వ)ం; సమానస్థితి; సమాన మూల్యం. *above* ~ పెంచిన విలువ, అధిక మూల్యం. *at* ~ సమాన ధరకు. *below* ~ తక్కువ ధరకు. ~ *excellence* ఉత్తమ, విశిష్ట. ~ *of exchange* సమాన మారకం విలువ. *on* ~ *with* సరిసమానంగా
**para** అదనపు; లోపభూయిష్ట, అపసవ్య, అసాధారణ; తప్పుడు; పోలిన; సమాంతర, బహుళ; బృహద్ధనువుకు చెందిన. ~ *glinding* వాయుక్రీడ, గాలిలో విహరించే క్రీడ. ~ *language* అనుసృత భాష. ~ *military* (సైన్యాన్ని పోలిన) సాయుధ దళాలు
**parable** నీతికథ
**paracentesis** శరీరకుహరం నుంచి ద్రవం తీయడం. *abdominis* ~ ఉదర కుహరం నుంచి ద్రవం తీయడం. ~ *pleural* ~ శ్వాస కుహరం నుంచి ద్రవం తీయడం
**parachronism** కాల నిర్ణయంలో పొరపాటు



**parachute** గాలి గొడుగు
**paraclete** న్యాయవాది, న్యాయసహాయకుడు
**paracrue** అభివృద్ధిలో పరాకాష్ఠ తర్వాత తిరోగమనం
**parade** కవాతు; ఆడంబరం
**paradigm** పదసమాహారం, రూపావళి
**paradise** స్వర్గ (ధామ)ం
**paradox** విరుద్ధ/ విపరీత భావం, వైరుధ్యం, విరోధాభాస. *therpeutic* ~ చికిత్సా సంబంధమైన విరుద్ధ ప్రభావం
**paradoxical** విపరీతమైన, అసంబద్ధమైన
**paraesthesia** అసాధారణ గ్రాహ్యత
**paraffin** మెరుగుమైనం. *liquid* ~ విరేచనకారి. ~ *wax* మైనం
**paragon** ఉత్కృష్ట వ్యక్తి/ వస్తువు, దృష్టాంతం; నమూనా
**paragraphia** తప్పులు రాయడం
**parakeet** చిలక
**paralalia** ఉచ్చారణ దోషం
**parallax** దృష్టినిక్షేపం, లంబన
**parallel** సమాంతర
**parallelism** సమాంతరత
**parallelogram** సమాంతర చతుర్భుజం
**paralyse** స్తంభింపజేయు, అశక్తంచేయు, పక్షవాతం తగులు
**paralysis** పక్షవాతం. *infantile* ~ శిశు పక్షవాతం (పోలియో మైలిటీస్)
**paralytic** పక్షవాత రోగి, పక్షవాతగ్రస్త
**parameter** పరామితి, కొలబద్ద, గీటురాయి, ప్రమాణం, నిర్ణయాత్మకమైన విషయం, ప్రసక్త నియతాంకం
**paramnesia** అపస్మృతి
**paramount** అతి ముఖ్యమైన, సర్వోన్నత
**paramountcy** సార్వభౌమాధికారం, సర్వాధికారం
**paramour** విటుడు, మిండగత్తె
**paranasal** ముక్కుకు రెండువైపులా
**paranoia** మృత్యుభయం, మానసిక రుగ్మత
**paranoic** చావుభయం గల రోగి
**paranoid** అనుమానస్పద. ~ *disorder* భ్రమల/ భ్రాంతుల వల్ల కలిగే మానసిక రుగ్మత
**paranormal** విపరీత మానసిక ప్రవర్తన గల
**parapet** పిట్టగోడ
**paraph** పొడి అక్షరాల్లో సంతకాలు పెట్టడం
**paraphernalia** సరంజామా, సామగ్రి
**paraphesia** ఊతపదం
**paraphimosis** వెనక్కువచ్చిన ముందోలు తిరిగి ముందుకు పోకపోవడం
**paraphonia** (ఈడొచ్చే దశలో) గొంతు మారడం
**paraphrase** వివరణ, వ్యాఖ్య, భావానువాదం
**paraphrone** వ్యాఖ్యానించు, భాష్యంచెప్పు
**paraplegia** శరీరంలో కింది భాగం చచ్చుబడిపోవడం
**parapsychology** మానవాతీత శక్తుల అధ్యయనం
**parasitaemia** రక్తంలో పరాన్న జీవులుండడం
**parasite** పరాన్నభుక్కు, పరాన్నజీవి. ~ *carriers* పరాన్నభుక్కుల వాహకాలు/ ప్రసారాలు
**parasitic** పరాన్నజీవులకు చెందిన
**parasiticide** పరాన్నజీవినాశని
**parasitism** పరాన్నజీవనం
**parasitology** పరాన్నజీవశాస్త్రం
**parasol** (ఆడవారి) గొడుగు
**parasuicide** ఆత్మహత్యాయత్నం

**parasympathetic** పరానుభూత. ~ *nervous system* పరానుభూత నాడీ వ్యవస్థ
**parasynthesis** పరాసంశ్లేషణ
**parataxis** నిబంధ నిర్మాణం
**parathyroid** ఉపావటు
**paratroops** గాలిగొడుగుసేన, వాయుసేన
**paratyphoid** విషజ్వరం
**parazoa** జంతురాజ్యం
**parboil** సగం ఉడకబెట్టు
**parboiled rice** ఉప్పుడు బియ్యం
**parcel** బంగీ, భాగం, అంశం
**parch** ఎండిపోవు, వేయించు, కాల్చు
**parchment** జంతు చర్మ పత్రం, తోలు కాగితం
**parcimonious** ఖర్చుకు వెనుకాడే
**pard** చిరుతపులి
**pardon** క్షమాపణ; తిరిగి చెప్పుమని అడగడం
**pardonable** క్షమించదగిన
**pare** చర్మాన్ని/ తోలుని/ చెక్కు/ ఒలుచు
**paregoric** బాధోపశమనకారి
**parencephalon** మస్తిష్కార్ధగోళం
**parenchyma** మృదుకణజాలం
**parentage** పుట్టుక; వంశం, కులం, తల్లి దండ్రులు
**parental** జనక, తల్లిదండ్రులకు సంబంధించిన/ సహజమైన. ~ *care* సంతాన పాలన
**parenthesis** కుండలీకరణం (లోనివాక్యం/ వాక్యభాగం), నిక్షేపం
**parenthetical** కుండలీకరణంలో ఉన్న, నిక్షిప్త, వైకల్పిక
**parergon** ఉపరచన
**parenthetical style** కుండలీకరణ శైలి
**paresis** అసంపూర్ణ పక్షవాతం
**parietal** పార్శ్వ, పార్శ్వక. ~ *bone* కుడ్యాస్థి, పార్శ్వాస్థి
**parity** సమానత్వం, సమార్థత
**parity grid** రూపాయి విలువలో ఇతర దేశాల కరెన్సీల మారకపు విలువల్ని సూచిస్తూ పొందుపరిచిన పట్టిక
**parkinson's disease** (అవయవాల) వణుకు రోగం
**parky** చలిగా ఉన్న
**parley** ప్రత్యర్థితో చర్చలు జరుపు/ సమావేశమగు, మరొకరితో మాట్లాడు
**parliament** ప్రజా ప్రతినిధుల కేంద్ర సభ, చట్టసభ
**parliamentarian** పార్లమెంటు సభ్యుడు, వ్యవహారజ్ఞుడు
**parliamentary path** పార్లమెంటరీ పంథా; ప్రజాప్రాతినిధ్య విధానం
**parlour** చావిడి, కచేరీ; సమావేశం
**parlous** దుస్థితి
**parochial** స్థానిక; ప్రాంతీయ, స్వప్రయోజన దృష్టిగల
**parody** అధిక్షేపకావ్యం, హాస్యానుకృతి
**parole** తాత్కాలిక విముక్తి, హామీ, పూచీ, వాగ్దానం, వాక్కు
**parotid gland** లాలాజల గ్రంథి
**parousia** క్రీస్తు పునరాగమనం
**paroxysm** కోపం, ఈర్ష్య, ఉద్వేగం, ఆవేశం
**parrot** (రామ) చిలుక
**parrotry** చిలుక పలుకులు పలకడం, అనుకరణ
**parry** దాటవేయు, సమాధానం ఇవ్వకుండా తప్పించుకొను, దూరంచేయు
**parse** శబ్దలక్షణాన్వయాలు చెప్పు
**parsec** నక్షత్రాల మధ్య దూరాన్ని కొలిచే ప్రమాణం



**parsimonious** డబ్బు ఖర్చు పెట్టడం ఇష్టంలేని, పిసినారి, పీనాసి, లోభి
**parsimony** పిసినారితనం, ఖర్చుకు వెనుకాడటం, కృపణత, లోభిత్వం
**part** భాగం, కంతు, వాటా, పార్శ్వం; విభాగించు, విడదీయు, ఎడబాపు. ~ *exchange* పాక్షిక వినిమయం
**partake** పాల్గొను, తీసుకొను; భాగం తీసుకొను
**partaker** భాగస్థుడు, పాల్గొన్న వ్యక్తి
**parterre** పూలసెజ్జల అమరిక
**parthenogenesis** ఫలదీకరణేతర పునరుత్పత్తి విధానం
**partial** ఆంశిక, పార్శ్వ, అర్ధ, అసంపూర్ణం, పాక్షిక, పక్షపాతంగల. ~ *differentiation* అవకలనం. ~ *fraction* ఆంశిక భిన్నం
**partiality** పక్షపాతం, పాక్షికత్వం
**partially** పాక్షికంగా; కొంతమేర
**participant** భాగస్వామి, సహభాగి; పాల్గొనే; పాలుపంచుకొనే. ~ *observation* సభ్యస్వీకృత పరిశీలన
**participate** పాల్గొను, భాగం పుచ్చుకొను
**participation** వంతు; పాల్గొనడం
**participatory democracy** పౌరులు పాల్గొనే అవకాశం గల ప్రజాస్వామ్యం
**participle** అసమాపక క్రియ; కృదంత విశేషణం
**particle** నెరసు, రేణువు, కణం
**particular** విశేష, ప్రత్యేకమైన, అసామాన్యమైన, నిర్దిష్టమైన
**particularity** ప్రత్యేకత; సూక్ష్మ వివరం
**particularize** ప్రత్యేకించిచెప్పు, వివరించు
**particular lien** నిర్దిష్టమైన అప్పుకు ధరావతుగా పెట్టుకొనేది
**particularly** ప్రత్యేకంగా, సవివరంగా
**parting** వీడ్కోలు
**partisan** పక్షపాతి, సమర్థకుడు
**partisanship** పక్షపాతం
**partition** విభాగం, వేరుపడడం; అడ్డు గోడ; తెర; విభజన, పంపిణీ; విభజించు, పంపిణీచేయు
**partner** భాగస్వామి, భాగస్థుడు, వాటాదారు; భార్య/భర్త. *business* ~ వ్యాపార భాగస్వామి. *general* ~ సంస్థ రుణాలకు కూడా బాధ్యతవహించే వ్యక్తి. *life* ~ జీవిత భాగస్వామి. *limited* ~ పరిమిత బాధ్యత వహించే భాగస్వామి. *managing* ~ నిర్వాహక భాగస్వామి
**partnership** భాగస్వామ్యం. ~ *deed* భాగ స్వామ్య పత్రం
**part owner** పాక్షిక యజమాని
**partridge** కౌజుపిట్ట; అంశకాలిక
**parturition** ప్రసవం
**party** రాజకీయపక్షం, దళం, విందు. ~ *congress* రాజకీయ పక్ష మహాసభ. ~ *discipline* పార్టీ క్రమశిక్షణ. ~ *less democracy* పార్టీ రహిత ప్రజాస్వామ్యం. ~ *line* పార్టీ పంథా
**par value** (వాటాల) ముఖ విలువ
**parvenu** ఆకస్మిక ధనవంతుడు/ పదవి పొందిన వ్యక్తి
**pass** ఉత్తీర్ణత పొందు; అనుమతించు, ప్రవేశాన్ని అనుమతించు గుర్తింపు కార్డు
**passable** సంతృప్తికరమైన, ఆమోదయోగ్య
**passage** దారి, మార్గం, గమనం; నిష్క్రమణం, తగ్గించడం, ప్రయాణం, అవతరణ, ఉద్ధరణ; ఓడరేవు; గ్రంథంనుంచి ఉదాహరించిన భాగం. *a bird of* ~ ఋతువులను అనుసరించి ప్రదేశాలు మార్చే పక్షి; ఒకచోట ఎక్కువకాలం ఉండనివాడు. ~ *of arms* వాగ్యుద్ధం, గొడవ, తగవు

**passe** గతం
**passer-by** దారినపోయే వ్యక్తి
**passion** మోహం, కామం; వెర్రి కోపం, ఆవేశం, తీవ్రోత్సాహం
**passionate** సులభంగా ఉద్రేకపడే, క్రోధం గల
**passionless** మనోవికారం లేని, శాంతుడైన
**passive** నిష్క్రియ, స్తబ్ధంగా ఉండే, జడ
**passiveness** ఉదాసీనత, జడత్వం
**passive voice** కర్మణ్యర్థకం
**pass off** మోసంతో ఇచ్చు, గతించు, ముగియు
**passport** పాస్‌పోర్ట్, విదేశ ప్రయాణానుమతి పత్రం
**pastel** పాలిపోయిన, లేతరంగు, లేపనం
**pasteurization** శుద్ధి
**pastime** వినోదం, క్రీడ, మనోరంజనం
**pastor** గొర్రెల కాపరి; క్రైస్తవ పూజారి
**pastoral** పచ్చిక పొలానికి సంబంధించిన, పశుపాలకులకు సంబంధించిన. ~ *poetry* గ్రామీణ/ కర్షక/ కాపు కవిత్వం
**pasturage** పశువుల మేత, పచ్చిక భూమి, పశువులు మేసే భూమి
**pasture** పచ్చిక బీడు, పచ్చిక మేపు/మేయు
**past vegetation history** ప్రాచీన వృక్ష చరిత్ర
**pasty** అనారోగ్యంగా కనిపించడం
**pat** ద్రవాహారం, మెత్తని ఆహారం, చిన్న దెబ్బ, చరుపు, తట్టు
**patch** అతుకు, మాసిక; మాసిక వేయు. ~ *work* అతుకుల మారి పని
**pate** శిరస్సు, తల
**patella** మోకాలిచిప్ప
**patent** ప్రత్యేక హక్కు, ఏకస్వం, అధికార పత్రం, వ్యక్త, స్పష్ట, ప్రసిద్ధ. ~ *rights* వ్యక్తి/ సంస్థ పొందిన ప్రత్యేక హక్కులు
**patentee** ప్రత్యేక హక్కు పొందిన వ్యక్తి
**patent infringement** ప్రత్యేక హక్కులను భంగపరచటం
**patent office** పేటెంట్ హక్కులను గుర్తించే/ ఇచ్చే ప్రభుత్వ కార్యాలయం
**pater familias** కుటుంబకర్త
**paternal** తండ్రికి సంబంధించిన, పైతృక; వంశపారంపర్య, పరంపరాగత
**paternity** పితృత్వం. ~ *leave* బిడ్డ తండ్రికి అనుమతించే స్వల్పకాలిక సెలవు
**path** మార్గం, పథం, పుంత
**pathetic** జాలిగొలిపే, అసహాయ, బాధాకర. ~ *fallacy* మానవత్వారోపణ
**pathfinder** మార్గదర్శకం, చుక్కాని
**pathogenesis** వ్యాధిజననం, రోగ వికాసం
**pathogenic** రోగాణువు
**pathology** వ్యాధి విజ్ఞాన శాస్త్రం, రోగ లక్షణ శాస్త్రం
**pathos** కరుణ (రసం), విషాదం
**patience** ఓర్పు, క్షమ, సహనం
**patient** ఓర్పుగల, సహనంగల, రోగి. *ambulant* ~ నడవగలిగిన రోగి. *indoor* ~ ఆసుపత్రిలో ఉన్న రోగి
**patina** తామ్రమలం, చిలుము
**patmate** హస్తాకార
**patriarch** వంశ మూలపురుషుడు; ఆది గురువు, కులపతి, తెగ పెద్ద
**patiarchal** పితృకయోగత, పూర్వకాలిక
**patriarchy** పితృస్వామ్యం
**patricide** పితృహత్య
**patriot** దేశభక్తుడు
**patriotic** మాతృదేశాభిమానం గల
**patriotism** దేశభక్తి, మాతృదేశాభిమానం
**patrol** పహరా, గస్తీ, గస్తీ తిరుగు, పహరా కాయు



**patron** పోషకుడు, దాత; అభిమాని, రక్షకుడు
**patronage** పోషణ, ప్రాపకం, ప్రోత్సాహం, చేయూత, మద్దతు, సహకారం
**patronize** అభిమానించు, ఆదరించు; ఆశ్రయమిచ్చు
**patter** తొందరమాటలు; లొడ లొడ మాట్లాడు
**pattern** వ్యూహం, రీతి. *speech* ~ మాట్లాడే తీరు, మాటతీరు
**patulous** తెరుచుకుని ఉన్న
**paucity** స్వల్పత, కొరత
**paunch** పొట్ట, కడుపు
**pauper** పేద, ఆస్తి లేని వాడు, బికారి
**pauperism** పేదరికం, బికారీతనం
**pauperization** దారిద్ర్యీకరణ
**pause** విరతి, నిలుపు, విరామం; విరామపు గుర్తు
**pave** చదునుచేయు; మార్గం సరిచేయు
**pavement** (రోడ్డు పక్కన ఉండే) కాలిబాట
**pavilion** డేరా, మంటపం
**paw** జంతువుల పంజా, పంజాతో కొట్టు
**pawn** తాకట్టు, కుదువ, (చదరంగంలో) బంటు; తమలపాకు; తాకట్టుపెట్టు, కుదువపెట్టు
**pawnbroker** వడ్డీ వ్యాపారి; తాకట్టు పెట్టుకొనే వ్యక్తి
**pay** వేతనం, చెల్లింపు, రుణపడింది తిరిగి ఇవ్వడం, లాభదాయకం. ~ *back* తీర్చివేయడం. ~ *homage* శ్రద్ధాంజలి ఘటించు. ~ *off* చెల్లించు, తీర్చు. ~ *someone off* వేతనం చెల్లించి పని లోంచి తొలగించు. ~ *something off* రుణాన్ని ఒకేసారి తీర్చు
**payable** ఇవ్వాల్సిన, చెల్లించాల్సిన. ~ *in advance* బయానాగా ఇవ్వదగ్గ. ~ *on demand* కోరికమేరకు చెల్లించు. ~ *to bearer* వినిమయబిల్లు సమర్పించిన వారికి చెల్లించు. ~ *to order* వినిమయ బిల్లుపై పేర్కొన్న వారికి చెల్లించు
**pay as you earn** సంపాదనానుసారం చెల్లించే ప్రత్యక్ష పన్ను
**pay attention** పట్టించుకొను
**payback** పెట్టుబడుల నుంచి లాభాంశాలుగా, వడ్డీగా వచ్చే ఆదాయం. ~ *clause* తీసుకున్న రుణాన్ని తీర్చే విధానం, నియమ నిబంధనలను స్పష్టం చేస్తూ ఒప్పందం పేర్కొనే నిబంధన. ~ *period* రుణం తీర్చేందుకు అనుమతించిన కాలవ్యవధి
**pay bill** వేతన పత్రం
**pay commission** వేతన సంఘం
**pay day** వేతనాలు, జీతం పొందేరోజు; పద్దుల రోజు
**payee** చెల్లింపును అందుకునే వ్యక్తి, స్వీకర్త
**payer** చెల్లించే వ్యక్తి
**paying banker** చెక్కు, వినిమయ బిల్లు చెల్లించే బాంకు
**paying in books** జమలను నమోదు చేసుకునేందుకు ఖాతాదారు ఉపయోగించే పుస్తకం
**paymaster** వేతనాలు బట్వాడా చేసే ఉద్యోగి; యజమాని
**payment** చెల్లింపు. ~ *by results* పనిని బట్టి, లాభాన్ని అనుసరించే చెల్లింపు. ~ *for honour* గౌరవార్థం చెల్లించడం. ~ *in advance* ముందుగా చేసే చెల్లింపు. ~ *in due course* సకాలంలో చేసే చెల్లింపు. ~ *in kind* వస్తుసేవల రూపంలో చేసే చెల్లింపు. ~ *on account* ఖాతాలో నిలువ చేయడం ద్వారా చేసే చెల్లింపు

**pay roll** వేతనదారుల పట్టీ
**paysage** ప్రకృతి దృశ్యం
**pea** బఠానీలు
**peace** శాంతి, ప్రశాంతత; సంధి, ఒడంబడిక
**peaceable** శాంతమైన, శాంతినికోరే
**peaceably** శాంతంగా, నెమ్మదిగా
**peaceful** శాంతియుతమైన. ~ *transistion* శాంతియుత పరివర్తన. ~ *co existence* శాంతియుత సహజీవనం
**peacock** నెమలి
**peahen** ఆడనెమలి
**peak** శృంగం, పర్వత శిఖరం, కొన, అగ్రం
**peaky** జబ్బుపడిన
**peal** పెద్ద ధ్వని; ఘంటా నాదం; తోలు, పట్టా; మోగించు, మోగు
**pear** బేరీ పండు
**pearl** ముత్యం; ముత్యపు చిప్ప; ముత్యాలతో అలంకరించు
**pearl fish** మెరుగుగల చేప
**peasant holdings** కుటుంబ కమతాలు
**peasantry** రైతాంగం
**pea souper** మురికిగా ఉన్న మంచు
**pebble** గులకరాయి
**peccatophobia** పాపభీతి
**pectinate** దువ్వెన ఆకారం గల, దువ్వెన అమరికగల
**peculation** ధనాపహరణ
**peculiar** అసాధారణమైన; విపరీతమైన; విశిష్టమైన; ప్రత్యేకమైన
**pecuniary** డబ్బుకు సంబంధించిన
**ped** మట్టి రేణువుల ప్రమాణం
**pedagogic** శిక్షణకు/ బోధనకు సంబంధించిన
**pedagogics** బోధనా పద్ధతులు/శాస్త్రం
**pedagogue** బోధకుడు, శిక్షిత వ్యక్తి, ఉపాధ్యాయుడు
**pedagoguery** బోధన వృత్తి, అధ్యాపకత్వం
**pedagoguism** విద్యాబోధన, అధ్యాపకత్వం
**pedagogy** శిక్షణ, శిక్షణా శాస్త్రం
**pedant** పాండిత్యగర్వం గల వ్యక్తి
**pedantic** పాండిత్య ప్రకర్ష గల
**peddle** ఊరూరూ తిరిగి అమ్ము, చట్ట వ్యతిరేకంగా అమ్మకాలు జరుపు, ఆలోచనను గాని, సమాచారాన్ని గాని బలవంతంగా ప్రజల మీద రుద్దు
**peddler** వ్యాపారి, అక్రమంగా మత్తు మందులు అమ్మే వ్యక్తి
**pedestal** వేదిక; పీఠం; స్తంభం/ విగ్రహం అడుగు భాగం
**pedestrian** పాదచారి
**pedicle** తొడిమ
**pediculosis** పేనుపట్టడం
**pediculus** పేను. ~ *capitis* తలపేను. ~ *corporis* ఒంటిపేను
**pedigree** వంశం, వంశావళి, వంశవృక్షం, ఉత్తమజాతి, వంశ చరిత్ర
**pedogenesis** నేల ఏర్పడడం
**pedology** మృత్తికా శాస్త్రం
**peduncle** తొడిమ
**pee** మూత్రవిసర్జనచేయు
**peel** తొక్క ఒలుచు
**peelings** పళ్ళ/ కూరగాయల తొక్కలు
**peep** తొంగిచూచు
**peeping Tom** బట్టలు మార్చుకునే (ఆడ) వాళ్ళను రహస్యంగా చూసే వ్యక్తి
**peer** సమవయస్కుడు, సమాన హోదా కల వ్యక్తి, తోటివాడు; సంకుచితంగా చూచు, పరిశీలించు
**peerless** సాటిలేని, అసమానమైన
**peevish** కోపం ఎక్కువగా ఉన్న, అసంతృప్త



**peevishness** చిరచిర, కర్కశత్వం, అసంతృప్తి
**peg** కొయ్యమేకు; సోడా కలిపిన మద్యం; కట్టివేయు; అదుపుచేయు; బిగించు
**pelage** క్షీరదాల శరీరం మీది వెంట్రుకలు
**pelagic** సముద్రానికి చెందిన, కెరటాలపై నివసించే
**pellagra** వ్యాధి
**pellet** చిన్న ఉండ, మాత్ర, గోళీ
**pell-mell** గందరగోళం, గజిబిజి, క్రమ రాహిత్యం
**pelt** పదునుచేయని తోలు, విసురు, విసిరి కొట్టు
**peltry** బొచ్చుతోనున్న తోళ్లు
**pelvic** కటిసంబంధమైన, తొడ ఎముక
**pelvis** కటి(వలయం)
**pen** కలం; పశువుల దొడ్డి; కోళ్లగూడు; రాయు, దొడ్లో పెట్టడం
**penal** దండనార్హమైన; నేర సంబంధమైన
**penal code** శిక్షాస్మృతి, దండస్మృతి
**penalty** జరిమానా
**penance** తపస్సు, ప్రాయశ్చిత్తం
**penchant** అభిరుచి, ప్రవృత్తి
**pendant** కర్ణభూషణం; కంఠహారంలో వేలాడే బిళ్ల
**pendency** అపరిష్కృత స్థితి
**pending** జరుగుతున్న, గడుస్తున్న, మిగిలి వున్న, అనిశ్చిత
**pendulous** ఊగాడే
**pendulum** లోలకం
**peneplain** సమస్థలాభం
**penetrable** చొరశక్యమైన
**penetrate** చొచ్చుకొనిపోవు, ప్రవేశించు, గ్రహించు
**penetrating** ప్రవేశక, చొచ్చుకపోయే. ~ *power* ప్రవేశన సామర్థ్యం
**penetration** చొరబాటు, దూరడం, చొచ్చుకొనిపోవడం, ఛేదించుకొని పోవడం, ప్రవేశనం, వ్యాప్తి
**penial** శిశ్నం, శిశ్న సంబంధమైన
**peninsula** ద్వీపకల్పం
**penis** పురుషాంగం, శిశ్నం
**penitence** పశ్చాత్తాపం, ప్రాయశ్చిత్తం
**penitent** పశ్చాత్తాపపడే/ అనుతాపమొందే (వ్యక్తి)
**penitential** పశ్చాత్తాప సంబంధి
**penitentiary** నేరగాళ్లకు నీతి బోధ చేసే జైలు, (వ్యభిచారిణుల) శరణాలయం, ప్రాయశ్చిత్తశాల
**penmanship** చేతిరాతలో నేర్పు, లేఖన/ రచనా నైపుణ్యం
**pen name** కలం పేరు
**pennon** జెండా; రెక్క
**pennywise** కక్కుర్తి మనిషి
**penology** శిక్షాస్మృతి శాస్త్రం
**penpusher** ఎక్కువగా రాతపని చేసే వ్యక్తి
**pension** ఉపకార వేతనం, పింఛను, వజీఫా
**pensive** ఉదాసీన, ఆలోచనాధీనుడై ఉన్న, పరధ్యానంగా ఉన్న
**pensively** సాలోచనగా
**pent** పూర్తిగా మూసిన పంచ
**pentagon** పంచభుజి, (అమెరికా) సైనిక ప్రధాన కార్యాలయం
**penthouse** పై డాబా/ పైనిల్లు, వసారా; పంచపాళి
**penurious** పేద, పిసినారి, అల్ప
**penury** కటిక దారిద్ర్యం
**people** జనం, ప్రజలు
**pep** ఉత్సాహం, ఉత్తేజం
**pepper** మిరియాలు; మిరియపు పొడి
**pep talk** ప్రజల్ని ఉత్తేజపరిచే ఉపన్యాసం

**pep up** ఉత్సాహభరితం చేయు, హుషారు కలిగించు
**perabdomen** కడుపు ద్వారా
**perambulate** చుట్టూ తిరుగు, నడయాడు, విహరించు
**perambulator**(పిల్లల) తోపుడు బండి; తిరిగిన దూరాన్ని కొలిచే చక్రం
**perceive** అవగతం చేసుకొను, గ్రహించుకొను
**per cent** నూటికి, వందకు; శాతం
**perceptible** ప్రత్యక్ష, స్పష్ట
**perception** అనుభూతి, అవగాహన, ఇంద్రియజ్ఞానం, గోచరత, గ్రహణశక్తి. *extra sensory* ~ అతీంద్రియశక్తి
**perch** పక్షి కూర్చోవడానికి పెట్టిన అడ్డ కొయ్య, ఆధారం
**perchance** ఒకవేళ, దైవవశాత్తూ
**percipient** సూక్ష్మగ్రాహి
**percolation** వడగట్టడం, చెమ్మగిల్లడం, ఊరడం, అంతః స్రవణం, వడపోత
**percolator** ప్రస్రావకం
**percussion** దెబ్బ, ఘాతం, గాయం, సంఘట్టన
**perdition** దుర్గతి, వినాశం, నిషా
**peregrination** సుదీర్ఘయాత్ర
**peremptory** అనుల్లంఘనీయ, ప్రామాణికమైన, కచ్చితమైన
**perennial** నిత్య, బహువార్షిక, శాశ్వతమైన. ~ *river* జీవనది. ~ *stream* నిరంతర ప్రవాహం
**perfection** పరిపూర్ణత, సమగ్రత, సర్వోత్కృష్టత
**perfectionism** పరిపూర్ణతావాదం
**perfidious** నమ్మదగని, కపటి, మోసం చేసే
**perfidy** అబద్ధం, విశ్వాసఘాతుకత
**perforate** రంధ్రాలు చేయు, ఛిద్రీకరించు, చిల్లుపొడుచు
**perforated** సచ్ఛిద్ర
**perforation** రంధ్రం, ఆంత్రచ్ఛేదనం
**perforce** బలవంతంగా
**perform** ఆచరించు, ప్రదర్శించు, పాటించు
**performance** ప్రదర్శన, పనిచేసే విధానం
**perfume** పరిమళం; సుగంధ ద్రవ్యం; అత్తరు
**perfumery** సుగంధద్రవ్య పరిశ్రమ, అత్తరు పరిశ్రమ
**perfunctory** అజాగరూక, యాంత్రిక, దైవిక, శ్రద్ధలేని
**perfusion** చిలకరించడం
**peri** చుట్టి ఉండే,పరి
**pericardium** గుండెమీది పొర
**perigee** (చంద్ర గ్రహమార్గంలో) భూమికి అత్యంత సమీపంలో ఉండే బిందువు
**perigynous** అండకోశ పరిచక్రం
**perihelion** పరిహేళి: (గ్రహమార్గంలో) సూర్యుడికి అత్యంత సమీప బిందువు
**peril** హాని
**perilous** అత్యంత ప్రమాదకరమైన
**perinatal** ప్రసవకాలిక
**perineum** మూలధారం
**period** కాలం; యుగం, కాలవ్యవధి, అవధి, సమయం. *safe* ~ సురక్షిత కాలం, గర్భధారణకు అవకాశంలేని కాలం; బహిష్టు సమయం
**periodic** ఆవర్తన. ~ *table* రసాయన మూలకాలను నిర్దిష్ట క్రమంలో పేర్చే ఆవర్తన పట్టిక
**periodical** ఆవర్తక, (నిర్ణీత కాలంలో వెలువడే) పత్రిక; నిర్ణీత కాలంలో జరిగే
**periodically** నిర్ణీత కాలంలో



**periodicity** నియమితకాలికత, ఆవర్తకత
**periosteum** ఎముకపై పొర
**peripatetic** దేశదిమ్మరి, పర్యటనశీల
**peripheral** పరిధీయ, క్రమాంత. ~ *nervous system* పరిధీయ నాడీ వ్యవస్థ
**periphery** కైవారం, పరిధి, హద్దు, చుట్టుకొలత
**periphrasis** డొంకతిరుగుడు, విస్తారం
**periphrastic construction** డొంక తిరుగుడు నిర్మాణం
**periscope** వర్ధచిత్రదర్శని
**perish** చనిపోవు, నశించు, హరించు, ఎండిపోవు
**perishable** క్షర; నశ్వర, నశించే, పాడైపోయే
**peristalsis** తరంగచలనరీతి
**peritoneum** ఉదరకుహరాన్ని ఆవరించి ఉండేపొర
**perjure** అసత్య ప్రమాణం చేయు, తప్పుడు సాక్ష్యం చెప్పు
**perjury** అసత్య ప్రమాణం; కూటసాక్ష్యం
**perman** రాయసకాడు; గ్రంథ రచయిత
**permanence** చిరస్థాయిత, స్థిరత్వం, శాశ్వతత్వం
**permanent** చిరస్థాయి, శాశ్వత, స్థిర. ~ *hardness* శాశ్వత కాఠిన్య. ~ *magnet* శాశ్వతాయస్కాంతం. ~ *revolution* శాశ్వత విప్లవం
**permeability** ప్రవేశ్య శీలత, ప్రవేశ్యత, పారగమ్యత, వ్యాప్తి
**permeate** వ్యాపించు, రంధ్రాల ద్వారా ప్రవేశించు
**permeation** పారగమనం, ప్రవేశం, ప్రవేశనం, భేదనం
**permission** అనుమతి, అనుజ్ఞ, అంగీకారం
**permit** అనుమతి పత్రం, అనుమతించు; ఒప్పుకొను
**permutation** ప్రస్తారణ, మార్పిడి, క్రమఛేదం/ విశేషం
**pernicious** హానికరమైన, కీడుచేసే, ప్రమాదకరమైన
**pernickety** పనికిరాని వాటి గురించి ఆందోళనపడు
**pernor** లాభగ్రహీత
**perpendicular** లంబం
**perpetrate** (దుష్కార్యం) చేయు
**perpetrator** ఘోరమైన తప్పుచేసిన వ్యక్తి
**perpetual** అనవరత, శాశ్వత, సతత
**perpetuate** శాశ్వతంగా ఉండేట్టు చేయు, శాశ్వతీకరించు
**perpetuity** శాశ్వతత్వం; నిలకడగా వచ్చే వార్షికాదాయం
**perplex** కలవరపరచు, విభ్రాంతపరచు, గాభరాపెట్టు
**perplexed** విభ్రాంతమైన
**perplexity** కలవరపాటు, చిక్కు, జటిలత, విభ్రాంతి
**persecute** పీడించు, హింసించు
**per se** కేవలంగా పరిశీలించగా
**persecution** పీడన, హింస
**persecutor** మతోన్మాది, హింసించే/ పీడించే వ్యక్తి
**perseverance** పట్టుదల, ఓర్మి, నిరంతర శ్రమ
**persevere** పట్టినపట్టు విడవకపోవడం; పట్టుదలతో ఉండడం
**persevering** పట్టుదలగల
**persist** పట్టుదలతో ఉండు
**persistence** పట్టుదల, నిలకడ, కార్యశూరత్వం, స్థిరత, మొండిపట్టు
**persistent** చిర, పట్టువిడవని, నిరంతర

**persistently** గుచ్చి గుచ్చి, పట్టు విడవకుండా
**personage** ప్రముఖవ్యక్తి, ప్రసిద్ధుడు
**personal** వ్యక్తిగత, స్వకీయ, శారీరక, సొంత. ~ *column* వార్తాపత్రికలలో వ్యక్తిగత వార్తలు అచ్చు వేసే ప్రదేశం
**personalism** వ్యక్తి ప్రధానవాదం
**personality** వ్యక్తిత్వం, మూర్తిమత్వం, శరీర దృఢత్వం. ~ *cult* వ్యక్తి పూజ. ~ *test* వ్యక్తిత్వ పరీక్ష. ~ *trait* వ్యక్తిత్వ విలక్షణత
**personal savings** వ్యష్టిపొదుపు
**personate** నటించు, పాత్ర పోషించు
**personification** మానవీకరణ, సాకారత
**personify** మానవీకరించు, చేతనత్వం ఆరోపించు
**personnel** ఉద్యోగులు, సిబ్బంది. ~ *manager* సిబ్బంది నిర్వాహకుడు
**perspective** దృష్టికోణం, దర్శనం
**perspicacious** సూక్ష్మగ్రాహి
**perspicuous** స్పష్టమైన, సుబోధకమైన
**perspiration** చెమట, చెమర్చడం, స్వేదనం
**perspiratory** చెమట పుట్టించే
**perspire** చెమర్చు, చెమట పోయు
**persuade** నచ్చ చెప్పు, ఒప్పించు; అనునయించు
**persuasion** బలవంతం, అనునయం, బుజ్జగింపు, ప్రోద్బలం
**persuasive** ఒప్పించే; ప్రేరణాత్మకమైన; అనునయపూర్వక
**pert** చురుకైన, తుంటరి, మనసు నొప్పించే
**pertain** సంబంధించు
**pertaining** సంబంధించిన
**pertinacious** పట్టుదల గల
**pertinacity** మొండిపట్టు; హఠం
**pertinent** తగిన, సంగతమయిన, పొసగిన, యుక్తమైన
**perturb** కలవరపెట్టు, ఆందోళన పరచు
**perturbation** వైకల్యం, వికలత
**perturbed** విహ్వల, వ్యాకులిత
**pertussis** కోరింత దగ్గు
**perusal** పరిశీలన, ధ్యానపూర్వక పఠనం
**peruse** శ్రద్ధగా చదువు, పరిశీలించు
**pervade** వ్యాపించు; సూక్ష్మ రంధ్రాల ద్వారా దూరు
**pervaded** పరివృత
**pervading** వ్యాపించే
**pervasive** అంతటా వ్యాపించిన, సర్వ వ్యాప్త, చెడు
**perverse** హేతుబద్ధంకాని, వక్రబుద్ధిగల, వికృత
**perversion** వక్రబుద్ధి, విపరీతత్వం
**perversity** వక్రబుద్ధి; వికట స్వభావం; వైపరీత్యం
**pervert** విరుద్ధంగా, సహజసిద్ధంగా లేని, పెడత్రోవపట్టే, విపరీత ప్రవృత్తిగల
**pervious** ప్రవేశ్య, ప్రవేశార్హత కలిగిన. ~ *rock* ప్రవేశ యోగ్య శిల
**pessary** యోనిలో ఉంచే మందుగుళిక
**pessimism** నిరాశావాదం
**pessimist** నిరాశావాది
**pest** తెగులు; ఉపద్రవం. ~ *management* తెగుళ్ళ నివారణ
**pester** వేధించు/ తరచుగా అడుగు, సతాయించు, విసిగించు
**pestilence** అంటువ్యాధి, చీడ, తెగులు
**pestilent** రోగం కలగ చేసే
**pestle** ముసలం, రోకలి, పొత్రం
**pet** పెంపుడు జంతువు; ప్రీతిపాత్రమైన, ప్రియమైన
**petal** పత్రం, పూరేకు



**petalous** రేకులు గల
**petechia** (చర్మం మీది) ఎర్ర మచ్చ
**peter out** సమాప్తమగు, క్రమంగా తగ్గు
**petit** చిన్న, తుచ్ఛమైన
**petite** సన్నగా, నాజూగ్గా ఉండే
**petition** అర్జీ, మనవి, దరఖాస్తు, విజ్ఞాపన
**petitmal** మూర్ఛ సంబంధమైన వ్యాధి
**petridish** గాజుతో చేసిన చిన్న కటకాకార పాత్ర
**petrifaction** రాయిగా మారిపోవడం
**petrified** ప్రస్తరీభూత, శిలాగామారిన. ~ *wood* శిలాకాఠిన్యం గల కలప
**petrify** అచేతనమయ్యేంతగా భయపడు, భయంలో బిగిసిపోవు, రాయిగా మారు/ మార్చు
**petrology** భూగర్భ శిలాశాస్త్రం
**petro price** పెట్రోలియం ఉత్పత్తుల ధరలు
**pettish** కోపపడే, చిరచిరలాడే
**petty** చిన్న; అల్పమైన
**petulance** అకారణమైన
**petulant** ముక్కోపి
**pew** చర్చిలో ప్రత్యేకించిన చోటు; ఆవరణ ఏర్పరచు
**phaeton** నాలుగు చక్రాల గుర్రపు బండి
**phage** పరాన్నజీవి, జీవాణుభక్షకం
**phagocyte** భక్షక కణం
**phagocytosis** భక్షక కణక్రియ
**phagophobia** ఆహారం అంటే భయం
**phalangeal** వేలి ఎముకకు సంబంధించిన
**phalanges** అంగుళ్యాస్థులు: చేతి/కాలి వేళ్ళకు ఉండే ఎముకలు
**phalanx** వేలి ఎముక; సేవా వ్యూహం
**phantasm** భ్రమ; మనః కల్పిత రూపం; మాయరూపు
**phantasy** పగటికల, ఊహాగానం, కల్పిత దృశ్యం
**phantom** మనోరథసృష్టి, భ్రాంతి, దయ్యం, నీడ
**pharmaceutical** ఔషధీయ; ఔషధాలు తయారు చేయడానికి సంబంధించిన
**pharmacist** ఔషధాలు తయారు చేసే వ్యక్తి, ఔషధ విక్రేత
**pharmacologist** ఔషధ శాస్త్రజ్ఞుడు
**pharmacology** ఔషధ శాస్త్రం/ విద్య, మందుల తయారీ
**pharmacopoeia** ఔషధకోశం/సంహిత, వస్తుగుణ ప్రకాశకం
**pharmaco-therapeutics** ఔషధ చికిత్సా శాస్త్రం
**pharmacy** ఔషధాలయం, రసాయనల శాల
**pharyngeal** గొంతు సంబంధమైన, సప్తపథీయ
**pharyngitis** గొంతునొప్పి
**pharynx** గొంతు, సప్తపథ
**phase** కాలం, పరిణామదశ, దశ, అవస్థ
**phasis** (గ్రహాల) కనిపించే భాగం
**phatic communication** సాంఘిక సంబంధాలను పటిష్ఠం చేయాలనే లక్ష్యం గల సమాచారం
**phenomenology** దృగ్విషయశాస్త్రం
**phenomenon** ఘటనాప్రపంచం దృగ్విషయం
**phenotype** సమలక్షణం
**phial** చిన్న గాజు బుడ్డి, సీసా
**philanderer** అనేక స్త్రీలతో లైంగిక సంబంధాలేర్పరుచుకొన్న వ్యక్తి
**philanthropic** లోకోపకారి, పరోపకారి
**philanthropist** లోకోపకారి, మానవ ప్రేమి
**philanthropy** లోకోపకార బుద్ధి; మానవ ప్రేమ; దాతృత్వం

**philately** తపాలా బిళ్లల సేకరణ/ సంకలనం
**philologist** భాషాచరిత్ర పరిశోధకుడు; ప్రాచీన భాషా శాస్త్రజ్ఞుడు
**philology** ప్రాచీన భాషా శాస్త్రం
**philosophical** దార్శనిక, తాత్విక
**philosophy** తత్త్వశాస్త్రం, దర్శనం
**philtre** వలపు మందు
**phimosis** ముందోలు వెనక్కి పోవడం
**phlegm** శ్లేష్మం, కఫం, కళ్ళె
**phlegmatic** శ్లేష్మయుతమైన, శ్లేష్మం తయారు చేసే
**phloem** పోషక కణజాలం
**phlogistic** బాధాకారకం
**phlycten** కంటిలో బొబ్బ
**phobia** భీతి, విపరీత భయం; విద్వేషం
**phonation** ఉచ్చారణ
**phone** భాషాధ్వని
**phoneme** వర్ణం
**phonetic change** ధ్వనిపరిణామం
**phonetics** ధ్వనిశాస్త్రం
**phoney** అబద్ధపు, నిజంకాని
**phonocardiogram** హృదయస్పందన (సూచక) పటం
**phonograph** శబ్దాన్ని గ్రహించి వినిపించే యంత్రం
**phonography** ఉచ్చారణ ఆధారంగా రాసే పద్ధతి
**phonology** ధ్వని ప్రవర్తన శాస్త్రం, వర్ణ నిర్మాణ శాస్త్రం
**phosphorescence** దీప్తమత్వం, భాస్వరత
**phosphorescent** దీప్తిమంతమైన, భాస్వర
**phosphorous** భాస్వరం
**photic zone** కాంతి ప్రాంతం
**photo** కాంతి ప్రకాశం, దీప్తి, ఛాయ. ~ *active* కాంతిప్రేరక. ~ *catalysis* కాంతి ఉత్ప్రేరణం. ~ *chemical reaction* కాంతి రసాయన చర్య. ~ *chemistry* కాంతి రసాయన శాస్త్రం. ~ *chromism* కాంతి వర్ణత్వం. ~ *conduction* కాంతి విద్యుద్వాహకత. ~ *conductivity cell* కాంతి విద్యుద్వాహక ఘటం. ~ *decomposition* కాంతి ప్రభావిత వియోగం. ~ *dynamic* కాంతి గతిక. ~ *electric* కాంతివిద్యుత్ సంబంధి. ~ *electric cell* కాంతి విద్యుత్ ఘటం. ~ *emissive* కాంత్యుద్గార. ~ *energy* కాంతిశక్తి. ~ *luminescence* కాంతి సందీప్తి. ~ *meter* కాంతి మాపకం. ~ *metry* కాంతి మాపనం. ~ *sensitive* కాంతి సూక్ష్మగ్రాహక. ~ *sensitivity* కాంతి సూక్ష్మగ్రాహ్యత. ~ *stimulus* కాంత్యుద్దీపనం
**photobiology** శారీరక వ్యవస్థపై కాంతి ప్రభావాన్ని గురించి తెలిపే శాస్త్రం
**photographic realism** ఛాయాచిత్ర వాస్తవికత
**photography** ఛాయాచిత్రం
**photolysis** కాంతివిశ్లేషణం
**photometer** ప్రకాశమాపకం. ~ *receptor* కాంతిగ్రాహకం
**photon** కాంతికణం
**photonasty** కాంతికి ప్రతిస్పందించడం
**photophase** కాంతిదశ
**photosensitive** కాంతి సంవేదక/ గ్రాహక
**phrase** పదబంధం, శైలి, వాక్సరణి
**phraseology** శబ్దవిన్యాసం, శైలీవిన్యాసం
**phrenic** ఉదర వితానానికి సంబంధించిన, కపాలసంబంధి
**phrenology** కపాల విజ్ఞానం
**phrynoderma** కప్పచర్మంలా ఉన్న



**phthisis** క్షయవ్యాధి
**phycology** శైవలశాస్త్రం
**phylogeny** వర్గచరిత్ర, వంశవృక్షం
**phynometer** సాంద్రతామాపకం
**phyrosis** గుండెమంట
**physic** చికిత్స, మందు, ఉపచారం, వైద్యం
**physician** వైద్యుడు
**physicochemical** భౌతిక రసాయనిక
**physiognomy** ముఖ సాముద్రికం, ముఖ లక్షణ విజ్ఞానం
**physiological** శరీరధర్మ సంబంధమైన
**physiology** శరీరధర్మశాస్త్రం
**physiotherapy** భౌతికచికిత్స
**physique** దేహబలం, శరీరతత్త్వం, దేహ నిర్మాణం
**phytopathology** మొక్కల వ్యాధుల గురించిన అధ్యయనం
**phytophagous** ఆహారం కోసం మొక్కలపై ఆధారపడే
**picaresque** వీరగాథామయ
**pick** కోయు; పొడుచు; దొంగిలించు; ఆరోగ్యవంతమగు, తేరుకొను, పరిచయం చేయు; ఎన్నుకొను; గునపం, సూది
**pickaxe** గడ్డపార, పికాసి
**pickery** చిల్లర దొంగతనం
**picket** కొరతవేసే కొయ్య, గూటం; సైనిక/ పోలీసు దళం; అడ్డగింత, తిష్ఠ; కొరత వేయు; అడ్డగించు; తిష్ఠవేయు
**picketing** నిరోధం, అడ్డగింత
**pick off** నాశనం చేయు
**pick on** దయలేని, విమర్శించే
**picky** సమాధాన పరచలేని
**picnic** వన విహారం/భోజనం
**picturesque** ఆకర్షణీయ, సుందర, ఇంపైన
**piddle** మూత్రంచేయు
**pidgin** మిశ్రిత(భాష)
**pie** పూర్ణం; పిండివంట
**piece** శకలం, ముక్క; చదరంగంలో పావు; తాను; చేసిన పని, తుండు; తుపాకి, అతుకు వేయు
**piecemeal** ముక్కలు ముక్కలుగా
**piedmont** పర్వత/ గిరి పాదప్రాంతం
**pie eyed** తాగిన
**pienut** వేరుసెనగ కాయ
**pier** అర్ధస్తంభం, పలకల వంతెన, రేవు
**pierce** గుచ్చు, దూరు, దూర్చు
**piercing** ఛిద్రణం
**pieta** కరుణామూర్తి
**piety** దైవభక్తి; ధర్మనిష్ఠ
**piffle** వ్యర్థమైన
**pig** పంది; లోహపు దుక్క. ~ *iron* దుక్క ఇనుము
**piggy** దురాశగల, స్వార్థం గల
**piggyback** గుండె శస్త్రచికిత్స; వీపుమీద మోసుకుపోవడం
**pigment** వర్ణద్రవ్యం, వర్ణకం. *bile* ~ పిత్త వర్ణకం
**pigmentation** వర్ణకవిధానం
**pigsty** పందుల దొడ్డి
**pike** ఈటె, బల్లెం
**pilaster** కుడ్యస్తంభం, స్తంభకుడ్యం
**pile** పోగు; దొంతి, దొంతర, పేర్చు, పోగు చేయు
**piles** మొలలు, మూలవ్యాధి
**pile up** కుప్పగూడు, పోగవు, అధికమగు
**pilfer** దొంగిలించు
**pilferage** దొంగతనం, చిల్లరచోరీ
**pilgrim** యాత్రికుడు
**pilgrimage** తీర్థయాత్ర
**pili** రోమాలు
**pill** (గర్భ నిరోధక)మాత్ర

**pillage** దోపిడి, కొల్లగొట్టడం
**pillager** దోపిడీ దొంగ
**pillion** ప్రయాణికుడి సీటు. ~ *rider* మోటరు సైకిల్ పైన వెనక సీటులో కూర్చున్న వ్యక్తి
**pillory** దండనయంత్రం
**pillow talk** (సన్నిహితంగా) మాట్లాడుకోవడం
**pilot** మార్గదర్శకుడు; విమానం/ నావ నడిపే వ్యక్తి; అగ్రగామి; విమానం/ నావ నడిపించు
**pimp** తార్చేవాడు; నిందించు, విమర్శించు, తార్చు
**pimple** మొటిమ
**pincer** పట్టకారు
**pine** దేవదారు చెట్టు; వ్యసనంతో/ అత్యాశతో కృశించు
**pineal gland** పీనియల్ గ్రంధి
**pineapple** అనాస
**pinion** పక్షిరెక్క; సంకెల; సంకెళ్ళు వేయు, రెక్కలు విరిచికట్టు
**pin money** (ఖర్చుపెట్టేందుకు) భార్యకిచ్చే డబ్బు
**pinna** గూబ, చెవిదొప్ప
**pinnace** చిన్న పడవ
**pinnacle** శిఖరం, ఉన్నతస్థానం; పర్వతాగ్రం; ఉచ్చదశ
**pinpoint** సరైన కారణాన్ని కనుగొను/ చూపు
**pint** పన్నెండు ఔన్సుల కొలత
**pin up** తక్కువ దుస్తులతో ఉన్న వ్యక్తి ఛాయాచిత్రం
**pinx** చిత్రం: చిత్రంపై కళాకారుడు చేసిన సంతకం
**pioneer** వైతాళికుడు, అగ్రగామి, మార్గదర్శకుడు, పథ నిర్దేశకుడు
**piorrhoea** (పంటి) చిగుళ్లనుంచి చీము కారడం
**pious** దైవభక్తి గల, ధర్మశీల, పాపభీతిగల
**pip squeak** అనవసరమనుకొనే వ్యక్తులపై ద్వేషాన్ని కలిగించడం
**pip** స్వల్పతేడాతో ఓడించు, రవ్వంతలో చేజిక్కించుకొను, హఠాత్తుగా కుంగిపోవు
**pipe** మురళి, (పొగాకు) గొట్టం; పిల్లనగ్రోవి
**piper** పిల్లన గ్రోవి వాయించే వ్యక్తి
**pipkin** మట్టి పిడత; చిన్న చట్టి
**piquant** సంతోషం/ హాయి కలిగించే, ఆహ్లాదపరచే
**pique** విరోధం, ద్వేషం; చికాకుపెట్టు, పరాభవించు
**piracy** సముద్రపు దోపిడీ, చౌర్యం. *audio* ~ కాసెట్లకు నకళ్లు తయారుచేసి దొంగతనంగా అమ్ముకోవడం. *book* ~ గ్రంథ చౌర్యం. *video* ~ వీడియో చౌర్యం
**pirate** ఓడ/ సముద్రపు దొంగ
**pirated edition** అక్రమంగా ముద్రించి చౌకగా విక్రయించే పుస్తకం
**pisciculture** మత్స్యపరిశ్రమ, చేపల పెంపకం
**pismire** చీమ
**pistia** అంతర తామర
**pit** కూపం, గొయ్యి, గుంట, బిలం
**pitch** స్వరస్థాయి; కౌలు; విసరు, విసరివేయు
**pitch black** గాఢాంధకారం
**pitcher** మట్టి పాత్ర
**pitcher plant** ఒక కీటకాహారి మొక్క
**pith** బెండు, దవ్వ, చేవ, సారం
**pithy** క్లుప్తంగా ఉండే, సారంగల, చేవగల; మరిచిపోలేని
**pitiable** జాలి చూపదగిన, దయనీయ
**pitifully** దీనంగా



**pitology** అస్థిశాస్త్రం
**pittance** స్వల్ప భృతి; స్వల్పం, కొంచెం
**pity** జాలి,దయ; జాలిపడు, దయచూపు
**pivot** ఇరుసు, కీలకం, ఆధారం, కేంద్రం
**pivotal** ధర పలుకుతున్న (వాటా); కీలకమైన
**placable** సమాధానపరచదగిన; శాంతింపజేయగల
**placard** విజ్ఞాపన, ప్రకటన
**placate** తృప్తిపరచు, సంతోషపెట్టు, ప్రసన్నంచేయు
**placebo** ఉత్తుత్తిమాత్ర, సర్వరోగ నివారిణి
**placement** సంస్థితి, ఉనికి, నిమగ్నత
**placenta** మావి, మాయ
**placid** ప్రశాంతమైన, నిశ్చలమైన, శాంతమైన
**plafond painting** లోకప్పు చిత్రణ
**plagiarism** గ్రంథ/భావ చౌర్యం
**plague** మహమ్మారి, ప్లేగు అనే వ్యాధి; వేధించు, వ్యాపించు
**plainly** సామాన్యంగా, స్పష్టంగా, నిష్కపటంగా
**plainness** నిష్కాపట్యం; స్పష్టత; అలంకార రాహిత్యం, సహజత్వం
**plaint** ఫిర్యాదు, అర్జీ, మొర, ఏడ్పు
**plaintiff** వాది, దావా వేసిన వ్యక్తి
**plait** అల్లిన జడ
**plait point** మలుపు తిరిగిన స్థానం
**plan** ప్రణాళిక, నమూనా, యుక్తి, పన్నాగం; ప్రణాళికవేయు; యుక్తిపన్ను, కుట్రచేయు
**plane** చిత్రిక, చదును; చదును చేయు
**planet** గ్రహం
**planetology** గ్రహాధ్యయన శాస్త్రం
**plank** లక్ష్యం, ధ్యేయం, పలక, బల్ల, కొయ్యముక్క
**planned** యోజిత
**plano** సమతల. ~ *concave lens* సమతల పుటాకార కటకం. ~ *convex lens* సమతల కుంభాకార కటకం
**plant** మొక్క; కర్మాగారం. ~ *dye* వృక్షరంజనం. ~ *pigment* వృక్షవర్ణదం. ~ *protein* వృక్షంలోని మాంసకృత్తు
**plantain** అరటి
**plantar** అరికాలికి సంబంధించిన
**plantation** (పూల) తోట; సేద్యం, సాగు
**plantigrade** రెండుకాళ్ళపై నడవడం
**plaque** ఫలకం, రాతిముక్క
**plasma** జీవద్రవ్యం
**plaster** పట్టీ, పాలాస్త్రి, గచ్చు. *adhesive* ~ మలాం, అంటుకునే పట్టీ
**plaster of paris** పారిస్ జిగురు
**plastic** మృదువైన, ఒదిగే పదార్థం. ~ *art* కల్పక కళ. ~ *sculptor* కల్పక శిల్పకారుడు. ~ *sub stance* కల్పక ద్రవ్యం
**plasticity** కల్పకత; సాగేగుణం, మెత్తదనం, ఒదుగు
**plastic money** నగదుగా మార్చుకోదగిన ద్రవ్యం
**plastic surgery** విరూప సవరణ శస్త్ర చికిత్స
**plat** సమ ప్రదేశం, అల్లు
**plateau** పీఠభూమి
**plate finished paper** నున్నని కాగితం
**platelet** రక్త(కణ)పట్టిక
**platform** వేదిక; రంగ (స్థల)ం, తిన్నె
**platitude** సాధారణ అభిప్రాయం; సామాన్యత
**platonic love** అలైంగిక ప్రేమ, అమలిన శృంగారం
**platoon** చిన్న సైనిక/ పోలీసు దళం
**plausible** నిజమనిపించే, యుక్తంగా కనిపించే, న్యాయంగా తోచే

**play** ఆట, క్రీడ, నాటక (ప్రదర్శన)ం; చలనం; ఆటలాడు, నటించు; వాయించు; ప్రదర్శించు
**play boy** విలాస పురుషుడు
**player** క్రీడాకారుడు, నటుడు
**playmate** ఆటలో జతగాడు
**paly off (match)** ఫలితాన్ని నిర్ధరించ డానికి ఆడే పోటీ
**plaything** ఆట వస్తువు
**plea** సాకు, హేతువు, వాదం, మనవి, విన్నపం
**pleader** న్యాయవాది
**pleasant** ఇంపైన; మనోజ్ఞమైన; సరస మైన; సంతోషకరమైన
**pleasantry** ఉల్లాసం; పరిహాసం
**pleasing** కమనీయ, మనోజ్ఞ
**pleasure** ఆనందం, ఆహ్లాదం
**plebiscite** ప్రజాభిప్రాయ/ జనాభిప్రాయ సేకరణ
**pledge** ప్రతిజ్ఞ, ప్రతిన, కుదువ, తాకట్టు, ధరావతు
**pledgee** తాకట్టు పెట్టుకొనే వ్యక్తి
**plenipotentiary** సర్వాధికారాలు గల (రాయబారి)
**plentiful** సమృద్ధ, పరిపూర్ణ, సమగ్ర, విస్తృత
**plentifully** బహుళంగా, పూర్తిగా
**plenty** సమృద్ధి
**plenum** మహాసభల మధ్య జరిగే కేంద్ర సంఘ సమావేశం
**pleomorphism** బహురూపత
**plethysmograph** శరీరావయవ పరి మాణ భేదమాపకం
**pleura** శ్లేష్మస్తరం, ఫుపుసావరణం
**pleurisy** ఫుపుసావరణ శోథ
**pleuty** చాలినంత; విస్తారం; విశేషం

**plexiform** జాలాకార, వలలాంటి
**plexus** వల, అల్లిక, ప్లక్షం. ~ *of nerves* నాడీప్లక్షం
**pliable** వంగే, నమ్య, మెత్తని
**plication** ముడవటం
**pliers** శ్రావణం, చిమట
**plight** దుర్దశ, దురవస్థ; కుదవ, తాకట్టు
**plinth** ఆధార వేదిక, పునాది. ~ *area* గోడలతో సహా ఇల్లు కట్టిన భాగం
**plod** భారంగా నడుచు, పాటుపడు
**plot** కుట్ర, పన్నాగం, చిన్న భూఖండం, ఇంటిస్థలం; కథాంశం, కథావస్తువు; కుట్ర పన్ను, కల్పించు
**plotting** దురాలోచన; గీయడం
**plough** నాగలి; దున్ను, సేద్యం చేయు
**ploughback** లాభాలను తిరిగి పెట్టుబడి పెట్టడం
**ploy** కారణం, చర్య, పని, ఉద్యోగం, వ్యవ హారం, నిర్వహణ, సంభాషణ, కేళి, క్రీడ, ఉల్లాసవంతమైన, సంతోషకరమైన, హద్దు మీరు, కాలక్షేపంలో మునుగు
**pluck** సేకరించు, వేరుచేయు
**plucky** ధైర్యంగల
**plug** బిరడా; నిరోధించు; బిరడాకొట్టి ఆపు
**plugged** మూసికొనిపోవు, ఆటంకం కలుగు
**plum** రేగు పండు/ చెట్టు
**plumage** పక్షి రెక్కలు, ఈకలు
**plumb** అనాహ్లాదకర ఆవేశం; సీసపు గుండు; వడంబం; తిరుగులేని, ఖచ్చిత మైన
**plumber** నీటి గొట్టాలు బాగుచేసే వ్యక్తి
**plumb line** లింగసూత్రం
**plumbum** సీసం
**plume** ఈక, తురాయి; గౌరవ చిహ్నం; గర్వం



**plummet** బరువు; లంబసూత్రం, వడంబం గుండు
**plummy** గ్రాంథికంలో మాట్లాడు
**plump** బలుపు, స్థూలత్వం
**plumpy** లావుపాటి, బలిసిన
**plunder** దోపిడీ, కొల్లగొట్టిన సొత్తు; దోపిడి చేయు, కొల్లగొట్టు
**plunge** మునక; చొరబడు, మునుగు, పడి పోవు, దూకు
**plural** బహు, అనేకమైన, బహుళ
**pluralism** బహుతావాదం
**plurality** బహుళత్వం, అనేకత్వం
**plush** ఖరీదైన
**pluvial** తీవ్రవర్షాకాలం
**pluviometer** వర్షపాత మాపని
**ply** ప్రయాణించు
**pneumatic** గాలి/ వాయువు ఒత్తిడితో పని చేసే
**pneumonectomy** ఊపిరితిత్తి తీసివేత
**pneumonia** ఊపిరితిత్తులు వాచిపోయే వ్యాధి
**poach** ఉడకబెట్టి ఒలుచు, గుచ్చు, చెమ్మగా ఉండు, దొంగతనంగా వేటాడు, ఇతరుల హక్కులను, లాభాలను హరించు, అను చిత ప్రయోజనాన్ని పొందాలనుకొను; గుడ్లను ఉడకబెట్టి ఒలవడం; వేటదొంగ
**poacher** దొంగ వేటగాడు, అక్రమార్జన పరుడు
**poaching** దొంగతనంగా అడవి జంతువు లను వేటాడడం
**pochade** ద్రుత చిత్రం
**pocks** చర్మంపై కలిగే గుంటలు/ రంధ్రాలు
**pod** కాయ
**podge** లావైన
**podium** ఉన్నత వేదిక
**poesy** కవిత్వం

**poetaster** కుకవి
**poetic diction** కవిత్వభాష
**poetic drama** పద్య నాటకం, గేయ నాటకం
**poeticism** కవితా లక్షణం
**poetic justice** కవిత్వ న్యాయం
**poetic licence** కవితా స్వేచ్ఛ
**poetic prose** కవిత్వ వచనం, పద్యగంధి/ ఆలంకారిక గద్యం
**poetics** అలంకార శాస్త్రం
**poet laureate** ఆస్థాన కవి
**poetry** కవిత్వం
**poignant** తీవ్రమైన, తీక్ష్ణమైన
**poikilothermic** చల్లని రక్తంగల జీవులకు సంబంధించిన
**point** సూది, సూచీ, మొన; కొన, చుక్క, బొట్టు; సంగతి, అంశం; సమయం; స్థలం, బిందువు. ~ *of incidence* పతన బిందువు. ~ *of order* నియమభంగా క్షేపణ
**pointed** మొన కలిగిన
**pointer** సూచకం, సంకేతం; (వేట) కుక్క
**pointillism(e)** బిందువాదం
**pointing** నిర్దేశనం
**pointless** ఉద్దేశరహిత
**poise** సరితూకం, సరితూగటానికి వేసిన బరువు
**poison** విషం, గరళం; విషం పెట్టు, విష పూరితం చేయు
**poisoning** విషప్రయోగం. *food* ~ విషా హారం/ కలుషితాహారం
**poisonous** విష సంబంధమైన, విషంతో కూడిన
**poke** గుచ్చడం; పోటు, పొడుచు; తల దూర్చు
**poker** నిప్పును కదల్చే ఇనుప కాడ

**poky** అసౌకర్యంగా ఉండే
**polar** ధ్రువ (సంబంధమైన)
**polar** ధ్రువ, ధ్రువీయ. ~ *solvent* ధ్రువ ద్రావణి
**polarimeter** ధ్రువణ మాపకం
**polarity** ధ్రువణత
**polarization** ధ్రువణం
**polarize** ఏకోన్ముఖత కలిగించు
**polarized** ధ్రువిత. ~ *light* ధ్రువిత కాంతి
**pole** ధ్రువం, స్తంభం; (నావనడిపే) తెడ్డు
**pole axe** గండ్ర గొడ్డలి, పరశువు
**polecat** మానుపిల్లి
**polemic** వివాదాస్పదమయిన; ప్రతివాదం
**polemicist** వివాద కారక రచయిత
**polemics** వాదం, తగాదా, సాహిత్య రాజకీయ వివాదం
**polemology** గుంపు ఘర్షణల అధ్యయనం
**pole-star** ధ్రువ నక్షత్రం
**police** నిఘా ఉంచు; పౌర రక్షక దళం
**policy** (పాలన) విధానం
**polish** మిసిమి, మెరుగు, నాగరక వర్తనం; మెరుగుపెట్టు, మెరుగు దేరు
**polite** మర్యాదగల, నాగరకమైన
**politeness** మర్యాద; సభ్యత
**politic** యుక్తి గల, తెలివి గల
**political** రాజకీయ. ~ *science* రాజనీతి శాస్త్రం
**politician** రాజకీయవేత్త
**politics** రాజనీతిశాస్త్రం, రాజకీయాలు
**polity** రాజ్యపాలన పద్ధతి, ప్రభుత్వ విధానం
**poll** తల; ఎన్నిక జరిగే స్థలం; వోటర్ల జాబితా, వోటు వేయు
**pollarded** ఆకులు కత్తిరించిన
**pollination** పరాగ సంపర్కం. *cross* ~ పరపరాగ సంపర్కం. *self* ~ ఆత్మ పరాగ సంపర్కం:
**poll tax** తలపన్ను, వోటు హక్కు పన్ను
**pollutant** కాలుష్యకారక
**pollute** అపవిత్రం చేయు, కలుషితంచేయు
**pollution** కాలుష్యం, కల్మషం
**poltroon** పిరికి పంద, భీరువు
**poly** బహు, బహుళ. ~ *acidic* బహు ఆమ్లీయ. ~ *arthiritis* అనేక కీళ్లవాతం. ~ *chromatic* బహువర్ణక
**polycentric** బహుకేంద్రక
**polychrome** బహువర్ణక
**polydactyl** బహ్వంగుళికత
**polydipsia** అధికదాహం
**polygamy** బహుభార్యాత్వం
**polygon** బహుపార్శ్వక, బహుభుజి
**polyhouse** వృక్షసంరక్షణశాల
**polymath** బహుముఖ ప్రజ్ఞాశాలి
**polymer** అణుపుంజం
**polymeric** బహ్వణుక
**polymerization** అణుపుంజీకరణం
**polymorph** బహురూపకం
**polymorphism** బహురూపకత
**polyneuritis** అనేక నాడులకు కలిగే బాధ
**polyneuropathy** అనేక నాడులు వికృతి చెందడం
**polynology** పరాగరేణు శాస్త్రం
**polyphonic prose** భిన్నస్వర వచనం
**polyphony** భిన్న స్వరత
**polysemy** అనేకార్థ బోధకత
**polyuria** అతిమూత్రత
**polyvalent** బహుసంయోజక
**pomatum** వాసన నూనె
**pomegranate** దానిమ్మ
**pomp** అంగరంగ వైభవం, ఆడంబరం; పటాటోపం; దంభం



**pompas** సమ శీతోష్ణ పచ్చిక బయళ్ళు
**pompous** ఆడంబరమైన; వైభవోపేత
**pond** కుంట, మడుగు
**ponder** యోచన, పర్యాలోచించు, లోతుగా ఆలోచించు
**ponderous** కఠిన, బరువైన, ప్రముఖ, ఆలోచనాపూర్వక
**poniard** బాకు, చురకత్తి
**pontiff** మత ప్రధాన గురువు
**pontifical** అధికారం ఉన్నట్లుగా ప్రవర్తించు
**pontoon** బల్లకట్టు, పడవల వంతెన
**pony** తట్టు, చిన్న గుర్రం
**poof** స్వజాతి సంపర్కం గల వ్యక్తి
**pooh pooh** హేళనచేయు, తృణీకరించు
**pool** సమూహం, నీటి గుంట, మడుగు
**poor** బీదలు, దీనులు, పేదలు; అల్ప, బలహీన, వెనుకబడిన
**pope** రోమన్ కాథలిక్కుల ప్రధాన గురువు
**popping** ఛిద్రదోషం
**poppy** గసగసాల మొక్క. ~ *oil* గసగస తైలం. ~ *seeds* గసగసాలు
**poppycock** పనికిరాని
**poppy day** (బ్రిటన్‌లో) స్మరణదినం
**populace** ప్రజాసామాన్యం, జనం
**population** జనాభా. ~ *explosion* జనాభా విస్ఫోటనం
**population density** జనసాంద్రత
**popular** లోకప్రియ, ప్రజాదరణ గల; జనాకర్షక, ప్రసిద్ధ, ప్రముఖ; ప్రాచుర్యం గల. ~ *culture* ప్రజాసంస్కృతి
**popularity** ప్రజాదరణ
**popularize** వ్యాప్తిలోనికి తెచ్చు, ప్రజాదరణ పాత్రం చేయు
**populous** జనసాంద్రత గల
**porcelain** పింగాణీ
**porcellanous** పింగాణీ సంబంధ
**porch** ద్వారమంటపం
**porcine** పందిలాగ కనిపించే
**porcupine** ఏదుపంది, ముళ్లపంది
**pore** చిన్న బెజ్జం, సూక్ష్మరంధ్రం
**porespace in the soil** అంతరవకాశం
**pork** పంది మాంసం
**porker** కొవ్వు బట్టిన పంది
**pornography** బూతు సాహిత్యం, అశ్లీల సాహిత్యం
**porosity** సచ్ఛిద్రత; రంధ్రయుక్తత
**porous** రంధ్రాలున్న. ~ *rock* సచ్ఛిద్ర శిల
**porridge** గంజి, జావ, పాయసం
**porringer** కంచం, భోజన పాత్ర
**port** రేవు పట్టణం, ఓడరేవు, ద్వారం; వైఖరి
**portable** వహనీయ/ చిన్న, మోసుకుపోదగిన
**portal** ప్రధాన ద్వారం, సింహద్వారం
**portal system** నిర్వాహక వ్యవస్థ
**portend** ముందుగా సూచించు, శకునం చెప్పు
**portent** కాలమహిమ; దుశ్శకునం
**portentous** అశుభ సూచకమైన, ఘోరమైన
**portfolio** మంత్రిత్వశాఖ; వాటాల జాబితా, కాగితాల దొంతర; కాగితాలు పెట్టుకునే అట్ట. ~ *management* విశ్లేషణ/ నిర్వహణ. ~ *manager* పెట్టుబడులను విశ్లేషించి, నిర్వహించే వ్యక్తి
**portice** ద్వార మంటపం
**portly** గంభీరాకృతిగల, స్థూల
**portman team** ప్రయాణానికి ఉపయోగించే సంచి
**portrait** చిత్రం, పటం; బొమ్మ; వర్ణన; మూర్తిచిత్రం, విద్ధచిత్రం. ~ *head* శీర్ష శిల్పం

**portraiture** ప్రతిరూపణం
**portray** వర్ణించు, లిఖించు, చిత్రించు
**pose** భంగిమ, నటించే తీరు, ప్రశ్నించు; నటించు
**position** స్థానం; అంతరం; స్థితి; పదవి. *knee, elbow* ~ మోకాలు, మోచేతులపై పడుకోవడం. ~ *paper* స్థితి గతుల వివరణ పత్రం. *supine* ~ వెల్లకిలా పడుకోవడం
**positive** వర్ణనాత్మక, సకారాత్మక, ధనాత్మక, నిజమైన, రూఢిఅయిన, స్పష్టమైన, నిర్ణీతమైన, సూటిఅయిన. ~ *charge* ధన విద్యుదావేశం. ~ *deviation* ధనాత్మక విచలనం. ~ *plate* ధనాత్మక ఫలకం
**positively** నిస్సంశయంగా, రూఢిగా, నికరంగా
**positivism** రూఢివాదం, ప్రత్యక్షైకవాదం
**posse** అధికారి/ పోలీసు దళం
**possess** కలిగి ఉండు, స్వాధీనంలో ఉంచుకొను
**possession** స్వాధీనం, కైవసం; అనుభవం; భుక్తం, ధారణ
**possessive** స్వాధీనతాసూచకమైన
**possible** సంభవనీయమైన, సాధ్యమైన
**post** పదవి, ఉద్యోగం; తపాలా; స్తంభం, కొయ్య; స్థానం, నియమించు, తపాలా పంపించు; ఖాతాలో ఎక్కించు
**postage** తపాలా రుసుం
**post date** తర్వాతి తేదీ వేయు
**poster** ప్రకటన/ విజ్ఞాపనపత్రం
**posterior** పశ్చిమ, పర, తర్వాతి, అనంతర; పృష్ఠ
**postgraduate** స్నాతకోత్తర
**post-haste** అత్యంత వేగంగా, అంచెలంచెలుగా

**posthumous** మరణానంతర
**posthumously** దివంగతుల స్మృత్యర్థం, మరణించిన వారి పేరుమీద
**postiche** కూటకం, కల్పిత, కృత్రిమ చిత్రం
**post-impressionism** పరిభావనా వాదం. ~ *painting* పరిభావనా వాద చిత్రణ
**post-modernism** అత్యాధునికత, అనంతరాధునికత
**post mortem** శవ పరీక్ష
**post natal** ప్రసవానంతర, జన్మాంతర
**post operative** శస్త్ర చికిత్సానంతర. ~ *care* శస్త్ర చికిత్సానంతర సంరక్షణ
**postpone** వాయిదా వేయు, (తాత్కాలికంగా) నిలిపివేయు
**postponement** వాయిదా, నిలుపుదల
**post-prandial** భోజనం తర్వాత
**post script (p.s)** తాజాకలం
**post structuralism** అనంతర నిర్మాణ వాదం
**post tax yield** పన్నుపోగా మిగిలిన రాబడి
**postulate** ప్రతిపాదన, స్వీకృతాంశం
**postulation** మూలసూత్ర నిర్ణయం
**posture** శరీరాన్ని ఉంచిన తీరు; భంగిమ; స్థానం, స్థితి
**posy** పూలగుత్తి
**potable** తాగటానికి తగిన
**potash** క్షారం
**pot boiler** డబ్బు కోసం చేసిన రచన; అలాటి రచయిత
**potency** శక్తి, సామర్థ్యం, బలం స్థాయి
**potent** శక్తి గల, బలమైన
**potentate** సర్వాధికారి, పాలకుడు
**potential** శక్తిగల, సంభావ్య, గర్భిత; శక్యం
**pother** హంగామా; గందరగోళం; గలభా, ఊపిరాడని పొగ; గందరగోళపరచు



**pothole** కుంభాకార బిలం
**potion** ద్రవరూపమైన మందు
**pot pourri** సంగీతమేళ, సాహిత్య సంకలనం
**pottage** గంజి, జావ
**potter** కుమ్మరి. ~ *'s clay* కుమ్మరి మట్టి
**pottery** కుమ్మరి పని, కౌలాలకం, మృణ్మయకళ
**potty** తెలివి తక్కువైన
**pouch** తిత్తి, చిన్న సంచి
**poulterer** కోళ్ల వర్తకుడు
**pounce** పక్షిగోరు; దుముకి పట్టుకొను; పైనబడు
**pounding** దంచటం
**pour** పోయు, వంపు, చల్లు
**pout** మొహం ముడుచుకొను
**poutice** కట్టు. *mustard* ~ ఆవపిండి కట్టు. *starch* ~ పిండికట్టు
**poverty** బీదరికం, దారిద్ర్యం
**power** అధికారం, శక్తి, సామర్థ్యం, బలం, తడాఖా, విద్యుత్తు. ~ *broker* రాజకీయ బేహారి. ~ *hungry* అధికార దాహం గల. ~ *sector* విద్యుత్ రంగం
**powerfully** పకడ్బందీగా, శక్తిపూర్వకంగా
**powerless** శక్తిహీన, అధికారహీన
**practical criticism** అనిబద్ధ విమర్శ
**practice** వాడుక, సాధన, ఆచరణ, అభ్యాసం
**practise** అభ్యసించు, అనుసరించు, ఆచరించు, అవలంబించు
**practitioner** వృత్తిలో ఉన్న వ్యక్తి, అభ్యాసకుడు
**praetorianism** అల్ప సంఖ్యాక వర్గాలు ప్రభుత్వం నడిపే విధానం
**pragmatic** ఆచరణీయ, కార్యసాధక
**pragmatics** సంకేత ప్రయోగ శాస్త్రం

**pragmatism** వ్యవహార జ్ఞానం/ వాదం
**pragmatist** ఆచరణవాది, వ్యవహార జ్ఞాని
**praise** సంస్తవం; పొగడ్త; స్తుతి, ప్రశంస, అభినందన; పొగడు, స్తుతించు, ప్రశంసించు
**praiseworthy** సంస్తవనీయ, కీర్తనీయ, పొగడదగిన, మెచ్చదగిన
**prance** పెద్ద పెద్ద అంగలతో నడుచు, దుముకు
**prank** జిత్తు; కుప్పిగంతు; కుచేష్ట
**prat** తెలివి తక్కువ
**prattle** అవ్యక్తపు మాట; అవ్యక్తంగా మాట్లాడు
**prawn seed** రొయ్యవిత్తనం
**praxis** క్రియాశీలత, అంగీకరించిన ఆచారం, ఉదాహరణల సముదాయం
**pray** ప్రార్థించు; బతిమాలు
**prayer** ప్రార్థన, విన్నపం, అభ్యర్థన
**prayers and penance** జపతపాలు
**preach** బోధించు, ఉపదేశించు
**preacher** బోధకుడు
**preaching** బోధన
**preamble** ప్రవేశిక, భూమిక, ఉపోద్ఘాతం
**pre-anaesthetic** మత్తుమందు ఇచ్చే ముందు
**pre-cancerous** పుట్టకురుపు పుట్టక ముందు
**precardial** గుండెముందు భాగానికి సంబంధించిన
**precarious** ప్రమాదకరమైన, అపాయకరమైన; సందేహాస్పద
**precatory** ప్రార్థనాత్మక
**precaution** ముందు జాగ్రత్త
**precautionary** ముందు జాగ్రత్తగా
**precede** ముందుగా పోవు/జరుగు
**precedence** అగ్రత, పూర్వత

**precedent** పూర్వ ప్రమాణం, పూర్వోదాహరణ
**preceding** మునుపటి, పూర్వ
**precentor** ప్రార్థనా సమావేశ నిర్వాహకుడు
**precept** సాధారణ సూత్రం, ధర్మసూత్రం, భగవదాజ్ఞ, ఉపదేశం
**precession** ముందుకు పోవు, ముందు నడుచు
**precinct** సరిహద్దు, ఆవరణ
**precious** అమూల్యమైన, అసాధారణ
**preciously** అసాధారణంగా
**precipice** చరియ; ఎక్కువ ఏటవాలుగా ఉన్న ప్రదేశం
**precipitance** తొందర; ఆలోచనా రాహిత్యం
**precipitant** అవక్షేపకరం
**precipitate** తొందరపెట్టు, తలకిందులుగా తోయు/ పడు; అవక్షేపం
**precipitator** అవక్షేపకరణి
**precipitous** నిట్రం, ఏటవాలుగా ఉన్న
**precis** సారాంశం
**precise** ఖచ్చితమైన, సరియైన
**precision** ఖచ్చితత్వం, సూక్ష్మత, సంక్షిప్తి
**preclude** అడ్డుకొను, ఆటంక పరచు, తొలగించు
**precocious** వయస్సుకు మించిన, అకాల పక్వ
**precoma** స్మృతిపోవడానికి ముందు
**preconceive** ముందుగా ఊహించు/ భావించు
**preconception** పూర్వభావం/ అభిప్రాయం
**precursor** పూర్వగామి, శకునం
**predator** ఇతర జంతువులను చంపి తినే జంతువు
**predatory** దోపిడీ చేసే, పీక్కుతినే, కొల్లగొట్టే
**predecessor** పూర్వాధికారి, పూర్వీకుడు
**predestination** ప్రారబ్ధం, విధి
**predestine** ముందుగా విధించు
**predicable** విధేయ ధర్మపదం
**predicament** సంకట పరిస్థితి, అవస్థ
**predicate** రూఢి పరుచు; (వ్యాకరణంలో) విధేయం, ఆఖ్యాతం
**predict** ఊహించు; జోస్యం చెప్పు
**prediction** జోస్యం, భావి కథనం
**predilection** గాఢప్రియత్వం, పక్షపాతం, అభిరుచి
**predisposition** పూర్వాభిమానం, సిద్ధత
**predominance** ప్రాబల్యం
**predominantly** ప్రబలంగా, ప్రధానంగా
**predominant** ప్రబలమైన, ప్రధాన, ముఖ్య
**preem** అలంకరణలో సమయం వెళ్ళబుచ్చు
**preeminent** అన్నిటికన్నా మేలైన, శ్రేష్ఠ
**preempt** పూర్వచర్య తీసుకొను
**preemption** నిరోధం, ముందే చేసిన దాడి
**preexistence** పూర్వస్థితి, ముందరి దశ
**preexisting** పూర్వస్థిత
**prefabrication** పురాఘటన, ముందు తయారీ
**preface** భూమిక; ముందు మాట, పీఠిక
**prefarment** పదోన్నతి
**prefatory** ఉపోద్ఘాతప్రాయ/రూపక
**prefect** అధిపతి, పాలకుడు, పరిరక్షకుడు
**prefer** ఎన్నుకొను, ఎంపిక చేసుకొను, ఎక్కువగా ఇష్టపడు; మొగ్గుచూపు
**preferable** ఎంచుకోదగిన, మెరుగైన, మేలైన
**preference** ప్రాధాన్యం, ఇష్టత, అభిమానం



**preferential** వరణాత్మక, మేలైన, ఉత్తమ
**preferred reading** ముఖ్యార్థ పఠనం
**prefix** ముందుగా చేర్చు (వ్యాకరణంలో) ఉపసర్గ, పూర్వలగ్న
**prefussion** నటన, అసత్యమైన హక్కు
**pregnancy** గర్భధారణ
**pregnant** గర్భవతి, కడుపుతో ఉన్న
**preheating** పూర్వతాపనం
**prehensile** గుండ్రంగా చుట్టి వస్తువులను పట్టుకొను
**prehistoric** చరిత్రపూర్వ. ~ *art* ప్రాగైతిహాసక కళ. ~ *period* ప్రాగైతిహాసిక యుగం
**prejudge** విచారణకు ముందే తీర్పునిచ్చు/ నిర్ణయించు
**prejudice** దురభిప్రాయం, పక్షపాతం, ప్రతికూలాభిప్రాయం, నిరసన భావం; పక్షపాతం/ దురభిప్రాయం కలిగించు, హాని కలిగించు
**prejudiced** ప్రతికూల అభిప్రాయం/ దురభిప్రాయం గల
**prejudicial** విరుద్ధ, హానికర, ప్రతికూల
**prelate** (క్రైస్తవ మత వ్యవస్థలో) ఉన్నతాధికారి
**preliminary** ప్రారంభిక, ప్రాథమిక. ~ *drawing* ఆరంభ లేఖనం. ~ *sketch* మొదటి చిత్తుపటం/నమూనా
**prelude** ఉపోద్ఘాతం; ఉపక్రమణిక; పరిచయం చేయు, ముందుగా సూచించు
**premature** అపక్వ, అకాల (పరిణత)
**premature (baby)** నెలతక్కువ బిడ్డ. ~ *failure* అకాల క్షీణత
**premaxilla** అగ్రహనువు, పై దవుడ
**premediation** కుట్ర, పూర్వాలోచన
**premedication** పూర్వౌషధప్రయోగం
**premenstrual** బహిష్టుకు పూర్వం
**premier** ప్రధానమంత్రి, ఉత్తమ, మొదటి, ముఖ్య
**premise** ఆధార వాక్యం, ప్రతిజ్ఞ
**premium** బీమా వాయిదా, లాభం, బహుమానం
**premonition** హెచ్చరిక, పూర్వసంకేతం, ముందు జాగ్రత చెప్పటం
**premonsoon period** పునాసకారు, ఎండకారు
**prenatal** ప్రసూతి పూర్వం
**preoperative** శస్త్రచికిత్సకు ముందు
**preordain** ముందుగా విధించు/నిశ్చయించు
**preparation** సన్నాహం; తయారీ, యత్నం
**preparative** సన్నాహక
**preparatory** సన్నాహక, ఆరంభ. ~ *stage* కృత్యాద్యవస్థ, ప్రారంభదశ
**prepare** సిద్ధం చేయు/ పడు
**prepared** సన్నద్ధ
**preparedness** సంసిద్ధత, సన్నద్ధత
**preponderant** ప్రబలమైన, అధిక భారమైన
**preponderate** బరువులో/ ఆధిక్యంలో మించు
**preposessing** పక్షపాతజనకమైన, ముందుగా ఆక్రమించిన
**preposterous** అస్వాభావికమైన, అవివేకమైన, అసంగతమైన, అసంబద్ధ
**prerogative** విశాష్టాధికారం, ప్రత్యేకాధికారం, అసామాన్యాధికారం
**presbiopia** చత్వారం, దగ్గర చూపులేమి
**prescience** భవిష్యజ్ఞానం, ముందు తెలివిడి
**prescribed** నిర్ణీత, నిర్దిష్ట
**prescript** ఆజ్ఞాపన

**prescription** ఔషధ నిర్ణయం; సూచన; ఆదేశం; చిరానుభవ హక్కు
**prescriptivism** శాసక పద్ధతి
**preselytise** నమ్మకాలను మరొకరితో పంచుకొను, మతం మార్పిడికి ఒప్పించు
**presence** సమక్షం, హాజరీ, ఉనికి, ఉపస్థితి
**present** బహుమానం; ప్రస్తుతం; వర్తమాన కాలం; ప్రస్తుత, హాజరై ఉన్న, సంసిద్ధంగా ఉన్న; బహుమతి ఇచ్చు; హాజరగు; సమర్పించు; ప్రతిపాదించు
**presentation** బహూకరణ, సమర్పణ; ప్రతిపాదన
**presentiment** ముందస్తు అనుమానం/ భయం
**presently** ఇప్పుడే, త్వరలో
**preservation** భద్రత, అభిరక్షణం, పరిరక్షణ, చెడిపోకుండా ఉంచడం, సంరక్షణ. *self* ~ స్వయంసంరక్షణ
**preservative** సంరక్షణకారి, చెడిపోకుండా ఉంచే
**preservator** రక్షకుడు, రక్షేకం
**preserve** పదిలంచేయు, జాగ్రతపరచు, భద్రపరచు, రక్షించు
**preside** అధ్యక్షతవహించు, శాసించు
**presidency** రాష్ట్రం, అధ్యక్షత, రాష్ట్రపతి పదవి, ప్రధానత
**president** అధ్యక్షుడు, అధిపతి; రాష్ట్రపతి
**presidential** అధ్యక్ష సంబంధమైన
**press** ముద్రణయంత్రం; వార్తాపత్రిక; పత్రికా రంగం/ ప్రపంచం
**press** అదుము, నొక్కు; పిండు; బలవంతం చేయు; తోయు, పోవు
**press communique** పత్రికా ప్రకటన
**pressing** అత్యవసరమైన
**press release** పత్రికా ప్రకటన
**pressure** పీడనం, ఒత్తిడి. *blood* ~ రక్తపీడనం. *diastolic* ~ నిమ్న రక్తపీడనం. *hydrostatic* ~ ద్రవస్థితి పీడనం. ~ *gauge* పీడనమాపకం. *systolic* ~ ఊర్ధ్వ రక్తపీడనం
**pressure groups** ఒత్తిడి బృందాలు/ ప్రభావ వర్గాలు
**prestation** సేవలకు తిండిగింజల రూపంలో చెల్లింపు జరిగే పద్ధతి
**prestige** పరువు, ప్రతిష్ఠ, గౌరవం
**presumably** చాలావరకు, బహుశా
**presume** భావించు, అనుకొను, ఊహించు
**presumption** అనుమానం, అభిప్రాయం, ఊహ
**presumptuous** గర్వితం, అతిధైర్యంగల
**presupposition** ముందుగా అనుకోవడం, పూర్వోహ, పూర్వభావం/ కల్పన
**pretence** నటన, మిష, సాకు
**pretend** నటించు, (లేని) హక్కుకోసం వాదించు
**pretender** నిరాధారంగా హక్కు ఉందని వాదించే వ్యక్తి, వేషాలమారి
**pretentious** డాంబికమైన, గొప్పలు చెప్పే, యోగ్యత/ ప్రాముఖ్యం ఉందని చాటుకొనే
**pretentiousness** డాంబికం, బుకాయింపు
**pretext** మిష, సాకు, నెపం
**pretty** సొగసైన, చక్కని, మనోజ్ఞమైన
**prevail** నెగ్గు, వ్యాప్తిలో ఉండు; ఒప్పించు, గెలుచు
**prevalent** వ్యాపించి ఉన్న, ప్రబలంగా ఉన్న. ~ *notion* వ్యవహారంలో ఉన్న భావం
**prevaricate** సందిగ్ధంగా చెప్పు, అబద్ధం చెప్పు, మాటలతో వంచించు, గుప్తంగా చెప్పు
**prevarication** అబద్ధం, సందిగ్ధవచనం
**prevent** నిరోధించు, నివారించు



**preventive** నివారక. ~ *detention* ముందస్తు నిర్బంధం. ~ *medicine* వ్యాధి నిరోధక వైద్యపద్ధతి
**preview** ముందస్తు ప్రదర్శనం; ముందుగా చూచు
**previous** ముందరి,పూర్వ, గత, మాజీ
**previously** లోగడ
**prey** ఎర, వేట; దోపిడీ సామగ్రి; వేటాడు, కొల్లగొట్టు
**priapism** అంగం ఎక్కువకాలం స్తంభించి ఉండడం, విశృంఖలత, కాముక ప్రవృత్తి
**price** వెల, మూల్యం, ధర; శ్రేష్ఠత. ~ *leader* మూల్య నిర్ణేత. ~ *movement* ధరలగతి. ~ *spiral* ధరల విపరీతపు పెరుగుదల. ~ *without engagement* చట్టబద్ధంగా కట్టుబాటు లేని ధర
**priceless** అమూల్యమైన
**prick** ముల్లు; పశ్చాత్తాపం, శిశ్నం; గుచ్చు, పొడుచు, నిక్కబొడుచు
**pricking** వేధనం, పొడవడం
**prickle** చిన్న ముల్లు
**prickly** ముళ్ళుగల
**prickly heat** చెమటకాయలు
**prick up** నిక్కబొడుచుకొను
**pride** గర్వం, హోదా, అభిమానం
**priest** పురోహితుడు, పూజారి
**priestly** పురోహితులకు సంబంధించిన/ తగిన
**prig** అహంకారి, స్వోత్కర్షగల వ్యక్తి
**prim** గంభీర, చక్కని
**primacy** సర్వోత్కృష్టత
**prima facie** చూడగానే, విచారించక ముందే
**primary** ప్రాథమిక, మూల, ప్రధాన. ~ *cell* ప్రాథమిక ఘటం. ~ *colour* ప్రధాన వర్ణం. ~ *current* ప్రాథమిక ప్రవాహం. ~ *particle* ప్రాథమిక కణం. ~ *structure* ప్రాథమిక నిర్మాణం. ~ *zone* ప్రాథమిక మండలం
**primates** వానరులు
**prime** ఆది, ప్రధాన, ఆరంభ దశ; నూత్న యౌవనం; శ్రేష్ఠభాగం
**primer** మౌలిక, ప్రాథమిక
**primeval** ప్రాచీన, పురాతన
**primigravida** ప్రథమగర్భం, తొలిచూలు
**priming** అధిభూమిక
**primipara** తొలికాన్పు, ప్రథమప్రసవం; మౌలికమైన, ప్రాచీనకాలపు
**primitive** ఆదిమ, పురాతన
**primogeniture** జ్యేష్ఠస్వామ్యం, పెద్ద కొడుకు పెత్తనం
**primordial** ఆద్య, మౌలిక
**prince** రాకుమారుడు
**princess** రాకుమార్తె
**principal** కళాశాలాధిపతి; మూలధనం; అసలు
**principality** రాజ్యం, ఆధిపత్యం
**principle** నియమం, (మూల)సూత్రం. ~ *of rebus* చిత్ర ప్రవహ్లిక
**print** ముద్ర, అచ్చు, ముద్రాంకం. ~ *medium* ముద్రణమాధ్యం
**print** v. ముద్రకొట్టు, అచ్చువేయు
**printer** ముద్రాపకుడు, అచ్చుయంత్రం
**printer's devil** ముద్రారాక్షసం
**prior** పూర్వ, వెనకటి
**priority** ప్రాధాన్యం, పూర్వత్వం, ముఖ్యత. ~ *sector* ప్రాధాన్య రంగం
**prisioner** ఖైదీ, బందీ, బంధితుడు
**prism** పట్టకం
**prismatic** పట్టక. ~ *colour* పట్టక వర్ణం
**prison** ఖైదు, జైలు, కారాగారం
**pristine** ప్రాచీన కాలపు, పురాతన, మారని

**privacy** ఏకాంతం, రహస్యం, గోప్యం
**private** ఆంతరంగిక, వ్యక్తిగత, సొంత, ప్రభుత్వేతర
**privately** రహస్యంగా, ఆంతరంగికంగా
**private ownership** ప్రభుత్వేతర యాజమాన్యం
**privation** దీనదశ; కష్టం, అభావం, లేమి
**privet** నిత్యహరితంగా ఉండే పొద
**privilege** ప్రత్యేక అధికారం, అసాధారణ అధికారం; సభాహక్కు. ~ *s committee* సభా హక్కుల సంఘం
**privy** ఆంతరంగికమైన, రహస్య, విషయం తెలిసిన; సొంతం. ~ *purse* రాజభృతి
**prize** గొప్పగా భావించు, మీటతో ఎత్తు; బహుమానం; మీట
**pro** ఆటే వృత్తిగా/ సంపాదన మార్గంగా స్వీకరించిన క్రీడాకారుడు/ క్రీడాకారిణి
**probability** సంభావ్యత, సంభవనీయత. ~ *distribution* సంభావ్యతా వితరణం
**probable** సంభావ్యమైన
**probably** బహుశా
**probate** వీలునామా ధ్రువపత్రం/ అధికారికమైన నకలు
**probationer** ఆరంభకుడు; పని నేర్చుకుంటూనే పనిచేసే వ్యక్తి
**probe** పరిశోధించు, దర్యాప్తుచేయు, విచారణచేయు
**problem** సమస్య, ఆలోచనీయమైన అంశం. ~ *play* సమస్యానాటకం. ~ *picture* నిగూఢ చిత్రం
**proboscis** తుండం, ముట్టె
**procedure** పద్ధతి; నిర్వహణక్రమం; ఆచారం
**proceed** కొనసాగించు, ముందుకుపోవు, చర్యతీసుకొను
**proceedings** వ్యవహార క్రమం, కార్యకలాపాలు
**procencephalon** అగ్రమస్తిష్కం
**process** క్రమం, విధానం, ప్రక్రియ, (కోర్టు) వ్యవహారం
**procession** ఊరేగింపు
**proclaim** చాటిచెప్పు, ఉద్ఘోషించు, వెల్లడిచేయు
**proclamation** ప్రకటన, ఉద్ఘోషణ, ఘోషణ
**procrastination** సాగతీత, టలాయింపు, ఆలస్యం
**procrastinator** జాగు చేసే వ్యక్తి
**procreate** జన్మనిచ్చు, కను, ఉత్పన్నం చేయు
**procreation** ప్రజననం
**proctitis** గుదంలో నొప్పి
**proctoscope** మలాశయదర్శిని
**procumbent** ముందుకు చొచ్చుకొని వచ్చిన; సాగిలబడే; నేలపై పాకే; సాష్టాంగపడే
**procurable** ప్రాపణీయ, సేకరించదగిన
**procure** సేకరించు, కలగజేయు, సంపాదించు, తెచ్చు
**procurement** సంగ్రహణం, సంపాదన, తార్పుడు(పని)
**procurer** కూర్పరి; సేకర్త, తార్పుడుకాడు
**prod** సూది, ముల్లు, అంకుశం (ముల్లు గర్రతో) పొడుచు
**prodigal** దుబారాచేసే, వృథాగా ఖర్చుపెట్టే
**prodigality** అమితవ్యయం, వ్యర్థత
**prodigious** అద్భుత, అసాధారణ, బ్రహ్మాండమైన
**prodigy** అద్భుతవ్యక్తి, విస్మయకర్త, విచిత్ర వ్యక్తి
**produce** ఫలం, పంట, ఫలితం; గుణకారలబ్ధం
**produced** నిష్పన్న, ఉత్పాదిత



**producer** నిర్మాత, ఉత్పాదకుడు
**product** ఉత్పన్నం, ఉత్పత్తి, పంట, ఫలితం, గుణకారలబ్ధం
**production** ఉత్పాదన, ప్రజననం. ~ *art* ఉత్పాదనకళ. ~ *relations* ఉత్పత్తి సంబంధాలు
**productive** ఉత్పాదక. ~ *capacity* ఉత్పాదన సామర్థ్యం
**profane** అపవిత్ర, భ్రష్ట, చెడిపోయిన
**profess** (బహిరంగంగా) పేర్కొను/ ప్రకటించు, ప్రవచించు, అంగీకరించు
**professional** వృత్తి సంబంధమైన. ~ *skill* వృత్తి నైపుణ్యం
**professionalism** వృత్తి తత్త్వం
**proficiency** ప్రావీణ్యం, పాండిత్యం
**proficient** ప్రావీణ్యం గల; కుశల, నిపుణ, యోగ్య
**profile** ఆకారం, (పార్శ్వ) రేఖాకృతి/ భంగిమ; వ్యక్తిత్వం; వ్యక్తిత్వ వర్ణన; వ్యక్తిగత వివరాలు
**profit** లాభం, ప్రయోజనం; ఫలం. ~ *before tax* పన్ను చెల్లింపునకు ముందు లాభం. ~ *booking* లాభాల స్వీకరణ. ~ *maximization* లాభగరిష్ఠీకరణ. ~ *taking* లాభాలు చేసుకోవడం
**profitability** లాభదాయకత
**profitable** ప్రయోజనకరమైన, లాభప్రదమైన
**profitably** లాభదాయకంగా
**profitless** లాభంలేని, నిష్ప్రయోజక
**profligacy** దుబారా, అమితఖర్చు, వృథావ్యయం
**profligate** నీతిబాహ్య, పరిత్యక్త
**profound** అగాధ, విస్తార, గహర, తీవ్ర
**profoundity** లోతు, విజ్ఞాన పరిమితి, గంభీరత
**profuse** అమిత, ధారాళ, విస్తార
**progenitor** మూలపురుషుడు
**progeny** సంతతి, వంశం
**prognosis** రోగ నిరూపణ/ భావిసూచన
**prognostication** భవిష్యదూహ
**program(me)** కార్యక్రమం, పథకం
**progress** అభివృద్ధి, అభ్యుదయం, ప్రగతి; అభివృద్ధి చెందు; ముందుకు పోవు
**progression** పురోగమనం, క్రమాభివృద్ధి, పరంపర, శ్రేణి. *arthmatic* ~ అంకగణిత శ్రేణి. *geometric* రేఖాగణితశ్రేణి
**progressive** అభ్యుదయకర, ప్రగతిశీల; అభివృద్ధి చెందుతున్న. ~ *assimilation* పురోగామి సమీకరణం. ~ *taxation* రాబడి ఉన్నవారి వద్ద పన్ను వసూలుచేసే పద్ధతి
**prohibit** నిషేధించు, ఆపు, కాదను
**prohibition** ఆటంకం, (మద్య) నిషేధం
**prohibitive** నిషేధార్థక, నిరోధించే
**project** ప్రణాళిక, యుక్తి, (పరి)యోజన, ముందుకు పొడుచుకొని వచ్చు, విసరివేయు, యుక్తిపన్ను, ఎత్తిచూపు, ప్రదర్శించు
**projectile** ప్రక్షేప(క)ం, విక్షేప(క)ం, విసరివేయదగ్గ
**projection** ప్రక్షేపం, ముందుకు పొడుచుకొని రావటం, ప్రదర్శన, తెరమీద చూపడం
**projector** విక్షేపకం, ప్రదర్శకం, పథకం రూపొందించే వ్యక్తి
**prokaryote** కేంద్రకపూర్వజీవి
**prolegomena** ముందుమాటలు, ఉపోద్ఘాతాలు
**proletarian** కార్మిక సంబంధమైన, శ్రామిక సంబంధమైన. ~ *democracy* కార్మికవర్గ/ శ్రామికవర్గ ప్రజాస్వామ్యం. ~ *internationalism* కార్మిక/ శ్రామిక వర్గ అంతర్జాతీయత

**proletariat** కార్మిక/ శ్రామిక వర్గం
**prolet cult** శ్రామిక సంస్కృతి
**prolicide** భ్రూణహత్య
**proliferate** విస్తరించు; పరిఢవిల్లు, తనను తాను పునరుత్పత్తి చేసుకొను, వేగంగా అభివృద్ధిచెందు
**proliferation** విస్తరణ, వ్యాప్తి, పునరుత్పాదన
**prolific** ఫలవంతమైన, సారవంతమైన, అధిక ఫలప్రద, బహూత్పాదక
**prologue** భూమిక, నాంది, ప్రస్తావన, ఆరంభం
**prolong** సాగదీయు, పొడిగించు, కాలహరణం చేయు, పెంచు
**prolongation** పొడిగింపు; విలంబం
**promenade** రహస్యమార్గం, విహార ప్రదేశం, వ్యాయామం కోసం నడుచు, పచారుచేయు
**prominence** ప్రాముఖ్యం, ఘనత, ప్రాధాన్యం
**prominent** ప్రముఖ, ప్రసిద్ధ, ఉన్నత
**prominently** ప్రముఖంగా, ఉన్నతంగా
**promiscuity** స్వైరవర్తన. *sexual* ~ లైంగిక స్వైర ప్రవర్తన
**promise** వాగ్దానం; ఆశ, బాస, హామీ; మాట ఇచ్చు, ఆశచూపు
**promising** ఆశావహ; అభివృద్ధిలోకి రాదగిన
**promissory** వాగ్దానంతో కూడిన
**promisuous** స్వైర, అస్తవ్యస్థ, విచక్షణా రహిత, లైంగిక సంబంధి
**promote** ప్రోత్సహించు, వృద్ధిచేయు; ఉన్నత పదవిలోకి పంపు, ప్రారంభించు, సాయపడు
**promoter** ప్రవర్తకుడు, వృద్ధికారకుడు, వ్యాపార ప్రారంభకుడు, నిర్మాత, ప్రవర్ధకం
**promotion** పదోన్నతి, వృద్ధి, ప్రోత్సాహం, ప్రారంభం
**prompt** చురుకైన, సత్వర; (నాటకంలో) మాట అందించు
**promptly** వెంటనే, సత్వరమే, శీఘ్రంగా
**promulgate** జారీచేయు, (అధికారికంగా) ప్రకటించు
**prone** ఉన్ముఖమైన, ఇష్టంగల, ముందుకు వాలి ఉన్న, ఏటవాలుగా ఉన్న, లొంగిపోయే
**proneness** ఉన్ముఖత
**pronominal** సార్వనామిక
**pronounce** ఉచ్చరించు, పలుకు; తీర్పు చెప్పు; ప్రకటించు
**pronounceable** ఉచ్చరించదగిన
**pronounciation** ఉచ్చారణ
**proof** నిరూపణ, రుజువు; సాక్ష్యం, నిదర్శనం; చిత్తుప్రతి, దాఖలా
**prop** ఊతం, ఆధారం; ఆనుకొను, ఆధారమిచ్చు, ఊతమిచ్చు
**propaganda** ప్రచారం
**propagate** ప్రచారంచేయు, వ్యాపింపచేయు; దండోరా వేయు
**propagation** విస్తరణ, వ్యాపనం, ప్రవర్ధనం
**pro patria** మాతృదేశం కోసం
**propel** ముందుకు నడుపు/తోయు, నెట్టు
**propellant** చోదక, చాలక
**propeller** చాలకం, చోదకం
**propensity** ఇష్టం, ఇచ్ఛ, ప్రవణత, ప్రవృత్తి, మొగ్గు, దుష్టస్వభావం
**proper** సముచిత, యుక్తమైన
**properly** సముచితంగా, యోగ్యంగా, యుక్తంగా
**property** ఆస్తి; సొత్తు; సహజగుణం, ధర్మం; తత్త్వం



**prophecy** భవిష్యద్ఘటనలను ముందుగా తెలుపు, ప్రవక్తగా మాట్లాడు, జోస్యం
**prophet** ప్రవక్త, భవిష్యద్దర్శకుడు
**prophetic** ముందుగా సూచించే
**prophylactic** రోగనిరోధక
**propinquity** దగ్గరగా ఉండటం, చనువు
**propitiate** బతిమాలు; శాంతపరచు; ప్రసన్నుడిగాచేయు
**propitious** ప్రసన్నమైన, దయగల; అనుకూలమైన, మంగళప్రద
**proponent** ప్రతిపాదకుడు, ప్రవర్తకుడు
**proportion** అనుపాతం; వంతు; దామాషా; తారతమ్య సంబంధం, నిష్పత్తి
**proportional** అనుపాత; నైష్పత్తిక. ~ *representation system* దామాషా ప్రాతినిధ్య పద్ధతి
**proposal** ప్రతిపాదన, ప్రస్తావన
**propose** ప్రతిపాదించు, వివాహేచ్ఛను తెలుపు
**proposer** ప్రతిపాదకుడు
**proposition** చర్చాంశం; ఉపపాదన; ప్రతిజ్ఞావాక్యం
**proprietary** స్వామిత్వం, యాజమాన్యం
**propriety** ఔచిత్యం; యుక్తత; న్యాయం; మర్యాద, యథార్థత
**propulsion** చోదనం
**pro rata** దామాషా పద్ధతి, కేటాయింపు
**prorogation** సమావేశాల నిలిపివేత/ సమాపనం
**prorogue** నిలిపివేయు, వాయిదావేయు
**proscribe** నిషేధించు; జప్తుచేయు
**prose** గద్యం, వచనం
**prosecute** నేరారోపణచేయు, విచారణ జరుపు, కొనసాగించు
**prosecution** దోషవిచారణ, ఫిర్యాదు అభియోగం, కొనసాగించడం
**prosecutor** అభియోక్త; విచారణకర్త
**proselytize** (బలవంతంగా) మతాంతరీకరించు
**prose poem** వచన పద్యం, వచన గేయం, వచన కవిత
**prosody** ఛందశ్శాస్త్రం
**prospect** దృశ్యం; దృగ్గోచర ప్రదేశం; ఆశాచిహ్నం, అవకాశం, భరోసా
**prospective** భావి, రాబోయే
**prospectus** విషయ ప్రణాళిక; వివరణ పత్రం, పరిచయపత్రం
**prosper** వర్ధిల్లు, ఫలించు; సుఖపడు
**prosperity** ఐశ్వర్యం, సౌభాగ్యం, సుసంపన్నత; సఫలత
**prosperous** భాగ్యవంతమైన, వర్ధిల్లుతున్న
**prostitute** పడుపుకత్తె, వేశ్య; పడుపు వృత్తిలోకి దించు
**prostitution** వ్యభిచారం, పడుపువృత్తి
**prostrate** సాగిలపడు
**prostration** సాగిలపడటం
**protagonist** ప్రవక్త, ప్రచారకుడు, సమర్థకుడు, నాయకుడు
**protect** రక్షించు, కాపాడు
**protection** రక్షణ, ఆశ్రయం
**protective** సంరక్షక. ~ *coating* పరిరక్షక లేపనం
**protector** రక్షకుడు, పాలకుడు
**protectorate** సంరక్షిత రాజ్యం, దేశం
**protege** ఆశ్రితుడు, పాలితుడు, సంరక్షితుడు
**protein** మాంసకృత్తు
**protem** తాత్కాలిక
**protempore** తాత్కాలిక
**protest** నిరసన, భిన్నాభిప్రాయం, విరుద్ధాభిప్రాయం, ఆక్షేపణ; వ్యతిరేకించు, నిరసన తెలుపు, ప్రతిఘటించు

**protestant** క్రైస్తవ మతంలో ఒక శాఖ; వ్యతిరేకాభిప్రాయం తెలిపే వ్యక్తి
**protestation** విరుద్ధాభిప్రాయ ప్రకటన
**prothorax** ప్రాగ్వక్షం
**protocol** ఒడంబడికల ప్రాథమిక పత్రం, గౌరవస్థాన భేదసూచనం
**protogeometric period** ఆదిమ జ్యామితీయ యుగం
**protoneolithic age** ఆరంభ నవీన శిలా యుగం
**protoplasm** జీవపదార్థం
**prototype** మూలరూపం, మూలరచన/ నమూనా, ఆదిమజీవి
**protract** పొడిగించు, సాగదీయు
**protracted war** దీర్ఘకాలిక యుద్ధం
**protracting** నాన్పుడు
**protraction** పొడిగింపు, విలంబం
**protractor** కోణమాపని, కోణమితి
**protruberance** ఉబుకు, ప్రాధాన్యం
**protrude** ముందుకు ఉబికి ఉండు
**protrusion** ఉబుకు
**protuberant** ఉబికి ఉన్న, ప్రాముఖ్యం గల
**proud** గర్విష్ఠి; అభిమాని; డాబుసరి
**prove** నిరూపించు, రుజువుచేయు, రుజువగు
**provenance** జన్మస్థలం, మూలం
**provender** మేత
**proverb** నానుడి, లోకోక్తి, సామెత, జాతీయం
**proverbial** సామెతవంటి, లోకప్రసిద్ధమైన
**provide** సిద్ధపరచు, సమకూర్చిపెట్టు; ఇచ్చు
**providence** విధి, కర్మ, దైవఘటన, పురాకృతం
**provident** దూరదృష్టి గల
**providental** దైవికమైన
**province** రాష్ట్రం, ప్రాంతం
**provincial** రాష్ట్రానికి సంబంధించిన, ప్రాంతీయ
**provision** వసరు; కేటాయింపు; ఆహార సామగ్రి
**provisional** తాత్కాలిక. ~ *government* తాత్కాలిక ప్రభుత్వం
**provisions** భోజన సామాగ్రి, సరుకులు
**proviso** షరతు; షరతులతో కూడిన ఒడంబడిక, ప్రతిబంధం, నిబంధన
**provocation** ప్రకోపనం; ఉత్తేజనం, రెచ్చగొట్టడం
**provocative** ఉత్తేజకరమైన, కోపం పుట్టించే, రెచ్చగొట్టే
**provoke** పురికొల్పు, రెచ్చగొట్టు, కోపం పుట్టించు
**prow** ఓడ ముందరి భాగం
**prowl** ఆహారం కోసం తిరుగుతుండు/ పొంచి ఉండు
**proximal** సమీప, సన్నిహిత
**proximate** సమీపవర్తి, దగ్గరి
**proximity** సామీప్యం, సాన్నిధ్యం, చేరువ
**proxy** ప్రతినిధి, వకీలు, బదిలీదారు
**proxy war** పరోక్ష యుద్ధం
**prude** లైంగికత్వానికి భయపడు
**prudence** ప్రాజ్ఞత, దూరదర్శిత్వం
**prudent** వివేకంగల, దూరదృష్టితో ప్రవర్తించే
**prudently** ముందు జాగ్రతతో
**prune** ఎండురేగు పండు; కత్తిరించు, నరుకు, తుంచు, తగ్గించు, కుదించు, తీర్చిదిద్దు
**pruning** కత్తిరింపు, ఛేదనం
**prurience** కామాతురత, దుర్వాంఛ
**pruritis** దురద



**pry** తొంగిచూచు, పరిశీలించు
**psalm** స్తోత్రం, స్తుతి, కీర్తన, ప్రార్థన
**psammophyte** ఇసుకలో పెరిగే
**psephologist** ఎన్నికల సర్వేలు నిర్వహించే వ్యక్తి
**psephology** ఎన్నికలు, వోట్లు, ప్రజాభిప్రాయ సేకరణ, సర్వేల పరిశీలన
**pseudandry** పురుష నామంతో రచనలు చేసే రచయిత్రి
**pseudo** బూటకపు, నకిలీ
**pseudogyn** స్త్రీనామంతో రచించే పురుషుడు
**pseudonym** కలం పేరు
**pseudopsychology** కుహనా మనస్తత్వ శాస్త్రం
**pseudostatement** కవిసమయం, కావ్య సత్యం
**psittacosis** చిలుకవల్ల వచ్చే రోగం, శుక రోగం
**psoriasis** పొడవ్యాధి, చర్మవ్యాధి
**pstille** సాంబ్రాణి కడ్డీ
**psychedelic art** మనోధర్మి కళ, భ్రాంత కళ
**psychiatric art** మనోవిక్షేప కళ
**psychiatrist** మనోరోగ వైద్యుడు
**psychiatry** మానసిక జబ్బుల చికిత్సా విధానం
**psycho** వికలోద్వేగరోగి; ఉన్మాది. ~ *neurosis* మనోవికృతి. ~ *sexual disorder* లైంగిక సామర్థ్య వైపరీత్యం. ~ *therapy* మానసిక చికిత్స, మనోవైద్యం
**psychoanalysis** మనో విశ్లేషణ
**psychogenic** మనోవ్యాధిజనిత
**psychologism** ప్రాథమికతా మనస్స్వాతంత్ర్యవాదం
**psychology** మనస్తత్త్వ శాస్త్రం
**psychopath** వికలోద్వేగరోగి
**psychosis** మనోవిక్షిప్తి, మతిభ్రమ
**psychosocial** మానసిక, సాంఘికాంశాలకు చెందిన
**psychosomatic** మనశ్చర్మ సంబంధి
**psychosis** మానసికాందోళన, మానసిక రుగ్మత
**puberty** యౌవనదశ, యుక్తవయస్కత
**public** ప్రజ / జన సామాన్యం ~ *distribution system* ప్రజా పంపిణీ వ్యవస్థ, పౌరసరఫరాల వ్యవస్థ. ~ *opinion* ప్రజాభిప్రాయం. ~ *ownership* ప్రభుత్వ యాజమాన్యం. ~ *policy* ప్రభుత్వ విధానం. ~ *sector* ప్రభుత్వ రంగం. ~ *sector enterprises* ప్రభుత్వ రంగ సంస్థలు
**publication** ప్రచురణ, ప్రచురిత గ్రంథం
**public house** ధర్మసత్రం, పూటకూటి ఇల్లు; సారాయి దుకాణం
**publicity** ప్రచారం
**public relations** పౌర సంబంధాలు
**publish** ప్రచురించు, ప్రకటించు; వెల్లడించు
**puddle** బురదనీటి గుంట, గందరగోళం
**puerile** చిలిపి, కుర్రతనపు
**puerperium** ప్రసూతి/ ప్రసవ కాలం
**puffed up** తమని తాము ప్రముఖులను కొని గర్వపడు
**puff up** వాచిపోవు
**pug** అడుగుజాడ, పంజాగుర్తు
**pugnacious** జగడాలమారి, కలహప్రియ
**puisne** చిన్న. ~ *judge* కింది న్యాయాధిపతి
**puke** వాంతి చేసుకొను
**pullarisation** చూర్ణన

**pullet** సంవత్సరం కన్నా తక్కువ వయస్సు కల్గిన కోడిపెట్ట
**pulling** లాగివేత
**pull one's weight** ఇతరులతో సమానంగా కష్టపడి పనిచేయు
**pulmonary** పుపుస, ఊపిరితిత్తికి సంబంధించిన
**pulp** గుజ్జు. *dental/tooth* ~ దంతపు గుజ్జు
**pulpit** చర్చి (బోధకుడి) వేదిక
**pulp literature** కాలక్షేప రచన
**pulsate** (నాడి) కొట్టుకొను, స్పందించు, కంపించు
**pulsating** స్పందమాన
**pulsation** రక్తనాళస్పందన
**pulsator** నాడీచలన యంత్రం; వజ్రాలను వెలికితీసే యంత్రం
**pulse** నాడి. *arterial* ~ ధమని నాడి *irregularity of* ~ క్రమం తప్పిన నాడి. *venous* ~ సిరనాడి
**pulseless** నాడిహీన
**pulse rate** నాడి వేగం
**pulses** కాయధాన్యాలు
**pulverisation** పొడి చేసే పద్ధతి
**pulverise** చూర్ణీకరించు
**pulveriser** చూర్ణకారి
**pulverize** పొడిచేయడం
**pumpkin** (మంచి) గుమ్మడి, కూష్మాండం
**pun** ద్వంద్వార్థ పదం, శ్లేష
**punch** హాస్యగాడు; పిడిగుద్దు, ముష్టిఘాతం, బెజ్జాలు పొడిచే సాధనం, బాగా మత్తెక్కించే సారాయి, పెద్ద పొట్ట. ~ *line* కొసమెరుపు. ~ *the air* విజయ సూచకంగా పిడికిలి బిగించడం; రంధ్రాలు చేయడం, పిడిగుద్దులు గుద్దడం
**punch card** ఉద్యోగి రాకపోకలు నమోదు చేయడానికి ఉపయోగించే కార్డు
**punching machine** ఉద్యోగుల రాకపోకలను నమోదు చేయడానికి వినియోగించే యంత్రం
**punch up** కొట్టుకొను
**punctual** వేళతప్పని, సమయంపాటించే
**punctuality** సమయపాలన
**punctually** సకాలంలో
**punctuate** విరామచిహ్నాలు పెట్టడం
**punctuation** విరామచిహ్నాలు
**puncture** బెజ్జం, రంధ్రం; రంధ్రంచేయు. *lumbar* ~ వెన్నెముకలో రంధ్రం చేసి ద్రవం తీయడం
**pungan** గానుక, కానుగ
**pungency** కారం, ఘాటు
**pungent** ఘాటైన, కారంగా ఉండే
**punish** శిక్షించు, దండించు
**punishable** శిక్షించదగిన
**punishment** శిక్ష, దండన
**punitive** దండనాత్మక, శిక్షాత్మక
**pup** కుక్క పిల్ల; (కుక్క) పిల్లలు పెట్టు
**pupil** కనుపాప; శిష్యుడు; విద్యార్థి
**puppet** తోలుబొమ్మ, కీలుబొమ్మ. ~ *government* కీలుబొమ్మ ప్రభుత్వం. ~ *show* తోలుబొమ్మలాట
**purberty** యుక్తవయస్కత, యౌవనదశ
**pure clay** స్వచ్ఛ మృత్తిక
**pure colour** స్వచ్ఛవర్ణం
**purgative** విరేచనకారి
**purge** క్షాళనం, ప్రక్షాళన, తొలగింపు
**purification** శుద్ధికరణం; పవిత్రీకరణ, శుభ్రంచేయటం
**purifier** శుద్ధికారి
**purify** శుద్ధిచేయు, పరిశుభ్రంచేయు, పవిత్రంచేయు
**purifying** శుద్ధీకారక, పవిత్రంచేసే
**purism** స్వచ్ఛతావాదం



**purity** నైర్మల్యం, స్వచ్ఛత, తేట, శుద్ధత. ~ *of colour* వర్ణస్వచ్ఛత
**purlieu** పొలిమేర, పొరుగు ప్రాంతం
**purloin** దొంగిలించు, అపహరించు
**purple** వంగవన్నె, కృష్ణలోహిత; నీలలోహితం, బచ్చలి పండు రంగు గల
**purport** సారాంశం, తాత్పర్యం, భావం, భావార్థం; తాత్పర్యం చెప్పు, బోధించు
**purr** పిల్లి అరుపు
**pursuance** అనుసరణ
**pursue** అనుసరించు, తరుము, నెరవేర్చు, కొనసాగించు
**pursuit** అనుసరణం, తరమడం, పని, వృత్తి
**purulent** చీముపట్టిన
**purvey** (భోజన సామగ్రి) సమకూర్చు, అమర్చు
**purview** పరిధి, హద్దు, అవకాశం
**pusher** మాదక ద్రవ్యాల సరఫరాదారు
**pusillanimous** పిరికి, భయస్థుడైన
**pus** చీము
**pustul** పొక్కు
**putative** ప్రఖ్యాత, ప్రసిద్ధి చెందిన
**put back** యథాస్థానంలో ఉంచు
**put off** వాయిదావేయు; ఆర్పు
**putrefaction** కుళ్లిపోవడం
**putrefy** కుళ్ళిపోవు, మురుగు
**putrid** కుళ్లిన, చెడిపోయిన
**putrifactive** కుళ్ళజేసే, దుర్గంధపరిచే
**putsch** ప్రభుత్వాన్ని కూలగొట్టడానికి క్రమబద్ధంగా చేసే ప్రయత్నం
**putter** (గోల్ఫ్‌లో) బంతిని నెమ్మదిగా తోసేవాడు; అందుకు వాడే పొట్టి క్లబ్
**put up** ముందుంచు, గ్రహించు
**puzzle** ఆశ్చర్యం, అర్థంకాకపోవడం, చిక్కు
**puzzled** సందిగ్ధంలో/ అయోమయంలో పడ్డ, కలవరపడ్డ
**pycnocline** సాంద్రతా భేదం
**pycnometer** మట్టిసాంద్రతా మాపకం
**pye dog** ఊరకుక్క
**pygmy** మరుగుజ్జు, వామనుడు
**pyknic** స్థూలకాయుడు
**pylon** ఆధారం, స్తంభం, ద్వారం
**pyostyle** పక్షితోక, ఎముక
**pyramid** గోపురం; రాజసమాధి
**pyre** చితి
**pyrexia** జ్వరం
**pyrometer** ఉష్ణ(తాప)మాపకం
**pyrotechnic** బాణాసంచా తయారీ పని
**python** కొండచిలువ

# Q q

**qua** కాల్పనిక భావాన్ని వ్యక్తం చేయడం
**quack** నకిలీ/ బూటకపు వైద్యుడు
**quadra** నాలుగు, చతుస్సంబంధమైన
**quadrangular** చతుర్భుజి, నాలుగు కోణాలు గల చతురస్రం
**quadratic** వర్గ, ద్విఘాత. ~ *equation* వర్గసమీకరణం. ~ *expression* వర్గ సమాసం
**quadrilateral** చతుర్ముఖ
**quadrivalent** చతుస్సంయోజక
**quadruple** నాలుగింతలు
**quadruplicate** నాలుగు కాపీలు, నాలుగవ కాపీ
**quaff** త్వరితంగా, వేగంగా
**quagmire** రొంపి, చిత్తడి నేల, ఊబి
**quaint** ఆకర్షణ కలిగి ఉండే, వింతైన

**screech** వాహనాల చక్రాలు చేసే చప్పుడు, ఆర్తనాదం
**screeching** కిచకిచ
**screen** తెర, జవనిక, యవనిక, దాచు, అడ్డుకొను, తెరమీద వేయు
**scribble** గజిబిజిగా/ తొందరగా రాయడం, గిలకడం, నిరర్థక రచన
**scribe** విలేకరి, రాయసకాడు; దస్తావేజులూ పత్రాలూ రాయు
**scrim** మెత్త. ~ *shaw* తిమింగలపు ఎముక
**scrimmage** పోట్లాట, జగడం
**scrimp** పొదుపుగా జీవించు
**scrip** షేరు, వాటా. ~ *issue* పాత వాటాదారులకు ఉచితంగా వాటాల జారీ
**script** లేఖనం, లిపి; రాతప్రతి, దస్తావేజు
**scriptum** లేఖ
**scripture** ధార్మిక/ పవిత్ర గ్రంథం, వేదం, బైబిల్, ఖురాన్ (లాంటివి)
**scrotum** వృషణంతిత్తి
**scrub** నీచుడు, కుంచె; గుల్మం, పొద, తోము, రుద్దు
**scrubbing** తోమటం, రుద్దటం, ధావనం
**scrub jungle** చిట్టడవి
**scrunch** (వస్తువులను) శబ్దం వచ్చేటట్లు ఒత్తడం
**scruple(s)** పాపభీతి, సంకోచం, నీతి నియమాలు
**scrupulous** న్యాయాన్యాయ విచక్షణ గల, నియమవర్తి
**scrutinise** జాగ్రత్తగా పరీక్షించడం, పరిశీలించు, తనిఖీ చేయు
**scrutinised** సంశోధిత
**scrutiniser** పరిష్కర్త
**scud** వేగంగా పరుగెత్తు, పారిపోవు; (స్కడ్) క్షిపణి
**scuffle** చిన్నపోట్లాట, దొమ్మీ; ద్వంద్వ యుద్ధం
**scullery** వంటగది దగ్గరగా ఉండే గది; కలియబడి పోరాడు
**sculptor** శిల్పి, మూర్తి/ రూప కారుడు
**sculpture** శిల్పం, స్థాపత్యం, మూర్తి నిర్మాణ కళ, శిల్పకళ. ~ *painting* శిల్ప చిత్రణ
**scum** మడ్డి, తెట్టె, పనికిరాని పదార్థం/ జనం
**scummy** చెత్త
**scupper** పూర్తిగా నాశనం చేయు
**scurf** చుండ్రు
**scurrility** బండబూతు
**scurrilous** బూతురాత రాసే, అశ్లీల పదాలు మాట్లాడే, నిందాత్మకమైన
**scurry** వేగంగా పారిపోయినప్పుడు కలిగే శబ్దం; వేగంగా పారిపోవు
**scurvy** స్కర్వీ, సి విటమిన్ లోపిస్తే వచ్చే వ్యాధి
**scuttle** బుట్ట, తట్ట; (నౌకలో) గూడు, పరుగెత్తు, పారిపోవు
**scythe** కొడవలి, కోతకత్తి
**seal** ముద్ర, మూత, ఒక సముద్ర జంతువు (సీలు); ముద్రవేయు, అవకాశం లేకుండా చేయు, మూసివేయు, తుది నిర్ణయం తీసుకొను
**sealer** రూఢిక
**seam** (క్రికెట్) బంతి కుట్టు
**seamounts** సముద్ర గర్భస్థ పర్వతాలు
**seance** ఆధ్యాత్మిక సమావేశం
**sear** తీవ్ర ఉష్ణంతో కాల్చడం
**search** సంశోధన, గవేషణ
**sea scape** సాగర దృశ్యం
**season** రుతువు, యుక్త సమయం; ఉపయోగంలోకి తెచ్చు, రుచి కలిగించు, పటిష్ఠం చేయు, పోపు పెట్టు



**seasonal unemployment** కాలికోద్యోగిత
**sebaceous gland** చర్మస్రావ గ్రంథి
**secede** విడిపోవు, వేరగు
**secessionism** వేర్పాటువాదం
**seclude** ఏకంగా ఉంచు, వేరుపరచు, విడగొట్టు
**seclusion** ఏకాంతం, ఒంటరితనం
**second** ద్వితీయ, రెండో; బలపరచు
**secondary** ద్వితీయ ప్రాధాన్యం గల/ గౌణ, అప్రధాన
**secrecy** గోప్యం, గోపనం
**secret** గూఢం, లోపాయకారీ, రహస్యం. ~ *session* రహస్య సమావేశం; రహస్య స్థలంలో దాచు, గుప్తపరుచు, వేరుచేయు, తీసివేయు
**secretion** స్రావం
**sect** తెగ
**sectarianism** ఒంటెత్తు వాదం, ఉలిపికట్టె ధోరణి
**secular** లౌకిక, మతప్రమేయంలేని
**secularism** లౌకికవాదం: మతాతీత భావన
**secure** పదిలం, భద్రం
**sedate** స్థిర, గంభీర, శాంత
**sedative** (ఉప)శమనకారి
**sedentary** చలనంలేని, కదలని, ఒకేచోట ఉండే. ~ *agriculture* స్థానబద్ధ వ్యవసాయం
**sedentes** ఒకే ప్రదేశంలో ఉండే ప్రజలు, వలసపోని జనాభా
**sedge** బురదనేలల్లో పెరిగే మొక్క
**sediment** అవక్షేపం, మడ్డి
**sedition** దేశ/ రాజ ద్రోహం, తిరుగుబాటు
**seed** విత్తనం, బీజం
**seedy** అనాహ్లాదకరమైన; విత్తులు గల
**seep** కారు, స్రవించు, కురియు, జాలువారు
**seepage** ఊట, చెమ్మ, పారుదు; చిన్న వాగు
**seer** ద్రష్ట, యోగి, జ్ఞాని
**seethe** నిండు, పరిపూర్ణమగు
**segment** ఖండం, తునక, చిన్న భాగం, అంశం
**segregate** వేరు చేయు, పృథక్కరించు
**segregation** పృథక్కరణ, విభజన, వేరు చేయడం, వర్ణ/ జాతి చక్రం
**seigniorage** హక్కు, నాణాల సుంకం, టంకశుల్కం
**seisin** పరిభోగం, స్వాధీనం
**seismograph** భూకంప లేఖిని, భూకంపం సూచికం
**seismology** భూకంపాధ్యయనశాస్త్రం
**seize** జప్తుచేయు, పట్టుకొను, స్వాధీనం చేసుకొను
**seldom** అరుదుగా, అపురూపంగా, అప్పుడప్పుడు
**selection** ఎంపిక, సంవరణం, సంకలనం
**selective** ఎంపికచేసిన, ఎంపికయిన, వరణాత్మక
**selenography** చంద్రుని ఉపరితల లక్షణాల అధ్యయనం
**selenology** చంద్రశిలాధ్యయన శాస్త్రం
**self** తాను, తన, స్వంత, స్వయం, ఆత్మ, స్వ. ~ *acquired* స్వార్జిత
**self-assertion** ఆత్మనిశ్చయం
**self-centred** స్వార్థపర, ఆత్మాభిమాని
**self-conceit** స్వోత్కర్ష
**self-condemnation** ఆత్మనింద
**self-confidence** ఆత్మవిశ్వాసం
**self-conscious** ఆత్మచేతన
**self-contained** స్వయం సమృద్ధ, స్వయం పరిపూర్ణ

**self-contradictory** పరస్పర విరుద్ధ
**self-control** ఆత్మనిగ్రహం
**self-defence** ఆత్మరక్షణ
**self-delusion** ఆత్మవంచన
**self-denial** ఆత్మత్యాగం
**self-destructive** ఆత్మనాశక
**self-determination** ఆత్మనిర్ణయం, స్వయం నిర్ణయాధికారం
**self-discipline** స్వయంశిక్షణ
**self-earned** స్వార్జిత
**self-employment** స్వయం ఉపాధి
**self-evaluation** తనను తాను అంచనా వేసుకోవడం
**self-evident** ప్రత్యక్ష, స్వతస్సిద్ధ, స్పష్ట
**self-explanatory** స్వయం వివరణాత్మక
**self-fulfilment** జన్మసార్థక్యం
**self-governing** స్వయంపాలిత
**self-government** స్వపరిపాలన
**self-hardening clay** స్వయం ఘనీభూత మృత్తిక
**self-immolation** ఆత్మాహుతి, తనను తాను దహనం చేసుకోవడం
**self-inductance** ఆత్మ ప్రేరకత్వం
**self-interest** స్వార్థపరత్వ, స్వప్రయోజనం
**selfish-intention** స్వార్థాశయం
**selfishness** స్వార్థ (పరత్వ)ం
**self-luminous** స్వయంప్రకాశక
**self-made** స్వయంకృషిగల
**self-objectification** ఆత్మవ్యక్తీకరణం
**self-pollination** ఆత్మపరాగసంపర్కం
**self-portrait** స్వమూర్తి చిత్రం
**self-possession** నిగ్రహం, సంయమం
**self-reliance** స్వయంసమృద్ధి
**self-reproach** ఆత్మనింద
**self-respect** ఆత్మాభిమానం, ఆత్మగౌరవం, స్వాభిమానం
**self-sacrifice** స్వార్థత్యాగం, ఆత్మత్యాగం
**self-seeking** స్వార్థపరాయణ
**self-styled** స్వయంనియమిత
**self-sufficiency** స్వయం సమృద్ధత, స్వావలంబన, ఆత్మనిర్భరత
**self-sufficient** స్వయంసమృద్ధ
**self-suficience** స్వయం సమృద్ధి, స్వావలంబన
**self-willed** స్వబుద్ధిగల, స్వతంత్ర నిర్ణయాలు చేయగల
**selling pressure** అమ్మకాల ఒత్తిడి
**semantics** అర్థ విచారం
**semblance** పోలిక, సమానత
**semeiology** సంకేతశాస్త్రం
**semi** అర్ధ
**semi-abstract** అర్ధనైరూప్య
**semi-arid** అర్ధశుష్క
**semicircle** అర్ధవృత్తం
**semi coma** అసంపూర్ణ స్మృతిరాహిత్యం
**semilunar** అర్ధచంద్రాకార
**seminal** శుక్లసంబంధమైన; ప్రారంభక
**semiotics** సంస్కృతీ సంకేతాధ్యయనం
**semiotics** భావ ప్రకటనాధ్యయనం
**semi-presious stones** రంగురాళ్ళు
**semi-solid** అర్ధఘనస్థితి
**semi-stylized** అర్ధశైలీకృత
**semi-transparency** అర్ధపారదర్శకత
**senate** పాలకసభ, అమెరికన్ కాంగ్రెస్‌లోని ఎగువ సభ/ రాష్ట్రాల సభ
**senile** ముసలితనపు, వార్ధక్య జనిత
**senilicide** వయస్సు మీరిన, ఎందుకు పనికిరాని వ్యక్తులను చంపడం
**senility** వార్ధక్యం, జీర్ణత్వం, ముసలితనం, వార్ధక్య బలహీనత
**senitism** వయస్సుతో నిమిత్తం లేకుండా వృద్ధాప్య లక్షణాలను కలిగి ఉండడం



**sensation** ఇంద్రియ జ్ఞానం, ఉద్రేకం, సంవేదన, అనుభూతి; సంచలనం, తెలివి, ఉద్వేగం
**sensationalism** ఇంద్రియజ్ఞానమే జ్ఞానానికి మూలమని చెప్పేవాదం; పత్రికల్లో సంచలనశీల రచనా పద్ధతి
**sense** n. వివేకం, అర్థం; బుద్ధి; ఇంద్రియం; భావం, చైతన్యం
**sense** v. అవగతం చేసుకొను, అవగత మగు; అర్థంచేసుకొను
**senseless** బుద్ధిలేని, అర్థరహిత
**sense organ** జ్ఞానేంద్రియం
**sensibility** సూక్ష్మ గ్రాహ్యత, రసికత, రాసిక్యం, కళాస్పందన : ఒక గాఢమైన భావానికి ఉత్తమమైన కళాఖండానికి స్పందించే గుణం
**sensible** బుద్ధిగల, వివేక. ~ *temperature* ఊహామాత్ర ఉష్ణోగ్రత: ఉష్ణమాపకంలో నమోదు కాకున్నా, ఉన్నట్లుగా భావించే ఉష్ణోగ్రత
**sensitive** సున్నితమైన, స్పందించే, మెత్తని, సూక్ష్మగ్రాహకం
**sensitiveness** గ్రహణశీలత, సున్నితత్వం
**sensitivity** సుతిమెత్తనితనం, సూక్ష్మ గ్రాహ్యత
**sensitized** సున్నితమైన
**sensory** సంవేదనాత్మక, జ్ఞానంకల. ~ *nerves* జ్ఞాన నాడులు
**sentence** తీర్పు, శిక్ష, దండన; వాక్యం
**sentiment** మనోభావం, భావవృత్తి, చిత్తవృత్తి, భావానుబంధం, సంవేదన; ప్రబల విశ్వాసం
**sentinel** కావలి(వాడు)
**sentry** కాపలాదారు
**separation** విభజన, పృథక్కరణం, వేర్పాటు. ~ *of powers* అధికారాల వేర్పాటు/ విభజన
**septic** కలుషిత
**septum** విభాజకం
**sepulchre** శ్మశానం, రుద్రభూమి
**sequel** పర్యవసానం, తరువాయి, శేషం, ఫలితం
**sequence** క్రమం, వరస, పరంపర
**sequestration** ప్రత్యేకించడం, (వివాదంలో ఉన్న ఆస్తిని) మధ్యవర్తుల పరం చేయడం
**sequestrum** కుళ్లిన ఎముక
**serendipitous** ప్రణాళికారహితంగానైనా ఫలప్రదమగు
**serendipity** అనుకోకుండా కొన్ని ముఖ్యమైన సిద్ధాంత సత్యాలను కనుగొనడం
**serene** (ప్ర)శాంత, ధీర, స్వచ్ఛ, నిష్కల్మష
**serf** (అర/ అర్ధ) బానిస, భూస్వామ్య బానిస / సేవకుడు / దాసుడు
**serfdom** దాస్యం, బానిసత్వం
**serialize** ధారావాహికంచేయు
**seriatim** క్రమబద్ధంగా, విడివిడిగా, యథాక్రమంగా
**sericultrue** పట్టుపరిశ్రమ, పట్టుపురుగుల పెంపకం
**series** పరంపర, క్రమం
**serious** ఆందోళనకర, తీవ్ర
**serology** రసవిజ్ఞానం
**serpentine** వంకర టింకర, పాము నడక వంటి, సర్పిలాకార
**serum** రక్తరసి
**service** సేవనం, సేవ; సేవించు, నౌకరీ చేయు
**servitude** దాస్యం, సేవ, అనుభోగభారం, బానిసత్వం, పరాధీనత
**session** సమావేశకాలం
**set** జత, వరస, వర్గం, ఆకారం, మార్గం, నికరం, గుంపు: సదృశ వస్తు/వ్యక్తి సము

దాయం, అస్తమించు, ఉండు, నిలుపు, అమర్చు, ప్రత్యేకించు, సరిచేయు

**set aside** రద్దుచేయు, తోసిపుచ్చు, తొలగించు

**set back** ఎదురుదెబ్బ, ఆటంకం, పరాజయం

**setting up** ఏర్పాటు

**sever** (సంబంధం) తెంచుకొను, వేరు చేయు

**several** అనేక, మిక్కిలి

**severe** తీక్షణమైన, తీవ్రమైన, కఠినమైన

**severence** విభజన, విచ్ఛేదం, విడిపోవడం

**sewage** వ్యర్థపదార్థాలు, మురికినీరు

**sewer** మురికి నీళ్ల గొట్టం/ కాలవ

**sewerage treatment** మురుగుశుద్ధి

**sewing** కుట్టుపని, దర్జీపని

**sex** స్త్రీ పురుషభేదం, లింగం, లైంగిక వాంఛ. ~ *appeal* రూపాకర్షణ ~ *education* లైంగిక విద్య

**sexagenerian** షష్టిపూర్తి అయిన వ్యక్తి

**sexis** స్త్రీ వివక్షా దృష్టిగల పురుషుడు

**sexism** స్త్రీ వివక్షాదృక్పథం

**sex perversion** అసంబద్ధ లైంగిక కాంక్ష

**sex ratio** స్త్రీ పురుష నిష్పత్తి

**sexual harrassment** స్త్రీలను వేధించడం

**sexuality** లైంగికభావన, లైంగికత

**shabby** నీచ, క్షుద్ర; చింకి పాతలు ధరించిన

**shade** ఛాయ, నీడ, ఆశ్రయం

**shadow** ఛాయ, నీడ, రంగు, కాంతి; కొంచెం

**shadowdge** ఛాయాంచలం

**shallow** లోతులేని, నిస్సార; మిడిసిపడే

**sham** మిథ్య, బూటకం, మోసం, సాకు; మోసగించు, సాకుచెప్పు

**shaman** నైపుణ్యంలేని వైద్యుడు, (గిరిజనులలో) మతాధికారి

**shamanism** ఆత్మ వ్యక్తిని ఆవహించి ప్రేరేపిస్తుందనే మతవిశ్వాసం

**shamble** కసాయి అంగడి; విధ్వంసం

**shame** సిగ్గు, అవమానం; సిగ్గుపరచు, అవమానించు

**shameful** సిగ్గుచేటు, అవమానకర

**shameless** సిగ్గుమాలిన, సిగ్గులేని

**sham sale** బూటకపు అమ్మకం, మోసపు అమ్మకం

**shandy** సంత

**shape** ఆకృతి, ఆకారం

**share** వాటా, వంతు, భాగం. ~ *capital* మూలధనంవాటా. ~ *holder* వాటాదారు. ~ *market* షేర్‌మార్కెట్. ~ *cropping* కౌలుదారీ వ్యవసాయం, భాగించు, భాగం పంచు, భాగం తీసుకొను, పాల్గొను

**shark** సొరచేప, అధిక వడ్డీ రేట్లపై అప్పులిచ్చే వ్యక్తి

**sharp** నిశిత, వాడియైన, పదునుగల, చతుర. ~ *shooter* గురికాడు

**sharper** వంచకుడు, మోసగాడు

**shatter** పగలగొట్టు, ఛిన్నభిన్నమగు

**sheaf** కాగితాల దొంతర లేదా కట్ట

**shearing** కర్తనం, కత్తిరించడం

**sheen** శోభ, తేజస్సు, మెరుపు

**sheer** పూర్తి, పరిపూర్ణ; కేవలం

**shelf** అటక, అల్మారా, గోడలో బిగించిన అర

**shelter** నిలువనీడ, ఆశ్రయం, ఆవాసం; ఆశ్రయించు, రక్షించు

**shelve** పక్కకు పెట్టు, నిలిపివేయు, మూసివేయు

**shepherd** గొర్రెలకాపరి, పశుపాలకుడు

**shibboleth** సంకేతం, గుర్తు, పద్ధతి, ఊత పదం



**shield** కవచం; రక్షించు, ఆదుకొను, కాపాడు

**shift** మార్పు, వంతు; బదిలీ, తరలించు, మార్చు, యుక్తిచేయు, మాటమార్చు

**shifting agriculture** పోడు వ్యవసాయం

**shine** ప్రకాశం, తళుకు/ ప్రకాశించు, మెరియు, ప్రసిద్ధికెక్కు

**shingle** గులక రాళ్ళు, చెక్కలతో ఇంటి కప్పువేయు

**shining** ప్రదీప్తి

**shiny** ప్రకాశవంతమైన

**shirk** వెనుకంజవేయు, బాధ్యత విస్మరించు

**shirker** పనిదొంగ

**shiver** వణుకు

**shivering** వణకటం, కంపనం

**shootfly** రెండు రెక్కల చీడ కీటకం

**shore** ఒడ్డు, గట్టు, తటి

**short** పొట్టి, హ్రస్వ, దగ్గర. ~ *comings* లోటుపాట్లు. ~ *gestation project* త్వరిత ఫలన పథకం. ~ *sight* హ్రస్వ దృష్టి. ~ *story* కథానిక, చిన్నకథ. ~ *term* స్వల్పకాలిక

**show** ప్రదర్శన, పటాటోపం, వేడుక; ప్రసవసూచకస్రావం. ~ *case* ప్రదర్శన పేటిక

**shred** ముక్కలుచేయు

**shredder** (కాగితాన్ని) ముక్కలు చేసే యంత్రం

**shreik** కీచుమనే ధ్వని, కీచుమని అరచు

**shrewd** నేర్పరి, గడుసరి, చతుర, నిశిత బుద్ధిగల, సూక్ష్మబుద్ధిగల

**shrewdness** గడసరితనం

**shrill** భరించలేని ధ్వని, కీచుధ్వని, తీక్ష్ణ, తీవ్ర, కర్కశ

**shrimp** చిన్నరొయ్య

**shrine** దేవాలయం, ప్రార్థనాస్థలం, పుణ్యక్షేత్రం; స్మారకస్థలం

**shrink** ముడుచుకొను, వెనుదీయు, కుంచించుకపోవు, తగ్గు

**shrinkage** కుంచించుక పోవడం, ముడుచుకొని పోవడం, కుంగుదల, సంకోచం

**shrivel** ముడుచుకొను, ముడుతలుపడు

**shroud** కప్పు; శవాన్ని కప్పే గుడ్డ, కప్పు, మరుగు అవు

**shrub** పొద, తుప్ప

**shudder** వణుకు, కంపం; కంపించు, వణుకు, అసహ్యించుకొను

**shuffle** మార్పు, పునర్వ్యవస్థీకరణ, (పేకముక్కలు) కలుపు

**shun** బుద్ధిపూర్వకంగా తప్పించుకొను, త్యజించు

**shutdown** మూసివేత

**shyster** నిజాయితీలేని వ్యక్తి

**sialagogue** లాలాజల ప్రేరకం

**siamese twins** అంటుకున్న కవలలు

**sib (sibling)** సహోదరుడు, సహోదరి

**sick** అస్వస్థ, దుఃఖిత

**sickle** కొడవలి. ~ *cell anaemia* కొడవలి కణ రక్తహీనత

**sickness** అస్వస్థత, రోగం. *motion* ~ ప్రయాణ వికారం, ఖాయిలా. *sleeping* ~ అతినిద్రా వ్యాధి

**side** పక్షం, తరపు, కోణం, ముఠా, జుట్టు. *take* - పక్షం వహించు, సహాయం చేయు

**sidereal month** నక్షత్ర మాసం

**sidereal** నక్షత్రాలకు సంబంధించిన

**side track** పక్కదారి పట్టడం

**siding** వత్తాసు ఇవ్వడం

**sidle** తప్పించుకోవడానికి జాగ్రత్తగా నడవడం

**siege** ముట్టడి

**sieve** జల్లెడ; జల్లించు

**sieving** జల్లించడం
**sigatoka leaf spot** పొగాకు మచ్చ తెగులు, వేరుసెనగ పిక్కతెగులు
**sigh** నిట్టూర్పు, ఉసురు
**sight** లోకనం, దృశ్యం; అంచనా; దృష్టి ~ *bill* సమర్పించగానే చెల్లించాల్సిన వినిమయ బిల్లు
**sign** చిహ్నం, గుర్తు, (భావ) సంకేతం
**signal** సంకేతం, గుర్తు, సూచన
**signature** సంతకం, దస్కతు, చేవ్రాలు
**signification** భావసార్థకత, ప్రముఖత, ప్రాధాన్యత
**signify** సూచించు, అర్థమిచ్చు
**silhouette** నీడ(బొమ్మ), ఛాయాచిత్రం
**silt** పూడిక, ఒండ్రు, బురద
**silurian** సైలూరియన్ కాలం; పాతరాతి యుగంలో 430–395 మిలియన్ల సంవత్సరాలకు సంబంధించిన కాలం
**silviculture** అడవుల అభివృద్ధి
**similarity** తుల్యత, పోలిక, సారూప్యత, సామ్యం
**simile** పోలిక, సాదృశ్యం, ఉపమానం
**simmer** ఉడుకుతున్న స్థితి, అతికష్టంమీద కూడ ఆపలేని దశ, ఉడుకు
**simple** సరళ, సాధారణ, నిరాడంబర, సాదా. ~ *imprisonment* సాధారణ జైలుశిక్ష. ~ *leaf* సామాన్యపత్రం. ~ *enumeration* సరళగణనం
**simpleton** అమాయకుడు, వెర్రిబాగులవాడు, తెలివితేటలు లేనివాడు
**simplicity** నిరాడంబరత, సులభ సాధ్యత
**simulate** అనుకరించు, నటించు
**simulation** కపటం, సాకు, నటన, అనుకరణ
**simulator** అనుకరణయంత్రం
**simultaneous** ఏకకాలంలో, ఒకేకాలంలో, అదే సమయంలో. ~ *representation* ఏక కాలిక ప్రతికల్పన/ ప్రాతినిధ్యం
**sincerity** నిజాయితీ
**sine cure** కష్టపడకుండా జీతం తీసుకొను
**sine die** నిరవధికంగా. *adjourned* ~ నిరవధికంగా వాయిదా వేయడం
**sine qua non** అత్యవసరమైన (షరతు)
**singeric** కపి చిత్రణ
**single** ఏక, వ్యస్త, ఒంటరి, ఒకే ఒక, వ్యక్తిగత, ఏకాంత, పెళ్లికాని. ~ *member constituency* ఏక సభ్య నియోజకవర్గం. ~ *party system* ఏకపార్టీ పద్ధతి
**singular** ఏకవచనం; ఒంటరి, అద్వితీయ. ~ *universals* ఏకైక సార్వత్రికాలు
**singularism** ఏకైకవాదం
**singularity** విచిత్రత, విశేషం, ఏకత్వం, అసాధారణం, ప్రత్యేకత, కొత్తదనం
**sinister** చెడ్డ, దుష్ట, హానికర, క్రూర
**sinuous** వంకరటింకర
**sinus** సరణి
**sink** మునుగు, ముంచు, వంగు, ప్రమాణం కోల్పోవు, దిగబడు, దిగజారు, గొంతు తగ్గించు, నిరుత్సాహపడు, ఆశవదులు కొను, చొచ్చుకుపోవు, గడగడా తాగు
**sink down** కుంగు
**sintering** కరిగేంతవరకు వేడి చేయడం
**siphon** మళ్ళింపు, అంకుశనాళిక
**sitter** ఉపవిష్టుడు, ఆసీనుడు
**sitting tenant** కిరాయిదారు కొనసాగే హక్కు
**situation** పరిస్థితి
**sixes cricket** ఆరుగురు ఆటగాళ్లే జట్టుగా ఉండే కొత్త తరహా క్రికెట్
**skeleton** అస్థిపంజరం. *internal* ~ అంతర్గత అస్థిపంజరం



**sketch** చిత్తుప్రతి, రేఖాచిత్రం, స్థూల రూప చిత్రణ; గల్పిక; వినోదాత్మక ప్రదర్శన; చిత్తుపటంగీయు, సంగ్రహంగా వర్ణించు
**sketchy** రేఖామాత్ర
**skew** మార్చిన, వక్రీకరించిన
**skew eyed** వంకరచూపుల
**ski** మంచుపై జారడానికి ఉపయోగించే సాధనం
**skiagraphy** నీడల అధ్యయనం
**skiascope** కంటిచూపులోని మార్పును కొలిచే సాధనం
**skid** జారిపోవడం
**skier** దారపుండ, దారపుబండి
**skiing** మంచుపై జారుతూ చేసే విన్యాసం
**skilfulness** నేర్పరితనం, పటిమ
**skill** నైపుణ్యం, కౌశలం, పనితనం
**skilled** నైపుణ్యంగల. ~ *workers* నిపుణ కార్మికులు
**skim** మీగడతీయు, స్థూలదృష్టితో చూచు
**skimp** పొదుపుచేయు
**skin** చర్మం, పట్టా, తోలు; నిశ్చర్మీకరణ, వలిచి వేయడం
**skipper** (ముఖ్యంగా క్రికెట్‌లో) జట్టు నాయకుడు
**skirmish** దొమ్మీ, పోట్లాట, వాగ్వివాదం
**skive** పని తప్పించుకొను
**sku** నక్కు, దాక్కొను, మాట్లాడకుండా ఉండు
**skull** పుర్రె, కపాలం
**skyscrapper** ఆకాశసౌధం
**slack** వదులైన, మందమైన, నిరుత్సాహమైన; వదులుచేయు, మందంచేయు
**slackening** మందగించటం
**slaking** విరియటం, విడిపోవడం
**slam** విసరికొట్టు; దభాలున మూయు
**slammer** జైలు
**slander** అపవాదు, అభాండం, వాగ్రూప నింద
**slanderer** నిందకుడు
**slang** యాస
**slant** ఏటవాలు, మొగ్గు
**slap** అరచేతిదెబ్బ, చరుపు, లెంపకాయ, చెంపదెబ్బ. ~ *dash* ఆకస్మికంగా, తక్షణం. ~ *down* మందలించు
**slash** కుదించు, కత్తిరించు, తగ్గించు
**slaughter** (చిత్ర)వధ, హత్య. ~ *house* కబేళా, చంపు, ఆహారం కోసం వధించు, చిత్రహింసపెట్టు, సంహరించు
**slave** బానిస, దాసుడు. ~ *trade* బానిస వ్యాపారం
**slavery** బానిసత్వం
**slavish** క్షుద్ర, బానిసత్వంతో సమానమైన
**slay** పరిమార్చు, దారుణంగా చంపు, వధించు
**slayer** ఘాతుకుడు, సంహర్త
**sleazy** అగౌరవకర, మలిన, దూషిత
**sledge** పెద్ద. ~ *blow* చావుదెబ్బ. ~ *hammer* పెద్ద సమ్మెట
**sleek** మృదువైన, ప్రకాశవంతమైన, చతుర, ఆకర్షణీయ
**sleep** నిద్ర, మత్తు; నిద్రపోవు, మత్తులో ఉండు. ~ *over* తాత్సారంచేయు. ~ *walking* నిద్రలో నడవడం
**sleeping** నిద్రిస్తున్న. ~ *pill* నిద్రమాత్ర. ~ *partner* నిష్క్రియ భాగస్వామి
**sleet** వడగండ్ల వాన
**sleeve** మర్మం, గొట్టం, జుబ్బాచెయ్యి
**slender** మృదువైన, నాజూకైన, స్వల్ప, సన్నని
**sleuth** నేరపరిశోధకుడు, గూఢచారి; జాడ తీయు, శోధించు
**slice** బద్ద; ముక్క; ఖండం; అంశం; చీల్చు; ముక్కలుచేయు

**slick** వివేక; చతుర

**slide** చిన్న గాజుపలక, చిన్నగోలుసు ముక్క; జారుడుదారి, జారే కవాటం; జరుగు, (మంచుపైన) జారు

**slight** చిన్న, స్వల్ప, కొద్ది

**slime** బంక, జిగట/ రేగడి/ మన్ను, పంకం

**slinging** రువ్వడం, విసరడం

**slink** తప్పించుకొని నడవడం

**slip** దోషం, పొరపాటు; చిన్నముక్క, జారు; తప్పుచేయు; జారవిడుచు

**slippery** జారే

**slip shod** పనిలో నిర్లక్ష్యంగా ఉండే, అజాగ్రత్తగా దుస్తులు ధరించే

**slit** ఛిద్రం, చీలిక, పగులు. ~ *lamp* నేత్ర పరీక్షలో వాడే దీపం

**slob** బద్ధకంగా ఉన్న

**slog** బండగా కష్టపడి పనిచేయడం

**slogan** నినాదం

**slop** బురద, మురికినీరు, తడుపు, నీళ్లు చిమ్ము

**sloth** సోమరితనం, అలసట, బద్ధకం

**slouch** అసమర్థ వ్యక్తి; తలవంచు, వాల్చు

**slough** పాము కుబుసం; బురద; కుళ్లిన పుండు; భూమివాలు; కుబుసం వదులు

**slovenly** అపరిశుభ్ర

**slow** మెల్లని, జాగుచేసే, మందగించిన, నెమ్మదిగా; నెమ్మదించు, మెల్లగాచేయు. ~ *down* మందగింపజేయు, వేగం తగ్గించు

**sludgre** బురద, అడుగు

**slug** లఘుశీర్షిక, సోమరి, తుపాకి గుండు; మగతేనెటీగ

**sluggish** మందకొడి, స్తబ్ధమైన

**sluggishness** మందకొడితనం, జడస్థితి

**sluice** తూము, ద్వారం

**slum** మురికి వాడ

**slumber** గాఢనిద్ర

**slump** మాంద్యం, ధరలు పడిపోవడం, దిగజారడం

**slur** కళంకం, మచ్చ, అపఖ్యాతి; అపఖ్యాతి పాలుచేయు; మచ్చతెచ్చు

**slurring** అస్పష్టంగా పలకడం

**slush** బురద; కరిగిన మట్టి; బురదజల్లు

**sly** తంత్రగొట్టు, కపటి, చమత్కారి

**smack** గట్టి ముద్దు; చెంపపెట్టు, వాసన; చిన్న నావ; వాసన పట్టు; పసిగట్టు, కను క్కొను, గుర్తించు; అరచేతితో చరచు; కొట్టు; ధ్వని వినిపించేటట్లు ముద్దుపెట్టు కొను

**small** చిన్న, కొంచెం; క్షుద్ర, నీచ, తక్కువ, కొద్ది. ~ *scale industry* చిన్నతరహా పరిశ్రమ

**smallpox** మశూచి, పెద్దమ్మవారు

**smart** చురుకైన/ ఆకర్షణీయ (వ్యక్తి)

**smarting** చిమచిమ

**smash** దుర్ఘటన, వినాశం, దివాలా; ధ్వంసం చేయు, ఛిన్నభిన్నంచేయు, పగల గొట్టు

**smattering** మిడిమిడి జ్ఞానం

**smear** n. పూత, చుక్క. *blood* ~ రక్తపు చుక్క. ~ *test* కేన్సర్ పూత/ పరీక్ష. *vaginal* ~ యోనినుంచి పరీక్షార్థం తీసే మచ్చు

**smear** v. పులుము, పూయు, అలుకు

**smell** (సు)వాసన; వాసనచూచు, పసిగట్టు

**smelt** కరిగించు, (లోహాన్ని) కరిగించి శుభ్రంచేయు

**smelter** ప్రగలనయంత్రం; లోహాన్ని కరి గించే సాధనం

**smile** చిరునవ్వు, దరహాసం

**smirch** మచ్చ, అపప్రథ, మచ్చతెచ్చు, కళంకితంచేయు



**smirk** గర్వంగా నవ్వు; వికటహాసం

**smite** గట్టిగా కొట్టు, చంపు

**smog** పొగమంచు

**smoke** ధూమం, పొగ; ధూమపానం చేయు, పొగతాగు

**smoking** ధూమపానం

**smooth** నున్నని, స్నిగ్ధ, సాఫీ, నునుపైన, మృదువైన; సుగమ, నిరంతరాయ, నునుపుచేయు; చదునుచేయు, మృదు వుగా చేయు, సుగమం చేయు. ~ *transition* సాఫీగా (అధికార) మార్పిడి

**smoothly** సాఫీగా

**smother** గొంతునొక్కి చంపు; అణచివేయు

**smoulder** కుమిలి కాలు, లోలోన దహించు

**smudge** మచ్చ, అపఖ్యాతి; మచ్చపడు

**smug** తెలివిగల, నీటయిన, స్వయంతృప్త

**smuggle** దొంగరవాణా చేయు; నిషిద్ధ వస్తువులను ఎగుమతి/ దిగుమతి చేయు

**smuggling** దొంగరవాణా, రహస్య వ్యాపారం

**smugly** దర్జాగా, తృప్తిగా

**smut** మాలిన్యం, మసి, బూతు(పుస్తకాలు)

**smutty** మలిన, అసభ్య

**snag** చిన్న నష్టం; ఊహించని అడ్డంకి

**snail** నత్త; సోమరి. ~ *s'pace* నత్తనడక, మందగతి

**snake charmer** పాములవాడు, పాము లను ఆడించే వ్యక్తి

**snake gourd** పొట్లకాయ

**snap** హఠాత్తు, ఆకస్మికం, చతురోక్తి; తటా లున తెంచు, విరుచు. ~ *election* ఆక స్మిక ఎన్నికలు. ~ *shooting* హఠాత్తుగా జరిగే కాల్పులు. ~ *shot* మెరుపు వేగంతో తీసిన చిత్రం

**snare** ఉచ్చు, బోను, వల; వలలో చిక్కు

**snatch** ఒక్క ఉదుటున లాక్కుపోవు

**snazzy** ఆకర్షణీయంగా ఉన్న, కాంతి వంతంగా ఉన్న

**sneak** క్షుద్రుడు; దొంగతనంగా చొరబడు

**sneaking** దొంగతనంగా దూరడం

**sneer** అవహేళనచేయు, అపహాస్యం, తిర స్కారం

**sneeringly** హేళనగా

**sneeze** తుమ్ము

**snip** కత్తిరించటం

**snipe** దాగి ఉండి తుపాకీపేల్చు; సురక్షిత స్థితిలో ఉండి విమర్శించు

**sniper** పొంచి ఉండి కాల్పులు జరిపే వ్యక్తి

**snob** పొగరుమోతు, దిగువస్థాయి వారిని అవమానించే వ్యక్తి, గర్విష్ఠి

**snobbery** గర్వప్రదర్శన, దర్పం, పెద్దరికం ప్రదర్శించటం

**snore** గురక

**snort** గురక, గుర్రు, సకిలింత

**snorter** గుర్రుపెట్టు, సకిలించు

**snout** ముట్టె

**snow** మంచు, నీహారం. ~ *bound* మంచులోకూరుకున్న. ~ *fall* హిమ పాతం. ~ *man* మంచుబొమ్మ. ~ *storm* మంచు తుపాను. ~ *flake* మంచుతునక. ~ *bite* చలికొరుకుడు

**snowball** విపరీతంగా వృద్ధిచెందు; పరిణ మించు; స్పష్టమైన రూపుదాల్చు

**snow plough** మంచు తొలగించే యంత్రం

**snow white** చాలా తెల్లనైన

**snub** n. గద్దింపు, కేకలు వేయడం. ~ *nosed* పైకి వంపు తిరిగిన ముక్కు కలి గిన వాళ్ళు

**snub** v. కేకలువేయు, నిర్లక్ష్యం చేయడం ద్వారా అవమానించు, బుద్ధిపూర్వకంగా నిర్లక్ష్యం చేయు

**snuff** ముక్కుపొడి, నశ్యం
**snuffle** ముక్కుతో మాట్లాడడం
**snug** వెచ్చగా, హాయిగా ఉన్న, సౌఖ్యంగా ఉన్న
**snuggle** తలదాచుకొను, ముడుచుకొని పడుకొను
**soak** నానబెట్టడం, స్తంభించు
**soak up** పీల్చి వేసుకొను
**soap nut** కుంకుడుకాయ
**soap stone** సబ్బురాయి
**soar** పైకెగురు
**sob** వెక్కిళ్లతో ఏడుపు, శోకం, వెక్కి వెక్కి ఏడ్చు
**sober** మంద్ర, గంభీర, హుందా అయిన
**sober up** తాగుడు వదిలివేయు
**soboliferous** పొదలేర్పడడం
**sobriety** నిగ్రహశక్తి, శాంతం, నెమ్మదితనం, గంభీరత
**sociability** కలుపుగోలుతనం
**social** సాంఘిక, సామాజిక, కలుపుగోలుతనం, స్నేహబుద్ధిగల. ~ *anthropology* సామాజిక మానవ శాస్త్రం. ~ *change* సామాజిక పరివర్తన. ~ *chauvinism* సాంఘిక దురహంకారం. ~ *conflict* సామాజిక ఘర్షణ/వైరుధ్యం. ~ *contract theory* సామాజిక ఒడంబడిక సిద్ధాంతం. ~ *differentiation* సామాజిక భేదనం. ~ *mobility* సామాజిక చలనశీలత. ~ *stratum* సామాజిక స్తరం. ~ *structure* సామాజిక వ్యవస్థ
**socialism** సామ్యవాదం
**socialist** సామ్యవాది. ~ *block* సామ్యవాద దేశాల కూటమి. ~ *democracy* సామ్యవాద ప్రజాస్వామ్యం. ~ *realism* సామ్యవాద వాస్తవికత, సోషలిస్టు వాస్తవికత. ~ *revolution* సామాజిక విప్లవం
**socialization** సాంఘికీకరణ
**social scourge** సామాజిక రుగ్మత
**sociation** మొక్కల సమూహం
**societal** సమాజానికి సంబంధించిన; సాంఘిక సంబంధి
**society** సమాజం. *stateless* ~ రాజ్య రహిత సమాజం
**sociology** సామాజిక శాస్త్రం. ~ *of consumption* వినియోగితా సామాజిక శాస్త్రం. ~ *of development* సామాజికాభివృద్ధి విశ్లేషణ. ~ *of economic life* ఆర్థిక జీవన సామాజిక శాస్త్రం. ~ *of literature* సామాజిక సాహిత్యాధ్యయనం
**sociometrics** సామాజిక మాపన శాస్త్రం
**sociopath** అసాంఘిక వ్యక్తి
**sock** ముష్టిఘాతమిచ్చు, మేజోడు
**socket** గిన్నె, గూడు, గుంట, ఒర
**sodden** తడిగా ఉండే
**sodding** తీవ్ర ప్రతిజ్ఞ చేయటం
**sod off** అవమానించి పంపటం
**sodomy** పుంమైథునం, జంతువులతో సంభోగం
**soft** సుతారమైన, మెత్తని, మృదుల. ~ *edged* మృదువైన అంచుగల. ~ *water* మంచినీళ్లు, లవణాలు లేనినీళ్లు, సబ్బుతో దట్టంగా నురగ ఇచ్చే నీళ్లు
**soil** మురికి, మట్టి, నేల; దేశం. ~ *erosion* నేలకోత, భూమి క్రమక్షయం. ~ *moisture retention* భూమి ఆర్ద్రధానత/ తేమను నిల్వ ఉంచుకోవడం. ~ *science* మృత్తికాశాస్త్రం. ~ *testing* భూసార పరీక్ష. ~ *transmission* నేల ద్వారా సంక్రమణ, మాపు, కళంకపరుచు
**sojourn** యాత్ర, తాత్కాలిక నివాసం, మజిలీ, విడిది, బస



**solace** ఉపశమనం, ఓదార్పు
**solar nebula** సౌరవ్యవస్థకు ఆధారమైన ధూళి మిశ్రమం
**solar system** సౌర కుటుంబం
**solder** టంకం, మాటు, టంకంతో అతుకు, మాటువేయు
**soldering** టంకం, మాటు
**soldier** జవాను, సైనికుడు
**solemnise** సంస్కార పూర్వకంగా జరిపించు
**solemnity** గంభీరత, సత్యనిష్ఠ
**solfatara** అగ్నిపర్వత రంధ్రం
**solicit** వేడుకొను, ప్రార్థించు, అభ్యర్థించు
**solicitation** అభ్యర్థన, వేడుకోలు
**solicitor** న్యాయవాది, అర్థి
**solid** ఘన (పదార్థ)ం
**solidarity** సంఘీభావం, ఏకీభావం
**solidify** ఘనీభవించు, ఘనీకరించు
**solidity** ఘనత్వం
**solifluction** మృత్తికామందసర్పణం
**soliloquist** స్వగతాల ద్వారా తన ఆలోచనలను తెలియజేసే వ్యక్తి
**soliloquy** స్వగతం, ఆత్మగత (భాషణ)ం
**solitaire** ఒకే వజ్రంతో చేసిన నగ
**solitary** ఏకాంత, ఒంటరి
**solitude** ఏకాంతం, ఒంటరితనం
**solo** ఏకైక కళాకారుడి ప్రదర్శన, ఒంటరి (ప్రయాణం)
**solubility** ద్రావణీయత
**soluble** కరిగే
**solution** ద్రావణం; పరిష్కారం
**solvency** స్తోమతు, పరపతి
**solvent** ద్రావకం, ఆర్థికపుష్టి గల వ్యక్తి, ద్రావణి
**soma** దేహం
**somalist** అన్ని మానసిక లోపాలకు అవయవాలే కారణం అనే వ్యక్తి
**somatic** శారీరక
**somatology** భౌతిక జీవశారీరక శాస్త్రం
**somatometry** శారీరక మితి
**somatopsychic** శరీరానారోగ్యం వల్ల కలిగే మనోవైకల్యం
**somersault** పిల్లిమొగ్గ, డింకీ, హఠాత్తుగా వాదాన్ని మార్చివేయడం
**somnambulism** నిద్రలోనడవడం
**somnolence** నిద్రమత్తు
**sonorous** శ్రావ్యమైన, ధ్వనించే, ఖంగుమని మోగే
**soot** నుసి, ధూళి, పొగబొగ్గు
**sooth** యదార్థం, వాస్తవం, నిజం. ~ *sayer* సోదెకత్తె, సోదెచెప్పే వ్యక్తి, జోస్యుడు
**soothe** శాంతపరుచు, మత్తు కలిగించు; ఉపశమనం కలిగించు
**sop** రాయితీ/ ప్రోత్సాహకం, నాను, తడియు, మునుగు
**sophism** కూటతర్కం, కుతర్కం
**sophisticate** తప్పుదారి పట్టించు, లౌక్యం వెలగబెట్టు
**soporific** నిద్రపట్టించే, నిద్రకలిగించే, మత్తు పుట్టించే
**sorcerer** ఇంద్రజాలికుడు, మాంత్రికుడు/ మంత్రకత్తె
**sorcery** మంత్రవిద్య, ఇంద్రజాలం, వశీకరణం
**sorciation** సాంఘిక సాన్నిహిత్య కల్పన
**sore** బాధపడు, పుండు, వ్రణం. *bed* ~ పడక పుండు. ~ *penile* శిశ్నవ్రణం
**sororate** భార్య చనిపోయిన తరువాత భార్య సోదరిని వివాహమాడడం
**sorption** శోషణం
**sorrow** విచారం, దుఃఖం, ఖేదం, దుఃఖించు, విచారించు, బాధపడు

**sortie** దాడి, ఆక్రమణ
**souming** పచ్చిక మైదానాల్లో జంతువులను మేపటానికి గల హక్కు
**sound** ధ్వని, శబ్దం, సముద్రశాఖ; చెడని, బలమైన, పటిష్ఠమైన, ఆరోగ్యవంతమైన. ~ *knowledge* సుజ్ఞానం
**soundness** శబ్దచిత్రం
**source** మూలాధారం, ఉత్పత్తి స్థానం, ప్రవాహం
**south east monsoon** ఆగ్నేయ రుతు పవనాలు
**south pole** దక్షిణ ధ్రువం
**south temparate zone** దక్షిణ సమశీతల మండలం
**south west monsoon** నైరుతి రుతు పవనాలు
**souvenir** జ్ఞాపిక, స్మారక సంచిక, స్మృతి చిహ్నం
**sovereignity** సార్వభౌమాధికారం
**sow** విత్తు(లు చల్లు); ఆడపంది
**space** విశాలస్థలం, చోటు, వ్యవధానం, రోదసి, అంతరిక్షం. ~ *craft* రోదసీ నౌక, అంతరిక్ష నౌక. ~ *flight* రోదసీ యానం, అంతరిక్ష యానం
**space port** అంతరిక్ష కేంద్రం, అంతరిక్ష స్థావరం. ~ *ship* అంతరిక్షనౌక. ~ *station* అంతరిక్ష స్థావరం. ~ *walk* రోదసిలో నడక
**spakle** పూరించు
**sparing** తక్కువ వ్యయం చేసే
**spark** చిన్న మెరుపు, మిణుగురు, వివేకం; విస్ఫులింగం
**sparse** కొంచెం కొంచెం, అక్కడక్కడ, దూరం దూరం
**spasm** ఈడ్పు, ఆకస్మిక బాధ, కండరాల సంకోచం. *arterial* ~ ధమని హఠాత్ సంకోచం. *bronchial* ~ ఆకస్మిక శ్వాస నాళ సంకోచం. *cadaveric* ~ మరణం తర్వాత కలిగే సంకోచం, కట్టె బిగిసి పోవడం
**spasmodic** ఈడ్చే, హఠాత్తుగా సంకోచించే
**spasmolytic** (హఠాత్) సంకోచ నివారిణి
**spastic** పక్షవాతపురోగి
**spasticity** దుస్సంకోచ స్థితి
**spastic paralysis** శాశ్వత పక్షవాతం
**spat** ముత్యపుచిప్ప డింభకం; నత్తగుల్లల గుడ్లు
**spate** వరద, ఆకస్మిక వర్షపాతం
**spatial depth** ప్రాదేశిక గంభీరత
**spatula** కొయ్య/ కొమ్ము గరిట, దర్వి
**spawn** గుడ్లు
**spay** లైంగిక గ్రంథుల తొలగింపు
**speaker** వక్త; శాసన సభాపతి; వ్యవహర్త
**spear** ఈటె
**specialist** నిపుణుడు
**specialization** విశేషాధ్యయనం, విశిష్టాధ్యయనం
**specie** ముద్దబంగారం, వెండినాణెం
**species** జాతి, రకం
**specificity** నిర్దిష్టత, ప్రత్యేకత
**speciology** జాతుల అధ్యయన శాస్త్రం
**speck** మచ్చ
**spectacle** కళ్ళజోడు; వినోదం, దృశ్యం
**spectacular** ఆకట్టుకొనే, దర్శనీయ, అద్భుత, విపరీత, విశేష
**spectator** ప్రేక్షకుడు, సాక్షి
**spectrophobia** తనను తాను అద్దంలో చూసుకోవడం అంటే భయం
**spectrum** వర్ణపటం
**speculation** ఊహాకల్పన; సట్టా వ్యాపారం
**speculative sciences** పరికల్పన శాస్త్రాలు



**speculum** వివృతి సాధనం. *ear* ~ కర్ణ వివృతి సాధనం. *nasal* ~ నాసా వివృతి సాధనం. *vaginal* ~ యోని వివృతి సాధనం
**speech** భాష, మాట, సంభాషణ, ఉపన్యాసం, ప్రసంగం. ~ *act* భాషణ చర్య. ~ *community* భాషా సమాజం. ~ *event* భాషణ సంఘటన
**speechless** మాటపోయిన; నిరుత్తర
**spelean** గుహలకు సంబంధించిన
**speleology** గుహా పరిశీలన శాస్త్రం
**spell** మంత్రకట్టు, వశీకరణం, మంత్రం; పరిణమించు, లేఖన క్రమం చెప్పు
**spell bound** ఆకట్టుకొన్న, మంత్రముగ్ధ, వశీకరణ
**spendthrift** ఖర్చుదారీ, అధిక వ్యయం చేయు
**spermatocide** వీర్యకణనాశని
**spermatogenesis** వీర్యకణోత్పత్తి
**spermatozoa** వీర్యకణాలు
**spew** ఉమ్ము; అగ్నిపర్వతం నుంచి లావా వెలువడడం
**sphincter** సంవరిణి కండరం. *anal* ~ ఆసన సంవరణి కండరం
**sphinx** సింహిక
**sphygmomanometer** రక్తపోటును కొలిచే పరికరం
**spial** రహస్యంగా పరిశీలించు
**spices** సుగంధ/ పరిమళ ద్రవ్యాలు
**spicule** చిన్నతునక
**spin** గింగిరీలు కొట్టు, చక్కర్లుకొట్టు, చుట్టూ తిరుగు, వడితిప్పు, తిప్పి చెప్పు, కల్పిత కథలు చెప్పు; దారం వడుకు, సందిగ్ధంలో నుండు; విషయం లేకుండా సాగదీసిన వార్తారచన
**spinal** వెన్నెముకకు సంబంధించిన. ~ *cord* వెన్నుపాము
**spine** వెన్నెముక, మధ్యాస్థి, ముల్లు
**spine chiller** భయానకమైన కథ
**spine chilling** వెన్నులో చలిపుట్టించే, భయపెట్టే, భీతిగొల్పే
**spineless** పిరికి, ఆత్మగౌరవం లేని, ఆత్మన్యూన
**spinning** నూలు వడకడం, భ్రమణం
**spin out** వాయిదావేయు, అవతలికి జరుపు, కాలం వెళ్ళబుచ్చు
**spinster** బ్రహ్మచారిణి, అవివాహిత
**spiral** చుట్టగా ఉన్న, క్రమంగా అభివృద్ధికరమైన పెరుగుదల
**spiralling** క్రమంగా పెరుగుతున్న, నిరంతరం వృద్ధిపొందుతున్న. ~ *prices* ఎప్పుడూ పెరిగే ధరలు
**spirit** స్ఫూర్తి, ఉత్సాహం, పిశాచం, దెయ్యం, ఆత్మ
**spiritual** పారలౌకిక, ఆధ్యాత్మిక
**spirograph** శ్వాసరేటును కొలిచే సాధనం
**spirometer** శ్వాసకోశ క్రియను కొలిచే మరచుట్టు ఆకృతి ఉన్న పరికరం
**spiteful** ద్వేషంగల, ద్వేషపూరిత
**splanchnopleure** అంతఃపార్శ్వం: అంతఃశ్చర్మం, అంతస్థ్య పొర కలిసి ఏర్పడిన పొర
**spleen** ప్లీహం; పగ. *ruptureof* ~ ప్లీహ చీలిక
**splendid** అమోఘమైన, సముజ్వల, జేగీయమానం, చాలా మంచిదైన, అత్యద్భుతమైన
**splendorous** ఉజ్జ్వల, దివ్య
**splendour** వైభవం, ఠీవి, శోభ
**splenectomy** ప్లీహోచ్ఛేదన
**splenomegaly** ప్లీహం పెరుగుదల
**splint** ఎముకల చికిత్సలో ఉపయోగించే బద్దీ

**splinter** పొడుగాటి సన్నని బద్దలుగా చీల్చు, కొయ్య, రాయి మొ॥ వాటి నుంచి చీల్చిన సన్నని బద్ద ముక్క/ చీలిక/ పుడక. ~ *group* విడిపోయిన వర్గం, రాజకీయ పార్టీ చీలిపోయిన తర్వాత మిగిలిన చిన్న వర్గం

**split** n. చీలిక, విభజన. *hair ~ analysis* నిశితమైన విశ్లేషణ, ప్రతి అంశాన్ని విశ్లేషించి చెప్పడం. ~ *personality* ద్వంద్వ వ్యక్తిత్వం, మాట మార్చే లక్షణం. ~ *second* క్షణంలో ఒక భాగం. *in* ~ వెను వెంటనే. *vertical* ~ నిలువునా చీలడం

**split** v. చీలు, విడిపోవు

**splurge** ఆర్భాటం

**spoliation** కొల్లగొట్టడం

**spolium** బలవంతంగా తీసికొన్న వస్తువు

**spolvero** అనువ్యంగ్యిక: ఒక వ్యంగ్య చిత్రపు అసలు ప్రతి నుండి రూపొందించ బడిన ఉపసర్జిత

**sponcerer** ప్రాయోజిత సంస్థ/వ్యక్తి, (ఆటలో) జట్టు లేదా క్రీడాకారుణ్ణి ప్రతిపాదించే సంస్థ

**spondylitis** వెన్నెముకకు సంబంధించిన కండరాల బాధ

**sponge gourd** నేతి బీరకాయ

**sponginess** విరళత

**sponging** స్పాంజితో శుభ్రం చేయడం, తడిగుడ్డతో తుడవడం

**sponsion** జామీను ఉండడం, అధికారాన్ని మించి ఒడంబడిక చేయడం

**sponsored mobility** ఆయా రంగాలలో నిపుణులు నేరుగా ఎంపిక చేయడం ద్వారా త్వరగా ఉన్నత హోదాలను సాధించడం

**spontaneity** అప్పటికప్పుడు, యాదృచ్ఛికత

**spontaneous** ఆకస్మిక, ఐచ్ఛిక; స్వాభావిక, సద్యోజనిత, సహజ

**spoonerism** అక్షర వ్యత్యయం, రెండు పదాల మొదటి హల్లులు తారుమారు కావడం. ఉదా: పాల తాలికలకు బదులు తాల పాలికలు అనడం

**sporadic** అప్పుడప్పుడు, అక్కడక్కడ, చెదురుమదురుగా

**sporadically** చెదురువాటుగా

**spore** సిద్ధబీజం

**sport** క్రీడ, ఆట, వినోదం

**sportive** సరదాగా తీసుకోవడం

**sports medicine** క్రీడల వైద్యశాస్త్రం: క్రీడల్లో గాయాలు, క్రీడల వల్ల తలెత్తే మానసిక శారీరక సమస్యలు, విజయానికి తీసుకోవాల్సిన ఆరోగ్యపరమైన జాగ్రత్తలు, క్రీడల్లో రహస్యంగా వాడే ప్రేరక ద్రవ్యాల గుట్టురట్టు చర్యలు... వంటి విస్తృత అంశాలను వివరించే వైద్య శాస్త్రం

**sporulation** సిద్ధబీజాలు ఏర్పడడం

**spotless** మచ్చలేని

**spot market** కొనుగోళ్ళు, అమ్మకాలు జరిగిన సత్వరమే అందించడానికి సిద్ధంగా ఉన్న వస్తువులు/ కరెన్సీ/ వాటాలు

**sprain** బెణుకు

**sprawl** వ్యాపించి ఉండు, క్రమరహిత ప్రవృత్తి

**spray** n. పిచికారి

**spray** v. చల్లు, పిచికారిచేయు

**sprayer** తుషారిక, పిచికారి

**spray printing** తుషార ముద్రణం

**spreading** వ్యాపించడం, పర్యాప్తం, విస్తరించడం

**spree** ఉల్లాస సమయం

**sprezzantura** అనవధానత

**sprig** చిన్న కొమ్మ, రెమ్మ, అంకురం



**spring** వసంతరుతువు, ఊట, నీటిబుగ్గ; ఊరు; ఉద్భవించు, అంకురించు

**sprinkle** చిలకరించు; సన్నని వానజల్లు

**sprinkling** చల్లడం

**sprinter** పరుగు పందెగాడు

**sprout** పల్లవం, అంకురం; అంకురించు, మొలుచు

**spruce** అందమైన

**sprue** భయంకరమైన ఆంత్ర వ్యాధి

**spulter** బ్రుమనే కఠోర శబ్దం, మాటల్లో తత్తరపాటు, అసమ ప్రగతి

**spur** ముళ్లచక్రం, ముల్లు; ఉసికొల్పు, పురిగొల్పు

**spurious** నకిలీ. ~ *liquor* కల్తీ మద్యం

**spurt** మహాయత్నం, పిచికారి, హఠాత్తుగా విరజిమ్ము

**sputum** కఫం

**spy** గూఢచారి, చారుడు, వేగు

**squabble** కొట్లాట, జగడం; తగవులాడు, జగడమాడు

**squad** దళం, పటాలం

**squalid** అశుభ్ర, రోతకలిగించే, నీచ

**squall** వానగాలి, పెద్దకేక

**squalor** కర్కశధ్వని, మురికి

**squamous** పొలుసులతో కప్పి ఉన్న

**squander** దుబారాచేయు, నిర్లక్ష్యంగా ఖర్చుచేయు

**square up** సమం చేసుకొను

**squatter** ఆక్రమణదారు, కబ్జాదారు

**squeak** తుమ్ము

**squeeze** పిండు, ఒత్తిడిచేయు, లాగుకొను

**squelch** అణచు, భంగపరుచు, నిర్మూలన చేయు

**squib** ఎగతాళి, నింద, వ్యంగ్య రచన, బాణసంచా. *damp* ~ తుస్సుమన్న పేలుడు, కాల్చిపారేసిన ముక్క

**squinting** వక్రదృష్టి

**squirming** గుంజుకోవడం

**squirt** వెలువరించు, పిచికారీ చేయు, చిమ్ము

**stab** పొడుచు, కత్తిపోటు, గాయం

**stabilise** స్థిరపర్చు, నిలువరించు, దృఢపర్చు, సమస్థితికి తీసుకొనివచ్చు

**stability** స్థిరత్వం, ధృతి, దృఢత్వం

**stabilizer** స్థిరీకరించే

**stable** గుర్రాల శాల, లాయం

**staccato** తాళం తప్పి పాడడం, పొసగని పాట. ~ *passage* సంబంధంలేని అంశం. ~ *performance* సమన్వయం లోపించిన ప్రదర్శన. ~ *touch* ఆకస్మిక స్పర్శ

**stack** గడ్డివాము, ధాన్యంకుప్ప

**staffage** జంగమారోపణ

**staff college** ఉద్యోగ శిక్షణ కళాశాల

**stage** ఘట్టం, వేదిక; దశ

**stagger** తొట్రుపాటుతో నడుచు; అస్థిరంగా నడుచు/ నిలుచు; సందేహించు, తూలు, తడబడు

**stagnant** నిశ్చల, కదలని, నిలవదేరిన

**stagnate** నిశ్చల, స్తబ్ధ

**stagnation** స్తబ్ధత, నిశ్చలత్వం

**staid** ప్రశాంత, గంభీర, స్థిర

**stain** మరక, మాలిన్యం, విలేపనం; రంజనం; మరకపడ్డ, కళంకితమైన, అభిరంజనం చేసే

**staining** రంజనం, రంగువేయడం, అభిరంజనం; సూక్ష్మదర్శనంలో ప్రత్యేక వర్ణదాలను *(dyes)/* అభిరంజకాలను *(stains)* వాడే విధానం

**staircase** మెట్లదారి

**stake** పణం, పందెం, గసిక, షరతు

**stake money** పందెం సొమ్ము

**stalemate** ప్రతిష్టంభన, స్తబ్ధత
**stalk** కాడ, తొడిమ; పిల్లిలా నడుచు
**stalwart** వస్తాదు, సమర్థుడైన, ధైర్యంగల, స్థిరచిత్తంగల, పేరెన్నికగన్న వ్యక్తి
**stamina** దమ్ము, సామర్థ్యం, (శారీరక) శక్తి
**stammer** నత్తి
**stamp** ముద్ర, తపాలా బిళ్ల, ముద్రవేయు; తన్ను, తొక్కు
**stamped** తొక్కిసలాట, గందరగోళం, గడబిడ, తొక్కిసలాడు, హఠాత్తుగా పారిపోవు
**stance** భంగిమ
**standard** ప్రమాణం, ప్రామాణిక. ~ *language* ప్రామాణిక భాష. ~ *of life* జీవన ప్రమాణం/ స్థాయి
**standardise** ప్రమాణీకరించు, ప్రామాణికంచేయు
**standardization** ప్రమాణీకరణం
**standing** స్థాయి, స్థితి, అనుభవం. ~ *army* స్థాయీసేన. ~ *committee* స్థాయీ సంఘం
**stand mute** మౌనంగా ఉండు
**stand over** వాయిదా పడు
**stand point** దృక్పథం
**stanza** చరణం, పద్యం
**staple** ముఖ్యమైన, ప్రధానమైన. ~ *food* ముఖ్యాహారం
**starch** గంజి, పిండి పదార్థం
**stark** మొరటైన, కఠినమైన, వంగని
**star mark** నక్షత్రపు గుర్తు
**startle** భయపెట్టు, నిశ్చేష్టపరచు, ఉలికిపడు
**starvation** ఆకలితో మాడడం, పస్తుండడం
**star war** అంతరిక్షయుద్ధం
**stasis** నిశ్చలత
**state n.** దశ, స్థితి, పరిస్థితి, స్థాయి, అవస్థ, రాష్ట్రం; ప్రభుత్వం; రాజ్యం. ~ *advised price* ప్రభుత్వం సూచించిన ధర. ~ *criminal* రాజకీయద్రోహి. ~ *domestic product* రాష్ట్ర స్వీయోత్పాదన. *in* ~ తగిన లాంఛనాలతో. *keep* ~ తన గౌరవాన్ని నిలబెట్టుకొను. *lie in* ~ ప్రజల దర్శనార్థం పెట్టి ఉంచిన. ~ *list* రాష్ట్ర జాబితా. ~ *of health* ఆరోగ్య స్థితి. ~ *of life* వ్యక్తి అంతస్తు/ వృత్తి
**state v.** చెప్పు, ఉద్ఘాటించు, వివరించు
**statesmanship** రాజనీతిజ్ఞత
**static** కదలికలేని, స్థిరంగా ఉన్న, మారని
**statics** స్థితిశాస్త్రం
**stationary** స్థిర, కదలని; కార్యాలయ/ లేఖన సామగ్రి
**statistics** గణాంకశాస్త్రం, సాంఖ్యక శాస్త్రం. *vital* ~ జీవావశ్యకమైన గణాంకాలు
**statue** (శిల్ప) మూర్తి, శిల్పం, ప్రతిమ
**status quo** యథా(పూర్వ)స్థితి
**status symbol** అంతస్తును సూచించే పదం/ వస్తువు/ గుర్తు
**statute** శాసనం, చట్టం
**staunch** గట్టి, పటిష్ఠ; దృఢ
**staunchness** గుండెనిబ్బరం, దృఢత్వం, గట్టితనం
**stay** నిలుపుదల; వాసస్థలం, ఆధారం, ఆలస్యం
**stay put** ఎక్కడికీ వెళ్ళకుండా ఉండు, కొనసాగు, ఎక్కడ ఉంటే అక్కడే ఉండు
**stead fast** అచంచలమైన, దృఢమైన, స్థిరమైన
**stead fastness** స్థిరత్వం, దృఢత్వం
**steadily** నిదానంగా, క్రమంగా, నిశ్చలంగా
**steady** స్థిర, నిశ్చల, క్రమయుక్త, జాగరూక
**steam** ఆవిరి
**steaming** ఆవిరి పట్టడం



**steel** ఉక్కు
**steep** ఏటవాలు ప్రదేశం, నిటారు, తడుపు, నానబెట్టు, ఉతుకు
**stele** స్థూణిక
**stellate** నక్షత్రాకార, తారాకృతి
**stemming** కొమ్ముకాయడం
**stench** దుర్గంధం, చెడువాసన, నీచు
**stenography** సంక్షిప్త లేఖనం
**stenosis** సంకీర్ణత
**stentorian** గట్టిగా మాట్లాడే/ బిగ్గరగా వాదించే వ్యక్తి
**steppe** పచ్చిక బయలు, గడ్డినేల
**stereochromy** ఏకీకృత వర్ణచిత్రణ
**stereogenosis** స్పర్శద్వారా వస్తువులను కనుక్కోవడం
**stereoscopic vision** త్రిమితీయ దృష్టి
**stereotype** మూసపోత పద్ధతి, ఒకే విధమైన; సాధారణీకరణం
**sterile** ఫలించని, గొడ్డుపోయిన, వంధ్య, బంజరు; సంతానప్రాప్తిలేని
**sterility** వంధ్యత్వం
**sterilization** వంధ్యీకరణం, క్రిమిరహితం చేసే పద్ధతి
**sterilizer** క్రిమిరాహిత్యకారి
**stern** కఠిన, గంభీర, పరుష
**sternness** నిష్ఠురం, కాఠిన్యం
**sternum** ఉరోస్థి
**steroid** ప్రేరకద్రవ్యం
**stet** అది అలాగే ఉండనీయాలి
**stew** మాంసం, కూరగాయలు కలిపి వండు. *brown* ~ ముందుగా వేయించి వండు. *white* ~ ముందుగా వేయించక పోవడం; కృత్రిమమైన చేపల మడుగు
**steward** పర్యవేక్షకుడు, ధర్మకర్త, సేనాధికారి
**stewardship** నాయకత్వం
**stiff** కొయ్యబారిన, గట్టిపడిన, వంగని, లొంగని
**stiffness** బింకం, కఠినత్వం
**stifle** నిర్మూలించు, తుడిచివేయు, నులుము
**stigma** మచ్చ, కళంకం; కీలాగ్రం, అపవాదు
**stile liberty** నవ్యకళ
**still life** స్తబ్ధచేతన
**stimulant** ప్రేరకం, ఉత్తేజకం. *cardiac* ~ హృదయోద్దీపకం
**stimulation** ఉత్తేజం, ఉద్దీపనం. *coital* ~ సంభోగోద్దీపనం
**stimulus** ఉద్దీపకం, ప్రేరేపక వస్తువు: స్పందన కలిగించే సంఘటన/ వస్తువు
**stimulus colours** ప్రదీపక వర్ణాలు
**stingy** నీచ
**stiparogenic** అజీర్తి, మలబద్ధకం కలిగించే ఆహార పదార్థాలు
**stiparolytic** అజీర్తి, మలబద్ధకం నుండి విముక్తి కల్గించే పదార్థాలు
**stipitate** కాండంగల, కాడ/ తొడిమ గల
**stipulated** నిర్ణీత, నిబంధించి, స్పష్టంగా నిర్ణయించిన
**stipulation** నిబంధన
**stir** సద్దు, కదలిక, సందడి, కదుపు, మథించు
**stir up** ఇతరులలో అసంతృప్తి/ అసమ్మతి రేకెత్తించు
**stock phrase** పడికట్టు పదం
**stock pile** పెద్దఎత్తున ఆయుధ నిల్వచేయు
**stoic** నిగ్రహం గల, బాధను భరించగల, విరాగి
**stomatitis** నోటిపూత, నోటిపుండు
**stone** శిల, రాయి. ~ *age* రాతియుగం *(25000-20000 B.C)*
**stonewall** కాలయాపనచేయు, తాత్సారం చేయు

**stoneware clay** రాతి మట్టి
**stool** నాలుగు కాళ్లపీట; మలం. *rice water* ~ కడుగునీళ్ల భేదులు
**stop** ఆగు, స్తంభన. ~ *out process* స్తంభన ప్రక్రియ
**stopping out** అవరోధనం
**store cattle** కసాయి వానికి అమ్మేందుకు/ మాంసం ఉత్పత్తి కోసం పశువుల్ని పెంచడం
**story** (చిన్న)కథ, ఇతివృత్తం; వార్తాకథనం
**stout** లావైన, స్థూల, దృఢ
**stowage** కొట్టు, గోదాము, గిడ్డంగి
**straggler** చెల్లాచెదరైపోవు, ప్రధాన సంఘం నుంచి విడిపోవు
**straight** బారుగా, నేరుగా, తిన్నగా
**straight edge** రుజుధార
**straight forward** రుజువర్తనంగల, ముక్కుసూటి, యథార్థం మాట్లాడే
**straight forwardly** ముక్కుసూటిగా
**straight forwardness** నిష్కాపట్యం, ముక్కుసూటితనం
**straight up** నిట్టనిలువు
**strainer** వికర్షణి, జల్లిమూకుడు, జల్లెడ
**strait** జలసంధి, సూక్ష్మరేఖ
**strand** నది ఒడ్డు, సముద్రతీరం; ఓడ మెరకపట్టు, వెనుకబడు, కష్టాలలో ఉండు
**stranded** చిక్కుకొన్న
**strange** అపరిచిత, అన్య
**strangle** గొంతు పిసికి చంపు; ఊపి రాడకుండా అదుము
**strangulation** గొంతు నులిమి చంపడం, ఊపిరాడకుండా అదమడం
**strangury** నొప్పితో కూడిన మూత్ర విసర్జన
**strategy** వ్యూహం, వ్యూహరచన, పథకం
**stratification** పొరలు పొరలుగా, దొంతరులుగా ఏర్పడడం, స్తరీకరణ. *social* ~ సమాజస్తరీకరణ
**stratified** స్తరిత
**stratigraphy** స్తరశాస్త్రం
**stratosphere** వాతావరణంలో రెండో పొర
**stratum** సమాజస్థాయి, తరగతి, స్తరం, అంతస్తు, పొర, దొంతర
**stray** తప్పిపోయిన, దారితప్పిన, చెదురు మదురు
**stream** ప్రవాహం, వంక, వాగు, తరంగిణి
**streamline** క్రమబద్ధం చేయు, జాలువారే రూపమిచ్చు; మృదురూపం
**stream of consciousness** చైతన్య స్రవంతి
**street** వీధి; తూర్పు-పడమర దిక్కులుగా సాగే రహదారి
**stress** ఒత్తిడి, ప్రాధాన్యం, ఊనిక
**stretch** పొడిగించు; సాగుడు, అవధి
**striate** గీతలతో గుర్తించిన
**strict** నిర్ణిబద్ధ; ఖచ్చితమైన
**stricture** నికోచం, నాళం/ వాహిక ఒక్క సారిగా కుంచించుకపోవడం; ఆక్షేపణ, తీవ్రవిమర్శ, ఖండన
**stride** పెద్దఅంగ, అంగలు వేస్తూ నడచు
**strife** కలహం, తగవు, పోరాటం, విరోధం, అశాంతి
**strike** సమ్మె, సమ్మెచేయు, మనసుకు తట్టు, ప్రారంభించు
**string** తాడు, దారం, తీగ, వీరాటనారి
**stringent** కఠినమైన, ఖచ్చితమైన, యథార్థ
**strip** పీలిక, పేడు, బెరడు, ఖండం, ముక్క; గుడ్డలు ఊడదీయు, బెరడుతీయు, ఖాళీ చేయు
**stripe** గీత, వాత, కొరడాదెబ్బ; పట్టీ, నిలువు చార



**stripmine** భూమ్యుపరితలానికి దగ్గరగా ఉన్న గని
**striving** పోరాడే, ప్రయత్నంచేసే
**stroboscope** భ్రమణ వేగమాపకం
**stroke** విసరు, వేటు, అఘాతం
**strongly** గట్టిగా, పకడ్బందీగా
**structural** నిర్మాణ సంబంధమైన, వ్యవస్థీకృత
**structuralism** నిర్మాణక్రమవాదం
**stubborn** గట్టిపట్టుదల గల, మొండి, హఠంగల
**stud** గుర్రపుశాల, గుండీ, గుబ్బమేకు
**stud horse** దాటించటానికి వాడే మేలు జాతి మగగుర్రం
**studio** చిత్ర/ శిల్పశాల
**study** అధ్యయనం, అనుశీలనం
**stuffy** వాయుప్రసారం కొరవడుతున్న, శ్వాసించడం కష్టమైన, చిరచిరలాడే
**stultify** విసుగు కలిగించే, వ్యర్థంచేసే
**stumble** తడబడు, తొట్రుపడు, తప్పు చేయు
**stumbling block** అవరోధం, అడ్డంకి, అటకాయింపు
**stump** మొద్దు, మోడు, మొండి
**stunted** గిడసబారిన, ఎదగని
**stupor** మైకం, స్తబ్ధత, మూర్ఛ
**sturdiness** దార్ఢ్యం, శక్తిశారిత
**stye** కంటికురుపు
**style** (భాషా)శైలి; పేరు, పద్ధతి, వైఖరి, తీరు
**stylization** శైలీకరణ
**stylized** శైలీకృత
**stylograph** లిఖితరూపం
**stylus** రాసే పద్ధతి/ వస్తువు
**stymie** నిస్సహాయ స్థితిలో పడవేయు, అడ్డంకులు కల్పించు
**suable** దావా వేయతగిన
**suave** మధురభాషి, వినమ్రంగా ఉండే వ్యక్తి; శాంతమైన, అనునయించే, శాంత పరచే, సుశీల
**sub-aerial** ఉపవాయు, గాలికింద, భూమ్యుపరితలంపై సంభవించే
**subaltern** తక్కువ పదవిలో ఉండే; కెప్టెన్ కంటే కింద పదవిలో ఉండే ఉద్యోగి
**sub-conjunctival** కంటిపై పొరలోని
**sub-conscious** ఉప చేతన/ అంతఃశ్చేతనలో ఉన్న
**sub-continent** ఉపఖండం
**sub-culture** ఉపసంస్కృతి
**subcutaneous** అధశ్చర్మం, చర్మం కింది భాగం
**subject** ఆలేఖ్య వస్తువు, అంశం, పాఠ్యాంశం, ముందస్తు పరీక్షల కోసం ఎంపిక చేసిన/ స్వచ్ఛందంగా ముందుకు వచ్చిన వ్యక్తి
**subjection** లోబరుచుకోవడం, ఆధీనత
**subjective idealism** ఆత్మాశ్రయ భావ వాదం
**subjectivity** ఆత్మాశ్రయత
**subjugate** అణిచివేయు, జయించు, వశ పరచుకొను
**subjugation** బానిసత్వం, దమం
**sub-lease** కౌలుదారు మరొకరికి కౌలుకు ఇచ్చు
**sublimation** ఉదాత్తత, ఉత్పతనం
**sublimity** ఉదాత్తత
**sublingual** నాలుక కింది
**submarine** జలాంతర్గామి. ~ *canyon* సముద్రంలోని లోతైన లోయ
**submerge** నీటిలో ముంచు/ మునిగిపోవు
**submissive** అణకువ గల, లొంగి ఉండే
**submit** లొంగు, లోబడు, సమర్పించు, దాఖలుచేయు

**sub-muscular** కండరాలకింది
**suborn** నేరానికి పురికొల్పు, తప్పుడు సాక్ష్యం చెప్పించు
**subrogate** ప్రత్యామ్నాయంచేయు, బదిలీ చేయు
**subrogation** రుణదాత బదిలీ/మార్పు
**subscribe** చందాదారునిగా చేరడం, అంగీకరించు, సంతకంచేయు
**subscriber** చందాదారు, సమర్థకుడు
**subscription** చందా, విరాళం (చెల్లింపు)
**subsequently** పిమ్మట, అనంతరం
**subserve** ఉపయోగపడు, సాధనమగు
**subservient** పరాధీన; తాబేదారు
**subside** నెమ్మదిపడు, సద్దుమణుగు, ఉపశమించు, శాంతించు
**subsidence drowning** భూమ్యవతరణం
**subsidiary** అధీన, సహాయక. ~ *company* అనుబంధ వ్యాపార సంస్థ
**subsidy** సబ్సిడీ, రాయితీ, ధనసహాయం
**subsistence** జీవనోపాధి, బతుకుతెరువు, మనోవృత్తి
**substance** పదార్థం; సారం; సారాంశం, ద్రవ్యం
**substandard** న్యూన ప్రమాణం, అప్రామాణిక
**substantial** గణనీయమైన, తగినంత, దృఢమైన, చాలినంత, అధిక, ప్రధాన
**substantiate** నిరూపించు, తగిన ఆధారాలు చూపించు
**substantive** విశేష్యం, సంజ్ఞ
**substitute** ప్రత్యామ్నాయం, ప్రత్యామ్నాయ/ బదులు వ్యక్తి; ప్రతిక్షేపం; ఒకరి బదులు వేరొకరు వచ్చు, మారుగాపెట్టు
**substractive system** తీసివేత/ వ్యవకలన పద్ధతి
**subtle** నిగూఢమైన, సూక్ష్మ, కపట, జిత్తుల మారి, కుటిల
**subtleties** సూక్ష్మభేదాలు
**subtlety** సూక్ష్మభేదం, కాపట్యం, జిత్తుల మారితనం
**subtract** వ్యవకలనంచేయు, తీసివేత
**subtraction** వ్యవకలనం, తీసివేత
**subvention** ఆర్థిక సహాయం
**subversion** విద్రోహం, కూలదోయటం
**subvert** నష్టపరచు, పాడుచేయు, కూలదోయు, నాశనంచేయు
**succeed** సఫలమగు, ఉత్తరాధికారి అగు
**succession** వారసత్వం, క్రమం, పరంపర
**succumb** లొంగు, లోబడు, అణుగు, చనిపోవు
**succour** సహాయం, ముష్టిగా పెట్టే అన్నం
**suck** పీల్చు, తాగు, లాభంతీయు
**sucker** పిలక మొలక
**suckling** చనుపాలు ఇచ్చు
**sucrose** సుక్రోజు, చక్కెర, చెరకు నుంచి తయారైన చక్కెర
**suction** చూషణం, పీల్చుకొనటం, తాగటం
**sudden death** (క్రీడల్లో) తక్షణ ఫలితం
**suddenly** చివాలున, దిగ్గున, అకస్మాత్తుగా
**sue** వ్యాజ్యంవేయు, ప్రార్థించు
**suffering** బాధ, వ్యథ, నలుగుడు
**suffocation** శ్వాసను అడ్డగించు, గొంతు పట్టుకొను, అణచిపెట్టు
**suffrage** ఎన్నిక/ ఓటు హక్కు
**suffragette** స్త్రీల ఓటుహక్కు ఉద్యమకారులు
**suffuse** నింపు, ముంచెత్తు
**suggestively** సూచనగా
**suicide** ఆత్మహత్య. *altrustic* ~ తన సంఘం/ తన సమూహం మంచి కోసం ఒక వ్యక్తి తనను తాను చంపుకోవడం. ~ *anomi* ఒక సమూహంలో ఇమడలేక ఒక వ్యక్తి చనిపోవడం



**suitability** పొంతన, పొందిక
**sullen** వ్యాకులంగా ఉండే, చిరచిరలాడే, అకారణంగా కోపించే
**sulphur** గంధకం
**summit** శిఖరాగ్రం. ~ *meeting* శిఖరాగ్ర సమావేశం
**sumptuary** అతివ్యయం నియంత్రించే
**sumptuously** పరిపూర్ణ, దివ్య, సుఖప్రద
**sun-bath** ఆతపస్నానం
**sunday painter** విలాస చిత్రకారుడు
**sunfast** ఎండ మన్నిక
**sunhemp** *(bombay hemp)* జనపనార
**sunset** సూర్యాస్తమయం
**superannuation** వయసు చెల్లటం, వార్ధక్యం
**super cooled** అతి శీతలీకృత
**super cooling** అతి శీతలీకరణం
**superego** ఉపరిబోధాత్మ
**superrogatory** కర్తవ్యాతీతమైన
**superfine** మేలైన, శ్రేష్ఠమైన, చాలాసున్నితమైన
**superfluities** అనావశ్యక ఆలోచనలు/ వస్తువులు
**superfluous** అనావశ్యకమైన, అత్యధిక
**superimposition** అధ్యారోపణ
**superior** ఉత్కృష్ట, ఉన్నత, ఉచ్చ, మేలైన
**supermatism** పారమ్యవాదం, పారమితవాదం
**supermind** అధిమనస్సు
**supernumerary** సాధారణ సంఖ్య కంటె ఎక్కువ, నియమిత సంఖ్యను మించిన, సంఖ్యాధిక
**superposition** అధిస్థాపనం
**super power** అగ్రరాజ్యం
**supersonic** సూపర్‌సోనిక్, అతిధ్వానిక
**superstition** మూఢవిశ్వాసం, భ్రమ
**supination** ఉత్తానసం
**supine** వెల్లకిలా పడుకోవడం, సోమరి అయిన, అలసటగల, మత్తుగా ఉన్న, ఉత్తాన
**supplementary demand** అనుబంధ పద్దు
**supply demand gap** సరఫరా–గిరాకీల అంతరం
**support** ఊత, ఆధారం, అండ, చేదండ; చేదోడు, అవలంబనం, ఆధారం, మద్దతు, దన్ను, సహాయం, బలపరచు, సాయపడు
**supposition** అంగీకృతాంశం, కల్పన, అనుమానం
**suppuration** చీముపట్టడం
**supremacy** ఆధిపత్యం, ప్రభుత్వం
**supremo** అధినేత, ప్రథముడు
**supression** అణచివేత, తగ్గింపు
**surdity** చెవిటితనం
**surface** (ఉపరి)తలం, ఉపరిభాగం
**surface case** విభక్తి
**surface structure** ఉపరితల నిర్మాణం
**surface tension** తలతన్యత
**surge** ఉప్పొంగు; జనసమూహం, అల, కల్లోలం
**surmise** ఊహ, భావన, అనుమానం
**surpass** అధిగమించు, అతిక్రమించు
**surplus** మిగులు, అధికం, శేషం, అదనం
**surrealism** అధివాస్తవికత
**surrealist** అధివాస్తవికతావాది
**surrejoinder** ప్రతివాదానికి సమాధానం
**surrender** లొంగుబాటు. ~ *value* వదులుకొన్న విలువ
**surreptitious** అక్రమమైన, రహస్యమైన, దొంగతనంగా, మోసగించి చేసిన
**surreptitiously** రహస్యంగా, ప్రచ్ఛన్నంగా
**surrogate** కృత్రిమ; ప్రత్యామ్నాయ; మారు. ~ *woman* వేరొకరికి పిల్లల్ని కనిపెట్టే స్త్రీ

